# ధర్మనిర్ణయం

నవల

తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు.



ప్రకాశకులు:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

మదరాసు-1.

# అంకితం

## మా అమ్మకు

నీవు శరీరమిచ్చి జననీ! మహనీయ వినూత్న సాధనా
జీవితముఁ వెలార్చితివి శ్రీ గురుదైవ పదాబ్జపాదుకా
స్థావరభావనాకలిత షడ్విధవస్తు సమైక్యతా విషం
చీవిహృతస్వరంబులు వశీకృతచిత్తములైన విట్లుగన్.

వాగర్థంబులు పార్వతీశివులు తద్భావంబుతో కావ్యశి
ఖాగీర్వాణమునాడె నాహృదయలక్ష్యాద్వైత చిద్రూపమే
దోగాణంబుగ ముద్రపట్టినది మేధోద్దీప్త సంపత్తు నే
డా గూఢంబగు గాఢభావనకు శబ్దార్థాకృతిఁ గూర్చితిన్.

# అభిప్రాయాలూ - అభినందనలూ

సర్వేపల్లి రాధాకృష్ణ,

గిరిజ,
30, ఎడ్వర్డుఎలియట్ రోడ్,
మైలాపూరు, మద్రాసు - 4.
డిశంబరు 22, 1967.

నేను మీ నవలను 'జాగృతి'లో చూచాను. అది భావుకులకు ప్రీతిపాత్రముగా నున్నందుకు సంతోషపడు చున్నాను.

భవదీయుండు,
స. రాధాకృష్ణ.



ఆచార్య పింగళి లక్ష్మీకాంతము, M. A.,

తిరుపతి,
3-1-68.

మీ ధర్మనిర్ణయం శ్రద్ధగా చదివాను.

పవిత్రమైన కథ. చిత్తశాంతికలిగించే నిర్వహణ...చాల ప్రశంసార్హముగా ఉన్నది.

పింగళి లక్ష్మీకాంతము.

V. R. Narla, M. P.
(నార్ల వేంకటేశ్వరరావు)
'ఆంధ్రజ్యోతి' సంపాదకులు.

ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్,
పోస్టుబాక్సు నెం. 334,
విజయవాడ - 2.
30-12-67.

మీరు సృజనాత్మకరచయితగా సర్వతోముఖ విజయమును సాధించుటకు నా శుభాకాంక్షలు.

భవదీయుడు,
వి. ఆర్. నార్ల.

★

విశ్వనాథ వేంకటేశ్వరులు,
ఉయ్యూరు,

ధర్మనిర్ణయము చూచి సంతృప్తినొందితిని......దాని యుపక్రమణనిర్వహణము లుదాత్తములై యున్నవి.

విశ్వనాథ వేంకటేశ్వరులు.

★

ఉభయభాషాప్రవీణ,
ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి,
కావలి,
31-12-67.

మీ నవల ధర్మనిర్ణయం శ్రద్ధగా చదివాను.

మంత్రశాస్త్రవిషయం లౌకికవిషయాలను జోడించి, కుతుకం ఎక్కడా దిగజారకుండా చక్కగా నడిపారు. ఆదర్శం ధీరంగా నడచింది. ఇట్లాంటి రచనలు చాల తక్కువగా ఉన్నాయి.

భవదీయుడు,
హనుమచ్ఛాస్త్రి.

★

10, హెన్స్‌మన్ రోడ్డు,
దాసు వామనరావు, త్యాగరాయనగరు,
మద్రాసు-17,
29-10-68.

"పురుషులందు పుణ్యపురుషులు వేరయా!" అన్నట్లు 'నవలలందు ధర్మనిర్ణయము వేరయా' అనవలసినట్లుగా ఉన్నదీ నవల.

పశుబలాన్ని ఆత్మబలంతో జయించి ఆత్మబలమంటే యేమిటో మనకు గాంధీమహాత్ముడు చూపించాడు. అటువంటివే యోగశక్తి, మంత్రశక్తులు. ఈ దివ్యశక్తులపైన నమ్మకం పోగొట్టుకొని, యంత్రప్రభావంతోనూ, భౌతిక యింద్రియ భోగలాలసత్వంతోనూ మునిగి లీనమైపోతున్న యీకాలపు పండిత పామరలోకానికి, ఒక నూతన ప్రబోధం, ఒక ఆత్మజిజ్ఞాస కల్గించే దివ్యగాథ యిది.

సరదాగా విలాసార్థంగా చదివి పారవేసే నవల కాదిది. చదివి నెమరువేసి, భద్రంగా దాచుకోవలసిన రామలింగాను శాసన మీ ధర్మనిర్ణయము.

ధర్మనిర్ణయమే కాదు ధర్మనిర్వహణంకూడా యీకథలో చిత్రింపబడింది.

ధర్మచక్రం జెండాను పైకెత్తినది భారతీయులని యీ గ్రంథం మళ్లీ నిరూపిస్తున్నది.

దాసు వామనరావు.

భాగ్యనగరము,
31-10-'68

ఆంగ్లనవలా సామ్రాజ్యంలో ఉన్న కథా కథనవిధాన ములు, శిల్పములు - మన రచయితలు మనకు దిగుమతి చేసిపెట్టి నప్పటికీ - మనకు - నిత్యస్మరణంగా ఉన్న నవలలు చాల స్వల్ప సంఖ్యలో ఉన్నాయి. ఎన్నిసార్లు చెప్పుకున్నా, ఏకవీర, మాల పల్లె, వేయిపడగలు.

వేయి పడగలువచ్చిన పాతికసంవత్సరాల తర్వాత ధర్మ నిర్ణయంవచ్చినది. దీనియందున్న కథా కథనదక్షత అద్వితీయమై నది. మాలపల్లె వేయిపడగలవలెనే ధర్మనిర్ణయం కూడ సమ కాలీన ఆంధ్ర దేశసాంఘిక రాజకీయ నైతిక ఆర్థిక ఆధ్యాత్మిక స్థితి గతులను యథాతథముగా చిత్రించుటలో కృతకృత్య మైనది. ఆంధ్రసాంఘికవాతావరణమును ప్రతిబింబించి, ఆంధ్ర జీవితమునకు రసవద్వ్యాఖ్యానముచేసిన దీ ధర్మనిర్ణయం.

అల్పసామర్థ్యము కలవారు శాంతరసమును ప్రధానరస ముగా స్వీకరించి రక్తికట్టింపలేరు. శాంతరససిద్ధిగల నవలలు విశ్వసాహిత్యమునందే అల్పసంఖ్యయందున్నవి. ఆంధ్రసాహిత్య మున నవలలలో పరిపూర్ణమైన శాంతరససిద్ధి సాధించిన మహా రచన ధర్మనిర్ణయం. శాంతరసము ప్రధానరసమైనప్పటికి, రచన, మాధుర్యప్రసాదగుణముల రాశిగా శోభిల్లుచున్నది.

భాష సమాసజటిలముకాక - బంధపారుష్యరహితమైన శైలితో - శబ్దకాఠిన్యవర్జితమై వైదర్భీరీతికి ఉత్తమోదాహరణ ముగా నున్నది.

సాహిత్యరసానందము బ్రహ్మానందసహోదరమన్న మాటకు నిదర్శనముగా పరమేశ్వరరావు దంపతుల నిర్యాణ ఘట్టమున్నది. రససిద్ధియందు పరాకాష్ఠస్థితియందున్న యీ ఘట్టము విశ్వసాహిత్యమునకే రమణీయాలంకారము.

పెద్దనగారి వరూథిని, రాయలవారి మాలదాసరి, రామకృష్ణుని నిగమశర్మ అక్క, విశ్వనాథవారి గిరిక - వంటి శాశ్వత పాత్రచిత్రణము రామలింగేశ్వరరావుగారి సుమతి.

ఆంగ్లనవలలందు పాత్రప్రధానమైన శిల్ప మెక్కువ. మన రచయిత లాశిల్పమునే దిగుబడిచేసిరి. ధర్మనిర్ణయమునందు అవలంబింపబడిన శిల్పము పైస్థాయిది. మారుతున్న కాలమాన పరిస్థితులలో ఒక కుటుంబముయొక్క పరిణామములను, సంప్రదాయగతులను, వస్తువుగా స్వీకరించి, కాలమానపరిస్థితులను చిత్రించుచు కథాపోషణలో పాత్రపోషణమును అంతర్లీనము చేసికొన్న బృహత్తరశిల్పమిది. జర్మన్ నవలా రచయిత 'టామస్‌మాన్', ఫ్రెంచి రచయిత ఎమిలీజోలావంటి మహారచయిత లీశిల్పములను స్వీకరించిరి.

భారతీయ జీవనపు విలువలను, ధార్మికరహస్యములతో మేళవించి ఉత్తమసాహిత్యముగావచ్చిన యీనవల యావద్భారతస్థాయిలో ఆంధ్రసాహిత్యమునకు కీర్తి ప్రతిష్ఠలను సముపార్జింపగలదు.

'సాహిత్యవేది'.

మారుతీనగరము,

విజయవాడ-4.

ఇది యొక గద్యకావ్యము. ఈ కావ్యమునందు మన దేశమునం దభివ్యాప్తమైయున్న బహువిద్యలలో నొకానొక మహావిద్యనుగూర్చి యెక్కువగా ప్రవచింపబడియున్నది. అది ప్రధానముగా కల్పితమైన దీకావ్యము.

ఒకపాతిక ముప్పదియేండ్లక్రింద నింగ్లండు దేశములో మేరీ కొరెల్లే అను యువతీరత్నము బహుగద్యకావ్యములను ఇంగ్లీషుభాషలో విరచించెను. ఆమె రచించిన గద్యకావ్యములలో నెక్కువ గ్రంథములలో తన మతప్రాబల్యమునే నిరూపించుచుండెను.

ఇంతకు చెప్పవచ్చిన దేమనగా మతప్రాబల్యమున్నంత మాత్రమున నది నవల కాదనుటకు వీలులేదు. ఇందలి కథానాయకుడు, కథా నాయికయు నన్యోన్యనివిష్టబుద్ధులు పరస్పర మొకరి నొక రెఱిగిగూడ తుదిదాక ప్రేమించుకొన్నవారు. నాయకుని ప్రేమ నియమముతో గూడి వైరాగ్యముతో నిండియున్నది. నాయికప్రేమ స్వాత్మార్పణముగానున్నది. ఇందులో నొకసిద్ధాంతము నిబిడమైయున్నది. నాయికయే మతస్థురాలో-ఆమెలోని రక్తము తన్మతలక్షణగాఢత్వముయొక్క పరంపర లేనిదిగా కనిపించుచున్నది. ఇది యొక హేతువేమో—అయినచో స్త్రీపురుషుల దాంపత్యమును గుఱించి యెవ్వతెనో యొకతెను ప్రేమించుట, యెవ్వనినో యొకనిని ప్రేమించుట శ్రేయో

దాయకముగా కనిపించదు. ఆధునికులు ప్రేమవిషయమున రక్త నిష్ఠమైన గుణములను పరామర్శించునట్లు తోచదు. రక్తనిష్ఠగుణ ప్రవాహసాంతత్యమును శాస్త్రదృష్టితో నిర్ణయింపబడిన దానిని గూడ పరిపాలించునట్లు కనిపించదు. మొత్తముమీద నీకావ్యము బహుమహార్థములకు వ్యంజకముగా నున్నది. మఱియు తెలుగు దేశములోని సంప్రదాయములు, కొన్ని యిండ్లలోని నిష్ఠలు, కొందరు మహాపురుషుల యాధ్యాత్మిక పరమానుభూతులు చమత్కారముగా నున్నవి. విశేషముగా నున్నవి.

మన మీనాడు ఒక మహాసంప్రదాయమును పరిత్యజించి నిర్జీవలక్షణము నుపాసించుచున్నట్లు కనిపించుచున్నది. కావ్యము ఆలోచనాశీలురకు మంచి ప్రరోచకమైన కావ్యము.

ఇట్టి గ్రంథములు వ్రాయుటకు పాండిత్యము కావలయును. సంప్రదాయశుద్ధి కలిగినబుద్ధి కావలయును. దీని నాస్వాదించుటకు తొందరపాటు పనికిరాదు.

ఈ కవిని నేను బహుధా ప్రశంసించుచున్నాను. ఈకావ్యమును పాఠకులు జాగ్రతగా పఠింపవలసినదని యభ్యర్థించుచున్నాననవలయును.

విశ్వనాథ సత్యనారాయణ.

# ధర్మనిర్ణయం

తన్నుచూచి ప్రొద్దుటినుంచీ హాస్టలులో ప్రతివారూ వింతగా చూస్తూఉండటం దూరదూరంగా గుసగుసలు పోవడం. సన్నిహితమిత్రులుకూడా ఎబ్బెట్టుగా ప్రవర్తించడం. అంతా అయోమయంగాఉన్నది నారాయణరావుకి. మనస్సుకి ఏదో కొంత ఆందోళనకరంగానూఉంది. అయినా మామూలుగా భోజనం ముగించుకుని, పుస్తకాలు సర్దుకుని కాలేజీకి వచ్చాడు. అక్కడ చాలమంది విద్యార్థులు-ముఖ్యంగా తన క్లాసువాళ్ళు గుంపులు గుంపులుగా ఉండటం, తన్నుచూడగానే పెద్ద అల్లరి చేయడం-ఏదో సంభ్రమం కలిగించింది. తోటి విద్యార్థులు ఇట్లా విచిత్ర ధోరణిలో ప్రవర్తించడానికి కారణం అతని కింకా తెలియలేదు. ఈ అల్లరిచూచి అప్రతిభుడుగా నిల్చుండి పోయాడు. విద్యార్థుల పొలికేకలు హెచ్చిపోయాయి ఇంతట్లో కాలేజీలో తెలుగు అధ్యాపకుడు నరసింహంగారు రావడం జరిగింది. ఆయన నిమిషాలమీద విషయం అంతాగ్రహించి, నారాయణరావును సమీపించి, భుజంమీద చెయ్యివేసి, తన వెంట తనగదిలోకి తీసుకువెళ్ళాడు. ఆయన వివరించి చెప్పేదాకా నారాయణరావుకి అసలు విషయం తెలియనేలేదు - ఆదినం

కాలేజీ గోడలమీద చాలాచోట్ల "నారాయణరావు అంటే ఫతీమాబేగం మొగుడు" అని వ్రాసిఉన్నదని.

విషయం తెలిసేటప్పటికి నారాయణరావుకి ఆరోజు ప్రొద్దుటినుంచీ తోటివిద్యార్థుల విచిత్రప్రవర్తనకి కారణం తెలియడమేకాకుండా-ఒక అనిర్వచనీయమైన ఆందోళన ఏదో ఆవేశించింది. తాను ఆపరిస్థితుల్లో ఏమిచెయ్యాలో తెలియక దిగాలుపడ్డాడు. నారాయణరావు ఉత్తమవిద్యార్థి అనీ-గోడల మీద వ్రాయబడినదాంట్లో ఏకొంచెమూ నిజంఉండదనీ-ఎవరో తుంటరులు చేస్తున్న అల్లరి అనీ గ్రహించిన నరసింహంగారు నారాయణరావును కొంత సముదాయించి, తేరుకునేటట్లు చేశారు. తరువాత ఆయనే నారాయణరావును వెంటబెట్టుకుని ప్రిన్సిపాలుగారి దగ్గరకు వెళ్ళి ఆయనతో సంగ్రహంగా విషయాలు చెప్పారు. ప్రిన్సిపాలుగారుకూడా అంతకుముందే కాలేజీకివస్తూ త్రోవలోనూ-కాలేజీ ఆవరణలోనూ-అనేకచోట్ల చూశారు 'నారాయణరావంటే ఫతీమాబేగం మొగుడ'ని వ్రాశివుండటం, ఫతీమాబేగం ఆకాలేజీలోనే నాలుగోసంవత్సరం చదువుచున్న విద్యార్థిని, అందమైనపిల్ల. తెలివికలదికూడాను. సబ్ కలెక్టరుగారి కూతురు. నారాయణరావున్నూ అదేతరగతి. వాళ్ళ ఇద్దరిపేర్లూ గోడలమీద జోడించి వ్రాసి ఉండటం చూచి ప్రిన్సిపాలుగారు చిరాకుపడ్డారు. ఆసంగతి విచారించాలని అనుకుంటున్నారు. ఇంతట్లోనే నారాయణరావును నరసింహంగారు వెంటబెట్టుకుని రావడం జరిగింది. నరసింహం

గారి మాటలు వింటూనే ప్రిన్సిపాలుగారు సబుకలెక్టరుగారి ఇంటికి టెలిఫోనుచేసి షతీమాబేగంను పిలిపించారు. ఆమె అప్పుడే కారులో కాలేజీకి బయలుదేరుతూ, వెనక్కువచ్చి టెలిఫోనులో మాట్లాడింది. ఆమెను ఆ దినం కాలేజీకిరావద్దనీ, ఆ సాయంత్రం, తానువచ్చి సబుకలెక్టరుగారితో స్వయంగా మాట్లాడుతాననీ ప్రిన్సిపాలుగారు చెప్పారు.

ఆ తర్వాత ప్రిన్సిపాలుగారు నారాయణరావువంక చూస్తూ "అబ్బాయీ! నీవు శ్రద్ధగల ఉత్తమ విద్యార్థివని నాకు తెలుసు; నీవు ఇదివరకు కళాశాలకు కీర్తివచ్చేట్లుగా అనేక పోటీలలో గెలిచావు. ఈ సంవత్సరం యూనివర్సిటీ పరీక్షలలో మన కళాశాలకు ప్రథమస్థానం వచ్చేట్లుగా ఉత్తీర్ణుడవు కాగలవని అధ్యాపకవర్గంవారంతా ఆశిస్తున్నారు. మరి నీవు ఏమి తెలివితక్కువ పనిచేస్తే-తుంటరులు రెచ్చిపోయి గోడలు పాడు చేశారో తెలియకుండా వున్నది" అని అన్నారు. నారాయణరావు కొంత భీతిగా సమాధానంచెప్పాడు. "నాకేమి తెలియదండి. నాకు తెలిసినంతలో నేనేమి పొరపాటు చెయ్యలేదనుకుంటున్నాను. ఒక చిన్న సంఘటనమాత్రం నాకు జ్ఞాపకంవస్తున్నది. మన కాలేజీలో ఆడపిల్లలు. అందులో ముఖ్యంగా షతీమాబేగం, మగపిల్లలతో మాట్లాడరు; అధ్యాపకులు క్లాసుకివచ్చిన తర్వాత క్లాసుకివచ్చి వారికంటె ముందుగా వెళ్ళిపోవడం అలవాటు. మూడురోజుల క్రితం, ఇంగ్లీషు డ్రామా నోట్సు ఒకసారి ఇవ్వమని -సారివిశ్వనాథం మాస్టారు నా దగ్గరనుంచి తీసుకొని

క్లాసురూములోనే షతీమా బేగానికి ఇచ్చారు. అంతకు ముందు వారం ఆమె కాలేజీకి రాకపోవడంవల్ల నోట్సు ఇప్పించమని మాస్టార్ని అడిగిఉంటుందని అనుకున్నాను. నిన్న సాయంత్రం షతీమా బేగం క్లాసుకువస్తూ నన్ను పిలచి-'మీ నోట్సు ఇదిగోనని' ఇచ్చింది. అపురూపంగా జరిగిన ఈసంఘటనకే-క్లాసులో అప్పుడే ఈలలుకొట్టారు. ఆ సంఘటనను దృష్టిలో వుంచుకొని ఎవరో తుంటరులు గోడలు పాడుచేశారనుకుంటాను" అని అన్నాడు. ప్రిన్సిపాలుగారు ఒకసారి నరసింహంగారివంకా, మరొకసారి నారాయణరావువంకా చూశారు. నారాయణరావుతో "ఇక నువ్వు వెళ్ళు. ఈరోజునువ్వుకూడా క్లాసునకు రాకుండావుంటే బాగుంటుంది. బహుశా పిలిపిస్తానేమో సాయంత్రంవరకూ హాస్టలులోనే వుండు" అన్నారు. నారాయణరావు ప్రిన్సిపాలు గారికి నమస్కరించి వెళ్ళిపోయాడు. నరసింహంగారున్నూ ప్రిన్సిపాలుగారివద్ద శలవు తీసుకున్నారు.

ప్రిన్సిపాలుగారు, అధ్యాపకుల్ని ఒక్కొక్కర్నీ పిలచి సంప్రతించారు. ముఖ్యంగా ఇంగ్లీషు అధ్యాపకులు విశ్వనాథం గారిని అడిగారు. అందరూ ఒకటే అభిప్రాయం వెల్లడించారు. నారాయణరావు ప్రవర్తనలోగాని, షతీమా బేగం ప్రవర్తనలో గాని శంకించవలసినదేమిన్నీ లేదనీ, గోడలమీద వ్రాతలలో కించిత్తూ సత్యము లేదనీ. తరువాత ప్రిన్సిపాలుగారు బంట్రోతుల చేత సున్నం తెప్పించి, మళ్లా గోడల్ని శుభ్రం చేయించారు.

ధర్మనిర్ణయం

నిష్కారణంగా తనదోషం ఏమిన్నీ లేకుండా ఇట్లా అవమానమూ, సిగ్గూ భరించవలసి వచ్చినందుకు నారాయణ రావు చాలా బాధపడ్డాడు. హాస్టలుకువెళ్ళి రూములో కూర్చుంటే ఏమీ తోచలేదు. ఏపుస్తకం తెరచినా దృష్టి నిలువలేదు. అట్లాగే బాధ అనుభవిస్తూ తలుపు వేసుకుని గదిలో ఉండిపోయాడు. సాయంత్రం అయిదింటికి మిత్రుడొకడు వచ్చిచెప్పాడు. ప్రిన్సిపాలుగారు గోడలను శుభ్రం చేయించారనీ సాయంత్రం ఆఖరు గంటలో అందరు విద్యార్థుల్ని సమావేశపరచి చాలా బాగా మందలించారనీ మళ్ళీ ఇటువంటి అసభ్యతపు వ్రాతలుగాని క్రమశిక్షణకు భంగకరమైన ప్రవర్తనలుగాని జరిగితే, తీవ్రమైన చర్య తీసుకుంటాననీ-అన్నారుట. ఇంతలో కాలేజి బంట్రోతువచ్చి నారాయణరావును ప్రిన్సిపాలు గారు రమ్మంటున్నారని చెప్పాడు.

శతీమాబేగంకు ప్రిన్సిపాలుగారు స్వయంగా ఫోనుచేసి కాలేజీకి ఎందుకు రావద్దన్నారో తెలియలేదు. పరిపరి విధాలు ఆలోచించింది. మనస్సు భ్రమించింది, పరిభ్రమించింది. కాలేజీకి వెళ్ళితేగాని కారణం తెలియదు. కనీసం సాయంకాలం ఏ స్నేహితురాలి ఇంటికైనా వెళ్ళితే సంగతులు తెలుస్తాయి. ఇప్పుడుఏమి చెయ్యాలోతోచలేదు. మధ్యాహ్నానికితండ్రిగారు

ఆఫీసునుంచిరాగా-ఆయనకు-ప్రిన్సిపాలుగారు ఫోనులో చెప్పిన మాటలు చెప్పింది. ఆయనకూ విషయం అవగాహన కాలేదు. అయినాసంగతి ఏమిటో విచారిద్దామని ప్రిన్సిపాలుగారికి ఫోను చేశారు. ప్రిన్సిపాలుగారు క్లాసురూములో ఉన్నారనీ - వారు ఫోనుదగ్గరకు వచ్చేటందుకు అరగంట పట్టవచ్చుననీ సమాధానం వచ్చింది. 'ఐనా ఏముంటుంది, సాయంత్రం ప్రిన్సిపాలుగారువచ్చి మాట్లాడుతామన్నారుగదా', అని తలచుకుని ఈ విషయం మరచిపోయి కార్యాంతరంలో పడిపోయారు.

సాయంత్రం బయటకు బయలుదేరుదామని ఫతీమా తయారవుతూండగా బిల బిలా, ఆమె తోటివిద్యార్థినులు పదిమందీవచ్చారు. గోడలమీద వ్రాతలు ఉన్నట్లుగానే ఫతీమా కాలేజీకి రాకపోవడం - నారాయణరావు హాస్టలులో ఉంటూ కూడా, క్లాసుకి రాకుండా ఉండటం - పాపం వాళ్ళకు ఏమీ అర్థంకాలేదు. ఇక్కడకు వాళ్లు వచ్చేటప్పటికి ఫతీమా మామూలుకంటే కొంచెం ఉత్సాహం తక్కువగా ఉన్నట్లు కనిపించినా, నిరుత్సాహంగామాత్రం ఉండకపోవడం వాళ్ళకు సమస్యమరింత జటిలంగా కన్పడింది. కాలేజీలో జరిగిన సంఘటనలు-ఉన్నవి ఉన్నట్లుగా విద్యార్థినులు తాము విన్నవి విన్నట్లుగా-ఊహించినవి ఊహించినట్లుగా తమకు తోచినవి తోచినట్లుగా - మెల్లిమెల్లిగా-కొంచెం దృఢంగా ఫతీమాకు విశదం చేశారు. ఆమెను సిగ్గు, భయం, క్రోధం, జుగుప్స-అన్నీ ఒక్కసారి ఆవేశించగా-భోరున ఏడ్చింది, ఇంతలో, లోపల్నుంచి

ఆమె తల్లిగారువచ్చి విషయాలు తెలుసుకొని, కుమార్తెను సముదాయించింది. మానవుల తప్పుగాని, లోపంగాని, లేకుండానే ఒకప్పుడు అట్లా అప్రతిష్ఠపాలు కావలసి వస్తుందని సముదాయించింది. ఇట్లా ఔపచారికాలూ, సముదాయింపులూ జరుగుతుండగానే - ముందుగదిలో తండ్రిగారు ప్రిన్సిపాలు గారితో మాట్లాడు తున్నారనీ తన్ను పిలుస్తున్నారనీ-వర్తమానం రాగా-జంకుతూ, జంకుతూ-షతీమాబేగం తండ్రిగారి ఆఫీసు గదిలోకి వెళ్ళింది.

తండ్రిగారికి ఎదురుగా కూర్చున్న ప్రిన్సిపాలుగారికి నమస్కరించి, తండ్రిగారిప్రక్క కుర్చీలో కూర్చున్నది. ప్రిన్సిపాలుగారు ఆమె వంకసానునయంగా చూస్తూ అమ్మాయీ! నేను అంతా విచారించాను. నీలోపంగాని, నారాయణరావు లోపంగాని ఏమీ లేదు. నిష్కారణంగా అపనిందలపాలు, ఆపత్తులపాలు కావడం-ముందుముందు ఉన్నతకర్తవ్యాలు సాధించవలసినవాళ్ళ జీవితాలలోనే జరుగుతుంది నీవు బెంగపెట్టుకోకు అమ్మాయీ!" అని అన్నారు. ఏమి బదులు చెప్పాలో తెలియక ఆమె కృతజ్ఞతాద్యోతకంగా ప్రిన్సిపాలుగారి వంక చూచింది. ఆమె తండ్రిగారు ప్రిన్సిపాలుగారితో "మీరు పూనుకుని ఈ సంఘటనను ఇంతనేర్పుతో తేల్చివేసినందుకు కృతజ్ఞుణ్ణి. పాపం-ఆనారాయణరావుకి కూడా నా కృతజ్ఞత చెప్పండి; అభివృద్ధిలోకి రావలసిన కుఱ్ఱవాడంటున్నారు మీరు. చాలా మానసిక బాధకు గురి అయ్యాడు" అని అన్నారు. ప్రిన్సిపాలుగారు

"ఇందులో నేను చేసిన ఘనమైన పని ఏమున్నదండీ; ఇట్టి సంఘటన మాకాలేజీలో జరగటమే నాకు తలవంపులుగా ఉన్నది, నారాయణరావుకూడా తనవల్ల మీ అమ్మాయికి బాధ కలిగినందుకు మన్నించమని నా ద్వారా చెప్పుకున్నాడు" అని అన్నారు. మళ్ళీ - "నారాయణరావు - నాతో వచ్చాడు. బయట కారులో ఉన్నాడు" అన్నారు. "అయ్యో! బయట ఎందుకుకూర్చోమన్నారు లోపలకు తీసుకురాకపోయారా?" అంటూ ఫతీమా తండ్రిగారు బంట్రోతును పిల్చి బయట కారులో ఉన్న నారాయణరావును లోపలకు పిలుచుకు రమ్మన్నారు.

నారాయణరావు లోపలకురాగానే ప్రిన్సిపాలుగారు అతన్ని సబుకలెక్టరుగారికి పరిచయంచేశారు. ఆ దినం కాలేజీలో జరిగిన దుష్టసంఘటన ఎవ్వరికీ జ్ఞాపకంలేనట్లే - అసలు జరుగ లేనట్లే - సంభాషణలూ, పరస్పరగౌరవాభివ్యక్తత, జరిగినై. మొట్టమొదటసారిగ ఫతీమాబేగం నారాయణరావుతో కొంత చనవుగా మాట్లాడటం, సంఘంలో ఆపరిస్థితుల్లో అవసరమైనంత మర్యాదగా, సన్నిహితంగా ప్రవర్తించడం. అతనిని ప్రత్యేక దృష్టితో చూడటంజరిగినవి. అప్పుడప్పుడు వస్తూఉండమని నారాయణరావును సబుకలెక్టరుగారు ఆహ్వానించారు. జరిగిన సంఘటనవల్ల ఏర్పడ్డ అశాంతిని, ఆందోళనను, వ్యథను వదలిపెట్టి హాయిగా, పరస్పర మర్యాదలతో-అతి ప్రశాంతిగా ఒకళ్ళదగ్గర ఒకళ్ళు శలవులు తీసుకున్నారు.

# 3

అప్పుడు సాయంకాలం ఆరుగంటలు అయివుంటుంది. ఇంకా గదిలోకి నాలుగు మూలలకూ చీకటి పూర్తిగా వ్యాపించలేదు. మనుష్యసంచలనం - దూరదూరాల ఉండనే ఉన్నది. ఆగదిలో ఒకమూల చిన్న మేజాబల్ల, దానిప్రక్కనే పుస్తకాల అరలూ,వాటినిండాపుస్తకాలూను, మేజాబల్లమీద రెండుమూడు పుస్తకాల దొంతరలూ, అద్దం దువ్వెనా, తల నూనెసీసా, చొక్కా కప్పు గుండీలు, పళ్ళుతోముకునే బ్రష్షూ, పేస్టు ట్యూబూ-అక్కడక్కడ ఉన్నాయి. ఒక ప్రక్క కాంపు కాటు, దానిమీద రెండు పుస్తకాలు, మేజాకు ఎదురుగా ఒక కుర్చీ-వీటన్నిటికీ అధికారిలాగా మేజాబల్లమీద ఒక అలారం టైంపీసు, మేజాబల్లమీద సరిగా నెత్తిమీద అప్పుడే వెలిగిన ఎలక్ట్రిక్ లైటు. ఆదీపం సాన్నిధ్యానికి మూగుతున్న చిన్న చిన్న పురుగులదండు; వాటిని మ్రింగటానికి ప్రయత్నిస్తూన్న బల్లులజంట. ఇది రాజమహేంద్రవరము కళాశాల హాస్టలులో ఒక గదిలో ఆనాటి సాయంకాలం ఉన్నపరిస్థితి.

బయట ప్రళయవర్షము కురుస్తున్నది. ఇంటి పైకప్పును దబదబా బాదుతున్నది. ప్రక్కనున్న చెట్ల ఆకుల్ని దులిపి వేస్తున్నది. కుండపోతగా వరండాలో నీళ్ళుముంచి పోస్తున్నది. అప్పుడప్పుడు తగ్గిపోతున్న ధోరణిలోకన్పిస్తూ దూరదూరాలకు తిమిరావృతమైన ఆకాశంలోకి విజృంభిస్తూ తిరిగితిరిగి ఇంటి మీదకు బలంగా - బలవత్తరంగా పరుగులెత్తివసూ

వికటాట్టహాసంతో ముందుకంటె అధికంగా కుంభద్రోణంగా మత్త ఐరావత గజేంద్రనాసాధారగా ఇంటికప్పును చలింప చేస్తున్నది. మూసిన కిటికీ తలుపుల్ని గదమాయిస్తూ బలవంతగా పగులకొట్టివేసేటట్లుగా రాక్షసవిహారం చేస్తున్నట్లుగా మహా భయంకర ఉన్మత్త దేవతాస్వైర విహారంలాగాఉన్నది. ఇంకా విజృంభించి గది అంతాకూడా తడిపి ముంచెత్తగలనని హుంకరిస్తున్నది. బయట జరుగుతున్న ప్రళయతాండవానికి ఛాయా ప్రతినిధిగా లోపల ఒక అశాంతి ప్రవేశించింది. గడియారం ఆగిపోయినట్లుగాతోచింది. విద్యుద్దీపం మసకలు క్రమ్ముకున్నది అంధకారపు నీడలు విస్తృతంగా గదిలోప్రవేశించి అధికారాన్ని హస్తగతంచేసుకుని రాజ్యవిస్తరణానికి ప్రారంభించినై. గోడమీాద బల్లుల జంట భయభ్రాంతిపొంది నిర్వికారంగా నిలచిపోయినట్లుగా ఉన్నాయి.

కాని ఆ ప్రళయ వర్షానృత్యం-ఆనంతంగా నిలత్రొక్కుకో లేకపోయింది. నిమిష నిమిషానికీ - సన్నగిల్లుతున్న సూచనలు తోస్తున్నా-ఇప్పట్లో ఆగిపోయేవిధంగా మాత్రం కన్పించడం లేదు. వర్షం ప్రశాంతంగా - ప్రక్కనున్న చెట్లమీాద - దూర దూరాలలో పంటభూములమీాద ఎదురుగా మైదానంలో తాను నూతనంగా నిర్మించిన సద్యస్సరస్సుమీాద - ఇంటి కప్పు మీాద - పడి - లయస్ఫూర్తిగా - భరతనాట్యం చేస్తూనేవున్నది. సంగీత విద్యానిధులకు తెలిసిన ముప్ఫయిఅయిదు తాళాలనీ-సమ్మిళితం చేసినట్లుగా మోత మోగిస్తూనేవున్నది. తాళ

మాలికలుగా - తాళాం తర్లీనములైన సొల్లులుగా - వెల్లువలు వెల్లువలుగా-గజ్జెలు తాండవిస్తూనే వున్నది. కర్ణాటక సంగీత మూర్తిత్రయంలో తాళగత మాధుర్యాన్ని మధించిన శ్రీ శ్యామశాస్త్రిగారి కృతిప్రస్తారంలాగా - చిత్సభావేదికపైన మహాతాండవం చేస్తున్న మహానటుడైన నటరాజుకి సహచారిణి యైన శ్రీశివకామసుందరీఅమ్మవారి అందెలరవళిలాగా-మధురాతి మధురమైన పోకడలు పోతూనేవున్నది గడియారం మళ్ళీ నిద్ర మేలుకున్నట్లుగా వున్నది. విద్యుద్దీపం తిరిగి కాంతిని పోసుకుని పుంజుకున్నట్లుగా వుంది. గోడమీద బల్లుల జంట నూత్న చైతన్యాన్ని ఆహరించుకున్నట్లుగా అయింది.

ఈ అకాల వర్షపాతజనిత విభ్రాంతి మాత్రం ఇంకా ప్రకృతినీ, చైతన్యమూర్తులయిన జీవరాశినీ, వదలిపెట్టినట్లుగా లేదు. ఈ అసామాన్యమైన విభ్రాంతితోనే క్యాంపుకాటుమీద నారాయణరావు కూర్చుని ఉన్నాడు. అదే పరిస్థితిలో మేజాకు ఎదురుగా ఉన్న కుర్చీలో ఫతీమాబేగమూ కూర్చుని ఉన్నది. గోడలమీద వ్రాతల సంఘటన తర్వాత వాళ్ళు ఎప్పుడూ పరస్పరం చూచుకోలేదు. రోజులు మామూలుగా దొర్లిపోయి నాయి. నాలుగునెలలలో విశ్వవిద్యాలయ పరీక్షలు వచ్చినై. కళాశాల అదివరకే వేసవిశెలవులకు మూయబడి ఉండుటవల్ల జూనియర్ విద్యార్థులంతా ఇళ్ళకు వెళ్ళిపోయారు. కాలేజీ హాస్టలు పూర్తిగా ఖాళీగావున్నది. ఒక్క నారాయణరావు గదితప్ప. ఆరోజు ఆఖరు పరీక్ష. పరీక్ష ముగియకముందే

మేఘాలు క్రమ్ముకుని, తుంపురులుగా సన్నచినుకుగా సాగినవాన అకాలప్రళయంగా విజృభించి పరీక్ష ముగిసే సమయానికి మహా భయంకరంగా వున్నది. ఆ రోజు సాయంత్రం జరిగిన పరీక్షకు ఆరుగురే విద్యార్థులు. అందులో హాస్టలువాడు నారాయణ రావు ఒక్కడే. పరీక్ష ముగియగానే, అధికారి పని ముగించుకుని కారులో చక్కాపోయాడు. నౌకర్లు తలుపులు బిగించి వాళ్ళ దారిని వాళ్ళు వెళ్లిపోయారు. విద్యార్థులు ఎట్లాగో దారిన పడ్డారు. ఉన్న ఒక్క స్త్రీవిద్యార్థిని ఫతీమాబేగము గేటుదాకా విసురుగా వచ్చి ఏదైనా బండి దొరకుతుందేమోనని పరకా యించి చూచింది. అటూ ఇటూ ఫర్లాంగుదూరంలో బళ్ళు లేవు. ఆ ముసురుకొన్న మసకచీకట్లలో అంతకన్న దూరము కన్పించనూ లేదు. నిమిషనిమిషానికీ వర్షం ఎక్కువైపోతున్నది దానికి తోడు ఝంఝూమారుతము. చీకటికూపాలుగావున్న కళాశాల వరండాలలోకి తిరిగి వెళ్ళడానికి భయంవేసింది. వర్షం తీవ్రతర స్వరూపం తాలుస్తున్నది. ఇక గత్యంతరంలేక ప్రక్కనేఉన్న కాలేజీ హాస్టలు వరండాలోకి కాలుపెట్టింది. వరండాలో చాలసేపు నుంచున్నది. అక్కడకూడా వర్షమువల్ల ప్రమాదం తగ్గలేదు. ఎటుచూచినా హాస్టలు గదులన్నీ తాళాలుపెట్టి ఉన్నాయి, చివరగదిలోమాత్రం దీపం వెలు గుతున్న సూచనలు కన్పించగా ఆమె కొంత ధైర్యంచేసి, ఆగదికి దగ్గరగా అప్రయత్నంగా నడచింది. కాని లోపలకు పోయే-అథమం తొంగిచూచే సాహసంకూడా ఆమెవద్ద లేక

పోవడంవల్ల-ఆగదిముందు వరండాలో అట్లాగే పదినిమిషాలు. నిల్చుని ఉండిపోయింది. వర్షంలో మెరిసిన మెరుపులలో ఆమె భయాతిరేకం పొందుతూ ఏమి చెయ్యాలో తెలియకచేసిన అలజడి గదిలోపలకు విన్పించి లోపల కూర్చునిఉన్న నారాయణరావు చేత తలుపు తెరిపించి బయటకు తొంగి చూచే ట్లుగా చేసింది. అతడు బయటకు తొంగిచూచేసరికి అస్పష్టంగా మసకచీకట్లలో కన్పించిన మానవాకృతిని లోపలకు రమ్మని ఆహ్వానించాడు. ఆపరిస్థితిలో ఇహ అసలు ఆహ్వానంలేక పోయినా లోపలకు వెళ్ళడానికి ఆమె సంసిద్ధంగా ఉండనే ఉన్నది. ఆమెకు ఏకొంచెమైనా జంకువుంటే అది ఆ ఆహ్వానం వల్ల హరించిపోయింది. కొంత ధైర్యం చేకూర్చుకుని, లోపలకు పోయి, లోపల నారాయణరావునుచూచి ఆమె ఆశ్చర్యపడింది. నారాయణరావు హాస్టలులో ఉంటున్నాడని ఆమెకు తెలుసు గాని ఈ గదిలోనే ఉంటున్నాడనిగాని తానతని గదిలోకి వెళ్తున్నాననిగాని ఆమెకు తెలియదు. నారాయణరావుకికూడా ఆవరండాలో అసహాయస్థితిలో నిల్చుని ఉన్నది ఫతీమా బేగమని తెలియదు. ఆమె ఇంతకుముందు తన్ను అపనిందపాలు చేయుటకు కారణమైన ఆమె. ఆ విచిత్ర పరిస్థితిలో సగం తడిసి సంపూర్ణమైన భీతితో సహజలజ్జా వినమ్రంగా ఆ సాయంవేళ నిర్మానుష్యంగాఉన్న కాలేజీ హాస్టలులో చిట్టచివరగాఉన్న తన గదిలోకి రావడం అతనికీ ఆశ్చర్యంగానే ఉన్నది.

ప్రళయ తాండవం ఉపసంహరించుకుంటున్న వర్షాదేవి తన సహజమైన ముగ్ధమనోహరాకారంతో దర్శనం ఇచ్చినట్టుగా ఆమె నారాయణరావు గదిలోకి ప్రవేశించింది. తడిసిపోయిన చీరనుండి నీళ్ళు కారుతూండగా తడిసిన చీరనుండి అతిలోక సౌందర్యంలోకంలోకి తొంగిచూస్తుండగా సమతల ప్రదేశంలో ప్రవహించే సెలయేటి కన్నెలా ఆమె గదిలోకి ప్రవేశించింది. కొండలమీదనుండి దూకుళ్ళుపోయి మైదానంలో ప్రవేశించి సాగరోన్ముఖంగా ప్రవాహాన్ని మళ్ళించుకుంటున్న నదీమతల్లిగా వచ్చింది. ఇంతసేపూ బహిఃప్రదేశంలో దివ్యనాట్యంచేసిన గంధర్వాప్సరఃకాంత నేలకు అవతరించినట్లుగా వచ్చింది. ఆ మహావర్షంలో తడిసిపోయిన పుష్పవనీకాంత - నిర్వర్షా ప్రదేశానికి తలదాచుకోవడానికి వచ్చినట్లుగా వచ్చింది. భీతి, లజ్జ, ధైర్యం మందగమనం-అన్నీ సంతరించుకుని అలసానివారి వరూధినీకాంత, ప్రవరాఖ్యుణ్ణి దరిసినట్లుగా వచ్చింది. మనోహరమైన ఇంద్రచాపం భూమికి అవరోహణచేసినట్లుగా వచ్చింది. ఆ రావడమే నారాయణరావును సంభ్రమాశ్చర్యచకితుణ్ణి చేసింది. నారాయణరావు తేరుకుని, ఆమెను కుర్చీలో కూర్చోమని, ఉతికిన తువ్వాళ్ళు రెండు ఇచ్చి తలతుడుచుకోమన్నాడు. ఆమె సిగ్గుపడుతూనే తుడుచుకుని కుర్చీలో అట్లాగేకూర్చుండిపోయింది. కొంతసేపు అట్లాగేజరిగిపోయింది. ఇద్దరూ మాట్లాడలేదు. అసలు ఏమి మాట్లాడాలోవాళ్ళ ఇద్దరికీ తెలియలేదు. ఇట్లా మానవాతీతమైన సన్నివేశంలో కలుసుకుని, అప్రతి

భులుగా అట్లాగే ఉండిపోయారు - కొంతసేపటికి నారాయణ రావు తేరుకొని, అప్పుడే రాత్రి ఎనిమిదిగంటలు కావడం గమనించి-అప్పుడు చేయవలసిన దేమిటని ఆలోచించాడు. విద్యార్థులు ఎవ్వరూ లేనందున హాస్టలులో భోజనం ఏర్పాట్లు నిలిపివేశారు. తాను భోజనానికి ఊళ్లోకి ఎట్లాగూ వెళ్ళి రావలసిందే. షతీమాను ఇంటిదగ్గర దింపిరావలసి ఉంటుందని గ్రహించాడు. దాదాపు ఒకటిన్నరమైలు దూరానగాని బండి దొరకకపోవచ్చు, తాను వెళ్ళి బండి తీసుకువస్తే మరోగంట ఆలస్యం కావచ్చు, ఏమిన్నీతోచక, షతీమాతో అన్నాడు. "మీరు ఇక్కడ ఉండండి. నేనువెళ్ళిబండి తీసుకువస్తాను." దానికి ఆమె ఇట్లా అన్నది. "మీరు వెళ్ళితే నేను ఒక్కర్తెనే ఇక్కడ ఉండలేనేమో! అదిగాక ఉండటం భావ్యంకూడా కాదేమో! ఐనా మీరు బండి తీసుకురావడానికి కనీసం గంట సేపైనా పట్టవచ్చు, అందుచేత మీరు నా వెంట వచ్చి దొరికిన చోట బండి ఎక్కించరాదా?" ఆమె సలహా బాగానే ఉన్నదనుకుని, నారాయణరావు తన దగ్గర ఉన్న ఒక్క గొడుగును తీసుకొని, గదికి తాళంవేసి, ఆమెతో సహా బయలు దేరాడు.

బయట ఇంకా మేఘావృతాంగానే ఉన్నది. అడపా దడపాపెద్ద పెద్ద జల్లులు వస్తూనే ఉన్నాయి. గాలి విసుర్లు కొట్టుతూనే ఉన్నాయి. వేరే గత్యంతరం లేక ఇద్దరూ ఒకే గొడుగులో తలలుదూర్చి బయలుదేరవలసి వచ్చింది. అంత

సన్నిహితంగా స్త్రీకి, అందులోనూ మహాసౌందర్యరాశి ఐన స్త్రీకి అత్యంతసన్నిహితంగా రావడం నారాయణరావుకి అదే ప్రథమానుభవం. వర్షపుజల్లు విజృంభించి గాలి విసురుదెబ్బ కొట్టినప్పుడల్లా ఆ ఏక ఛత్రంలో పయనిస్తున్న జంట మరింత సన్నిహితంగా-మధ్యలో నిరవకాశమైనంత సన్నిహితంగా రాక తప్పలేదు. పరపురుషునితో అందులోనూ మహామేధావిగా తనకు తెలిసి, తనకు తెలియకుండానే తన భావనాప్రపంచంలో సమున్నతస్థానం అధిష్ఠించిన నారాయణరావుతో ఇంత సన్నిహితంగా రావడం ఫతీమాకున్నూ ప్రథమానుభవమే. ఈ అకాలవర్షా విజృంభణంలో వాళ్ళిద్దరూ ఒకరినొకరు ఆశ్రయించినట్లుగా, పెనవేసికున్నట్లుగా నడుస్తూ షుమారొక మైలు దూరం ప్రయాణంచేసి ఉంటారు. ఈకొంచెంసేపట్లోనూ, ఉభయులూ ఏవో అతిలోకమాధుర్య మహానుభవాన్ని చవిచూచినట్లుగాను అనేక జన్మాంతరాలుగా అతి సన్నిహిత సంబంధంకలిగి నేడు ఆ సర్వ పూర్వానుబంధమూ పునః దృఢీకరించుకున్నట్లుగానూ అనుకున్నారు. ఈ స్వల్పకాలిక సన్నిహితత్వమే వాళ్ళకు ఆజన్మమైన పరిచయం ఉన్నట్లుగానూ, అంతరంగిక అనుబంధం ఆత్మీయతా ఉన్నట్లుగానూ అనిపింపచేసింది. ఇద్దరూ ఉత్తమ శీలవంతులు కావడంవల్ల ఆ అసామాన్య ఏకాంతసమైక్యతాస్థితిలోకూడా తమ మధురావేశాల్ని అదుపులో ఉంచుకున్నారేగాని, శరీరాలు ఒరుసుకుంటూ, తలలు తగిలించుకుంటూ, గుసగుసలుపక్కుంటూ చేసిన ఆప్రయాణంలో

వాళ్ళకు గాఢపరిష్వంగానుభవం, పరస్పర హృదయావిష్కరణ కలిగిందనడంలో అతిశయోక్తిలేదు. తమ తండ్రిగారు ఊళ్ళో లేకపోవడంవల్ల కారు లేకపోయిందనీ-తాను పరీక్ష ముగిసిన తర్వాత బండిలో వెళ్ళవచ్చుననుకున్నాననీ, వర్షం విజృంభించిన తర్వాత తనకోసం బంట్రోతువచ్చి తాను కన్పడకపోవటంచేత వెళ్ళిపోయి ఉండవచ్చుననీ ఆమె చెప్పింది. ఆమె మాటలు వింటూ ఆ వినూతనభుజాస్ఫాలనా పులకిత మాధుర్యాన్ని అనుభవిస్తూఉన్న నారాయణరావు రాజమహేంద్రవరం నడి బజారులో వరదరావు కాఫీహోటలు, నాళంవారి సత్రం వచ్చేసినాయని గుర్తించనేలేదు. ఇంతలో మునిసిపలు రోడ్డు మీద నిత్యమైన ఏగుంటలో కాలువేసిందో-షతీమా పట్టుతప్పి పడిపోయింది. నారాయణరావు స్మృతివచ్చినవాడై ఆమెను రెండుచేతులతోనూ ఎత్తి పొదివిపట్టుకున్నాడు. ఆమె మెడ క్రింద ఒకచెయ్యి, కాళ్ళక్రింద రెండోచెయ్యివేసి పొత్తిళ్ళలో పసికందును పెట్టుకున్నట్టుగా ఆమెను పట్టుకొని గొడుగును మెడకు తగిలించుకున్నాడు. ఆమె అతని చేతుల్లో సొమ్మసిలి పోయింది. ఆమె అంత తేలికగా ఉన్నదేమిటని అతడు ఆశ్చర్య పోయాడు. ఏడుపువ్వుల ఎత్తు రాజకుమార్తెకథ జ్ఞాపకంవచ్చి నవ్వువచ్చింది. ఆమెను అక్కునచేర్చుకోగా అంతవర్షంలోనూ చలిలోనూ అతనికి ఏదో కవోష్ణగాఢత్వం అనుభవంలోకి వచ్చింది. ఆమె నిస్సహాయంగా అతని బాహువులలో ఇరుక్కుని, అతని కంఠాన్ని బాహువులతో బంధించి సొమ్మసిలి

ఉండటం అతనికి పరమానందపారవశ్యంగా ఉన్నది. ఇంకా వర్షం కురుస్తూనే ఉండటంవల్లనూ, చీకటిగా ఉండటంవల్లనూ జనసంచారంలేదు. ఆమెను పొదివిపట్టుకుని అతడు అట్లా పది అడుగులు వేశాడోలేదో అక్కడ గుర్రబ్బండి నిల్చునిఉన్నది. అతడు ఆమెను అందులో కూర్చోపెట్టి ప్రక్కదుకాణంలో ఉన్న బండివాణ్ణి పిలుచుకువచ్చాడు.

ఆమె బండిలో ఎక్కి కూర్చుని నారాయణరావుతో వెళ్ళివస్తానన్నది. ప్రకృతంలోకి వచ్చిన నారాయణరావు తాను కూడా ఆమెవెంటవచ్చి ఇంటిదగ్గర దింపివస్తానన్నాడు. అప్పటికే చాలరాత్రి అయిపోయినదనీ ఇక అతనికి శ్రమ ఇవ్వడం న్యాయంకాదనీచెప్పి - అదీకాక ఇక భయపడవలసిన కారణం కూడా లేదనిచెప్పి తిరిగి రేపు కలుసుకుందాము లెమ్మనిచెప్పి ఆమె బండిలో కదలివెళ్ళిపోయింది.

నారాయణరావుకు ఆరాత్రి సరిగా నిద్దురపట్టలేదు. ఏవో మధురాతి మధురమైన ఊహలు, పట్టక పట్టక నిద్దురపట్టగా స్వర్గానుభవంలాంటి మధురస్వప్నాలు ఇంతలో స్వప్నభంగాలు మళ్ళీ-పరీక్షలమీద ఆలోచనలు; ప్రాక్టికల్సు ఇంకా వారం రోజులుండటంవల్ల తానక్కడనే ఉండాలనుకున్నాడు. ఈ వారము రోజులలోనూ తానేదో నూత్న ప్రపంచానికి పోతున్నట్లుగా ఉన్నది. ఇంతలో తన కుటుంబముపైన ఆలోచనలు. తన తండ్రిగారు బహు పుణ్యశీలుడైన ఉత్తముడు. ఆయనకు తన ఊహలు సమ్మతములో? చివరకు తన ఈమధుర స్వప్నమేమి

కానున్నదో ? తానేదో గంధర్వ-విద్యాధర-యక్షలోకములకు ప్రయాణము చేయుచున్న బాటసారివలె నున్నాడు. ఇన్ని ఊహలతో ఊహలకందని అపూర్వ భావోద్రేకముతో సుఖ స్వప్న భ్రాంతులతో - తద్భంగములతో ఆరాత్రి గడపిన నారాయణరావు మరునాటి సూర్యోదయ సమయంలో కన్నులు తెరచాడు.

# 4

నారాయణరావు లేచి కాలకృత్యములు తీర్చుకుని స్నానము ముగించుకుని. బయటకు పోవుటకు ఉద్యుక్తుడగు చుండగా - షతీమాబేగము వచ్చింది. గాఢజటిలతమో నిబిడ మైన నిశాంతకాలంలో చనుదెంచు శాంత ఉషః కాంతా లలామవలె ఆమె వచ్చింది. మహాంధకారమధ్యంలో చంద్రరేఖ వలె ఆమెవచ్చింది. గాఢతిమిరతరుపల్లవాలై ఆకాశాన్ని ఆవ రించిన మేఘతమాలమాలికలు అదృశ్యంకాగా శరత్కాంతా తిలకమైన శారదేందురేఖవలె ఆమె వచ్చింది.

ఆమె ఒక ఫ్లాస్కునిండా కాఫీని - పెద్ద పొట్లాముతో తినుబండారాలు - చిన్నబుట్టతో పళ్లూ తెచ్చి మేజాపై పెట్టి కుర్చీలో కూర్చుని నారాయణరావువైపుచూచి చిరునవ్వునవ్వి నది. నిన్నటి సాయంకాలము అదేగదిలో ప్రవేశించుట కామె కెంత సాహసము కావలసివచ్చినదో - నేడంత ఉత్సాహంతో-

ఆమె లోపలకు వచ్చింది. నారాయణరావు "ఇవన్నీ ఏమిటి?" అన్నాడు. ఆమె చిరునవ్వు నవ్వి "హాస్టలులో మెస్సు లేదు కదా! మీరు కాఫీకి ఊళ్లోకి వెళ్ళాలికదా! నేను మీకోసం ఊళ్లోనుంచి వస్తున్నప్పుడు మీరు మళ్ళీ ఊళ్ళోకి కాఫీకోసం వెళ్ళడం దేనికని ఇవన్నీ తెచ్చాను" అన్నది. నారాయణరావు "ఒక్క కాఫీకాదే! బండెడు తినుబండారాలుకూడా తెచ్చారు. వీటిని నేనేం చెయ్యగలను?" అని అనగా - ఆమె "పాపం! తినుబండారాలు ఏం చెయ్యాలో తెలియని నంగనాచిలాగా మాట్లాడుతున్నారే" అని అంటూ నవ్వింది. ఆనవ్వు అతిప్రసన్నమైన మధురస్మితమై నారాయణరావు హృదయంలో నూతన ఉద్దీపనకు హేతువై స్వర్గసోపానపంక్తిలో మరియొక మెట్టు ఎక్కినట్లుగా అనిపించింది. ఏదో సమాధానము చెప్పాలిగనుక నారాయణరావు "అబ్బో! ఇన్నిపళ్ళు! అల్పాహారాలు! నా వల్ల కాదు - మీరుకూడా తీసుకోవలసిందే" అని అన్నాడు. ఆమె మరల మందస్మితంగా "అవును - లేకపోతే నన్ను వదలి పెట్టి మీరొక్కరే ఆరగిద్దామనుకున్నారా ఏమిటి?" అని అంటూ లేచి పళ్ళూ. ఫలహారాలు రెండుభాగాలుచేసి అతని ముందొకటిపెట్టి రెండు గ్లాసులతో నీరుపెట్టి ఒకభాగం తన ముందుపెట్టుకుని ఉపక్రమించింది.

వాళ్ళు అల్పాహారాలు తిన్నారో వినూతన మాధుర్యాన్ని అనుభవిస్తూ కాలం గడిపారో నర్మసంభాషణలు చేసుకుంటూ హృదయ గతమర్మభావాల్ని వ్యక్తం చేసుకున్నారో-

అపూర్వమైన ఆనంద విహారంలో ఉండిపోయారు. వాళ్ళకు వాళ్ళు తప్ప బహిః ప్రపంచం లేనట్లుగా ఉన్నారు. పరస్పరాకర్షణ, పరస్పరస్పర్శ, పరస్పరాస్ఫాలన, నుంచి క్రమంగా, హస్తనిపీడనం, సన్నికర్షణం, సన్నిహిత ఆసీనత్వం, ఏకవచనత్వం, ఏకాంత నిగూఢత్వం, పరస్పర ఆత్మీయత్వంగా వృద్ధి పొంది, పరిధులు అతిక్రమించని సంపూర్ణ ఆత్మీయత, అవినాభావతల హద్దుల మేరకువచ్చి ఆరురోజులు గడచినై. ప్రతిరోజూ ప్రాతఃకాలంతోనే షతీమా తినుబండారాలతో నారాయణరావు గదికి వస్తుంది. సాయంకాలందాకా అక్కడనే ఉంటుంది. అవేమాటలు, అవేచర్యలు, అవేలాలనలు, అవే గుసగుసలు, అవే పరమరహస్యములు మర్మములు, స్నిగ్ధములు, అవే నూతనములు అవే అనూతన నూతనములు.

ప్రాకృత పురుషునిలాగా ఈనూతన మధురానుభూతిలో మునిగిపోయిన నారాయణరావుకి-ఏదో అభూతమైన హృదయ శక్తి - వెనక్కులాగుతున్నట్లుగా - ఆకాశహర్మ్యంమీాదనుంచి పడిపోతూఉండగా-ఏదో అదృశ్యశక్తివలవేసి పట్టుకున్నట్లుగా-అనిపిస్తూవచ్చింది. ఈ అసాధారణ పరిస్థితిలో తనప్రవర్తన ధర్మోచితంగా ఉన్నదా - తన తలిదండ్రులస్థితికి, మనస్వితకు తగినట్లుగా ఉన్నదా - తనభారతీయ సంస్కృతికి అనుగుణ్యంగా ఉన్నదా - అని శంకాసంకులమైన వేదనాభారం నారాయణరావు నివేధిస్తూనే ఉన్నది. ఆవేదన, ఆభారం - క్షణక్షణానికీ వామనావతారంలాగా - విజృంభిస్తూన్నది.

ఆ మరునాడే ప్రాక్టికలు పరీక్షలు. ఇద్దరికీ స్మృతి వచ్చినట్లయింది. స్నేహితురాండ్ర ఇండ్లకు పోవుచుంటినన్న నెపముతో ఆమె వస్తున్నది. పరీక్షలు పూర్తియితే ఇక బయటకు రావడానికి వీలుండదు. ఆసాయంకాలం ఆమె నారాయణరావుతో అన్నది. "అయితే రావూ! రేపటితో పరీక్షలుఆఖరు. మన మిద్దరం గట్టెక్కగలం. ఏదో స్వయంగా ఆర్జించుకుని బ్రతుకగలం. మనవాళ్ళు మన నిర్ణయాలని అంగీకరింపకపోయినా మనం భయపడనక్కరలేదు. ఇంతకూ మనం ఎప్పుడూ వివాహం చేసుకుంటే బాగుంటుందో ఆలోచించు"- ఈ మాటలకు నారాయణరావు చకితుడై "షతీ! నేను ఇంకా అంతదూరం ఆలోచించలేదు అసలు ఇన్నాళ్ళుగా నేను క్లాసు రూములో ఉన్న ఆడపిల్లన్ని ఆడపిల్లలుగా గుర్తించనేలేదు. గోడలమీద వ్రాతలు చదివిన రోజున నాకు కొంతపురుషత్వము ప్రాప్తించినట్లుగా అయినది. ఆరాత్రి నీతో ఏకఛత్ర ప్రయాణం చేసినప్పుడు-నాలోమాధుర్యభావం—ఉద్దీప్తమై— నన్ను సంపూర్ణపురుషుణ్ణి చేసింది. ఈఆరుదినాలనుంచి నీతో సాహచర్యం నన్ను ఆపాదమస్తకమూ మేల్కొలిపింది. విచిత్రమైన అనుభవాల్ని ప్రసాదించింది. నిజంగా జీవితంలో పుస్తకాలనుండి తెలుసుకునే దానికంటె స్వానుభవం ద్వారా తెలుసుకునేదే ఎక్కువగా ఉన్నదని నాకు బోధపడింది. ఇట్లా స్వానుభవంవల్ల గ్రహించిన విజ్ఞానమే మనస్సులో నిలవత్రొక్కుకునేది. ఇప్పుడు నువ్వు వివాహం సంగతి ప్రస్తావించేదాకా

నామనస్సు ఆ విషయం గురించి ఆలోచించనేలేదు. ఇంతకూ పురుషుని కన్నా స్త్రీయే వివేకవంతురాలనీ, ఆలోచనా పరు రాలని, ప్రకృతి స్వభావమైన విషయాలలో ఆమెదే పైచేయి అనీ - నాకు ఇప్పుడు ఆకళింపుకువస్తోంది. మన వివాహవిషయం ఆలోచించవలసినదే. దీనికి మీ తలిదండ్రులు అంగీకరిస్తారా? మాతలిదండ్రులు అంగీకరిస్తారా? లోకం ఏమంటుంది? అనేక సంగతులు ఆలోచించవలసి ఉన్నాయి", అని అన్నాడు. దానికి ఫతిమా "నిజమే. అంతా విచిత్రంగా ఉన్నది. మొట్టమొదటి సారి గోడలమీద వ్రాతలతో నాదృష్టి మీవైపుకి మళ్ళింది. చూడగానే ఏదో చెప్పజాలని ఆకర్షణ కలిగింది. ఆ ఆకర్షణ నాకు తెలియకుండానే నా మనస్సులో చోటు చేసుకుని, వృద్ధి పొందింది. ఇప్పుడు నామనస్సు అంతా ఆ ఆకర్షణకు జనక కారణ మైన మనోహరరూపమయమై పోయినా స్వాధీనంనుండి తప్పి పోయింది. ఆ రోజురాత్రి ఏకఛత్ర ప్రయాణమూ - నేను కాలుజారి నీళ్ళలోపడి పోవటం - మీరు నన్ను బాహు ద్వయంతో పొదివి పట్టుకోవడం- ఆ అనుభవాలు అనేక పూర్వ జన్మలపుణ్యార్జిత ఫల స్వరూపమైన దివ్యానుభవాలై -వాటిని జ్ఞాపకం తెచ్చుకుంటేనే శరీరం యావత్తు పులకాంకురం అవు తోంది. మనస్సు పరవశించిపోతున్నది. ఏవోపూర్వజన్మ అను బంధాలు స్మృతికి వచ్చినట్లుగా ఉన్నది నాకు ఇన్ని రోజు లుగా - నాఅంతరాత్మలో నిత్యనివాసం చేస్తున్న ఈ నారా యణరావును ఎట్లా గుర్తించలేక పోయానా? అని ఇప్పుడు

నాకు ఆశ్చర్యంవేస్తోంది. ఈ నారాయణరావే నాకు సర్వ పూర్వ జన్మల్లోనూ భర్త అని నా అంతరాత్మ నాకు చెబుతున్నది. ఇప్పుడు నాకు నీయందు అనితరహేతువుచేత కలిగిన ఆత్మీయతే - నాయీ భావాన్ని బలవత్తరమైన సాక్ష్యంగా ఋజువు చేస్తోంది. సర్వపూర్వ జన్మలలోనూ భార్యాభర్తలమైన మనము-ఈజన్మలో కేవలం లౌకికాచారమాత్రమైన వివాహకాండ జరుపుకోవడానికి పెద్ద ఆలోచించాల్సినదేముంది? మనం భార్యా భర్తలమని మన ఆత్మలకు తెలుసు. ఈ భావమే ఇక సర్వ భావి జన్మలలోనూ ప్రతిష్ఠితమై ఉంటుంది. ఇప్పుడు మనం ఇద్దరం మైనారిటీ వెళ్ళినవాళ్ళమే. ఇద్దరికీ దృఢమైన - దైవం కూడా త్రెంపజాలని - ప్రేమానుబంధంవున్నది. ఇద్దరం చదువుకున్నవాళ్ళం మూఢమైన నమ్మకాల్ని మనం ఖాతరుచెయ్యం. మన కాళ్ళమీద మన నిలబడగల పరిస్థితిలోవున్నవాళ్ళం. నీవు సిద్ధమైతే నేను రేపే నిక్కా చేయించుకోవడానికి సిద్ధమే. మాతండ్రిగారు నా అభిలాషకు ఎప్పుడూ అడ్డుపెట్టరు." అని శాంచెం హెచ్చుస్థాయిలో ఆవేశపూరితంగా - రుద్ధగాత్రంతో ఉన్నది.

నారాయణరావుకి ఈ సమస్య అంత సులభమైనదిగా తోచలేదు. తనకూ తల్లీ తండ్రీ వున్నారు. తండ్రిగారు సదాచారసంపన్నుడు, తానే పెద్దకుమారుడు; తల్లితండ్రులు తన మీదనే ఎన్నో ఆశలు పెట్టుకుని వున్నారు. తానీ తురకపిల్లను కట్టుకోవడానికి వాళ్లు ఇష్టపడతారా? తల్లిదండ్రులయందు

తనకున్న బాధ్యతమాటేమిటి? అసలీ షతీమా - ఉత్తమ భార్యగా - తన కర్తవ్యాన్ని ఎంతవరకు నిర్వహింపగలుగు తుంది. ఆమె తల్లిదండ్రుల అభిప్రాయాలు ఎట్లాఉన్నాయో ! తనకు తన భారతీయత్వంపైనా - తన ఉపనిషన్మతంపైనా - మిక్కిలి అభిమానం వున్నది. ఈ తురకపిల్లను పెండ్లాడి తన మతాన్ని ఏమిచేసుకోవాలి? తానా - కేవలమూ తరతరాలుగా శాకాహారులై, ఆర్షసంప్రదాయనిష్ఠులైన సనాతనుల కుమా రుడు. ఆమె నిత్య గోమాంసభుక్కులకుమార్తె. తమతమ రక్తా లలో - ఒకరియందు ఒకరికి అనురాగంకంటె - వైలక్షణ్యమూ- విరోధభావమూ - ఎక్కువగా ఉన్నాయేమో. ఇన్నిసమస్యలు, ఇన్ని విరుద్ధ భావకల్పనలు - అతని మనస్సులో ఒక్కసారి విజృంభించి స్తబ్ధుణ్ణి చేసినై. ఆమెకు దగ్గరగా కూర్చుని ఉన్న - ఎంతో దూరాన వున్నట్లు అనిపించింది. ఇంతవరకూ ఎంతో సౌఖ్యప్రదాయిగా ఉన్న ఆమె సాన్నిధ్యం - ఇప్పుడు అకస్మాత్తుగా, ఏదో దుష్కంటకంగా - మహాభయాస్పదంగా - మారిపోయినట్లు తోచింది. ఆమెతో ఏమీ చెప్పలేక "షతీమా! రేపు పరీక్షలు అయిపోయిం తర్వాత ఈ సమస్యను తేల్చుకుం దాము. ఈ సమస్యను తేల్చుకునిగాని నేను మావూరు వెళ్ళను" అనిమాత్రం అనగలిగాడు - కొంతప్రయత్నంమీద అంత మాత్రానికే ఏదో ఆఘాతం అనుభవించినట్లుగాఅయి చాలా నిరుత్సాహంపొంది, దిగాలుపడి - వేరే ప్రత్యుత్తరంలేక - ఆమె "సరే" అన్నది.

ఆ మరునాడు పరీక్షలు బాగానే ముగిశాయి. పరీక్షలు ముగించుకొని బయట వరండాలోకి వస్తుండగానే ఎదురుగా టెలిగ్రాము జవాను కన్పడి "నారాయణరావు ఎవరండీ" అన్నాడు. తానేనని చెప్పి నారాయణరావు టెలిగ్రాం తీసుకున్నాడు.

టెలిగ్రాం తెరవగానే తన్ను మహాభయం ఆవహించినట్లుగా అయింది. ఏదో దుఃఖదేవత ప్రత్యక్షమై, మహాభీభత్సకర స్వరూపంతో దర్శనమిచ్చి - భయపెట్టినట్లుగా అయింది. తన తండ్రిగారు పరమప్రమాదంలో ఉన్నారనీ వెంటనే బయలుదేరిరమ్మనీ టెలిగ్రాంలో ఉన్నది. తండ్రిగారిమీద నారాయణరావుకి మహాగౌరవం. పొరపాటుగానైనా ఆయనయందు తూష్ణీంభావమువహించి ఎరుగడు. ఆయన తనకు ప్రత్యక్షపరమేశ్వరుడే. అటువంటి తండ్రిగారికి మిక్కిలిప్రమాదంగా ఉన్నదని చదువటానికే అతనికి అమితమైన బాధకలిగింది. కళ్ళల్లోకి నీళ్ళువచ్చినై. ఏమీతోచక గబగబాహాస్టలుకివెళ్ళి తనగదిలో క్యాంపుకాటుమీద బోర్లపడి ఏదో అనుత్తీర్ణమైన దుఃఖము పొంగిరాగా సన్నసన్నగా వెక్కి వెక్కి ఏడుస్తూ పడుకున్నాడు. ఆదుఃఖంలోనే మగత - మళ్ళీ మెలకువ-తిరిగి దుఃఖపువెల్లువ - ఇట్లా ఎంతసేపు జరిగిందోకాని ఫతీమాబేగంవచ్చి మీద చెయ్యివేసి పలకరించేటంతవరకు అతడు స్వాస్థ్యంపొందలేదు.

ఆమె తట్టిలేపగా లేచికూర్చున్నాడు. ఇతని పరిస్థితి ఆమెకు అర్థంకాలేదు. ఆమె బెంబేలుపడింది. తన్నుతాను నిభాయించుకున్నది. "ఎందుకట్లా దుఃఖపడతారు" అని అన్నది. అతడు తన జేబులోఉన్న టెలిగ్రాంతీసి ఆమెచేతికి ఇచ్చాడు.

ఆమె టెలిగ్రాం చదివి పరిస్థితి అవగాహన చేసుకున్నది. అపరిమితంగాఉన్న అతని దఃఖానికి కారణం తెలుసుకున్నది. "అయితే మరి రెండు గంటల్లో మీ ఊరికి రైలున్నది. ప్రయాణంకండి" అని అన్నది. అతని సమాధానానికి ఎదురు చూడకుండానే అతనిపుస్తకాలు అతనిబట్టలు, ఇతర సామాన్లు అన్నీ సర్దింది. ఆతడు చిత్తరువుగా చూస్తూఉండిపోయాడు. బయటకు వెళ్ళి గుర్రబ్బండీని పిలుచుకువచ్చింది. హాస్టలు గుమాస్తా దగ్గరకు వెళ్ళి గదితాళపుచెవి ఇచ్చి వచ్చింది. అతణ్ణి సామానుతో సహా బండీ ఎక్కించి, తానుకూడా బండీ ఎక్కి-రాజమండ్రి స్టేషనుకుతీసుకుని వెళ్ళింది. అతడు వెళ్ళి బెజవాడకు టిక్కట్టు తెచ్చుకున్నాడు. రైలుబండి రావడానికి ఇంకో అర గంట ఆలస్యంఉండగా - ఇద్దరూప్లాటుఫారంమీద దూరంగా పోయి నుంచున్నారు. అతని దుఃఖము చాల వరకు అదుపు లోకి వచ్చింది. ఆమె చేసిన సహాయానికి కృతజ్ఞత చెప్పు కున్నాడు. 'నీవు నన్ను సన్నద్ధము చేయకపోతే ఈ రైలును పట్టుకునేవాణ్ణికాదు' అని అన్నాడు. ఇంతలో ఆమెకు తానిచ్చిన మాట జ్ఞాపకం వచ్చింది. 'మన వివాహసమస్య తేల్చుకునిగాని నేను మావూరు వెళ్ళను.' అని క్రిందటిసాయంకాలమే ఆమెకు

తాను మాట ఇచ్చాడు. దానితో ఆమె అన్నమాటలు 'నేను రేపే నిక్కా-చేయించుకోవడానికి సిద్ధమే' అని అవికూడా జ్ఞాపకానికి వచ్చినై. ఇంతలో రైలు వచ్చే సమయమైనదని గంట మ్రోగింది. ఆమెనుకూడా గోదావరి స్టేషనువరకూరమ్మని టిక్కెట్టు తెచ్చి ఇచ్చాడు! ఆమె టిక్కెట్టు తీసుకుని చూచి, నవ్వి-అతని టిక్కెట్టుకూడా తెమ్మనితీసుకున్నది అతను 'దేనికి? అంటూనే ఇచ్చాడు. ఆమె 'మీరిక్కడే ఉండండి' అంటూనే బుకింగ్ ఆఫీసులోకి వెళ్ళి ఐదునిమిషాల్లో తిరిగివచ్చి—అతని చేతుల్లో సెకండుక్లాసు టిక్కెట్టు ఉంచింది - అతను సిగ్గుపడ్డాడు. ఆమె సబుకలెక్టరుగారికూతురు. ఆమెకైనా సెకండుక్లాసు టిక్కెట్టు కొనవలసినది. తాను బీదవాడు. బెజవాడవరకూ రెండో తరగతిలో ప్రయాణం చెయ్యడానికి కావలసినస్తోమతుతనకు లేదు. ఆమె చేసిన ఈమార్పుకి ఏమి చెయ్యాలో తోచక తికమకపడి, చివరకు 'థాంక్సు' అన్నాడు. ఆమెచిరునవ్వునవ్వి - 'ఫరవా లేదు - నోమెన్షన్' అన్నట్లుగా చూపులు చూచింది. ఇంతలో రైలుబండి రావడమూ. జనసమ్మర్దము ఎక్కువకావడమూ - వీళ్ళిద్దరూ సామానులు పట్టించుకొని రెండో తరగతిపెట్టిలో ప్రవేశించడమూ జరిగినై.

ఆ పెట్టిలో వీళ్ళు వెళ్ళేటప్పటికి ఎవ్వరూ లేరు. వీళ్ళిద్దరే కూర్చున్నారు. అప్పుడు సమయం రాత్రి ఏడుగంటలయింది. ఇంతలో ఆమెకు ఏదోజ్ఞాపకానికి వచ్చినట్లయి, దిగి - ప్లాటుఫారము మీదకు వెళ్ళి-ఇన్నిపండ్లు-ఇన్ని అల్పాహారపు పొట్లా

లూ తీసుకువచ్చింది. "నాకు మతిలేదు. మీరు భోంచెయ్య లేదు కదా! బెజవాడకుబండి రాత్రి రెండుగంటలకు గాని పోదాయె. ఈ దుఃఖసమయంలో మీరు అస్నీమరచిపోతారు. కాస్త ఈపళ్లు, ఈ అల్పాహారాలు తినండి" అన్నది. అతను కృతజ్ఞతలుచూపి చిరునవ్వు నవ్వాడు. ఆమె మళ్ళీ వెళ్ళి మర చెంబునిండా నీళ్లు పట్టుకునివచ్చింది. రైలుబండి కూతకూసి కద లింది.

అతనికి ఏదో బాధగా ఉన్నది ఆమె చూపించే అను రాగానికి, పరిచర్యకి సమయస్ఫూర్తికి, వలసినంత ప్రత్యను రాగం తాను వ్యక్తం చేయలేకపోతున్నానని; తానామెకు చెప్పవలసిన సమాధానం తన మనస్సులో ఇంకా రూపం తాల్చక తన్ను వేధిస్తూనే ఉన్నది. సమాధానం చెప్పకపో వడంవల్ల తానిచ్చినమాట నిలవటంలేదనికూడా అతని మనస్సు బాధపడుతోంది. ఏమైనాసరే కానిమ్మని ధైర్యంచేసి, "ఐతే షతీ! మన వివాహం ఎట్లా జరిపించుకోవాలి? నీవు నిక్కా అన్నావే?" అన్నాడు. అతను ప్రస్తుతం ఉన్న దుఃఖపరిస్థితిలో తమ వివాహ ప్రస్తావన ఎట్లా చెయ్యాలో తోచక సతమతం అవుతూన్న షతీమాకు సావకాశం దొరికినట్లుగా అనిపించింది. ఆమె అన్నది. "ఏమున్నది! నిక్కా చేసుకోవడమే! నేను మహమ్మదీయ స్త్రీనాయె. నన్ను పెండ్లాడితే మీరూ మహమ్మ దీయులే. అదే ఇస్లాములో సంప్రదాయం. అంతేకాదు. నన్ను మీ హిందూమతంలోకి ఎట్లాగూ రానివ్వరు." ఈమాటలు

అతనికి బల్లెపుపోటుగా ఉన్నాయి. ఫతీమాపైన తనకు కొంత వ్యామోహం ఉన్నమాట వాస్తవమే కాని, ఆమె మతము మీద మాత్రం తనకు ఎటువంటి వ్యామోహమూ లేదు. అత నన్నాడు. "ఐతే నీవు నాకోసమైనా ఇస్లామును వదలుకో లేవన్నమాట" అతని ఈ ధోరణిఅమెకు అవగాహన కాలేదు. ఆమెసమాధానంగా, "అదికాదు. పెళ్ళిచేసుకోవలసిన వధూ వరులలో ఏ ఒక్కరు ఇస్లాము మతస్థులైనా రెండోవారు ఇస్లాముతీసుకుంటేనే నిక్కా జరుగుతుంది. ఇది లోకంలో ఉన్న ఆచారం" అని అన్నది. ఈ సమాధానం అతనికి చాల బాధ కలిగించింది. తగిన ప్రత్యుత్తరం ఇవ్వాలని ఆలోచిస్తున్నాడు. ఇంతట్లోకే గోదావరి స్టేషను వచ్చేసింది. రైలుబండి వేగం తగ్గించి, ప్లాటుఫారంమీద నిల్చిపోయింది. ఆమె అతనివంక అను కూలమైన సమాధానంకోసం ఆశగాచూస్తూ బండిలోనుంచి దిగి - అతనికి తగ్గరగా కిటికీవద్దకువచ్చి నిల్చుంది. అతనన్నాడు. "నీకు నామీదకంటె మీమతంమీదనే ఎక్కువ ప్రేమ ఉన్నట్లు ద్యోతకమవుతూ ఉన్నది. అసలు మీ మతంలో స్త్రీయొక్క ప్రేమకు అనురాగానికిఉన్న అంతస్థు విలువ వేరు. మాకుఉన్న విలువలు వేరు. మావాళ్ళలో స్త్రీ ఒక పురుషునికి హృదయం యిస్తే మళ్ళీ ఎప్పటికీ తీసుకోదు. జన్మాంతం అంతే. ఎన్ని కష్టాల నైనా తన పురుషునికోసం భరిస్తుంది. స్త్రీకి పునర్వివాహ ప్రసక్తిగాని, ఇతర పురుష ప్రసక్తిగాని లేనే లేవు. జీవితాం తమూ ఆపురుషునికే ఆమె భార్య. అతనికే తన హృదయంలో

స్థానం; అందుచేతనే "పాతివ్రత్యము" అనే భావన వ్యవస్థ మామతానికే తెలుసు. దాని గొప్పతనం తెలిపేగాథలు మాకే ఉన్నాయి. దాని దివ్యత్వమేమిటో ఆమహాత్యాగంముందు సృష్టి స్థితిలయ కారకులైన త్రిమూర్తులుకూడా ఎట్లా తీసి కట్టో-ఆగుణాన్ని ఆరాధించడమే స్త్రీలకు గృహస్థ జీవితంలో ఎట్లా ఆదర్శలక్ష్యమో - మాటలవల్ల తెలపడానికి శక్యమైనవి కావు.

"కనుక ప్రేమ, దాంపత్యజీవనం, వంటి విషయాలలో కూడా విభిన్న సిద్ధాంతాలకు చెందిన మనం, ప్రేమించుకోవడం కూడా అసందర్భంగానే ఉన్నది మనం ఇప్పటికైనా ఎవరి మార్గం వారు చూచుకోవడమే ఉత్తమంగా ఉంటుంది." అని అతడన్నమాటలు ఆమెకు పిడుగుపాటుగాఅయినై. ఆమె కళ్ళ లోకి నీళ్ళువచ్చి జలజలాకారినై. ఇంతట్లో ఆ పెట్టెలోకి వే రెవ్వరో ఎక్కారు. బండికదలడం మొదలుపెట్టింది. బలవంతం మీద ఆమె దుఃఖాన్ని మ్రింగుకుంటూ "ఐతే ఇదేనా మీ సమాధానం? టెలిగ్రాం వచ్చినప్పటినుంచీ మీ మనస్సు దుఃఖ మయంగా ఉన్నది. సరిగ్గాలేదు. మళ్ళీ తిరిగి ఆలోచించండి. మీ హృదయపూర్వకమైన సమాధానంకోసం ఎదురుచూస్తూ ఉంటాను. అది ఎన్ని సంవత్సరాలకు వచ్చినా వేచిఉంటాను" అని ఆమె అంటూ కదలుతున్న బండితోపాటు నడిచింది. రైలు బండి గమనాన్ని త్వరితం చేసుకున్నది. ఆమె వెనక పడి

పోయింది. అతడు ఆమెను చూస్తూనే ఉన్నాడు. బండి సాగి పోయింది. ఆమె ప్లాటుఫారంమీద నిలిచిపోయింది.

# 6

ఆమె దుఃఖదేవతలాగా - అవమానింపబడిన దేవతా స్త్రీలాగా, శిశిరఋతుమధ్యంలో వనదేవతలాగా, కృష్ణత్రయోదశీనిశార్థ భాగంలో చంద్రరేఖలాగా - గ్రీష్మకాల తప్తనదీ వేణీభరంలాగా - దీనవదనంతో ఇల్లు చేరింది.

ఇల్లు చేరుట తడవుగా - సరాసరి పడకగదిలోకి పోయి పడుకొని ముసుగుపెట్టుకున్నది. పరీక్షలు సాయంకాలం నాలుగు గంటలకే ముగియగా, ఇంతవరకు పిల్ల ఇంటికి చేరలేదేమిటని ఆందోళనపడుతున్న తల్లి కుమార్తె పడక గదిలోకి పోయిన తర్వాత గాని గమనించలేదు. ఈమధ్య వారంరోజులుగా ఎక్కువ ఉత్సాహంగా ఉండి, ఆరోజు ఉదయంకూడా చాలా సంతోషంగా కళాశాలకు వెళ్ళిన కుమార్తె, అతి నిరుత్సాహంగా - సరాసరి పడకగదిలోకి తిరిగివచ్చి ముసుగుపెట్టి పడుకొనుట దేనికో ఆ తల్లికి అర్థంకాలేదు. ఆమె కుమార్తెవద్దకు పోయి పలకరించింది. జవాబులేదు మంచంమీద కూర్చుని, కప్పుకున్న దుప్పటిని తొలగించి జ్వరమేమైనా వచ్చిందేమోనని చూచింది. ఒంటిమీద వేడి లేదు. పెడముఖంగా పడుకున్న కుమార్తె ముఖాన్ని తనవైపుకి తిప్పుకుంది తల్లి. కుమార్తె

కళ్ళుమూసుకుని ఉంది. కళ్ళనిండా నీరు నిలచి ధారలు కట్టి బుజ్జగించి బుజ్జగించి, బుజ్జగించి, లాలించి లాలించి, తన చాక చక్యమంతా చూపించగా కుమార్తె కళ్ళు తెరచి తల్లిని కౌగిలించుకుని బావురుమని ఏడ్చింది. దుఃఖం దిగమింగు కునేట్లుగా కుమార్తెతో తల్లి మరికొన్ని ఉపశమనవాక్యాలు చెప్పింది. లాలించింది. గుండెలోతుల్లోకి చొచ్చుకుపోయే చూపులు చూచింది. హృదయంతో హృదయానికి అర్థం అయ్యేటట్లు మూగసంభాషణ చేసింది. కొంచెం కొంచెంగా కుమార్తెయొక్క దుఃఖం సడలిపోయింది.

కుమార్తె అప్పటికి తల్లికి తనయొక్క దుఃఖ కారణాన్ని తెలపడానికి ప్రారంభించింది. ముందుగా అసందర్భమైన వాక్యాలతో నిరాదరణ ప్రత్యర్థమైన 'హుఁ హుఁ' కరింపుల్తో, నిట్టూర్పులతో, దీర్ఘనిశ్వాసాలతో, మధ్యమధ్య దుఃఖతరంగాలతో ఫతీమాబేగం తనతల్లితో తాను అనుభవిస్తున్న బాధ, తన ప్రేమ నిరాకరింపబడుట, తనకు గల్గిన అవమానం, వారం రోజులుగా నడచిన ప్రేమకథాకలాపం - అంతా విశదంచేసింది. తల్లికి గుండెకరగి కుమార్తెను గ్రుచ్చి కౌగిలించుకున్నది.

తల్లికి తన జీవితమంతా కళ్ళముందు తిరిగినట్లుగా అయింది. ఆమె మహమ్మదీయుల ఇంట పుట్టిన స్త్రీ కాదు. ఆమె తండ్రి ఇంజనీరు. అయ్యంగారు. తెలుగుదేశంలో చాలచోట్ల పనిచేశాడు. తానొక్కతే సంతానం. ఆయన ఆంధ్రదేశంలోనే ఎక్కువకాలం ఉద్యోగరీత్యా ఉండటంవల్ల తనకు తెలుగే

చెప్పించారు. తన తండ్రికి ప్రమోషనురాగా మద్రాసు చేరారు. తాను ప్రెసిడెన్సీ కాలేజీలో చేరింది. తన తండ్రికి చీఫ్ ఇంజనీరుపని అయింది. తను ఫిలాసఫీ ఎమ్మే చదివేరోజులు. తనతో సహాధ్యాయిగా ఉన్న యాహ్యాలీది రాయలసీమ. ఇద్దరూ తెలుగు తెలిసిన వాళ్ళవటంచేత కొంత పరిచయం ఏర్పడింది. అదికాకుండా అసలు క్లాసులో నలుగురే విద్యార్థులు. వీళ్ళిద్దరి మధ్యా ఏర్పడిన పరిచయం కాలక్రమేణా స్నేహంగానూ, ప్రేమగానూ మారిపోయింది. ఆమె ప్రేమ వృత్తాంతము తలిదండ్రులకి తెలియకముందే తండ్రిగారు అకస్మాత్తుగా క్యాంపులో ఉండగా గుండెపోటువల్ల మరణించారు. తన చదువు పూర్తిఅయింది.

భర్తృవియోగంతో నిండుదుఃఖంలో ఉన్న తల్లిగారి హృదయవేదనని అర్థంచేసుకోక, తొందరపడి తాను ప్రేమించిన మహమ్మదీయ కుర్రాణ్ణి పెళ్లిచేసుకుంటానని పట్టుపట్టి తల్లిగారిని ధిక్కరించి ఆమెనువదలి యాహ్యాలీని పెళ్లాడి తాను బూబమ్మ అయింది.

ఆతర్వాత ఒక్కసారైనా తల్లిని చూడటమే పడలేదు. ఆతల్లి భర్తృవియోగ దుఃఖంలో ఈ కుమార్తె ఆగడానికి తట్టుకోలేక కుమిలికుమిలి మతిచలించి నాలుగు నెలలకే చనిపోయింది. ఆమె చనిపోయిన పదినెలలకుగాని ఆమె మరణవార్త కుమార్తెకు తెలియనేలేదు. తల్లిగారు ఆమెకున్న ఆస్తిలో చాలాభాగం తిరువళిక్కేణిలో వేంచేసిఉన్న శ్రీ

పార్థసారధి స్వామి వారికి కైంకర్యం చేసిందనీ - మిగిలినది తమ ఇంట్లో చాలా సంవత్సరాలుగా వంటచేస్తూ అవసాన దినాలలో ఆమెకు ఆధారమైన వంట వానికి వ్రాసిఇచ్చిందనీ అతడే ఆమెకు శ్రాద్ధకర్మలు, తిరుఆరాధన చేశాడనీ కుమార్తె కర్ణాకర్ణిగా విన్నది. తల్లి మరణవార్త విని పదిహేనురోజులు బాధపడింది. తల్లికి తాను చేయరాని మహాద్రోహం చేసినట్లుగా తలచుకొని దుఃఖించింది. యాహ్యాలి తన్ను నిజంగా ప్రేమించాడు. అతనిలో ఏలోపమూ లేదు. తనకోసం అతడు కూడా మాంసాహారాన్ని త్యజించాడు. తాను తన తల్లినీ, సర్వబంధువుల్నీ, మతాన్నీ, విడిచిపెట్టి ప్రేమనే నమ్ముకుని వచ్చినదని యాహ్యాలీ సర్వదా కనిపెట్టుకుని ఉండేవాడు. ఉంటున్నాడు. వాళ్ళు తమ దాంపత్య జీవితంలో ఇంతవరకూ ఏ ఒక్కసారీ అభిప్రాయభేదాలుపడి ఎరుగరు. తమ జీవితం సౌఖ్యవంతంగానే జరుగుతూన్నది. తమకు ఈ ఫతీమా ఒక్కతే సంతానం. తమ వివాహం ఐన రెండేళ్ళకు పుట్టింది. ఇప్పటివరకూ బాధలు ఏమీ పడలేదు. ఇప్పుడు తన కుమార్తె ఈ ఫతీమా తానుచేసిన తప్పిదానికి ఫలం అనుభవిస్తున్నదా? అని ఆమెకు ఆలోచన వచ్చింది. జీవితగమనం ఊహించరానంత విచిత్రంగా ఉంటుంది. తాను హైందవ స్త్రీయై, మహమ్మదీయుని ప్రేమించి, ప్రేమకోసం సర్వమూ త్యాగంచేసి, తాను ప్రేమించిన వాణ్ణి ఆశ్రయించింది. తన కుమార్తె మహమ్మదీయ అయివుండి హిందూ యువకుణ్ణి ప్రేమించి, తాను ప్రేమించిన

వాణ్ణి మహాత్మునీయుడవు కమ్మని కోరింది. తన కుమార్తె తన వలె ప్రేమకు త్యాగం చేయాలని పూనుకోలేదు. ఆ భావమే షతీమాకు కలిగినట్లు లేదు. ప్రేమ త్యాగాన్ని కోరుతుంది. త్యాగరహితమైన ప్రేమలో ఆనందం ఏముంటుంది. త్యాగానికి సంసిద్ధమై నిలువ త్రొక్కుకున్న ప్రేమే నిజంగా ప్రేమ అనుపించుకోవడానికి అర్హత సంపాదించుకుంటుంది. త్యాగం చేయవలసిన సన్నివేశంలో అదృశ్యమైపోయే ప్రేమ - ఆ పేరుతో పిలిపించుకోవడానికే తగదు. తనకుమార్తె ప్రేమ అంటే ఏమిటో గ్రహించుకోలేక పోయిందన్నమాట. ప్రేమ ఆరాధకులైన తనకూ యాహ్యాలీకి జన్మించిన ఈ షతీమాకు ప్రేమ అంటే ఏమిటో అవగాహన కానేలేదు? ఈలోపం తన మనస్సుకి లోపంగా తోచక ప్రబలమైన అసందర్భంగా తోస్తున్నది.

ఇంతట్లో సబుకలెక్టరుగారు రావడం - భార్య ఎదురేగటం పిచ్చాపాటీ మాటలతో అంతా భోజనాలకు సిద్ధం కావడం జరిగినై. భోజనాలదగ్గర కుమార్తె మామూలుగా లేదనీ ఏదో మానసికమైన బాధ అనుభవిస్తున్నట్లు ఉన్నదనీ తండ్రి గ్రహించాడు. తన భార్య మిక్కిలి సామర్థ్యం కలదనీ ఇంటికి సంబంధించిన అన్ని విషయాలూ ఆమె చక్కపెట్టుకోగలదనీ - అభిప్రాయాలుకల అతడు కుమార్తెను ఏమీ ప్రశ్నలు వెయ్యలేదు. భార్యను కుమార్తెను ఏవిధంగానూ నొప్పించు

టకు ఇష్టపడని అతడు - గుచ్చి గుచ్చి మాట్లాడక - తన భార్యద్వారా - నెమ్మదిమీద విషయం దాని అంతట అదే తెలుస్తుంది లెమ్మని ఉపేక్షించి ఊరుకున్నాడు.

నారాయణరావు ప్రయాణం చేస్తున్న రైలుబండి రాత్రి రెండుగంటలకుగాని బెజవాడ చేరలేదు. వెంటనే బందరు వెళ్లేబండి లేదు. బెజవాడలో తెల్లవారి అయిదు గంటలకు బయలుదేరిన రైలుబండి ఏడున్నరకుగాని "దేవపురము" చేరలేదు. దేవపురంరాగానే నారాయణరావు రైలు దిగి, సామానుదింపుకుని, వంటెద్దుబండి మాటాడుకొని, అందులో సామాను సర్దుకొని అరగంటలో ఇల్లుచేరాడు. ఇంటిముందు బండి నిలిపించి తను బండినుంచి దిగగానే-లోపల నుండి పరమహంస పరివ్రాజకాచార్య వర్యులు శ్రీ విమలానంద భారతీ స్వాములవారు వస్తూ ఉండటం చూచాడు. ఇంతట్లో వారు తన్ను సమీపించగా నారాయణరావు వెంటనే వారి శ్రీచరణాలకు వందనంచేసి నిల్చున్నాడు. ఆయన నారాయణ స్మరణతో ఆశీర్వదించారు. ఆయన నారాయణరావు వంకచూస్తూ "ఆంజనేయస్వామి వారికోవెలలో వసతి. అక్కడకు సాయంత్రం నువ్వురా" అని వెళ్ళిపోయారు. శ్రీవారు పూర్వాశ్రమంలో బందరులో అధ్యాపకులు. నారాయణరావు తండ్రి పరమేశ్వరరావుగారు శ్రీవారివద్ద విద్యాభ్యాసం

చేశారు. ఆయన శిష్యులలో ముఖ్యులు. శ్రీవారికి పరమేశ్వర రావుగారిపైన అవ్యాజానురాగమై పుత్రనిర్విశేషమైన వాత్స ల్యం. శ్రీవారు తురీయాశ్రమం స్వీకరించి కూడా చాలా సంవత్సరాలైంది. శ్రీవారు దేవపురం వచ్చినప్పుడల్లా పరమే శ్వరరావుగారింట్లో రెండు దినాలైనా భిక్ష స్వీకరించడం పరిపాటి.

స్వామివారు వెళ్ళిన తరువాత నారాయణరావు సామా నులు పట్టించుకుని లోపలకు వెళ్ళాడు. లోపల్నుంచి తల్లి పార్వ తమ్మ కుమారుని రాక చూస్తూనే ఉన్నది. సామాన్లు లోపల పెట్టించి, బండివాణ్ణి పంపి, నారాయణరావు తల్లిని సమీపించి, ఆమెకు నమస్కరించి, లేచి, ఆమెవంక చూచాడు. ఏదో మహా దుఃఖాన్ని అతికష్టంమీద అదుపులో పెట్టుకున్నట్లుగా ఆమె కన్పించింది. ఇంట్లో ఆమెకాకుండా ఇద్దరు చిన్నకొడుకులు, ఆఖరు కుమార్తె- అస్వస్థతలో ఉన్న పరమేశ్వరరావుగారూ ఉన్నారు. మరెవ్వరూ లేరు. ఆమె దుఃఖపడి చిన్నపిల్లల్ని గాభరాపెట్టడం తప్ప వేరే లాభము లేదని గ్రహించింది. అంచేత తన దుఃఖాన్ని నిగ్రహించుకున్నది. ఇంతట్లో దగ్గరకు వచ్చిన తమ్ముళ్ళూ చెల్లెలూ "అన్నయ్యా!" అని కేకవేసి - ఏడుస్తూ నారాయణరావును కౌగిలించుకున్నారు. ఈ నాలుగు నాళ్లుగా తండ్రిగారికి అనిదంపూర్వమైన అస్వస్థత - తల్లిగారు ఏమీ చెప్పలేకపోయినా ఏదో మానసికమైన బాధతో ఉన్నట్లు కన్పడడం - వాళ్ళ దుఃఖాన్ని వెళ్ళబోసుకోవడానికి

ఇప్పటికి ఆస్కారం కలిగింది. నారాయణరావుకికూడా దుఃఖం ఆగలేదు. తల్లి సముదాయించి, తండ్రి పడుకొని ఉన్న గది లోనికి తీసికొనిపోయింది.

పట్టెమంచముమీద తెల్లగా పరిశుభ్రమైన దుప్పటి మీద ఆయన పడుకొని ఉన్నాడు. చేతులు ముడుచుకొని ఉన్నాడు. కళ్లు మూసికొని ఉన్నాడు. ఆయన వంటిమీద చెయ్యివేసి నారాయణరావు చూశాడు. వళ్లు మామూలుగా ఉన్నది. జ్వరంలేదు. ఆయన నీరసంగా నిస్సత్తువగా వున్నట్లు కనపడుతున్నాడేగాని ముఖం తేజోవంతంగానే ఉన్నది. ఆయన నిద్రపోతున్నాడో లేక అసలు స్మృతిలేక పడిఉన్నాడో నారాయణరావుకి అర్థం కాలేదు. తల్లివంక చూశాడు. తల్లి చెప్పింది-

ఏకాదశినాడు మామూలుగానే ఉపవాస మున్నారుట. ఆ రాత్రి చాలసేపు పోతనామాత్యులవారి గజేంద్ర మోక్షం చదివారట. తెల్లవారుఝామున మామూలుగానే బహిర్దేశా నికి వెళ్లారుట. అక్కడ ఏదో దున్నపోతు ఎదురుపడి పొడవ బోయిందట. ఉపవాసంవల్ల ఏర్పడ్డ నిస్సత్తువ కారణంగా, చాల కష్టం మీదగాని దానిని తప్పించుకోలేకపోయారుట. ఆ ఉదయం మామూలుగా ద్వాదశిపారాయణ ముగించుకుని మామూలుగా తాలూకాఫీసుకి వెళ్లారుట. ఆఫీసులో ఆయన పెద్దగుమాస్తా కావడంవల్ల ఏదో ముఖ్యమైన పనిమీద తాశి ల్దారు ఆయన్ను బందరు కలెక్టరాఫీసుకి వెళ్లమనగా అప్పుడే

వెళ్లి చిలకలపూడి స్టేషనులో దిగి కలెక్టరాఫీసుకి వెళ్లి పని చూచుకుని తిరిగి రాత్రి బండిలో పదిగంటలకు ఇంటికి వచ్చారుట. క్రితంరోజు ఉపవాసం కావడం, ఆరోజు మిక్కిలిగా శ్రమపడటం, చాలా నీరసంగా ఉండిన్నీ, రాత్రి రాగానే వేడి నీళ్లు పెట్టి ఇస్తానన్నా ఆగక చన్నీళ్లు స్నానంచేసి అనుష్ఠానానికి కూర్చుని మామూలుకన్నా కొంత ముందుగా నిలుపుదల చేసి తన్ను పిలిచారుట. తాను దగ్గరకు వెళ్ళగా—"ఈరోజు జపానువాళ్లు విశాఖపట్నంమీద బాంబులు వేశారుట. రాజమండ్రి మీదకూడా బాంబులు పడ్డాయని అంటున్నారు. మన ప్రభుత్వంవాళ్లు నిజం బయటపెట్టరు. బందరులో జనం అంతా చెప్పకోవడం విశాఖపట్నం, కాకినాడ, రాజమండ్రుల మీద బాంబులు పడ్డాయని. మన నారాయణరావుకి ఏమి ప్రమాదం జరిగి ఉంటుందో పాపం. వాడు - ఏమీ తెలియని వెర్రినాయన - ఏమి బాధలు పడుతున్నాడో - చేతులో చాలినంత డబ్బు ఉన్నదో లేదో - ఐనా ఇక రెండుమూడు రోజుల్లో పరీక్షలు పూర్తిఐపోతాయనీ - వస్తాననీ రాశాడు." అని చెప్పి ఒక దీర్ఘనిశ్వాసం వదలి - ఏదో కొంచెం ఆలోచిస్తున్నట్లుగా కూర్చుని - మళ్ళీ ఆచమనంచేసి - మొదలుపెట్టగా - తాను ఇంకా అనుష్ఠానం మిగులుఉన్నదేమో అనుకున్నదిట. పది పదిహేను నిమిషాలు మౌనంగా ఉన్నారుట. జపంచేస్తున్నారని తాననుకున్నదట. ఇంతలో స్మృతిలేకుండా క్రిందపడి పోయారుట. ఆరాత్రి పదకొండు గంటలవేళ - తనకేమీ

తోచక - ఏమీ చెయ్యలేక ప్రక్కయింటి వెంకటరామయ్య గారిని ఆయన భార్యను పిలిచిందిట. వెంకటరామయ్యగారు వెళ్లి డాక్టరును తీసుకువచ్చారట. ఆయన పరీక్షించి - ఇది చాలా నీరసం మూలాన వచ్చినదని చెప్పి - ఏదో ఇంజక్షను ఇచ్చి వెళ్లారుట. కాని అప్పటినుంచి ఇప్పటివరకు పరమేశ్వర రావుగారికి స్మృతిరానే లేదుట. అట్లాగే కన్నులు మూసుగుని పడుకున్నారుట. మర్నాడు ఊరిలోనే ఉన్న తన అన్నగార్లకు కబురంపి వాళ్ళచేత నారాయణరావుకి టెలిగ్రాం ఇప్పించిందిట. డాక్టరు రెండుపూటలా వచ్చిపోతూనే ఉన్నాడుట. కాని ఆయనకు రోగం అసలేమిటో తెలిసినట్లు లేదని అందరూ అంటున్నారుట.

నారాయణరావు చాలసేపు మౌనంగా తండ్రిగారి మంచంమీద అట్లాగే కూర్చుని, లేచి స్నానాది కృత్యాలు ముగించుకుని - తల్లి బలవంతచేయంగా - నాలుగు మెతుకులు తిని - డాక్టరు దగ్గరకు వెళ్లాడు.

డాక్టరు చాలామంచివాడు. ఆ ఊళ్ళో ఉన్న వైద్యు లందరిలోనూ ఆయనే ఘనుడు. ప్రఖ్యాతికలవాడు. ఆయన నారాయణరావుతో మర్మంలేకుండా మాట్లాడాడు! పరమేశ్వరరావుగారికి ఏమి వ్యాధో తనకు అవగాహనకానే లేదుట టెంపరేచరు మామూలు కన్నా కొంత తక్కువగా ఉండటం తప్ప వేరే దోషం కన్పట్టం లేదట. ఇట్లాగే డాక్టరుతో ఏవో ఏవో మాటలు మాట్లాడి - నారాయణ రావు మేనమామల ఇళ్ళకు వెళ్ళాడు. అక్కడ కూడా

ఇట్లాగే మామూలు మాటలు మాట్లాడి - మామూలు కుశల ప్రశ్నాదికం జరిపి - మళ్ళీ తిరిగి ఇంటికి చేరాడు. ఇంట్లో తల్లి ఉదయకంటె ఇప్పుడు ఇంకా ఎక్కువనిరుత్సాహంగా ఉన్నది. నారాయణరావు ఒకసారి తండ్రిగారి మంచందగ్గరకు పోయి కొంతసేపు కూర్చున్నాడు. ఏమా ధైర్యం తోచలేదు. లేచి బయటకువచ్చి సరాసరి తపాలు ఆఫీసుకివెళ్ళి - తనతోబుట్టువులు నలుగురికీ తంతి ఇచ్చి వచ్చాడు. ఇంతలో సాయంకాలం ఐంది. డాక్టరు వచ్చి పరమేశ్వరరావుగారిని మళ్ళీ ఒకసారి బాగా తనిఖీచేశాడు. పరిస్థితిలో ఏమి మార్పు కనబడలేదని నారాయణరావుతో చెప్పి వెళ్ళి పోయాడు.

నారాయణరావుకి శ్రీస్వాముల వారి మాట జ్ఞాపకం రాగా శ్రీఆంజనేయస్వామివారి ఆలయానికి వెళ్ళాడు. శ్రీవారు నారాయణరావు కోసం ఎదురు చూస్తున్నట్లుగా కన్పించారు. నారాయణరావు పాదాభివందనం చెయ్యగా ప్రక్కన కూర్చో మన్నారు. ఒకాయన సంగతి గ్రహించి లేచి శ్రీవారివద్ద శలవు తీసుకుంటానని చెప్పి అనుజ్ఞతీసుకుని వెళ్ళిపోయాడు. శ్రీవారి సన్నిధానంలో నారాయణరావొక్కడే మిగిలాడు.

శ్రీవారు నారాయణరావు వంక దయామధురంగా చూస్తూ మెల్లిగా అన్నారు. "నాయనా! నీకు తెలియదు. నీ తండ్రి సిద్ధపురుషుడు. ఆయన స్థిత ప్రజ్ఞామూర్తి ఐన పరమ యోగి. ఆధ్యాత్మికంగా ఉన్నత కక్ష్యలు సాధించిన తపస్వి.

అతి నిరాడంబరుడు. లోకాన్ని పట్టించుకోనివాడు. అజాత శత్రువు. మన కృష్ణాజిల్లా రాజకీయాలలో సాధ్యపడని సంగతి- ఆయన వొక్కడియందే వర్తిల్లినది. ముప్పైఏళ్ళ క్రితం ఈ ఊరి తాలూకాఫీసులో గుమాస్తాగా ఆయన ఉద్యోగంలో చేరి నేటివరకు ఇక్కడనే ఒక్క ట్రాన్సుఫరు కూడా లేకుండా ఉన్నాడు. ఏ పై ఉద్యోగిచేత గాని - మరెవ్వరి చేతగాని మాటపడి ఎరుగడు. అతడొక మనస్సన్యాసి. ఒక్కటిమాత్రం కొంచెం ఆశ్చర్యకరంగానే ఉన్నది. నీపైన మాత్రం ఆయనకు అతిలోకమైన మమకారం. నేను నిన్న త్రయోదశినాడే ఇక్కడకు వచ్చాను. మొన్న బందరులో ద్వాదశినాడు మీ నాయన రాగా చెప్పాను. త్రయోదశినాడు వస్తున్నానని. ఇక్కడ ఆసాయంకాలం నా దగ్గరకు మీ నాయన మామూలుగా రావలసినవాడు రాలేదు. ఎందుచేత రాలేదా అనుకున్నాను. అందుకని ఈ ఉదయం మీ యింటికి నేనే వచ్చాను. మీ తండ్రిని చూచాను. అతనికి వ్యాధిఏమీ లేదు. అతడు శ్రీవిద్యాచిద్దీక్షలో భావనోపనిషత్ప్రకారంగా అంతర్యాగమనే ఒక ప్రక్రియాసాధనలో ఆజ్ఞాచక్రాంత సంచారంచేస్తున్నాడు. ఆ సాధనాకక్ష్యనుంచి సాధారణంగా బాహ్య ప్రపంచంలోకి మనస్సు రానీయదు. ప్రాణోత్క్రమణం చెయ్యడమే సాధారణంగా జరిగేది. మీ తండ్రి మూడునాళ్ళుగా అసాధారణమైన ఈ సాధనాకక్ష్యలో యోగనిద్రాస్థితిలో ఉన్నాడు. రేపు చైత్ర పౌర్ణమి. బహుశా రేపేదైనా చేస్తా

డేమో. నీపైన మమకారం కొద్ది - నీవు వచ్చావని గ్రహిస్తే - బహుశా-ఆయన తిరిగి లౌకికోన్ముఖుడు అయినా కావచ్చును. ఈ విషయాలు అతి రహస్యాలు. మీ తల్లికికూడా చెప్ప రానివి. రేపుదయం నేను మళ్ళీ మీ యింటికి వస్తాను. నేను వచ్చేటప్పటికి మీ పెద్దమేనమామను పిలిపించు" అని ఆయన ముగించి, నారాయణరావువంక వినూతన వాత్సల్యస్నిగ్ధంగా చూచారు. నారాయణరావుకు ఆశ్చర్యమూ, గౌరవమూ, దుఃఖమూ, కృతజ్ఞతా, సమ్మిశ్రమైన భావాలు పెల్లుగా వచ్చి శ్రీవారి శ్రీచరణాల్ని కన్నీటితో కడిగాడు. డగ్గుత్తికతో శెలవు తీసుకొని బయలుదేరి దేవాలయానికి వెళ్ళి ఈశ్వరదర్శనం చేసుకుని ఇంటికి చేరుకున్నాడు.

ఆ మరునాటి ఉదయాన వారింటిప్రక్క ఉన్న రాఘవయ్యగారువచ్చి నారాయణరావును పిలిచారు. అతడు ఆయన్ను సాదరంగా లోపలకుపిల్చి కూర్చుండబెట్టి "ఏమి సమాచారము" అన్నాడు. ఆయన నారాయణరావువంక అనునయంగాచూస్తూ ఇట్లా అన్నాడు. "నాయనా! మీ తండ్రి గారు మిక్కిలి ఉత్తములు. మీ కుటుంబమే చాలా గౌరవ నీయమైనది. పాపము మీ తండ్రిగారికి అనిర్ణేయమైన వ్యాధి రావలసినదికాదు. ఆయన బ్రతకడని వైద్యుడు చెప్పినట్లుగా తెలిసినది. నీవెరుగుదువుకదా. మీ ఇంటిలో చిన్నవాటాలో కాపురమున్న సాంబయ్యగారు నాకు దూరపుబంధువు. ఆయన పిల్లలు కలవాడు. మీరున్నూ పెద్దకుటుంబంవారే. ఇప్పుడు

దుష్టనక్షత్రం నడుస్తున్నది. నేను పౌర్ణమి. ఈదినం మీ తండ్రి గారికి గడువక పోవచ్చును. వెంటనే బయటకు తీసుకువచ్చి పెట్టకపోయినచో లోపలనే ప్రాణము పోవచ్చును. అప్పుడు నాలుగైదు నెలలు ఇల్లు వదలవలసిరావచ్చును. మీకున్నూ సాంబయ్యగారికిన్నీ కూడా కష్టమే. మీ మేనమామలతో సంప్రతించి త్వరగా ఆపని చెయ్యి." ఆ మాటలకు నారాయణ రావు కళ్ళలో నీరు గిర్రున తిరిగింది. డగ్గుత్తికతో మెల్లిగా ఆయనవంకచూస్తూ సమాధానం చెప్పాడు. "అయ్యా! మీరు మా కుటుంబముపైన చూపిన ఆదరానికి మిక్కిలి కృతజ్ఞుణ్ణి. కాని మా తండ్రిగారు ప్రాణములు వదిలేవరకూ ఈ ఇల్లు ఆయనదేకదా! ఆయనను ప్రాణములుండగా ఆయన ఇంటినుండి బయటకు త్రోయు హక్కు నాకెట్లావస్తుంది? ఇది ఆయన కట్టుకొన్న ఇల్లు-ఆయన సుఖంగా మరణించడానికికూడా ఉప యోగపడకపోతే మరి దీని సార్థకతఏమి? ప్రాణములుండగా ఆయనను బయటకు తీసుకొనిరాము. మాకుగాని, ఇతరులకు గాని ఎట్టికష్టములు వచ్చిననూ సరే!" ఈ మాటలకు చిన్న బుచ్చుకొని రాఘవయ్యగారు వెళ్ళిపోయారు. ప్రక్కనుండి ఈమాటలు వింటున్న రమణయ్యగారు- నారాయణరావు పెద్ద మేనమామ- తన ఆవేశాన్ని ఆపుకోలేక నారాయణరావును కౌగిలించుకుని "నీవు వివేకవంతుడవని నాకు తెలుసు. నాచెల్లెలు కడుపున శ్రీరామచంద్రుడు పుట్టినని సంతోషపడుచున్నాను" అని అతిశయాన్ని వెల్లడించాడు.

ఇంతట్లో శ్రీవిమలానందభారతీస్వాములవారు వస్తున్నారని తెలుసుకొని, నారాయణరావు, రమణయ్యగారు వారికి ఎదురుగాపోయి పాదాభివందనంచేసి, కాళ్ళుకడిగి లోపలకు తీసుకొనివచ్చారు.

శ్రీవారు నారాయణరావును అతని పెద్దమేనమామను రమణయ్యగారిని మాత్రమే దగ్గర ఉంచుకొని ప్రసంగించారు. "రమణయ్యా! నువ్వు పరమేశ్వరావును చిన్నతనంనుంచీ ఎరుగున్నావు. అతడు శృంగేరీపీఠాధిపతులవద్ద శ్రీవిద్యాపూర్ణాభిషేకాన్ని పొందినవాడు. నాదగ్గర ప్రస్థానత్రయ శాంతిచేశాడు. అతనికి రాజవిద్య సహజంగా ఆనువంశికంగా తెలిసినట్లున్నది. అతడుయదృచ్ఛాలాభసంతుష్టుడు. నిరహంకారుడు. ప్రసన్నచిత్తుడు. శాంతుడు. బ్రహ్మవిదుడు. అతనికేవ్యాధీలేదు. అతడిప్పుడు సహజఅమనస్కరాజయోగ నిష్ఠుడై సహస్రారకమల సంచారం చేస్తూ ఉన్నాడు. కుమారుడికి విద్య ముగిసినది గనుక- ఆతనిపైన సంసారభారాన్ని ఉంచి వైదిక లౌకికకర్మల సన్న్యసించి, ఆపైన బాహ్యాంతరములను మరచి పరిపూర్ణ ప్రత్యగభిన్న పరబ్రహ్మ చైతన్య ప్రకాశమాత్రుడై ప్రాణోత్క్రమణం చేస్తాడేమోనని నాకనుమానంగా ఉన్నది. నేడు చైత్ర పౌర్ణమిగనుక మధ్యాహ్నం సరిగా పన్నెండు గంటలకు అతడు ప్రాణోత్క్రమణం చెయ్యడానికి నిశ్చయించుకున్నాడేమో నని భావిస్తున్నాను. ఆసమయం దాటితే అతణ్ణి తిరిగి లౌకికవిషయాలలో జాగరితం చెయ్యవచ్చుననుకుంటాను." ఈ

మాటలు మాట్లాడిపరమేశ్వరరావుగారుపడుకొనిఉన్నగదిలోకి దారితీశారు. అక్కడ ఆయన ఆసీనులై, నారాయణరావును స్నానంచేసి, శుచిగా, మడిబట్టలతో సంధ్యావందనంచేసి రమ్మని చెప్పారు. రమణయ్యగారితో తాముచెప్పిన విషయాలు జాగ్రత్తగా పరమేశ్వరరావుగారి భార్య పార్వతమ్మగారికి వివరించి రమ్మన్నారు. నారాయణరావు త్వరగానే సంధ్యావందనం ముగించుకొనిరాగా కూర్చోమని సంజ్ఞచేసి రమణయ్యగారిచేత ఒక టెంకాయ తెప్పించి, తలుపు వేయించారు.

నారాయణరావు, రమణయ్యగారు శ్రీవారికి ఎదురుగా కూర్చున్నారు. శ్రీవారు నిరుక్తం (వైదిక నిఘంటువు) నుండి పౌర్ణమాస శబ్దానికిగల వ్యాఖ్యానాన్ని ఉచ్చైస్స్వరంతో పఠించారు. ఆరువాత పద్మాసనస్థులై, కళ్ళుమూసుకుని, సుమనోహరంగా ముమ్మారు ప్రణవనాదంచేసి, నిశ్చలంగా ఐపోయారు. రమణయ్యగారికి, నారాయణరావుకి అప్పుడు తెలిసింది-శ్రీవారు సమాధినిష్ఠులైనారని. ఇంతలో శాంత మధుర ప్రసన్ననాదం వినిపించి, తమర్ని వినూతన ఆనందపథాలకు తీసుకొనిపోయినట్లుగా అయి-ఆ నాదబ్రహ్మ మెచ్చటనుండివచ్చినదో గుర్తించడానికి వాళ్ళకు కొంచెంసేపు పట్టింది.

మంచంమీద ఇంతకాలం పడుకొని ఉన్న పరమేశ్వరరావుగారు మంచం మీదనేలేచి పద్మాసనంలో కూర్చుని ఉండటం చూచారు. అయన కన్నులు మూసుకునే ఉన్నారు. ఆయన దగ్గరనుండే ఈశాంత మధురప్రణవోచ్చారణ జరుగు

తున్నది. ఇంతలో ఆమధుర నాదం ఆగిపోయి-ప్రశాంతమయమై నది. పరమేశ్వరరావుగా రట్లాగే కూర్చునిఉన్నారు. శ్రీవారు కన్నులు తెరచారు. ఆయన రమణయ్యగారి వంకచూస్తూ "రమణయ్యా! ఒకపీట తెప్పించి-దానిమీద ఇతడు నిత్యమూ ఉపయోగించే దర్భాస్తరణం పరపించి-దానిపైన ఇతన్ని కూర్చోపెట్టాలి. ఇక ఎక్కువ సమయం లేదు." అనిచెప్పగా-రమణయ్యగారు పీట తీసుకొని వచ్చి దానిమీద దర్భాసనం వేశారు. నారాయణరావూ, రమణయ్యగారు పట్టుకొని పరమేశ్వరరావుగారిని ఆ దర్భాసనంమీద ఉత్తరముఖంగా కూర్చోపెట్టారు. కూర్చోపెట్టిన తర్వాత శ్రీవారు రమణయ్యగారితో ఇట్లా అన్నారు. "పార్వతమ్మకు అన్నీ చెప్పి, చివరిసారి భర్త పాదాలకు నమస్కారంచేసుగోమని చెప్పు. ఆ తర్వాత అతని శరీరాన్ని భార్యస్పృశించడానికి వీలుండదు. అతడు సంప్రదాయ సన్న్యాసాన్ని తీసుకోబోతున్నాడు." ఆమాటలు విని రమణయ్యగారు తెల్లబోయి, లోపలకువెళ్ళి, కొంతసేపటికి పార్వతమ్మను వెంటపెట్టుకుని వచ్చారు. ఆమె నిండుకుండలాగా ఉన్నది. అమితమైన కష్టంమీద దుఃఖాన్ని సంబాళించుకున్నట్లుగా కన్పడింది. ఆమె భర్తగారి పాదాలమీద వ్రాలి - ఇక దుఃఖభారాన్ని నిలువరించుకో లేక వెక్కి వెక్కి ఏడ్చింది. పరమేశ్వరరావుగారు మాత్రం ఇంతవరకూ కన్నులు తెరవనే లేదు. నిశ్చలంగానే ఉన్నారు. శిలాప్రతిమలాగా ఉండిపోయారు. నాలుగైదు రోజులుగా నిరాహారంగా ఉన్నప్పటికీ-

బలహీనత ఆయనముఖంలో కన్పించడం లేదు. ఏదోమహత్తర మైన తేజస్సు జాజ్వల్యంగా ప్రకాశిస్తున్నట్లుగా కన్పించింది. శ్రీవారు మందలింపులతో అనునయించగా పార్వతమ్మ తేరు కొన్నది. శ్రీవారి ఉత్తర్వుమేరకు రమణయ్యగారు ఆమెను బలవంతంగా-రెక్కలుపుచ్చుకొని లేవతీసి-లోపలకుతోడ్కొని వెళ్లారు. రమణయ్యగారుతిరిగివచ్చి నారాయణరావు ప్రక్కగా కూర్చున్నారు.

శ్రీవారు పరమేశ్వరరావుగారి వంకచూస్తూ ఉపనిష త్పాఠం చేస్తున్నారు.

"యదహరేవ విరజేత్తద హరేవ ప్రవ్రజేత్తా"-ఓం,

ఓం అన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయా నందమయా శ్శరీరా మే శుధ్యంతాం జ్యోతిరహం విరజావి పాప్మాభూయాసం, వాఙ్మన శ్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణ రేతో బుద్ధ్యా కూతిసంకల్పా-మే - శుధ్యంతాం-జ్యోతిరహం-విరజావి పాప్మాభూయాసమ్॥

ఓం అతీతవైరాగ్య మఖండబోధం - సమాధియోగస్య పరస్యనిష్ఠా సర్వేషు భూతేషు సమత్వ బుద్ధిశ్చ దృఢం మే భూయాత్॥

ఓం నిత్యశుద్ధ బుద్ధముక్త సత్యపరమానందా ఽద్వితీయ బ్రహ్మానుభవ సిద్ధిర్భూయాత్॥

ఓం వాసనాక్షయ మనోనాశ తత్త్వజ్ఞానా భ్యాసవశ వశాత్ జ్ఞానరక్షా తపస్సిద్ధిః సర్వసమత్వం దుఃఖనివృత్తిః సుఖా

విర్భావ ఇత్యే తత్పంచ ప్రయోజన సిద్ధిర్భూయాత్, బ్రహ్మ సాక్షాత్కారో దృఢీ భూయాత్ - నిరంతరాత్మాను సంధాన వశాన్మనసో వృత్తి రూపపరిణామ పరిత్యాగేన నిరుద్ధతా కారేణాత్మ పరిణామో దృఢీభూయాత్, బ్రహ్మాహమస్మీతి బ్రహ్మాత్మానుభవమాత్ర పర్యవసానే బుద్ధిర్నిరంతరం భూయాత్.

'యతోవా ఇమాని భూతాని జాయంతే, యేన జాతాని జీవంతి, యత్ప్రయంత్యభి సంవిశంతి'

'సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్, బ్రహ్మావా ఇదమగ్ర ఆసీత్, ఆత్మవా ఇదమేక ఏవాగ్ర ఆసీత్ నబ్రహ్మా, నేశానః, నేమే ద్యావా పృధివీ నక్షత్రాణి. అహం బ్రహ్మాస్మి ప్రజ్ఞానంబ్రహ్మ.

"తత్త్వమసి"-"అయమాత్మా బ్రహ్మ" "ఐతదాత్మమిదిం సర్వం"-"ఆత్మైవేదం సర్వం, ఆత్మనః ప్రాణ, ఆత్మనోమనఆత్మన ఆకాశ ఆత్మతస్స్వర, ఆత్మతస్తేజ, ఆత్మత ఆప, ఆత్మత ఆవిర్భావతిరోభావా ఆత్మతోన్నం"-ఓమ్.

ఈ శ్రుతిమంత్రములు చెప్పి శ్రీవారు కమండలోదకాన్ని వూని దానితో పరమేశ్వరరావుగారిని ప్రోక్షించారు. పరమేశ్వరరావుగారు చలించలేదు, కన్నులు తెరవలేదు, అట్లాగే నిశ్చలంగా పద్మాసనంలో ఉన్నారు. స్మృతి ఉన్నట్లే లేదు. ప్రోక్షణోదకం మీదపడగానే పరమాద్భుతంగా - పరమేశ్వరరావుగారి యజ్ఞోపవీతం-దానిఅంతట అది జారి క్రింద పడింది. శ్రీవారు ఆయజ్ఞోపవీతాన్ని పరమేశ్వరరావుగారి

మొలత్రాటిని, ఆయనకట్టుకున్న బట్టనూ నారాయణరావుచేత తీసివేయించారు. ఆతరువాత శ్రీవారు నిల్చుని-

"నకర్మణా నప్రజయాధనేన
త్యాగే నైకే అమృతత్వ మానశుః
పరేణనాకం నిహితం గుహాయాం
విభ్రాజదే తద్యతయో విశన్తి
వేదాంత విజ్ఞాన వినిశ్చితార్థా।
సన్న్యాసయోగాద్యతశుద్ధపత్త్వాః
తే బ్రహ్మలోకేతు పరాంతకాలే।
పరామృతాత్పరి ముచ్యంతుసర్వేః."

అని పఠించారు. రమణయ్యగారు, నారాయణరావుకూడా నుంచుని ఈమంత్రాన్ని శ్రీవారితో కలసితాముకూడా పఠించి, పరమేశ్వరరావుగారికి ఎదురుగావచ్చి సాష్టాంగ దండప్రణామం కావించారు.

మరల శ్రీవారు పద్మాసనస్థులై-కుడిచేత కొబ్బరికాయ పుచ్చుకుని, సుమనోజ్ఞంగా ప్రణవనాదం చేశారు. ఆనాదం అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ - కోశాలను దాటి పంచకోశాలకు ఆనందానుభూతి కల్పించినట్లుగా ఉన్నది. మానససరోవరంనుండి కైలాసశిఖరంపైకి ఎగురుతున్న రాజ హంస గొంతెత్తి కలకూజితం చేసినట్లుగా ఉన్నది. అతివినూతనమై, సర్వస్వర సమ్మేళనంగా శబ్దమయలోకానికి రాచబాట వేసినట్లుగా ఉన్నది. పరమార్థ సంవిల్లక్షణసత్తారూపమై గుణ

రూప ప్రకృతిచేత పదార్థరూపంగా నివృత్తమౌతున్న శబ్ద బ్రహ్మస్వరూపం విద్యమానం అయినట్లుగా ఉన్నది. అవ్యక్త మధురములైన నాదబిందుకళలు పరబ్రహ్మాభిముఖంగా ప్రయాణిస్తూ కర్పూర దీపోజ్జ్వల సద్భావనలను గుబాళించినట్లుగా ఉన్నది.

ఆ అతిలోక మధురనాదం ఇంకా సన్న సన్నగా వినిపిస్తూనేఉండగా కాలం సరిగా మధ్యాహ్నం పన్నెండుగంటలు అవటం పరమేశ్వరరావుగారి శిరస్సునుండి పెద్ద ధ్వనిరావటం శ్రీవారు చేతుల్లో పట్టుకుని ఉన్న కొబ్బరికాయను పగులగొట్టడం అన్నీ ఒక్కసారిగా జరిగాయి. వెంటనే శ్రీవారు లేచి నుంచొని,

"గమాగమస్థం గమనాదిశూన్యం
చిద్రూపదీపం తిమిరాపహారం
పశ్యామి తే సర్వజనాంతరస్థం
నమామి హంసం పరమాత్మరూపమ్.

హంస హంసాః పరమహంసస్సోహం హంసః" అని నిమీలితాక్షులతో ధ్యానించి-"ఓం హంస హంసాయ విద్మహే, పరమహంసాయ ధీమహి తన్నో హంసః ప్రచోదయాత్" అని మూడుసార్లు ఉచ్ఛైస్వరంతో పఠించి నారాయణరావువంకా, రమణయ్యవంకా చూచారు. వాళ్ళిద్దరూ ఈ లోకంలో ఉన్నట్లే లేదు. వాళ్లున్నూ అప్రయత్నంగా నిల్చుని ముకుళించిన హస్తాలతో పూజావసాన మంత్రపుష్ప సమయంలో నిలబడి

నట్లుగా అర్థనిమీలితంగా నిల్చుని-వాళ్లున్నూ స్వరయుక్తంగా "ఓం హంస హంసాయ విద్మహే పరమహంసాయ ధీమహి తన్నోహంసః ప్రచోదయాత్" అని అంటున్నారు. శ్రీవారు ప్రశాంతులు కావడంతో వాళ్ళిద్దరూ కళ్లు తెరచి ఆయనవంక చూచారు. అప్పుడు ఆయన వాళ్ళిద్దరినీ చూస్తూ "అంతా అయిపోయింది. మహాయోగరూపంలో బ్రహ్మరంధ్రం ఛేదించుకొని ప్రాణోత్క్రమణం చేసి హంస లేచిపోయింది" అని కన్నులు తుడుచుకున్నారు. నారాయణరావు ఆ మాటలు విన్నాడో లేదో శిలాప్రతిమలాగా అట్లాగే నిల్చుని ఉన్నాడు. అతనికి దుఃఖము వచ్చినట్లు లేదు. ఏదో మహత్తరమైన సందర్శనము లభించి, తదనుభవ పరివ్యాప్తిలో మనస్సు కళకళపడుతున్నట్లుగా ఉన్నాడు. ఇది గ్రహించి శ్రీవారు "నారాయణా!" అని రెండుమూడుసార్లు పిలువగా అతడు ప్రకృతిలోకి వచ్చాడు.

శ్రీవారు తిరిగి రమణయ్యవంక చూస్తూ "రమణయ్యా! అతడు ఆపత్సన్న్యాసాన్ని స్వీకరించి, సహజతురీయమైన ఉన్మనీ చరమభాగంలో సంచరించి ఇంద్రియ సమన్వితమనః ప్రాణాల్ని లయం చేశాడు. అతని శరీరానికి దహనం లేదు. సమాధిచేయించండి. పార్వతమ్మ పసుపు కుంకుమకు భంగం లేదు. సంప్రదాయం నీ వెరుగుదువుగా! ఆమె నిత్య పుణ్య 'స్త్రీ' అని చెప్పి నారాయణరావువంక చూస్తూ "నాయనా మళ్ళీ నేను రేపువస్తాను" అని తలుపు తెరచుకొని వెళ్ళిపోయారు.

రమణయ్యగారు బయటకువచ్చి చూడగా పరమేశ్వర రావుగారి ఇద్దరు కుమార్తెలు, ఇద్దరు అల్లుళ్ళు లోపలకు వస్తున్నారు. వాళ్ళను పరమేశ్వరరావుగారిగదిలోకి తీసుకువెళ్ళి - జరిగినసంగతులు సూక్ష్మంగాచెప్పి తను పార్వతమ్మదగ్గరకుగాను లోపలకువెళ్ళాడు. లోపలకువెళ్ళి అతను చూచిన దృశ్యము అనూహ్యమైనది. వంటఇంటి గుమ్మం ప్రక్కగా దేవతామందిరం ఎదురుగా పార్వతమ్మ పద్మాసనస్థితయై, నిర్జీవంగా ఉన్నది. ఆమె కూడా ఎప్పుడో బ్రహ్మరంధ్రాన్ని ఛేదించి ప్రాణోత్క్రమణం చేసింది. ఏమిచిత్రం! ఆమెకూడా సర్వయోగరహస్య నిష్ణాత! బ్రహ్మరంధ్రంనుండి ప్రాణోత్క్రమణం జరిగినట్లుగా శిరస్సు పైభాగం పగిలి నెత్తురు కారుచున్నది. ఏమి ఈ దంపతులు? వీరు కలియుగంలో పుట్టినవారా?కృతయుగంలో పుట్టినవారా?అరుంధతీ వశిష్ఠులవలె-లోపాముద్రా అగస్త్యులవలె-అనసూయా అత్రిమహామునులవలె - మైత్రేయీ యాజ్ఞవల్క్యులవలె-ఏమి ఈ దంపతుల తపశ్శక్తి! రమణయ్యగారు తేరుకొని నారాయణ రావు దగ్గరకువచ్చి అతనిని కౌగిలించుకుని బావురుమన్నాడు. స్తబ్ధుడై, మందుడై - నిశ్చలంగాఉన్న నారాయణరావుకు స్మృతి వచ్చినట్లై - అతడుకూడా అప్పుడు బావురుమన్నాడు. కూతుళ్లు, ఇంట్లో పిల్లలు, పెద్దలు అంతా ఒక్కసారి గొల్లుమన్నారు.

ఇంతట్లో రమణయ్యగారి తమ్ముడు వేంకటేశ్వరరావు, అతని భార్య, రమణయ్యగారి భార్య వచ్చారు. అందరికీ

అంతా తెలిసిపోయింది. అన్ని వివరాలు అందరికీ వాటంతట అవే తెలిసినై.

వేంకటేశ్వరరావు పురోహితులకు కబురంపాడు. ఊళ్లో వారందరికీ అన్నివిషయాలూ తెలిసినై. పరమేశ్వరరావుగారి స్వచ్ఛంద మరణమూ, పార్వతమ్మగారి సహగమనమూ - ఈ వృత్తాంతాలు విని ఆశ్చర్యపడనివారు, కంటతడిపెట్టనివారు, హృదయదఘ్నంగా దుఃఖాతిరేకం పొందనివారు, ఆ మహాను భావుల సన్నిధానంలో ఉండగలిగినందుకు తమ్ము తాము అభి నందించుకోనివారు ఆ ఊళ్ళో నేలేరు. ఊళ్ళోవారందరూవచ్చి ఇంటిచుట్టూ మూగారు. అంతా పితృదుఃఖమగ్నుడైన నారా యణరావును తమతమ కనిష్ఠసోదరునిలాగా పరామర్శించారు.

ఎక్కడనుంచో నారాయణరావు ఆజన్మమిత్రుడు గంగా ధరరావు వచ్చాడు. అతడు ధనికుల బిడ్డ. అతన్ని చూడటమే తడవుగా నారాయణరావతణ్ణి గ్రుచ్చుకొని ఏడ్చాడు. అతని కిన్నీ దుఃఖం ఆగలేదు. ఇద్దరూ రోదించారు. గంగాధరరావు సంబాళించుకుని, నారాయణరావును ప్రక్కకు తీసుకొనివెళ్ళి- "అన్నా! మీ తలిదండ్రులు నిజంగా పార్వతీ పరమేశ్వరులే! వారిని సన్నిహితంగా ఎరిగిన నావంటివారమే ధన్యులంగా భావించుకుంటున్నాము. నీవు దుఃఖపడి ప్రయోజనమేమున్నది? నీకు తెలియని సంగతులేమున్నాయి? ముందు మీ తమ్ము ళ్ళనూ, చెల్లెలనూ సముదాయించు. ఇవిగో ఈ వెయ్యి రూపాయలు దగ్గరుంచుకో - అవసరంపడవచ్చును. నాకు

కొంత ముఖ్యమైన పని ఉన్నది. క్షమించు. వెళ్ళివస్తాను. ఈ ఆపత్కాలంలో దగ్గరఉండి నిన్ను అనునయించుకునే అదృష్టం కూడా లేకుండా - నాకు పనివచ్చిపడింది. నీదుఃఖాన్ని మటుక్కునేనుకూడా భాగం పంచుకుంటూనే ఉన్నాను. నేను ఊరినుంచి తిరిగి వచ్చి నిన్ను కలుస్తాను." అని చెప్పి వెళ్ళి పోయాడు.

ఇంటిలో డబ్బు లేదని నారాయణరావుకి తెలుసును. అసలు ప్రస్తుతము డబ్బున్న గాని జరుగవలసిన కర్మకాండ నడవదని అతనికి అవగాహన అయిన విషయమే. రమణయ్య గారు వేంకటేశ్వరరావు బీదవారు. సర్దుబాటు చేయగల సామ ర్థ్యం వారిద్దరికీ లేదు. ఏమి చెయ్యాలో తెలియక వాళ్ళిద్దరూ తికమకలుపడుతుండగా - నారాయణరావు వాళ్ళకు నంవ రూపాయలు ఇచ్చాడు. వాళ్లు పెద్ద బరువు తీసినట్లయి ముందు జరుగవలసిన పనులు జరిపించడానికి వీధిలోకి వచ్చారు. వీధి లోకి వచ్చి ఆశ్చర్యంతో నిల్చిపోయారు.

ఆ ఊరిలోఉన్న బ్రాహ్మణ్యం వారంతా వచ్చి ఉన్నారు. పరమేశ్వరరావుగారి స్వచ్ఛంద మరణవృత్తాంతం ఆ ఊరినే కదలించివేసింది. అందులో వైదికవృత్తిలో ఉన్న బ్రాహ్మణుల సంగతి చెప్పక్కర్లేదు. ఎవళ్ళకువాళ్ళే సిద్ధపడి-పరమేశ్వరరావు గారు అద్వైతసిద్ధిగా - తురీయాశ్రమంలో - బ్రహ్మైక్యం పొందారు గనుక - ఆయన శరీరాన్ని సమాధిచేయించడానికి

పార్వతమ్మగారి దేహాన్ని దహనం చేయించడానికి కావలసిన ఏర్పాట్లు సిద్ధం చేశారు.

తురీయాశ్రమంలో ఉన్న బ్రాహ్మణ యతులు గ్రామానికి వచ్చినప్పుడు ముందుగా స్మార్తవృద్ధ బ్రాహ్మణ పురోహితుల భిక్షా వందనం స్వీకరించుట ఆచారం. పరమేశ్వరరావుగారు యతులై, మహాయోగులై, ప్రథమభిక్షావందనమైనా స్వీకరించకుండానే బ్రహ్మైక్యం పొందటంచేత - ఆయన శరీరానికి ఖననసంస్కారం తామే నిర్వహించాలని పురోహిత బ్రాహ్మణులు నిశ్చయించుకొనివచ్చి, నడుముగట్టి అది తమతమ తల్లిదండ్రుల సంస్కారమువలె చిత్తశుద్ధిగా ఆర్ద్రమైన మనస్సులతో వేదఘోష చేశారు. ఊరంతా "యోవేదాదౌ స్వర ప్రోక్తా వేదాంతేషు ప్రవర్తితా"—అన్న శ్రుతిగానంతో నిండిపోయింది. బ్రాహ్మణులు రమణయ్యగారితో సంప్రదించి, పరమేశ్వరరావుగారి దేహాన్ని, పార్వతమ్మగారి దేహాన్ని వేర్వేరుగా బయటకుతెచ్చి కూర్చోపెట్టారు.

వీధిలోఉన్న కుటుంబాలవారంతా ఆపుణ్యదంపతులకు హారతులుపట్టి మంగళగీతాలు పాడారు. దేవతాదర్శనం చేసుకున్నట్లుగా అందరూ పాదాభివందనాలు చేశారు. పూలమాలలు సమర్పించుకున్నారు. "నకర్మణా నప్రజయాధనేన" అన్న ఉపనిషద్వాక్యం సర్వేసర్వత్ర విజృంభించింది.

పరమేశ్వరరావుగారి కుమార్తెలు, అల్లుళ్ళు, ఇంటిలో చిన్నపిల్లలు, నారాయణరావు - దుఃఖహతులై తట్టుకోలేక

పోయారు. ఉదయం ఇల్లు ఖాళీచెయ్యమని సలహాచెప్పిన రాఘవయ్యగారు ఆవేదన భరించలేక నారాయణరావు దగ్గరకు వచ్చి "నాయనా! ఉదయం నేను మాట్లాడినదానికి నన్ను క్షమించు. మీ తల్లితండ్రులు సాక్షాత్తూ పార్వతీపరమేశ్వరులే. అల్పజ్ఞుడనైన నేను గ్రహించుకోలేక పోయాను. వారిని సేవించుకోలేకపోయాను. మీకు ఇంటికి ఇబ్బందిఅయితే నాలుగునెలలు నేను ఇల్లు ఇస్తాను." అన్నాడు. నారాయణరావు రాఘవయ్యగారికి నమస్కరించి కృతజ్ఞత తెలుపుకున్నాడు.

పరమేశ్వరరావుగారి శరీరానికి సమాధి, పార్వతమ్మగారి దేహానికి దహనం యథావిధిగా జరిగినై. పార్వతీపరమేశ్వరుల కళ్యాణంలాగా - ఊళ్ళోజనం తమంతటతాము నడుంకట్టి తమయథాశక్తి తోడ్పడ్డారు. అది ఒక తిరునాళ్ళలాగా, కళ్యాణోత్సవంలాగా - బ్రహ్మోత్సవంలాగా రథోత్సవంలాగా ప్రజలు మూగారు.

పరమేశ్వరరావుగారిని ఎక్కడ సమాధి చెయ్యాలని కొంత తర్కం జరిగింది. ఆ ఊళ్లో రెండుమూడు శివాలయాలున్నాయి. అందులో ఒకదానికి పరమేశ్వరరావుగారే ధర్మకర్త. ఇంకోటి అనేకవందల సంవత్సరాలుగా ఉన్న ఆలయం. శాతవాహనుల కాలంలో ప్రాడ్వివాకులై ఆ వంశంవారు కట్టించుటచేత దానికికూడ ఈనాటికీ పరమేశ్వరరావుగారి వంశంవాళ్లే ధర్మకర్తలు. ఆ ఆలయం చరిత్ర ప్రసిద్ధమైంది.

శాలివాహనుల కాలంనుంచీ విజయనగర ప్రభువుల దాకా ఆ దేవాలయంలో శాసనాలు ఉన్నై. పరమేశ్వరరావుగారు సన్న్యసించి బ్రహ్మైక్యం పొందటంవల్ల ఆయన శరీరం శివ స్వరూపమేననీ - ఆయన తమ వంశంలో వెలుగుదీపం వంటి వాడు గనుక ఆయన శరీరాన్ని చరిత్ర ప్రసిద్ధమైన ఆ దేవాలయ ప్రాంగణంలో సమాధి చేయించాలని ఆయన జ్ఞాతులు పట్టుపట్టారు. ఆ ఆలయం ప్రభుత్వంవారి అజమాయిషీలో ఉంటున్నది గనుక ఏమైనా అభ్యంతరాలు రావచ్చని కొందరు హెచ్చరికలు చేశారు. ఇంతలో పరమేశ్వరరావుగారి ఆ బాల్యస్నేహితుడు, ఆ ఊరిలో మోతుబరి రైతు - వెంకట కృష్ణయ్య చౌదరి వచ్చి "నాకు ప్రాణాధికుడైన స్నేహితు లాయన. కులాలు వేరైనా మే మిద్దరం అన్నాతమ్ముళ్ళలాగా బ్రతికాం. నా అన్న మరణ సమయంలో కూడా మహోదాత్త మైన మాహాత్మ్యం ప్రదర్శించి వెళ్ళిపోయాడు. ఆయనతో చేసిన స్నేహంవల్లా ఆయన్ను సేవించుకున్న పుణ్యంవల్లా మేమంతా పునీతులమైనామని భావించుకుంటున్నాము. ఆయన సమాధిపైన శివలింగం ప్రతిష్ఠ చేయించి ఆలయం కట్టించడానికి నేను నిశ్చయించుకున్నాను. మన ఊరుబయట పెద్ద చెరువుకి పడమరగా నాకు మూడెకరాల భూమి ఉన్నది. అందులో సమాధి చేయించాలి. అక్కడ ఆలయం కట్టించి, ఆ భూమి ఆలయానికి రాసి ఇస్తాను" అని అన్నాడు. ఆయన మాటలకు అంతా హర్షించారు. ఆయన కోరిన ప్రకారమే సమాధి జరిగింది.

# 8

ఆ మర్నాడు సంచయనానికి బయలుదేరుతుండగా నారాయణరావును పరామర్శించడానికి తాలూకా సిబ్బందితో తాశిల్దారుగారు వచ్చారు. తాశిల్దారుగారు జగన్నాథరావు నాయుడుగారు. ఆయన నారాయణరావును కౌగలించుకుని కళ్ళలో నీళ్లు పెట్టుకుని-అబ్బాయీ! నేను ఈవూరు తాశిల్దారుగావచ్చి నెలరోజులే అయింది. ఈ నెలరోజుల్లో మీతండ్రి గారిని గురించి ఎక్కువగా తెలుసుకునే అవకాశం లేక పోయింది. ఆయన ఆఫీసుపనిమీద బందరువెళ్ళివచ్చి తిరిగి ఆఫీసుకి రాలేదు. శలవుచీటి పంపలేదు. మామూలు ఆఫీసరు జులుంతో నేను మీతండ్రిగారిమీద డిప్యూటీకలెక్టరుగారికి రిపోర్టువ్రాశిన గంటకు తెలిసింది మీతండ్రిగారి స్వచ్ఛంద మరణవృత్తాంతం. ఆయన మరణవార్తవిని ఆఫీసులో అందరు జవాన్లు - అందరు గుమాస్తాలు తమతమ స్వంత తలిదండ్రుల్ని పోగొట్టుకున్నట్టుగా ఏడ్చారు. అప్పుడుగాని నాగుండెకరగ లేదు. అప్పుడుగాని మీతండ్రిగారి మహనీయత నాకు అవ గాహనకాలేదు. నేను చేసిన పొరపాటు గ్రహించాను. మీ తండ్రిగారి బదులు నువ్వు నాతప్పు క్షమించాలి" అని అంటూ నారాయణరావు రెండుచేతులూ పట్టుకుని బావురుమన్నాడు. ఆయన గాఢ శీలానికి, సజ్జనత్వానికి నారాయణరావు ముగ్ధుడై నాడు. 'అయ్యా! మీరు ఉత్తములు. కాబట్టి ఇట్లామాట్లాడు తున్నారు. ఇందులో క్షమించవలసినంత తప్పేమి జరిగింది? మీ

అభిమానానికి పాత్రుడనైన నేను అదృష్టవంతుణ్ణి,' అని చెప్పి నారాయణరావు ఆయన్ను ఊరడించాడు.

జగన్నాథరావు నాయుడుగారితో వచ్చిన తాలూకా శిరస్తాదారు పరమేశ్వరరావుగారి జీతం నిన్నటివరకూ తెచ్చామని చెప్పిఇచ్చి-దానితోపాటు ఇంకాకొంత మొత్తంఇచ్చాడు. "ఇదేమిట"ని నారాయణరావు ఆయన వంకచూడగా-ఆయన అట్లాఅన్నాడు. "తాలూకాఫీసులో ఉద్యోగస్థుల మందరమూ కొంత మొత్తంచేర్చి, పరమేశ్వరరావుగారిపైన మాకుగలప్రేమ గౌరవాల చిహ్నంగా తెచ్చాము. ముప్పైఏళ్ళనుండీ ఉద్యోగంచేస్తూ నిలువచేసుగున్నది మీతండ్రిగారు గౌరవమొక్కటే. ఆయన ఉద్యోగధర్మంలో చాలానిక్కచ్చి మనిషి. ఐనా సహోద్యోగుల్లో ఎవ్వరిమనసు నొప్పించి ఎరగడు. ఆయన ఉద్యోగం చేస్తూ మరణించారు గనుక - ఆయన అంత్యక్రియలకు సహోద్యోగులు తమయథాశక్తి తోడ్పడటం వాళ్ళ కనీసధర్మం. అదే ఈసొమ్ము, దీన్ని నువ్వుగ్రహించి మాకు తృప్తిచేయాలి" అనగా నారాయణరావు ప్రత్యుత్తరం చెప్పలేక స్వీకరిస్తూ రుద్ధకంఠంతో ఆ వచ్చిన ఉద్యోగులందరకూ కృతజ్ఞతా నమస్కారాలుచేశాడు. వాళ్ళ ముఖాలలో తన తండ్రిగారికీర్తి గౌరవాలు నివాసాలు ఏర్పరచుకున్నట్లుగా తోచి-ఆకీర్తి గౌరవాలకు తన మనస్సులో పునః పునః ప్రణామాలు చేశాడు. తన తండ్రిగారి యశశ్శ్రీ ఇంత ప్రసన్నంగా-ఇంతసన్నిహితంగా ఉండనే ఉన్నప్పటికి - ఆయన వియోగం భరించరానిదిగానే.

ఉంటున్నదేమిటని ఆలోచించుకుంటూ వాళ్ళందరినీ సాగ నంపాడు.

సంచయనం పూర్తిచేసుగుని వచ్చి భోజనానికి కూర్చుండగా నారాయణరావు తోబుట్టువు వెంకటనర్సమ్మ వడ్డించింది. వచ్చిన ఆడపడుచులలో ఆమే పెద్దది. ఆమెకంటె పైవాళ్ళిద్దరున్నారు. అందరికన్న పెద్ద ఆమెకు ఆదినమే మామగారు మరణించటంచేత ఆమెగాని, ఆమెభర్తగాని రాలేదు. రెండో ఆమెగాని ఆమెభర్తగాని రాలేదు. వాళ్ళకు పరమేశ్వరరావు గారితో మనస్పర్థలుగా ఉన్నవి. ఆపత్సమయంలోకూడా వాళ్ళు కించిత్కారణాలు మరవలేకపోయి ఆమెను తల్లితండ్రుల మరణసమయానికికూడా పంపలేదు. మూడోకుమార్తె వెంకటనర్సమ్మ. ఆమె ఇప్పుడు ఇంట్లోపెత్తనం చేయవలసి వచ్చింది. వడ్డనచేస్తూ ఆమె తమ్ముడుతో చెప్పింది. "నాన్న మంచం ఎక్కినప్పటినుంచీ మన నందమ్మ మేతమేయలేదట. అమ్మ బలవంతంచేసి కుడితినీళ్ళు తాగిస్తున్నదట. నిన్నమధ్యాహ్నంనుంచీ దాని సంగతి పట్టించుకోవడానికి ఎవ్వరికీపట్టలేదు.అది మేతముట్టలేదు. నీళ్ళుతాగలేదు. అట్లాగే నిలచి అరుస్తూన్నది. నువ్వు భోజనం చేసి దానిసంగతి కొంచెం చూడు!" నందమ్మ వాళ్ళఆవు. పరమేశ్వరరావుగారు కన్నబిడ్డవలె సాకుతున్న ఆవు. దాదాపు ఐదారు పురుషాంతరాలుగా వాళ్ళఇంటిలో పుట్టిన ఆవుల సంతానము. బహుసుందరమై, సర్వకపిలవర్ణమనోహరమై, కుండంతపొదుగుతో, ప్రత్యక్ష కామధేనువవలె-నందమ్మ మహా

సాధువు. దానిని పరమేశ్వరరావుగారు ఎండచూడనీయలేదు. వాళ్ళఇంటికి ఎదురుగాఉన్న తమస్థలంలో పశుశాలవేయించి - దాన్ని నందమ్మ నివాసంగా చేశారు. ఆయనకు పని లేనప్పుడల్లా నందమ్మకు సేవచేస్తుండేవారు. దానికి ఆయనే మేతవెయ్యాలి. ఆయనే నీరు పెట్టాలి. పాలు ఆయనే తియ్యాలి. ఆయన, నారాయణరావుగాక - అప్పుడప్పుడు వెంకటకృష్ణయ్యచౌదరి గారు మాత్రమే దాన్ని చూచిన పరపురుషులు. అది ఇంతవరకు నాలుగోపురుషుణ్ణి చూడలేదు. పరమేశ్వరరావుగారు కన్పడక అది చాలా బెంగపెట్టుకుని "అంబా" అని రాత్రిళ్ళు పగళ్ళు ఘోషిస్తూంది. భోజనంచేసి నందమ్మదగ్గరకు వెళ్ళాలని నారాయణరావు బయటకురాగా వెంకటకృష్ణయ్యచౌదరిగారు వాకిట్లో కూర్చునిఉన్నారు. "నాయనా! రెండుమూటలు బియ్యం పంపాను. తరువాత నీకు మాసొమ్ము రుచిస్తుందో లేదో - మాఅన్నగారి శ్రాద్ధకర్మలకైనా మాబియ్యం ఉపయోగించు" అని చెప్పి చౌదరిగారు కళ్ళుతుడుచుకున్నారు. నారాయణరావు లోపల్నుంచి తాటిఆకులచాపతెచ్చి అరుగుమీద వేసి ఆయన్ను కూర్చోమని, ఆయన కూర్చున్నతరువాత తాను కూర్చున్నాడు.

ఎదురుగా దొడ్డిలోనుంచి నందమ్మచేస్తున్న 'అంబా' రవాలు విన్పిస్తున్నాయి. చౌదరిగారు ఒకటిరెండు విని లేచి "ఔరా! నోరులేని ఈసాధుజంతువుకి అన్నగారిపైన ఎంతప్రేమ! ఆయనపోగా మనమంతా దుఃఖాన్ని భరించుకున్నాం. పాపం!

నందమ్మమాత్రం ఇంకా రోదిస్తూనే ఉన్నది" అని అంటూ పశుశాలలోకి దారితీశారు. నారాయణరావు ఆయన్ను వెంబడించాడు. వీళ్ళిద్దరినీచూచి నందమ్మ తన రోదనాన్ని రెట్టింపు చేసింది. నారాయణరావు దాని గంగడోలునిమిరి, మెడ కౌగిలించుకొని వెక్కి వెక్కి ఏడ్చాడు. అతనిదుఃఖంలో - చౌదరిగారు దానిని ప్రేమగా స్పృశించుటలో అది ఏదో సమనునయభూతమైన అనుభవాన్ని పొందగల్గింది. ఈ మూగభాషలో - ఏవో హృదయాంతర భావావిష్కరణలు. మానవునికి జంతువునకు మధ్యగలప్రేమానుబంధాలు - ఏవో దృఢమైన పురాణబంధాలు వ్యక్తీకరింపబడినట్లుగా ఉన్నది.

నారాయణరావు నందమ్మకు నీరుపెట్టాడు. అది త్రాగింది. మేతవేశాడు. అది ముట్టుకొని కొంచెం కొంచెంగా మెయ్యడానికి ప్రారంభించింది. చౌదరిగారు చూస్తూనిలబడి కన్నులు తుడుచుకున్నారు. నారాయణరావు చౌదరిగారు చాలాసేపట్లాగే నందమ్మనుచూస్తూ నిలబడ్డారు. ఆతర్వాత చౌదరిగారు "బాబూ! మీ తండ్రిగారు నందమ్మకు ప్రతిరోజూ నాలుగు రూపాయలు శలవుచేస్తున్నారు. మరి దీన్ని నీ వెట్లా సాకుతావో" అని అన్నారు. నారాయణరావు ప్రతిసమాధానంగా "అదే నేనాలోచిస్తున్నాను. దయచేసి నందమ్మభారం మీరు స్వీకరించండి" అని కోరాడు. చౌదరిగారు "ఇది మా అన్నగారికి ప్రియతమమైన హోమధేనువు. దీనిని మా అన్నగారిని సేవించుకున్నట్లుగా సేవించుకుంటాను" అని కొంత సేపాగి

"అన్నగారి కర్మకాండలు ముగిసింతర్వాత దీనిని నేను తోలుకు వెళ్తాను. ఈలోగా దీనికి మేత, నీళ్లు, నేనేవచ్చిచూచి పోతూం టాను. పాలు నేనే తీసిఇచ్చి వెళ్తూఉంటాను" అన్నారు. ఇద్దరూ పశువులశాలనుంచి బయటకువచ్చి తిరిగి ఇంటి అరుగుమీద కూర్చున్నారు. కొంతసేపు ఇద్దరూ మౌనంగా ఉన్నారు. చౌదరిగారు నారాయణరావు చేతిలో రెండువందల రూపా యలు పెట్టి "బాబూ! ఇవికూడా మీవద్ద ఉంచండి. ఈ సొమ్ము నందమ్మ ఖరీదుకాదు. దానికి వెలకట్టలేము. దాని ప్రేమాభిమానాలు దొడ్డవి. అది తొక్కిన దొడ్డిలో మహాలక్ష్మి తాండవిస్తుంది" అని చెప్పి 'వెళ్ళివస్తాను' అని వెళ్ళి పోయారు.

ఏవో స్మృతులతో నారాయణరావు అట్లాగే కూర్చుండి పోయాడు. తన చిన్నప్పటినుంచీ తండ్రిగారిని గురించిన అనేక అనుభవాలు జ్ఞాపకానికివచ్చి మనోవీధిలో సంచరించినాయి. ఆ జ్ఞాపకాలవల్ల ఆయనయందు భక్తి గౌరవాలు పెరిగిపోయి-ఆయన వియోగంవల్ల కలిగిన విషాదాన్ని మరింత గాఢం చేసినాయి.

ఇంతట్లోకే వాకిట్లో గుఱ్ఱబ్బండీ ఆగింది. బండిలోనుంచి దొరవేషంతో ఒక పెద్దమనిషి దిగి గుమ్మంలోకి వచ్చాడు. ఆయన ఎవరో నారాయణరావుకి తెలియలేదు. అయినా ఆయన్ను చూడగానే లేచి నిల్చున్నాడు. బండి ఆగటం గమ నించిన రమణయ్యగారు లోపల్నుంచి బయటకువచ్చారు. ఆ

వచ్చిన దొర వేషపు పెద్దమనిషిని లోపలకు ఆహ్వానించి ఆయన్ను లోపలకు తోడ్కొనిపోయారు. నారాయణరావు కూడా వాళ్ల వెంట లోపలకు నడిచాడు. ఆ పెద్దమనిషిని లోపల కుర్చీలో కూర్చోపెట్టి రమణయ్యగారు నారాయణరావు వంక చూపిస్తూ ఆయనతో "వీడే మా పెద్ద మేనల్లుడు" అన్నారు. నారాయణరావువంక చూచి "వీరు మన వెంకటకృష్ణయ్య చౌదరిగారికి పెత్తండ్రి కుమారులు. వీరు ఇంగ్లాండులో బారిష్టరు ప్యాసై వచ్చి, మద్రాసులో ప్రాక్టీసు చేస్తున్నారు. మీ తండ్రిగారికి చిన్ననాటి మిత్రులు. వీరి పేరు నీవు వినేఉంటావు. ప్రసిద్ధ రచయితలైన కృష్ణస్వామి చౌదరిగారు వీరే."

ఆ పేరు నారాయణరా విదివరకే వినిఉన్నాడు. ఆయన రచనలున్నూ కొన్ని చదివి ఉన్నాడు. తను చదివిన రచనల్లో కనపడకపోయినా ఆయనకు దేశములో బ్రాహ్మణ ద్వేషముగా రచనలుచేసే రచయితల బృందానికి నాయకుడుగా కీర్తిఉన్నట్లు విన్నాడు. కాని తాను చదివిన ఆయన రచనలు నుడికారము నకు పుట్టిల్లుగా, సొంపుగా ఉన్నవి. ఆయనకు గల శబ్దాధికారము అధికమైనదని తా ననుకున్నాడు. ఆయన ఊహాశాలిత్వం, భావనా తీవ్రత్వం ఆతను గ్రహించాడు. కాని ఆయన రాక నారాయణరావుకి ఆశ్చర్యం కలిగించింది. అట్టి బృందానికి నాయకుడు పరమేశ్వరరావుగారి మరణానికి సానుభూతి తెలుపుటకు వచ్చుటా? అని అతని ఆశ్చర్యము. ఆ అచ్చెరువు నారాయణరావు ముఖంలో ప్రస్ఫుటంగా విద్యమానం అయింది.

కృష్ణస్వామిచౌదరిగారు నారాయణరావును దగ్గరకు తీసుకొని తన ఒడిలో కూర్చోపెట్టుకున్నారు. అతని బుజాలు సవరిస్తూ మాట్లాడారు. "నాయనా! నిన్న మధ్యాహ్నమే వెంకటకృష్ణయ్య మీ తండ్రిగారి స్వచ్ఛంద మరణాన్ని గురించీ, అమ్మగారి సహగమనాన్ని గురించీ నాకు తంతిని ఇచ్చాడు. నేను వెంకటకృష్ణయ్య సమవయస్కులం. మీ తండ్రిగారు మా ఇద్దరికంటె ఆరు నెలలు పెద్ద. నాకు మా తండ్రి ఒక సంవత్సరం వయస్సులోనే గతించగా నన్ను మా పినతండ్రిగారు పెంచారు. నేనూ వెంకటకృష్ణయ్యా స్వంత అన్నదమ్ములలాగా - కవలపిల్లలలాగా - ఉండేవాళ్లం. మేము ముగ్గురమూ చిన్నప్పటినుంచీ ఒకే జట్టు. వెంకటకృష్ణయ్య మూడో ఫారంతోనే స్కూలు చదువు చాలించాడు. మీ తండ్రిగారూ, నేనూ, బందరు నోబులు హైస్కూల్లో స్కూలు ఫైనలువరకూ చదివాము. ఎప్పుడూ మేమిద్దరం కలసే ఉండే వాళ్ళం. స్కూలు ఫైనలుతో మీ తండ్రిగారు ఆపేశారు. నాకు మీ తండ్రిగారే సాహిత్యవేదాంత గురువు, మంత్ర గురువు. దేశంలో నన్ను బ్రాహ్మణద్వేషినని అనుకుంటున్నారు. అది నామీద స్వార్థపరులు వేసిన అపనింద. ఆ అపనింద నిరాధారం. నేనింతవరకూ ఏ బ్రాహ్మణుణ్ణి ద్వేషించలేదు. ద్వేషించ వలసిన అవసరమున్నూ కలుగలేదు. కులం వ్యక్తి సంబంధమైంది. ఎవరికులం వాళ్లది. ఎవరి గౌరవం వాళ్లది. ఎవరి సంతానం వాళ్ళది. తమతమకులాలు కారణంగా సంఘంలో ఎవ్వరికీ

ప్రత్యేక స్థానాలు ఉండక్కరలేదని నావాదం. నీ వ్యక్తిగత సద్గుణాలచేత నీ ప్రజాహితకార్య కర్తృత్వముచేత, నీసామర్థ్యముచేత - సాంఘికమైన పదవులు నీవు సాధించుకోవాలి. ఇక్కడ కులముతో ప్రసక్తిలేదు. నీకులాగతమైన ధర్మాలు నీ కున్నాయి. కొన్ని ఆచారాలు నీకున్నాయి. అవి నీవు నిర్వర్తించుకో. మా కభ్యంతరం లేదు. సమిష్టిగా యావత్సంఘానికీ వాటితో నిమిత్తంలేదు. నీకుల ధర్మాలు, ఆచారాలు, నీ వ్యక్తి సంబంధమైనది. నీ సాధన నీ అనుష్ఠాలలాగానే. అవి నీవు ఆధ్యాత్మికంగా ఉన్నత కక్ష్యలు సాధించడానికి మాత్రమే ఉపయోగపడాలి. కులం - ఒక విషవలయమై, ఇతరుల్ని న్యూనతపరచడానికి, అగౌరవం చెయ్యడానికి, కారణం కాకూడదు. అట్లా అవడంచేత మనదేశం నేడధోగతిలో ఉన్నది. పూర్వంలాగా సర్వవర్ణములవాళ్ళూ సమాన గౌరవ ప్రతిపత్తులతో, సహకరిస్తూ, మనదేశాన్ని సముద్ధరించాలని నా అభిలాష. దీంట్లో బ్రాహ్మణుల్నిగాని, ఇతరుల్నిగాని ద్వేషించడం ఏమున్నది? పైగా నా అభిప్రాయాలకు పరమ బ్రహ్మణ్యులైన మీతండ్రిగారెప్పుడూ ప్రతి చెప్పలేదు. అందుచేత వారి ఆమోదముద్ర ఉన్నదనే నా నమ్మకం. ఇవి నన్ను నీకు తెలుపుకోవడానికి చెప్పినమాటలు. మీ తండ్రిగారు నాకు గురువుగారని చెప్పితినికదా! ఆయన మరణం నీ కెట్లాగో నాకూ అట్లాగే భరింపరానిదిగా ఉన్నది. ఆయన మంత్రశాస్త్రవేత్త అయిన తర్వాత నన్ను రక్షింపమని నే

నాయన్ని ఆశ్రయించాను. నాకాయన 'గోపాలరత్నా'న్ని అనుగ్రహించారు. ఆ నాటినుండి నాకు పరమదైవమైన గోపాల కృష్ణుడు మీ తండ్రిగారి స్వరూపంతో-గీతాపరమేశ్వరమూర్తి అయి - నాకు నిత్యప్రసన్నుడుగా ఉన్నాడు. అవతారపురుషు లైన శ్రీరామ, శ్రీకృష్ణ, బలరాములు బ్రాహ్మణులు కారే. మహాభక్తాగ్రేసరులైన నారదుడు, ధ్రువుడు, విదురుడు, మొద లైనవాళ్లు బ్రాహ్మణులు కారే. వీళ్ళందరినీ పూజ్యపురుషు లుగా సర్వబ్రాహ్మణ్యమూ అంగీకరించడం లేదా! కాబట్టి కులాగతమైన సహజగౌరవం లేదని విశదమౌతున్నదికదా! అది అట్లాఉండనీ. భిన్నకులాలు అయినందువల్ల మీపైన నాకు ప్రేమ గౌరవాలుండటానికి అడ్డురాలేదే. మీ తండ్రిగారు మరణించినందుకు నీకున్నంతదుఃఖం నాకూ ఉన్నది. ఇది రక్త సంబంధమైన దుఃఖంకాదు. సత్యమైన గౌరవహేతువైన దుఃఖం. నిజమైన శిష్యునికి గురుపాదులపైన నిత్యంగా ఉన్న భక్తి కారణముగాగల దుఃఖం.' అని అంటూ కన్నులలో నీళ్ళు కారగా తుడుచుకొని "ఏదో ఆవేశంలో మాట్లాడాను" అని మళ్ళీమళ్ళీ కళ్ళుతుడుచుకుంటూ కొంతసేపుకూర్చుని తరువాత లేచి మళ్ళీ నారాయణరావును ఆలింగనంచేసుకుని వెళ్ళి పోయారు. ఈ ద్వేషాలు, ప్రేమలు, అభిమానాలు, భక్తి గౌరవాలు ఇవి ఏవో విచిత్రంగా నారాయణరావుకు భాసించి నట్లుగా అయినది.

# 9

ఆ సాయంత్రం శ్రీ విమలానందభారతీ స్వాములవారు వచ్చి వాకిట్లో నిలువగా నారాయణరావు పాదాభివందనం చేశాడు. శ్రీవారు నారాయణస్మరణచేస్తూ ఎదురుగా ఉన్న పశుశాలలోకి నడిచారు. నారాయణరావు వెంబడించాడు. అక్కడ పశుశాలలో నందమ్మ పడుకునిఉన్నది. వీళ్ళనిచూచి నిల్చున్నది. అంబా అని అరచి మెడజాపింది. మహాసుందరమై మాతృభావానికి రూపకల్పనగా ఉన్న కపిలగోవు నందమ్మను చూడగా శ్రీవారికి మిక్కిలి సంతోషమైంది. దానిదగ్గరకు వెళ్ళి జాపిన మెడను స్పృశించి దానిదగ్గరగానిల్చుని దాని మెడ దగ్గరగా తీసుకుని రెండుచేతులతో నిమురగా నందమ్మకు అపూర్వసౌఖ్యమేదో కలిగినట్లుగాఅయి, తిరిగి పడుకొని మెడను ఆయనచేతుల్లో పెట్టింది. ఆయన దానిముందుకూర్చుని దాని మెడను తనఒడిలో పెట్టుకుని స్పృశిస్తూ దానివంకచూస్తూ కూర్చున్నారు. నారాయణరావుకి చిత్రమైన ఆనందంకలిగింది. ఈ అమాయికమైన ఆవు శ్రీవారిదగ్గర పరమశాంతి ఉన్నదని గ్రహించి, దానిని అనుభవిస్తున్నది. ఆహా! సృష్టిచిత్రము! అమాయికులకు, విద్యావిహీనులకుకూడా మనదేశంలో త్రికాలాబాధ్యమైన సత్పదార్థంమీద ఇట్టిదే ప్రగాఢరక్తి - భక్తి, విశ్వాసాలు కాబోలు. శ్రీవారు నిన్న తన తండ్రిగారి మరణసమయంలో ఎంతచిత్రంగా ప్రవర్తించారు? తన తండ్రి

గారు పరమహంసగా మహాయోగసిద్ధితో బ్రహ్మరంధ్రాన్ని ఛేదించుకొని ప్రాణోత్క్రమణంచెయ్యడానికి శ్రీవారు కారణ భూతులా? నారాయణరావు మనస్సు ఆగిందికాదు. శ్రీవారి ఎదుటతిరిగి సాష్టాంగ నమస్కారంచేసి వెక్కి వెక్కి ఏడ్చాడు. ఆయన మందస్మితంగా నారాయణరావువంక "ఏమిటి?" అన్నట్లుగా చూచారు. అప్పుడు నారాయణరావు "తమరు మా తండ్రిగారిని ఉద్ధరించారు. నన్నుకూడా ఉద్ధరించండి!" అని కళ్ళనీళ్ళతో పునః ప్రణామం చేశాడు. శ్రీవారు "మన శ్శివ సంకల్పమస్తు" అని నారాయణరావు వంక చూస్తూ "నాయనా! ఆధ్యాత్మికసిద్ధి అంత తేలికగా లభిస్తుందా? మీ తండ్రి నావద్ద ప్రస్థానత్రయ శాంతి చేశాడు. నేను ప్రాణోత్క్రమణం చేసేటప్పుడు మీతండ్రి నిర్వహింపవలసిన కార్య క్రమాన్ని - అతని బ్రహ్మైక్య సమయంలో నేను నిర్వహించాల్సి వచ్చింది. విధి ఎట్లావుంటుందో చూడు! అన్నిటికంటె మీఅమ్మగారి మరణం మరీ చిత్రంగా ఉన్నది. భర్త మరణిస్తున్నాడని తెలుసుకొని ఆమె ప్రాణాన్ని వదిలింది. కేవలం పతిభక్తివల్లనే ఆమెకు అతిలోకమైన యోగసిద్ధి లభించింది. ఆమె తన ఇష్టానుసారం ప్రాణత్యాగం చెయ్యగలిగింది. ఆమె ఇంత సిద్ధురాలని నేనుకూడా గ్రహింపలేక పోయాను.

"నేను తురీయం స్వీకరించిన వారంరోజులకి ఈవూరు వచ్చాను. ఆరోజు మీతండ్రి భిక్షావందనం చేస్తానని ముందుగా అన్నారు. కాని ఉదయం ఎనిమిదిగంటలకు వచ్చి

మీతండ్రి చెప్పాడు. మీఅమ్మ ప్రసవించినదనీ-పుత్రజననమనీ. నువ్వుపుట్టావు. నేనే నీ జాతకచక్రాన్ని వ్రాసిఇచ్చాను. మీ తండ్రితో ఆదినమే చెప్పాను. మీకుటుంబంలో బలంగా ఉన్న దైవభక్తి, సంప్రదాయనిష్ఠ, ఆధ్యాత్మికసాధన - ఈ నీ కుమారునివల్ల ఉన్నత శిఖరాలు చూస్తాయని. మీతాతగారు మీ పెత్తండ్రిగారు, నిన్న మీతండ్రి - అంతా తురీయాన్ని స్వీకరించి బ్రహ్మైక్యాన్ని పొందినవాళ్ళే. నేను చెప్పానుకదా ! నువ్వుకూడా సాధనలో ఉన్నత కక్ష్యలు సాధిస్తావు. మీ తండ్రి మూలాధారాది సహస్రాంతం గల స్థూలచక్రాలలోనూ భ్రూమధ్యంనుంచి ఉన్మన్యంతంగా ఉన్న సూక్ష్మచక్రాలలోనూ కేవలం బిందువునందూ శ్రీవిద్యానిధానమైన శ్రీచక్రాన్నీ, బ్రహ్మాండాన్ని, శ్రీదేవిని సామరస్యంగా భావించి భావనోపనిషత్ ప్రకారంగా బ్రహ్మపదార్థసాధనచేసి, అనితర సాధ్యమైన ఆధ్యాత్మికశక్తి ప్రవర్శించాడు. అంశుమంత దిలీపుల వంశంలో భగీరథుని వంటివాడవు నీవు. కాని నీకు మంత్రోపదేశం చేసే ఆచార్యులు వేరే ఉన్నారు. వారే నిన్ను స్వయంగా శిష్యునిగా స్వీకరిస్తారు. నాదగ్గర నువ్వు మంత్రదీక్ష తీసుకోవడం పొసగదు. కనుక నిన్ను నేను ఉద్ధరించడం ఏమిటి? నే నీ సాయంత్రమే దక్షిణదేశానికి వెళ్తున్నాను. అక్కడ నాకు ముఖ్యులైన స్వామివారొకరు తపస్సమాధిలో ఉన్నారు. వారు నాకొరకు నిరీక్షిస్తున్నట్లుగా ఇవ్వాళ ఉదయమే నాకు భాసించింది. తిరిగి నేనీప్రాంతానికి రావడమే జరుగకపోవచ్చు" అని

లేచి బయలుదేరారు. నారాయణరావు నందమ్మ ఒక్కసారి లేచారు. తన్ను అతిలోకస్పర్శయొక్క సౌఖ్యంలో నుంచి అకస్మాత్తుగా జాగరితంచెయ్యడంవల్ల - నందమ్మ 'అంభా' అన్నది. నారాయణరావుకి దుఃఖం ఉక్కిరి బిక్కిరై - తన అశౌచంవల్ల శ్రీవారి పాదాలు స్పృశించడానికికూడా వీలులేక పోయిందే అని - దూరాన్నుంచే పాదాభివందనంచేసి - కట్టలు త్రెంచుకుని వస్తున్న దుఃఖాన్ని ఆపుకుని నిల్చుండగా శ్రీవారు నారాయణస్మరణతో ఒక్కసారి వెనక్కుతిరిగి, అతన్ని ఆర్ద్రంగా చూచి - వెళ్ళిపోయారు.

# 10

మర్నాడు నిత్యకర్మ మొదలుపెట్టారు. మధ్యాహ్నానికి నారాయణరావు పెత్తల్లి వచ్చింది. ఆమెకు చిన్నతనంలో భర్త పోగా - తన ఏకపుత్రునుతో చెల్లెలు పార్వతమ్మదగ్గరనే ఉన్నది. ఆమె పార్వతమ్మగారు కవలపిల్లలు. ఆమె పార్వతమ్మ గారికంటె ఒక్కఘడియముందు పుట్టిందట. పార్వతమ్మగారి పురుళ్ళూ పుణ్యాలూ - అన్నీ ఆమె చేతిమీదుగానే నడచినాయి. ఆమె కుమారునికి పరమేశ్వరరావుగారే చదువుసంధ్యలు చెప్పించారు. అతడు చదువుపూర్తిచేసి చాల రోజుల్నుంచీ ఉద్యోగం చేసుకుంటున్నాడు. అతనితల్లి అతనిదగ్గరేఉంటున్నది. ఇప్పుడీ మరణవార్తలకు వచ్చింది. పార్వతమ్మగారి పిల్లలందరికి ఆమె పెంపుడుతల్లి. ఆమె వీళ్ళందరినీ తన సొంతబిడ్డ

ల్లాగానే పెంచింది. ప్రేమించింది. నారాయణరావుమీద ఆమెకు ప్రత్యేకాభిమానం. అతనికిన్నీ ఆమెపైన అంతే. ఆమె రావడం తడవుగా - నారాయణరావు ఆమె ఒడిలో తల దూర్చుకుని బావురుమని పట్టడానికి వీల్లేనట్లుగా ఏడ్చాడు. ఇంతవరకు దుఃఖాన్ని కొంత అదుపులో ఉంచుగున్న నారాయణరావు - ఇప్పుడు కట్టలు త్రెంచుకుని, ఏడవటం - అందరికీ ఆశ్చర్యం కలిగించింది. వెంకమ్మగారు (అది ఆమె పేరు) నారాయణరావుతో కలసి కొంతసేపుదుఃఖించి - కొంతసేపు అతన్ని బుజ్జగించి - మరికొంతసేపు అతని బాధ్యతలు పరామర్శించి - తరువాత కొంతసేపు అనునయించి - చివరకు అతన్ని దుఃఖం మరచిపోయేటట్లు చెయ్యటమేకాక - అతని ముఖంమీద మందస్మితం వచ్చేటట్లుచేసింది. ఆతడు తేరుకుని ఆమె ఒడిలోనుంచి లేచాడు.

కర్మకాండలు సలక్షణంగా జరిగినై. పన్నెండోరోజు ఆశీర్వచనం జరిగింది. బ్రాహ్మణ్యాన్ని సంభావించిన తర్వాత రమణయ్యగారు నారాయణరావుతో ఇట్లాఅన్నారు. "మీ అక్కయ్య పద్మావతమ్మ తాలూకు సొమ్ము రెండువందల రూపాయలు మీ నాన్నదగ్గర ఉన్నాయట. ఆ సొమ్ముపిషయం అడిగి తేల్చమని మీ బావ ముకుందరావు నన్ను ఈ పన్నెండురోజుల్నుంచీ వేధిస్తున్నాడు. సమయంకాదని నేనతన్ని ఆపాను. తండ్రిగారు మీకు ఈ ఇంటిని ఈ ఇంటికి ఎదురుగా ఉన్న పశుశాల ఆవరణాన్ని తప్ప ఇతరం ఏమిన్నీ మిగిల్చినట్లు లేదు. నాలుగో కుమార్తె పద్మావతమ్మ పెండ్లికిచేసిన అప్పుక్రింద ఈ

ఇల్లు తాకట్టుగా ఉన్నదని విన్నాను. మరి మీ బావ పట్టుదల చూడగా తన సొమ్ము ఇప్పుడే కావాలంటున్నట్లుగా ఉన్నది.''

నారాయణరావుకు ఏమి చెప్పడానికి పాలుపోలేదు. గంగాధరరావిచ్చిన వెయ్యిరూపాయలు, తాలూకా సిబ్బందివాళ్ళిచ్చిన రెండువందలు, వెంకటకృష్ణయ్యగారిచ్చిన రెండు వందలుకాక - మొదటిరోజు ఖనన దహనాలఖర్చు ఊళ్ళో బ్రాహ్మణ్యం వాళ్లే భరించారు. అంతేకాక కావలసిన బియ్యం చౌదరిగారే ఇచ్చారు. తనకు రొఖంగా మూడువందలు మాత్రమే ఖర్చయింది. తనకు ఎంతసొమ్ము వచ్చిందీ - ఎంత ఖర్చయింది ఎంతమిగిలిందీ - రమణయ్యగారికికూడ చెప్పలేదు. ముకుందరావుకి ఇవ్వవలసినసొమ్ము విషయంలో ఏమి ప్రస్తావించినా - అనుచితంగా ఉంటుందని - నారాయణరావు లేచి లోపలకు వెళ్ళి రెండువందలు తెచ్చి - తన నాలుగో అక్కగారు పద్మావతమ్మను పిల్చి ఆమె ఎదురుగా ఆ సొమ్మును ముకుందరావు చేతిలో పెట్టి రమణయ్యగారివంకచూచాడు. అంతా మౌనంగా ఉన్నా-నారాయణరావు ప్రదర్శించిన విజ్ఞతకు ఆశ్చర్యాన్ని పొందకపోలేదు. ఎవ్వరూ ఏమీ మాట్లాడలేదు. ఇంత సులభంగా తనకు సొమ్ము వస్తుందని ముకుందరావు భావించలేదు. ఏవో ఉపచారవాక్యాలు చెప్తుతారనీ - దానిపైన కొంతరగడ జరుపుదామనీ అతడు సిద్ధంగా ఉన్నాడు. అనుకోనివిధంగా సొమ్ము చేతికి రావడంతో అతడు తికమకపడి తన ఉద్రేకాన్ని ప్రదర్శించడానికి సావకాశం లేకపోవడంవల్ల ఆశాభంగమే

పొందాడు. అతని ముఖకవళికలకు ఏమిన్నీ అర్థంగాక వడ్డీ కావాలని అడుగుతాడేమోననీ నారాయణరావు భావించాడు. ఆ ఉద్దేశంతో అతడు ముకుందరావుతో "బావగారూ! మే మిప్పుడు ఆపత్తులో ఉన్నాం. ఆకారణంచేత వడ్డీ ఇచ్చుకో లేనందుకు మన్నించండి" అని అన్నాడు.

ఇది అంతా అక్కడనే ఉండి చూస్తూ - ఆలకిస్తూ - ఉన్న వెంకటనరసమ్మ అందుకుని "ఈ సొమ్ము మా తండ్రిగారు ముకుందరావుగారికి ఇవ్వవలసినబాకీకాదు. పద్మావతమ్మ పెళ్ళి లో బంధువులు పద్మావతమ్మకు చదివించిన రొఖపుకానుకల మొత్తం నూటడెబ్బై ఆరుకీ భర్తీచేసి నాన్నగారు ఇస్తానన్న రెండొందలూను. మనప్రాంతంలోనూ, మన బంధువర్గంలోనూ ఇట్లాంటి కానుకలమొత్తాలు తలిదండ్రులే వినియోగించు కుంటున్నారు. మళ్ళీ ఆ చదివింపులు చేసినవారి ఇళ్ళలో శుభ కార్యాలకు ఈ తలిదండ్రులే బాకీలు తీర్చాలికదా! మరి మాతండ్రిగారు మాత్రం ఆ కానుకల మొత్తాలకు పట్టీలుకట్టి మా మా వివాహాలకి మాకే ఇచ్చేశారు. పద్మావతమ్మ పెళ్ళి ప్పుడుకూడా, పట్టీకట్టి నూటడెబ్బైఆరురూపాయలు వచ్చా యనీ, మల్లుతోరణానికి వచ్చినప్పుడు పెళ్ళివారితో చెప్పేశారు. ఆ సొమ్ము రెండొందలుచేసి ఇవ్వాలని నాన్నగారి సంకల్పం. ఆమాటే చెబుతుండేవారు. ఇప్పుడు తమ్ముడు ఇవ్వనేఇచ్చాడు. అటువంటి ఈ సొమ్ముమీద వడ్డీలు కోరకుండా ఉండటమే శ్రేయస్కరం" అని అన్నది. ముకుందరావు చిన్నబుచ్చుకుని

తలవంచుకున్నాడు. అంతలో వెంకటనర్సమ్మ భర్త భీమనాథ రావు కల్పించుకుని, రమణయ్యగారివంక, వేంకటేశ్వరరావు వంక, ముకుందరావువంక, నారాయణరావువంక, నిల్చుని ఉన్న వేంకటనర్సమ్మ, పద్మావతమ్మ, వెంకమ్మగార్ల వంకచూస్తూ మెల్లిగా నాలుగు మాటలు అన్నాడు. "మామగారు అత్తగారు శాప గ్రస్తులైన దేవతామూర్తులు. శాపాంత కాలంలో సహజమైన దేవతాస్వరూపాలు స్వీకరించినట్లుగా నిర్యాణం పొందారు. వారిపైన ఇతరకులాలవారు, ఊళ్ళోజనం యావన్మందీ ప్రదర్శి స్తున్న గౌరవాభిమానాలు చూస్తే ఆత్మీయులమైన మనం అంతా తలవంచే టట్లుగా ఉన్నది. కనుక మనం ఆలోచించవల సింది ఈచిన్నపిల్లలనుగురించి, నారాయణరావు ఇద్దరుతమ్ములు, ఒక్క చిన్నచెల్లెలు - వీళ్ళందరిని ఎలా వృద్ధిలోకి తేవాలనీ, వీళ్ళని కనిపెట్టుకుని ఎవళ్ళుంటారనీ. నారాయణరావుకు ఏదైనా ఉద్యోగం దొరికేదాకా వీళ్ళ పోషణాభారం ఎట్లా జరగాలనీ. ఇంటిమీద రెండువేల రూపాయలు అప్పుఉన్నది కదా. దాన్ని ఎట్లా తీర్చాలి. ఇల్లు ఎట్లా నిలబెట్టాలి." ఈ మాటలు అందరూ విన్నారు. రమణయ్యగారుగాని, వెంకటే శ్వరరావుగాని, ముకుందరావుగాని ఏమీమాట్లాడలేదు. వెంకమ్మగారు, వెంకటనర్సమ్మ, పద్మావతమ్మ, నారాయణరావు వంకే చూస్తూఉన్నారు. అతడు తలవంచుకుని కూర్చున్నాడు. అంతా తనవంక చూస్తున్నారని గ్రహించి తలఎత్తి అందరి వంకాచూచి వెంకమ్మగారివంక తదేకదీక్షతో కొంతసేపుచూచి

కళ్ళలో నీళ్ళురాగా తుడుచుకొని కొంత రుద్ధకంఠంతో నారాయణరావు ఇట్లా అన్నాడు. "బావగారూ! మీకు మా తలిదండ్రులపైన విశేషమైన గౌరవం ఉన్నదని నాకు తెలుసు. మా అక్కయ్యకు మీకు నామీద అమితమైన వాత్సల్యం ఉన్నదనీ నాకు తెలుసు. మీ అందరి ఆశీర్బలంవల్ల నాకు ఉద్యోగం దొరక్కపోదు. తీవ్రమైన ప్రయత్నంచేస్తే - నల రోజుల్లో తప్పక దొరుకుతుంది. ఈలోగా ఫరవాలేదు. మేమంతా కలిసేఉంటాము. మా అమ్మగారు మాపెత్తల్లి వెంకమ్మగారిని మాకు అండగా ఉంచిపోయింది. ఆమె ఇక మమ్మల్ని కాపాడుతుంది. ఈ ఇల్లు అమ్మి అప్పుతీర్చి ఎదురుగా పశుశాలావరణలో చిన్న ఇల్లువేసుకుని కాలక్షేపం చేస్తాము" అని అన్నాడు. అతని సునిశ్చితమైన అభిప్రాయాలకూ, అతి ఋజురేఖగాఉన్న అతని ఊహాలకూ స్వల్పమైన ఆశ్చర్యంపొందినా.. అందరూ సంతోషమే పొందినట్లు వాళ్ళముఖాలే చెప్పినాయి. ముఖ్యంగా నారాయణరావు ఊహాలు వెంకమ్మగారికి చాలా సక్రమంగాఉన్నట్లు అనిపించింది. ఆపైన అంతా లేచారు. భీమనాథరావు, ముకుందరావు తమ తమ ఊళ్ళకు వెళ్ళిపోయారు. వెంకటనర్సమ్మ, ఆమె పిల్లలు, పద్మావతమ్మ (ఆమెకు పిల్లలులేరు) నెల మాసికంవరకూ ఉండటానికి నిశ్చయించుకున్నారు.

నారాయణరావు లేచి - లోపలికివెళ్లి కొంత విశ్రమించాడు. ఏమీతోచిందికాదు. సాయంకాలం పొద్దువాటారుతుండగా - తాము ధర్మకర్తలైన శివాలయానికి వెళ్ళి స్వామి

దర్శనంచేసి వద్దామని బయలుదేరుతుంటే - బయట ఎవరో పిలుస్తున్నట్లు తోచి వచ్చి చూచాడు. తాలూకాఫీసు జవాను. "ఏమిటని" నారాయణరావు అతణ్ణి అడిగాడు. అతడు వివరించాడు. 'కొత్తజిల్లాకలెక్టరుగారు నిన్నటినుంచీ దేవపురంలో క్యాంపు చేస్తున్నారట. వారు నారాయణరావును పిలిపించమన్నారుట' - అంటూ చెప్పి అతడు వెళ్ళిపోయాడు. నారాయణరావు అనుకున్నాడు - బహుశా కలెక్టరుగారు తనతండ్రిగారి ప్రశస్తి విని ఉంటారు. అందుచేత తన్ను పరామర్శించడానికి పిలిపించి ఉంటారు. ఇట్లా ఆలోచిస్తూ నారాయణరావు తమశివాలయానికివెళ్ళి స్వామి దర్శనం చేసుగున్నాడు.

# 11

నారాయణరావు అరగంటలో ముసాఫిరు బంగళాకు చేరాడు. అక్కడ విచారించగా తెలిసింది - జిల్లాకలెక్టరుగారు నాలుగైదు రోజులక్రితమే క్రొత్తగా ఛార్జి తీసుకొని నిన్న సాయంత్రమే కుటుంబసమేతంగా దేవపురం క్యాంపువచ్చారుట. ఈ మధ్యాహ్నమే టెలిఫోనులో వర్తమానంరాగా - ఏదో మీటింగుకి గాను మద్రాసు వెళ్ళారుట. ఆయన కుటుంబం మాత్రం ఇక్కడే ఉన్నారుట. దొరవారు లేరు గనుక నారాయణరావును ఎవరు పిలిపించారో తెలియదుట. ఇవి అక్కడ ఉన్న నౌకరు చెప్పినమాటలు. నారాయణరావు అతనితో తనకోసం తాలూకా జవాను వచ్చాడనీ ఇక్కడకు

రమ్మని చెప్పాడనీ పునరుద్ఘాటిస్తుండగా లోపల్నుంచి నౌకర్ని ఎవరో పిలిచారు. అతడు లోపలకు పరుగెత్తుకుని వెళ్ళాడు. వెంటనే తిరిగివచ్చి మిక్కిలి వినయంతో నారాయణరావుకి నమస్కరించి 'అమ్మగారు మిమ్మల్ని పిలిపించారట' అని లోపలకు రమ్మంటూ తీసుకువెళ్ళాడు. గుమ్మందాకా వచ్చి నౌకరు వెనక్కు వెళ్ళిపోయాడు.

నారాయణరావు లోపలకుపోగా - ఎదురుగా మహా సౌందర్యరాశియై మధ్యవయస్కురాలైన ఒక స్త్రీ కూర్చుని ఉన్నది. ఆమె అచ్చంగా ఒక దేవతామూర్తిలాగా పరమగంభీరంగా ఉండి తన్ను కూర్చోమని సంజ్ఞచేసింది. ఆమెను చూస్తుంటే నారాయణరావుకి తన తల్లిగారిని చూచినంత తృప్తిగా ఉన్నది. మనస్సు ఆర్ద్రమై కళ్ళు తడిఅయినాయి. ఆమె కూర్చున్న పద్ధతి - ఆ కన్ను ముక్కుతీరు - ఆ చేయి తిప్పిన వైఖరి నారాయణరావుకి ఏదో సుపరిచితంగా భాసించిందే కాని ఆమె ఎవ్వరో పోల్చుకోలేక పోయాడు. తన్ను కూర్చోమని చేసిన సంజ్ఞతో మాటాడీ మాటాడనట్లుగా చేసిన శబ్దావగాఢమైన ధ్వని అధికంగా శ్రవణపేయమై - అతిపరిచితమైన ధ్వనిగా ఉన్నదే కాని తన సర్వమైన బుద్ధిచేత ఆలోచించినా ఆమె ఎవ్వరో - తనకు గల పూర్వపరిచయం ఏమిటో నారాయణరావు పోల్చుకోలేక పోయాడు. ఇంతలో ఆమె మాట్లాడింది. 'బాబూ! నువ్వు నన్ను పోల్చుకున్నట్లు లేదు. నువ్వు నన్నిదివరకు చూడనేలేదు. నేను ఫతీమాతల్లిని.' ఈ

మాటలు కలిగించిన ఆశ్చర్యవిభ్రాంతినుండి నారాయణరావు తేరుకుంటుండగా ఆమె చెప్పింది. "పదిరోజులక్రితం మా వారికి రాజమండ్రి సబుకలెక్టరు పదవినుంచి, కృష్ణాజిల్లా కలెక్టరుగా ప్రమోషను వచ్చింది. వారంరోజుల క్రితమే మేమంతా బందరు వచ్చాము. నిన్న సాయంకాలమే ఈఊరు క్యాంపు వచ్చాము. ఈమధ్యాహ్నం మద్రాసునుంచి వర్తమానం రాగా వెంటనే ఆయన మద్రాసు వెళ్ళారు. రెండుమూడు రోజులకు గాని తిరిగిరారు. మీది ఈ ఊరనీ మీ తండ్రి గారికి తాలూకాఫీసులో ఉద్యోగమనీ ఫతీమా చెప్పగా తెలుసుకుని సాయంకాలమే తాశిల్దారుని మిమ్మల్ని గురించి అడిగాను. ఆయన చెప్పారు. మీ తలితండ్రులు పుణ్యమూర్తులనీ పన్నెండు రోజుల క్రితమే మరణించారనీ. నిన్ను పరామర్శిద్దామని నేను పిలిపించమన్నాను. మీ యింటికి వచ్చి పరామర్శించే ధైర్యం చాలక ఇక్కడికే నిన్ను పిలిపించినందుకు ఏమీన్నీ అనుకోకు" ఆమె దీర్ఘనిశ్వాసం చేసింది.

నారాయణరావుకి అమితమైన ఆశ్చర్యం కలిగింది. ఆమెను తా నిదివరకు చూళ్లేదు. ఇదే మొదటిసారి చూడటం. తనకూ, ఫతీమాకు మధ్య నడచిన అనురాగ కలాపం ఆమెకు తెలుసో లేదో? తనవెంట వాళ్లుకూడా తనఊరికే వచ్చారు. ఇది చూడగా భగవంతుడు తన్ను మహా కఠినపరీక్షకే గురి చేసేటట్లున్నది. ఈ ఈ ఊహాలతో ఆమె చేసిన దుఃఖోపశమన ప్రసంగానికి నారాయణరావు కృతజ్ఞతతో చెప్పుకుంటుండగా ఆమె

లేచి లోపలకు వెళ్ళింది. తాను లేచి వెళ్ళిపోవాలా కూర్చుం డాలా ? నారాయణరావుకు బోధపడలేదు. ఒకవేళ ఆమె మళ్ళీ తిరిగివచ్చి తన్ను సాగనంపుతుందేమో? ఇంతకూ షతీమా ఎక్కడున్నదో. ఆమెకూడా లోపల ఉన్నదేమో అని ఆలో చనలతో దుర్భరత అనుభవిస్తూ ఉండగా ఎవరో వచ్చిన చప్పు డునుబట్టి అతడు తేరుకుని చూడగా షతీమా నుంచుని ఉన్నది. షతీమా వేషధారణం చాలా నూతనంగా ఉన్నది. అచ్ఛంగా హిందూ స్త్రీలాగా ఆచారనైష్ఠికులైన బ్రాహ్మణుల స్త్రీవలె ఆమె దుస్తులు ధరించి ఉన్నది. ముఖము మీద కుంకుమబొట్టు పెట్టుకుంది. అంతకు మునుపే శిరస్స్నానము చేసినట్లుగా ఉంది. జారుముడి వేసుకొని ఉన్నది. ఆమె అతనికి దగ్గరగా నడచి అతడు ఈ వినూతన పరిస్థితివల్ల కలిగిన విభ్రాంతినుండి బయట పడక మునుపే అతని పాదాలు స్పృశించి కళ్ళకద్దుకుని దగ్గ రగావచ్చి కూర్చుంది. అతనికి ఏమి మాటాడవలసిందీ తోచ లేదు. ఆమె మాటాడింది. "ఈ సాయంత్రమే తాశిల్దారుగారి వల్ల మీ తలిదండ్రుల మరణ వృత్తాంతం మా తల్లిగారూ నేనూ విన్నాము. వారి పుణ్యచరిత్ర, దివ్యశీలం, నాకు అత్యా ధికమైన ఆనందాతిరేకాన్ని కల్గించాయి. అంతకుముందు మీరు నన్ను తృణీకరించారని నాకు కించిదాగ్రహం ఉండేది. మీ తలిదండ్రుల వృత్తాంతం వినగా మీరొక దివ్యపురుషునిలాగా నా మనస్సులో భావించి, మీవంటి దివ్యపురుషునిపై ప్రేమ కలిగించినందుకూ, మీతో పరిచయభాగ్యం ప్రసాదించినందుకూ

భగవంతునికి కృతజ్ఞతలు చెప్పుకున్నాను. చాలసేపు మీ తల్లి తండ్రుల వృత్తాంతం మననంచేసుకుంటూ ఏదో విచిత్రమైన అనిదంపూర్వకమైన ఆత్మీయతామగ్నమైన అనుభూతిపొంది చాలసేపు ఆ నూతనానుభూతిలో ఉండి - తేరుకొని - మళ్ళీ అనేక ఆలోచనలు చేశాను. మీ తల్లిదండ్రులు మిమ్మల్ని వదలి వెళ్ళి మిమ్ము దుఃఖంలో వదలినారని తలచుకొని నేనుకూడా దుఃఖాన్ని పొందాను. భావవ్యక్తంకాని దుఃఖాన్ని మ్రింగి, మీ తల్లిదండ్రులు నాకున్నూ ఆత్మీయులే గనక వారి మృతా శౌచ శుద్ధిగా శిరస్నానంచేసి తలతుడుచుకొని దుస్తులు ధరిస్తుం డగా మా అమ్మ చెప్పింది - మీరు తాను కబురంపగా వచ్చా రని. వెంటనే మీదగ్గరకు వచ్చాను.” ఈ మాటలు, ఈచేతలు నారాయణరావును విస్మయచకితుణ్ణి చేసినై. “ఈ మహమ్మదీయ వనిత ఎంత హైందవత్వ నిష్ఠగా మాట్లాడుతున్నది? తన తల్లి దండ్రుల మరణానికి ఆమె అశౌచ మనుకున్నది. తనకోసం ఆమె బ్రాహ్మణస్త్రీ వేషం ధరించింది. తనకు పాదాభివందనం చేసింది. ఆమె చేతలలోగాని, మాటలలోగాని ప్రేమ ప్రదర్శ నలోగాని తనకు ఎబ్బెట్టుగా ఏమీ అనిపించలేదు. ఆమెకు ఏమి సమాధానం చెప్పాలో తనకు తోచలేదు. ఆమె ప్రవ ర్తనలోని, మాటలలోని, హృదయపూర్వకత్వం, అచ్చపుతనం, అమాయికత్వం - అతనికి ప్రస్ఫుటంగా కనిపించి అతని హృద యాన్ని కదలించాయి. ఆమెకు తానుచేసింది అన్యాయమేమో నని భావనరాగా అతనికళ్లు చెమరించాయి. తుడుచుకున్నాడు.

తల్లిదండ్రులు జ్ఞాపకం రాగా అతడు కన్నులు తడిపెట్టుకున్నా డని ఆమె భావించి "మహాపుణ్యవంతులై, దేవతా సమాను లైన తల్లిదండ్రుల్ని ఒకేసమయంలో పోగొట్టుకున్న దుఃఖము మిగుల భారమైంది. మీకు జ్ఞాపకం చేసినందుకు నన్ను క్షమిం చండి" అని ఆమె చెబుతుండగా ఫతీమాతల్లి వచ్చింది. ఆమె "బాబూ! రేపు సాయంకాలం మే మిద్దరం మీ యింటికి వచ్చి చూస్తాము. నీవు తప్పుగా భావించవ్రుగదా!" అని అన్నది. ఆమాటలకు వేరే సమాధానం చెప్పడానికి వీల్లేక అతడు లాంఛనంగా "అట్లాగే రండి. మీవంటి పెద్దలకు మా పూరి గుడిసెలో తగినంత సత్కారము లభించకపోతే మన్నించాలి!" అని అన్నాడు. ఆమాటలు అని లేచి. ఆమెకు నమస్కరించి ఫతీమావంక కృతజ్ఞతా దృష్టులు చూచి శలవుతీసుకొని వెళ్లి పోగా - ఆ తల్లీ కూతుళ్లు, అతన్ని చూస్తూ అల్లాగే నిల్చుండి పోయారు.

# 12

ఆరాత్రి నారాయణరావుకి నిద్రపట్టలేదు. నాలుగైదు సార్లు లేచి నందమ్మను చూచి వచ్చాడు. నడిరాత్రి దాటిన చాలసేపటికిగాని నిద్దురపట్టలేదు. ఆ పట్టిన నిద్దుర అంతా స్వప్న సంకలితమే. తన తలిదండ్రులు దివ్యవిమానారూఢులై ఆకా శంలో సంచరిస్తున్నట్లు - తాను తన తమ్ములు చెల్లెలు గోదావరీ మధ్యలో ఒక చిన్న సైకతద్వీపంలో ఉన్నట్లు-ఒక దివ్యసింహా

సనంమీాద రత్నకిరీటం ధరించి ఒక దివ్య దేవతాస్త్రీ ఉచిత మైన వేషంతో ఫలీమూ కూర్చుని తనదిక్కుగా సుమధురహాస సుషమాకిరణాల్ని ప్రసరించునట్లు-తానొక మహాప్రళయకాల విజృంభమానసాగరగర్భంలో పడి ఈదులాడుతున్నట్లు - అనేక స్వప్నపరంపరలుగా రాత్రి సాగిపోయి - ప్రాతఃకాలంగా మూర టంతో నారాయణరావు మంచంమీాదనుంచి లేవవలసివచ్చింది.

తెల్లవారి స్నానంచేస్తూ ఉండగా తమ పురోహితుడు సీతారామయ్యగారువచ్చి "నాయనా! మీా తండ్రిగారు నిత్యం ఉపాసించిన దేవతార్చన నేను తీసుకొనవెళ్లి అర్చించాను. మీా నాన్నగారు మంచమెక్కిన రోజే మీా అమ్మగారు వర్తమానం పంపగా నేను వచ్చి తీసుకువెళ్ళాను. ఇదిగో తిరిగి తీసుకు వచ్చాను. త్వరగా స్నానంచేసివస్తే నేను దగ్గరఉండి ఈదినం నీచేత దేవతార్చన చేయిస్తాను" అని చెప్పగా నారాయణ రావు స్నానం ముగించి సంధ్యావందనం చేసివచ్చాడు. ఆ దేవతార్చన కైలాసప్రస్థార శ్రీచక్ర సహితమైన శివపంచాయ తనమనీ, అది వాళ్లింట దాదాపు పధ్నాలుగు పురుషాంత రాలుగా ఉపాసింపబడుచున్నట్లు తాను విన్నాననీ, అందులో వర్తులాకార సుందరమై కృష్ణవర్ణమయమై కూర్మాంగరాగ చిహ్నమై షట్చక్ర యుక్తమైన సాలగ్రామం ఉన్నదనీ, మహా రుణరాగ మూర్తిభావంగా శోణభద్రాప్రభవిత రత్నగర్భ గణపతి ప్రతీక ఉన్నదనీ - పుష్యరాగ సందీప్తమైన సూర్య ప్రతిమ ఉన్నదనీ 'నిత్యకళ్యాణశీలమైన అంబికా ప్రతిమా,

కైలాస ప్రస్థార శ్రీచక్రమూ ఉన్నాయనీ - అన్నిటికి మించి పరమసుందరమై శుద్ధస్ఫటిక సంకాశమైన శివలింగమున్నదనీ దానికి శిరోభాగాన లోపల నిత్యప్రజ్వలితంగా చిన్న వెలుగు రేఖ ఉన్నదనీ-అందుచేత దానికి చంద్రశేఖర బాణమని పేరున్నదనీ - సీతారామయ్యగారు వివరించారు. ఒక మహాంధకారంలో ఎవరో చేయిపట్టి త్రోవచూపుతున్నట్లుగా ఏదో దుఃఖపాథోధిలో ఒక ఆశాద్యోతకమైన తెప్ప కన్పిస్తున్నట్టుగా తోచి నారాయణరావు దేవతార్చన పూర్తిచేశాడు. ఇదే ప్రథమంగా పూర్వపురుషులు ఆరాధించిన మూర్తుల్ని ఆరాధించడం గనక సీతారామయ్యగారు నారాయణరావుచేత మహాన్యాసపూర్వక ఏకాదశరుద్రవారాభిషేకాన్ని శాంతియుక్తంగా అమ్మవారికి సహస్రనామావళితో మిగిలిన పంచాయతన దేవతలకు అష్టోత్తర నామావళులతో చేయించారు. ఇదివరకు తన చిన్నప్పటినుంచీ తండ్రిగారు దేవతార్చన చేస్తూండగా వింటున్నాడు. ఇప్పుడు ఏకాగ్రమైన మనస్సుచేత అదే మంత్రానుక్రమణిక వినగా తన పూర్వ పరిచయమంతా ప్రస్ఫుటమై తనకు కంఠస్థమైన మంత్రానువాకాలే స్మృతికి దెచ్చుకున్నట్లుగా నారాయణరావుకి అనిపించింది. అతనికి ఆశ్చర్యమైంది. ఇందుకోసమే పెద్దలు వేదపాఠాలు ఉదాత్తానుదాత్తస్వరాలతో ఉచ్చైస్స్వరంతో చదువుతారు కాబోలు. విద్యాగంధమంటే ఇదే కాబోలు అనుకున్నాడు. నాలుగురోజులు సాయంకాలం రుద్రం పాఠం చెయ్యమని చెప్పి పురోహితుడు వెళ్లిపోయాడు.

దేవతార్చన సంపూర్తి అయ్యేటప్పటికి వంట సిద్ధం అయిఉండటంచేత, భోజనంచేసి నారాయణరావు బయటకు వచ్చాడు.బయట వెంకట కృష్ణయ్యచౌదరిగారుకూర్చుని ఉన్నారు.ఆయన నారాయణరావునుచూచి లేచి"భోజనాలైనాయా?" అని ప్రశ్నించగా నారాయణరావు 'ఊ' అని తలఊపి ఎదురుగా ఉన్న గోశాలలోకి దారి తీశాడు. ఇద్దరూ గోశాల లోపలకు వెళ్ళారు. ఇద్దరూ నందమ్మ దగ్గరగా పోయి నిల్చున్నారు. నందమ్మ నారాయణరావును చూచి కొంత మారాము చేసింది. అతడు దానిని సమీపించి మూపురంమీద చెయ్యి వేసి, వీపుతడిమి దాని గంగడోలు సవరించి, మూతిని దగ్గరగా లాగి కౌగిలించుకోగా అతనికి దుఃఖము పొర్లివచ్చింది. తన తండ్రిగారు, ఆయన నందమ్మను అమితప్రేమతో పెంచడం జ్ఞాపకానికి వచ్చాయి. తేరుకొని, ఇంట్లోకివెళ్లి, వెంకటనర్సమ్మగారిని పిలుచుకుని వచ్చాడు. ఆమె నందమ్మకు పసుపుపూసి కుంకుమ బొట్టు పెట్టింది. పూలదండలు కట్టింది. ఎర్రనీరు దిగతుడిచి మంగళహారతి పట్టింది. నారాయణరావు దానికి కుడితినీరుపెట్టి, ఒక జనపకట్ట తినిపించాడు. ఇంటిలో పిల్లలూ, పెద్దలూ, వచ్చి అంతా ఒక్కొక్కరూ దానిని తాకి గంగడోలు సర్ది ముట్టెను దగ్గరకులాగి గ్రుచ్చి కౌగలించుకొని ఆర్ద్ర మనస్కులై కళ్ళు చెమరించగా అది పరమేశ్వరరావుగారి హృదయావిష్ట ప్రేమ వాత్సల్య దేవతగా భావించి ఎదలు పులకించగా నిస్సహాయులై దానిని చూస్తూ నిలబడిపోయారు. చివరకు నారాయణరావు

మెల్లిగా త్రాడువిప్పి నందమ్మను బయటకు తీసుకువచ్చాడు. అది పరమ భీరువుగా నారాయణరావు వెంట నడచింది. వెంకట కృష్ణయ్యచౌదరిగారు దాని వెనుకగా నడిచారు. మహాపెన్నిధానాన్ని పోగొట్టుకున్న పరమలుబ్ధునిలాగా ఇంట్లో ఉన్న పెద్దలు పిల్లలు నందమ్మ వెళ్లిపోతుండగా చూస్తూ నిలబడిపోయారు. నిలబడి కంఠగతమైన దుఃఖంతో వాపోయారు.

నారాయణరావు నందమ్మను మెల్లిగా అడ్డుత్రోవను తీసుకొనిపోయి వెంకటకృష్ణయ్యచౌదరిగారి గోశాల చేర్చాడు. అక్కడ చౌదరిగారి భార్య నందమ్మకు ఎర్రనీళ్ళు తీసి మంగళ హారతిపట్టి పసుపుకుంకుమతో పూలలో పూజించింది. చౌదరి గారు నందమ్మకు జనపకట్ట అందించారు. నారాయణరావు బయటకురాగా నందమ్మ 'అంబా' అని అరచింది, నారాయణరావు మళ్ళీ లోపలకువెళ్ళి నందమ్మ ముట్టెను కౌగిలించుకొని దుఃఖము నిలుపుకోలేక బావురుమన్నాడు. చౌదరిగారికి, ఆయన భార్యకూ కళ్ళనీళ్ళపర్యంతమూ అయింది. నారాయణరావు సంబాళించుకుని బయటకు వచ్చాడు. చౌదరిగా రతన్ని ఇంట్లోకి తోడ్కొనివెళ్లి కుర్చీలో కూర్చుండబెట్టి, కుశల ప్రశ్నాదికంచేసి, లేతకొబ్బరికాయనీరు దాహమిచ్చి, పొందూరు జరీపంచెలు కట్టబెట్టారు. నారాయణరావు "ఇవి ఎందుకూ" అని అన్నాడు. "నాయనా! నువ్వు నాకు అన్నగారి కుమారుడవు. గురుపుత్రుడవు. రక్తసంబంధం కాకపోయినా దానిని మించిన ఆత్మాభిన్న సంబంధం మనది. ముఖ్యులైన బంధువులు

ఆపద్దుఃఖంలో ఉండగా, నాలుగునాళ్లు ఇంటిలో ఉంచుకొని బట్టలు పెట్టడం ఆచారంకదా" అని ఆయన సమాధానం చెప్పగా నారాయణరావు తిరుగు చెప్పలేక కొంతసేపు కూర్చుండి క్రొత్తబట్టలతో తిరిగి ఇల్లుచేరాడు.

తలితండ్రులు మరణించినవేళ నక్షత్రం మంచిదికాక పోగా మూడునెలలు ఇల్లు వదలవలసి వచ్చింది. అది ఆ సాయంత్రం దీపాలుపెట్టు వేళలోగా చెయ్యాలి. నారాయణ రావు తిరిగి వచ్చేటప్పటికే తన తోబుట్టువులు, పెద్దతల్లి అవసర మైన ముఖ్యసామానులు గోశాలలోకి మార్చుట నారాయణ రావుగుర్తించాడు. సాయంకాలం ఇల్లు తాళంపెట్టుటకు అంతా సిద్ధంచేసి ఉంచారు. ఇంట్లో చిన్నభాగంలో అద్దెకున్న సాంబయ్యగారు, పరమేశ్వరరావుగారు మరణించిననాడే ఇల్లు ఖాళీచేశాడు. నారాయణరావు పెద్దతల్లితోనూ, తోబుట్టువుల తోనూ. కలెక్టరుగారి భార్య పరామర్శకు రావచ్చుననీ తగి నట్లుగా మర్యాదచేయమనీ చెప్పాడు. ఇంతలో బయట ఎవరో పిలుస్తున్నారని పద్మావతమ్మ చెప్పగా, నారాయణరావు బయ టకు వచ్చాడు. ఎదురుగా 'రేమల్లె రామస్వామి' అనే హరిజన నాయకుడు నుంచుని ఉన్నాడు. అతడు కాంగ్రెసులో చేరి స్వాతంత్ర్య సమరయోధుడై, శాసనసభ్యుడై రెండవ ప్రపంచ యుద్ధ సందర్భంగా, అందరు కాంగ్రెసు సభ్యులతోపాటు రాజీనామా ఇచ్చాడు. అతడుకూడ పరమేశ్వరరావుగారికి ముఖ్యుడని నారాయణరావుకి తెలుసును.

నారాయణరావును చూడగానే రామస్వామి నమస్కారం
చేసి, 'తండ్రిగారి సమాధివద్దకు పోదామురండి' అని అన్నాడు.
నారాయణరావు అతనికి ప్రతినమస్కారంచేసి అతని వెంట
నడిచాడు. ఇద్దరూ సమాధివద్దకు నడుస్తున్నారు. సాయంకాలం
అవుతున్నది. మహాకఠినుడై నిరంకుశుడైన ప్రభువు పరమ
కారుణికుడుగా మారినట్లు, సాయం సూర్యకిరణాలు అతి
ప్రసన్నంగా ఉన్నాయి. సమాధివద్దకు చేరగానే, రామస్వామి
సమాధికి ప్రదక్షిణీకరించి సాష్టాంగప్రణామంచేసి ఎదురుగా
కూర్చుని దుఃఖించాడు. నారాయణరావుకూడా తండ్రిగారి
సమాధికి ప్రదక్షిణంచేసి, సాష్టాంగప్రణామంచేసి లేచి నుం
చున్నాడు. సమాధికి తూర్పుగా చెఱువుకట్ట ఉన్నది. పడమటి
దిక్కున అస్తమిస్తున్న సూర్యకిరణాల వెలుతురులో సమాధి
నీడ అతిదీర్ఘమై చెఱువుగట్టుమీదవున్న మఱ్ఱిచెట్టు మొదటి
వరకూ ప్రసరించి ఉన్నది. రామస్వామి లేచి ఆనీడ కొన
భాగంలో మఱ్ఱిచెట్టు క్రిందగాపోయి కూర్చున్నాడు. నారా
యణరావుకూడా అతనిదగ్గరగా కూర్చున్నాడు. అతడు పద్మా
సనస్థుడై చాలసేపు మౌనంగా కళ్ళుమూసుకొని కూర్చు
న్నాడు. కొంతసేపు నాసాంతదృక్కుగా కూర్చున్నాడు. మళ్ళీ
కొంతసేపటికి లేచి ధరించిన దుస్తులు విసర్జించి కౌపీనధారియై
పునఃపద్మాసనస్థితుడై నారాయణరావుతో అన్నాడు.
"బాబయ్యా! రేపు చైత్రబహుళ అమావాస్య. రేపురాత్రి
ఏడుగంటల తర్వాత మీరు ఇక్కడికి రండి. మీతో కొంత

ప్రస్తావించాలి. ఇక నేటికి వెళ్ళిరండి!" అని నిమీలిత నేత్రుడు కాగా నారాయణరావు మానసికంగా అతనికి నమస్కరించి తండ్రిగారి సమాధికి నమస్కరించి, తాము వంశపారంపర్యా ధర్మకర్తృత్వము వహిస్తున్న శివాలయానికి వెళ్లి ప్రదక్షిణము చేసి లోపలకు వెళ్లాడు. అక్కడ ఆనాడు మాసశివరాత్రి అవటంవల్ల ఆసమయంలో పూర్ణాభిషేకం పూర్తయి మంత్ర పుష్పం జరుగుతున్నది. తమ కులదైవమైన ఉమామహేశ్వ రుడు తనయందు మిక్కిలి ప్రసన్నుడుగా నారాయణరావు భావించుకుని నమస్కరించాడు. తీర్థప్రసాదాలు స్వీకరించి ముఖమంటపంలోకి వచ్చి కూర్చున్నాడు.

ఇది అతని ముత్తాతగారు కట్టించిన ఆలయం. దానికి ప్రస్తుతం సుక్షేత్రమైన నూటఇరవై ఎకరాల భూవసతి ఉన్నది. ఇదివరకొకసారి ప్రభుత్వంవారు ఈ ఆలయాన్ని దేవాదాయ ధర్మాదాయ చట్టంక్రింద స్వాధీనం చేసుకోవాలని ప్రయత్నిం చారు. అప్పుడు పరమేశ్వరరావుగారి అన్నగారు బ్రతికి ఉన్నారు. ఆయనే అప్పుడు ధర్మకర్త. ఆయన కోర్టుకివెళ్ళి, ప్రభుత్వంమీద దావాలు నడిపి, ఆలయాన్ని ప్రభుత్వంవారి స్వాధీనం కాకుండా రక్షించుకున్నారు. అన్నగారు మరణించిన తర్వాత పరమేశ్వరరావుగారే ధర్మకర్త అయ్యారు. పరమేశ్వర రావుగారి అన్నకుమారుడు భార్యతరఫున ఆస్తిరాగా దూర గ్రామంలో ఉంటున్నాడు. అతనికి దేవపురంలో ఆస్తి ఏమీ లేదు. ఈమధ్య అతడు దేవపురం రానేలేదు. పిన్నతండ్రి పర

మేశ్వరరావుగారు పోయినప్పుడే రాలేదు. ఇక ఆలయ ధర్మ కర్తృత్వం నారాయణరావు నెరపవలసినదే. ఈ అన్నివిషయాలు నారాయణరావు మనస్సులో మెదలినై. తనకు సెంటు భూమిలేదు. భారమైన కుటుంబమున్నది. తమస్వామి బహు ధనవంతుడు. తాను కడుపుపట్టుకొని అన్నార్థియై దేశాటనం చెయ్యవలసి వచ్చునట్లుగా ఉన్నది. మరి తాను ఉన్న పరిస్థితులతో ఆలయ ధర్మకర్తృత్వాన్ని నిర్వహించగలడా? ఈ విషయాలు మనస్సులో పరిభ్రమించి, మళ్ళీ దుఃఖాన్ని కలిగించి, కొంత కలవరపెట్టినై. నారాయణరావు చాలాసేపు ముఖమంటపంలో కూర్చుని నందీశ్వరుని పృష్ఠభాగాన్ని చూస్తూ ఏమీ తోచక కూర్చుండి చివరకు లేచి పురోహితుని యింటికి వెళ్ళి రుద్రపాఠంచేసి రాత్రి ఇంటికి చేరాడు.

# 13

సాయం సంధ్యావందనం ముగించి, భోజనంచేసి, గోశాలావరణంలో నారాయణరావు బయట మంచంవేసుకుని కూర్చున్నాడు. పిల్లలు అంతా నిద్రపోతున్నారు. వెంకమ్మగారు వెంకట నర్సమ్మ, పద్మావతమ్మ పనులు ముగించుకుని ఇంకో మంచం తెచ్చి నారాయణరావుకి దగ్గరగా వేసుకుని కూర్చున్నారు. వెంకట నర్సమ్మ నారాయణరావుతో చెప్పటం మొదలుపెట్టింది. "నారాయణా! నువ్వు చెప్పినట్లు ఇందాక సాయంత్రం పెద్ద కలెక్టరుగారి భార్య కుమార్తె మనింటికి వచ్చారు. నాన్నగారి

సజ్జనత్వం కారణంగా మనల్ని పరామర్శించడానికి వచ్చారని మేము అనుకున్నాం. కాని తరువాత అంతా తెలిసింది. ఆమె మహా ప్రజ్ఞావంతురాలు. అఖండమైన తెలివితేటలు ఉన్నాయి ఆమెకు. నాకూ పద్మావతికీ మంచి కంచి పట్టుచీరెలు రెవికలు తెచ్చింది. మన చెల్లెలుకి పట్టుపావడా తెచ్చింది. పసుపు కుంకుమ తెచ్చింది. పళ్లు తెచ్చింది. ఆ అట్టహాసం చూస్తే మాకేమీ అర్థంకాక తికమక పడ్డాము. ఆమె అతి గౌరవంగా అతి మృదువుగా అమిత హృదయస్పందిగా పరామర్శ చేసింది. కొంతసేపు మన తల్లిగారిని తండ్రిగారికి పొగడింది. తాను విన్న ప్రశస్తిబట్టి వారి గుణగణాల్ని కీర్తించింది. తరువాత పిచ్చాపాటీలోకి దిగాము. ఆమె తన చరిత్ర చెప్పింది. తను హైందవ స్త్రీయై, బ్రాహ్మణ బాలికయై, ప్రేమకొరకు మహమ్మదీయుణ్ణి ఎట్లా పెళ్ళాడినదీ చెప్పింది. ఆమెకూడా పెద్దపెద్ద చదువులు చదివిందట. ఆ తరువాత కొంచెం కొంచెంగా సంగతులు బయటపెట్టింది. ఆమె కుమార్తె ఫతీమాకు నీమీద అనురాగంట. నిన్ను తప్ప వేరెవ్వరిని వివాహం చేసుకోనంటున్నదట. నువ్వేమో ఆమె ప్రేమను ఇదివరకే తృణీకరించావుట. మన వంశ వృత్తాంతాలు విన్నప్పటినుంచీ ఫతీమాకు నీమీద ప్రేమ గౌరవాలు అధికం అయ్యాయిట. ఇతరుల్ని వివాహం చేసుకోవడంకంటే ఆమెకు మన ఇంట్లో దాసిగా ఉండటమైనా ఇష్టమేనట. నన్నూ, పద్మావతినీ, పెద్దమ్మను మరీమరీ ప్రాధేయపడి ప్రార్థించింది. తన కుమార్తెను ఎలాగైనా రక్షించమని. తరువాత

వెంకమ్మగారు కల్పించుకుని 'నాయనా! ఆ పిల్ల బ్రాహ్మణుల పిల్లలాగానే ఉందిరా! మహాలక్ష్మీదేవిలాగా ఉన్నదిరా! అచ్చంగా మన పిల్లలాగా బొట్టుపెట్టి, కట్టుకట్టిందిరా! ముఖం చాలా శోభగా ప్రసన్నంగా ఉన్నదిరా. బ్రాహ్మణపిల్ల కాదు కాని నీకు అన్నివిధాలా తగిన వధువురా! నీకు తగిన ఉత్తమ శీలవంతురాలుకూడా ననిపిస్తున్నదిరా! ఆమె తన జీవితాన్ని నీకై త్యాగం చెయ్యడానికి సర్వసిద్ధంగా ఉన్నదిరా! మరి ఆ ఉత్తమురాలిని అమ్మవారు ఎలా రక్షిస్తుందోరా' అన్నది. నారాయణరావు ఏమీ సమాధానం చెప్పలేదు.

# 14

అనుష్ఠానం ముగించుకొని, భోజనంచేసి, నారాయణరావు పోస్టాఫీసుకివెళ్ళి అక్కడ దేవాదాయశాఖ అధిపతికి రిజిష్టరు ఉత్తరంవ్రాసి పంపాడు. తమదేవాలయాన్ని ఒకవారం రోజులలోగా స్వాధీనంచేసుగోమని. పోస్టాఫీసులో పనిముగించుకుని బయటకు వస్తుంటే అతనికి జ్ఞాపకంవచ్చింది ప్రక్కనే ముసాఫిరు బంగళా ఉన్నదని. ఆ దెసగాచూచాడు. ఆబంగళాలో వరండాలో ఫతీమాతల్లి నుంచుని తనవైపే చూస్తూ ఉన్నది. అతడు ఆమె వంకచూడగా ఆమె అతడిని రమ్మనమని సైగ చేసినట్లుగా ఉన్నది. అతడు అప్రత్నంగా ఆమె దగ్గరకు వెళ్లాడు. ఆమె అతణ్ణిలోపలకు తీసుకొనివెళ్ళి కూర్చోపెట్టినది. ఇంతలో ఫతీమా ప్రవేశించగా తల్లి ఇంకోగదిలోకి వెళ్ళి

పోయింది. ఫతీమా మునుపటిలాగానే హైందవస్త్రీలాగానే ఉన్నది. ఆమె రాగానే సరాసరి నారాయణరావు పాదాలకు వచ్చి వందనంచేసింది. పాదాభివందనం చేసినది అట్లే అతని పాదాలు కౌగిలించుకుని వెక్కి వెక్కి ఏడ్చింది. నారాయణరావుకు ఏమిన్నీ పాలుపోలేదు. నారాయణరావు ఆమెను చేతుల్తో లేవదీసి ప్రక్కనకుర్చీలో కూర్చుండబెట్టవలసి వచ్చింది. కూర్చోబెట్టడమే కాకుండా తత్కాలోచిత ఉపశమన వాక్యాలు కూడా చెప్పకతప్పలేదు. నారాయణరావు అన్నాడు. 'ఊరికే కారణం లేకుండానే దుఃఖపడతావెందుకు ఫతీమా?' ఆమాటలకు కొంత ఉపశమనం పొంది ఆమె చెప్పింది. "మీ విషయం ఆలోచిస్తే మీరు ప్రత్యక్ష దేవతా పురుషులని అవగాహన అయింది. మీవైఖరిచూస్తే నాతలిదండ్రుల మతంకారణంగా నన్ను మీరు స్వీకారయోగ్యంగా భావిస్తున్నట్లు తోచడం లేదు. నా మనస్సుపూర్తిగా మీమీదనే ఉన్నది. ఇప్పుడు తెలిసింది నాకు భారతీయస్త్రీకి పతే ప్రత్యక్షదైవం అంటే ఏమిటో. నన్ను నేను మీకిదివరకే దత్తంచేసుగున్నాను. మరి మీరు నన్ను స్వీకరించకపోతే నేనేమికావాలి? నాకు గతి ఏమిటి? ఈ తలి తండ్రులబిడ్డగా జన్మించడమే నా దోషమా? అది నావల్ల జరిగిన తప్పుకాదే? వాళ్ళమతమే నా మతమా? నేను నా ఇష్టమైన మతాన్ని స్వీకరించడానికి నాకు హక్కు లేదా? నాకు పరమదైవమైన నా భర్తమతమే నా మతమెందుకుకాకూడదు? అయినా కులం మతం దేనికి సంబంధించినవి?

దేహానికా? మనస్సుకా? ఆత్మకా? ఆత్మకూ, మనస్సుకూ కుల మేమిటి? మతమేమిటి? శౌచాశౌచభావాలేమిటి? ప్రేమ, భక్తి గౌరవాలు మానసికమైన విషయాలు. రస భావ భాసా భాస స్థితులుకూడా మనోవిషయాలేకదా? పురుషుని పతిగా స్వీకరించుట మానసికంగా జరిగితే అది సంపూర్ణ స్వీకరణంకాదా? మనస్సులో ఆ స్వీకరణభావం స్థిరంగా నిత్యంగా చెయ్యడమే కదా జీవితంలో స్త్రీ భర్తయందు చెయ్యవలసినది? అన్ని మతాలలోనూ వివాహతంత్రాంగం ఉన్నది. దాని ఆంతర్యం ఇంతేగా! ఆ సుస్థిరభర్తృభావం, ఆత్మబలముచేత సర్వ మనోవాక్కాయములచేత స్వీకరింపబడగా, దానిని ఎందుచేత గుర్తింపకూడదు? ఈ పదిహేనురోజులనుంచీ మాతల్లిగారి దయతో నేను భారతీయస్త్రీ అంటే ఏమిటో తెలుసుగున్నాను. ఆమెకు భర్త అంటే ఎట్టి ఆరాధనామూర్తో తెలుసుకున్నాను. నేను మిమ్మల్ని నా ఉపాసనామూర్తిగా ఎన్నుకున్నాను. దీనికి మీ అభ్యంతరం ఏమున్నది? అసలు ఈ స్వీకరణకు మీ ఇష్టానిష్టాలతో ప్రసక్తిలేదేమో" ఈ మాటలు ఆమె నారాయణరావువంక చూస్తూ అన్నది. నారాయణరావుకి ఉక్కిరిబిక్కిరి అయింది. కొంత యాదృచ్ఛికంగా, కొంత లౌకికంగా, కొంత ఆలోచనావృతంగా నారాయణరావు సమాధానం చెప్పడానికి ప్రయత్నించాడు. 'తాను బహుకుటుంబీకుడు. ఇంకా పైకి తీసుకురావలసిన తమ్ములిద్దరూ ఒక చెల్లెలూ ఉన్నారు. తను లౌకిక మార్గంలో గాడితప్పితే, తనపై ఆధారపడిన ఈ చిన్న

పిల్లల జీవితాలు వక్రమార్గాలు పట్టినాయి. వాళ్ళందరినీ సక్రమంగా అభ్యుదయమార్గంలో పెట్టవలసిన బాధ్యత తన కున్నది. తన తండ్రిగారి గౌరవప్రతిష్ఠలవల్ల వారికి సంఘంలో లభించిన స్థానాన్ని పోగొట్టే హక్కు తనకు లేదు. తను ఏకాకి కాదు. తన సోదరులమూలంగా, తోబుట్టువులమూలంగా, వాళ్ళయందు తాను నిర్వహించవలసిన బాధ్యతలమూలంగా యథేచ్ఛావిహారం చెయ్యలేదు. తనకు షఠీమాపైన ఎంతగౌరవమున్నా - ఆమె పాతివ్రత్యంపైన ఎంత మన్నన - ఎంతనమ్మకం ఉన్నా, తాను తన పరిస్థితులలో చేయగల్గిందిలేదు. తాను ఇంత ఉత్తమురాలిని, శీలవతిని, వివేకవతిని, విద్యావతిని, వినయగుణసంపన్నురాలిని, తన్ను పరదైవంగా ఆరాధిస్తున్న దానిని, పోగొట్టుకుంటున్న మందభాగ్యుడు. ఇంతకూ ఇందులో ఏదో భగవన్నిర్ణయం ఉన్నట్లుగా ఉన్నది. ఉభయులూ భగవన్నిర్ణయాన్ని శిరసావహించడం కన్నా చేయగలిగింది లేదు. ఈ భావాలు అతి శాంతంగా అతిమృదువుగా అనునయంగా నారాయణరావు వ్యక్తపరిచాడు. ఐనా ఆభావాలు షఠీమాను మిక్కిలి గాయపరచినై. ఆమె ఉద్విగ్నహృదయ. ఈమాత్రానికే విపరీతంగా చలించిపోయింది. ఆమె నారాయణరావుతో అన్నది. "ఐనా మీకోసం జీవితాంతకాలందాకా కనిపెట్టుకుని ఉంటాను ఉపాస్యదైవం వరమిచ్చేదాకా తపస్సు చెయ్యవలసిందేకదా! మీకు ఎప్పటికి దయకలిగినా సంతోషమే" ఆమె ఈమాటలు చెబుతున్నప్పుడే నారాయణరావు లేచి

కళ్లు తుడుచుకుని నేను వెళ్ళివస్తానని చెప్పి వెనక్కు తిరిగి చూడకుండా నడచివెళ్ళిపోయాడు. ప్రక్కగదిలో ఉండి ఇదిఅంతా పర్యాలోకిస్తున్న ఫతీమాతల్లి, ఫతీమా బయటకువచ్చి అతడు పోతున్నంత దూరం అతడు కన్పించినంతసేపు కన్పించినంత దూరం చూస్తూ నిల్చుండి అట్లాచూస్తూచూస్తూ నిట్టూర్పులు విడుస్తూ చివరకు లోపలకు వెళ్ళిపోయారు.

# 15

నారాయణరావు సాయంత్రం రుద్రపాఠం ముగించుకుని, తమ దేవాలయానికి వెళ్ళి స్వామిదర్శనంచేసుగుని, ఇల్లు చేరి, అనుష్ఠానానంతరం భోజనంచేసి, విశ్రమిస్తూ ఉండగా రేమల్లె రామస్వామిసంగతి జ్ఞాపకంవచ్చింది. వెంటనే లేచి పైబట్టవేసుకుని చెఱువుగట్టుకి పోయాడు. అక్కడ తండ్రిగారి సమాధికి నమస్కరించి మఱ్ఱిచెట్టుక్రిందకు వెళ్ళాడు. అక్కడ నిన్న తను వదలివచ్చినప్పుడు ఎట్లా ఉన్నాడో - ఇప్పుడూ రామస్వామి అట్లాగే కూర్చుని ఉన్నాడు. అతడు నిమీలిత నేత్రుడై పద్మాసనంలో ధ్యాననిష్ఠుడై ఉన్నట్లుగా ఉన్నాడు. అతనిచుట్టూ చాలామంది హరిజనులు కూర్చునిఉన్నారు. చెఱువుగట్టుమీద ఆ ప్రదేశమంతా పరిశుభ్రం చేయబడి ఉన్నది. రామస్వామికి దగ్గరగా నాలుగైదు దీపాలు ఉంచబడి ఉన్నాయి. అక్కడ కూర్చునిఉన్న హరిజనులు నారాయణరావును చూడగానే లేచి నిల్చుని నమస్కరించారు. అక్కడ

రామస్వామికి దగ్గరగా పరచిఉంచిన తాటిఆకుల చాపమీద కూర్చోమన్నారు. నారాయణరావు కూర్చున్నతర్వాత - వాళ్ళంతా కొంచెం కొంచెం దూరంగా కూర్చున్నారు. వాళ్ళందరిలో వయసుచేతా అనుభవంచేతా పెద్దవాడైన ధర్మన్న నారాయణరావుతో ప్రసంగించాడు. "దొరా! రామస్వామి నిన్న ఎప్పుడు వచ్చాడో-ఇక్కడ పెద్దయ్యగారి సమాధి కెదురుగా ధ్యానంలో ఉన్నాడు. మావాళ్ళు ఇవ్వాళ పొద్దునే చూశారు. అప్పటినుంచీ రామస్వామి కళ్ళు తెరవ లేదు. మావాళ్ళు కనిపెట్టుకునే ఉన్నారు. రామస్వామికి మన హరిజనవాడలో ముఖ్యబంధువులు లేరు. కాని అంతా సన్నిహితులైనవాళ్ళే. రామస్వామి తను కుటుంబానికి ముఖ్యుడని మా అందరికీ తెలుసును గనుక అతడు వచ్చి ఇట్లాధ్యానంలో పెద్దయ్యగారి సమాధిదగ్గర కూర్చుని ఉన్నాడని మీకు కబురు పంపుదామని అనుకుంటున్నాము. ఇంతట్లో మీరేవచ్చారు. రామస్వామి నాలుగు నెలల క్రితం గాంధీగారిఉద్యమంలో జెయిలుకు వెళ్ళాడు. ఎప్పుడు వదలిపెట్టారో ఎప్పుడు వచ్చాడో ఎట్లావచ్చాడో తెలియదు." ఈమాటలు చెబుతుండగా రామస్వామి కళ్ళు తెరచాడు. అందరూ నిశ్శబ్దంగాఉన్నారు. రామస్వామి అందరి వంకా చూస్తూ మాట్లాడాడు. "అన్నలారా! నేను నిన్నసాయంకాలం వచ్చాను. ఇక ఇక్కడనే ఇట్లాగే ఉంటాను. నాగురించి మీరేమీ బాధపడకండి. నాకేమీ అక్కర్లేదు. మీరంతా వెళ్ళి మీమీ పనులుచూసు

కోండి. రావాలనుకుంటే భోజనాలుచేసి ఒకళ్ళిద్దరురండి. అంత వరకూ నేను అయ్యవారితో మాట్లాడుతూ ఉంటాను.'' అని చెప్పాడు. వాళ్ళు అంతా మెల్లిగాలేచి నారాయణరావుకి నమస్కరించి వెళ్ళిపోయారు. నారాయణరావుకి రామస్వామికి నమస్కారము చెయ్యాలనిపించింది. లౌకికమర్యాదలలో ఏమి చెయ్యాలో తెలియక తికమకలు పడ్డాడు. రామస్వామి చిరు నవ్వునవ్వి నారాయణరావు వంకచూస్తూ అన్నాడు. ''దొర గారూ! నేను మీతండ్రిగారి సేవకుణ్ణి. నేను మీకుకూడా సేవకుణ్ణే. నేను గాంధిగారి సేనలోపడి స్వాతంత్ర్యసమరంలో ఉంటూ హరిజనోద్ధరణకు కృషిచేస్తూ పదిహేనేళ్ళుగా సరిగా మనఊళ్ళో ఉండటంలేదు. అంచేత నన్ను మీరు బాగా గుర్తించ లేరనుకుంటాను. నేనెక్కడఉన్నా, ఏంపనిచేస్తున్నా, నాగురువు, నాయజమాని మీతండ్రిగారే. ఆయనే నన్ను దేశ సేవకు ప్రోత్సహించారు. మీతండ్రిగారు సర్వశాస్త్రరహస్య వేత్త. ముఖ్యంగా దార్శనిక విషయాలలోనూ, యోగశాస్త్రం లోనూ, ఆయనకు తెలియని విషయంలేదు. ఆయన సమయ దక్షిణాచారపరిశుద్ధమూర్తి. ఐనా ఆయన పాంచరాత్రాగ మాలు, శైవాగమాలు, వామాచార తంత్రగ్రంథాలు, దూర్వాసపరశురామ దత్తాత్రేయ కల్పసూత్రాలు కూలంక షంగా పరిశీలించారు. మంత్రశాస్త్రానికి మీఇల్లు పుట్టిల్లేమోనని పిస్తుంది. మీకుటుంబంలో పదితరాలవారి గాథలు నేను విని ఉన్నాను. అందరికీ మీతాతగారివరకూ ఏకపుత్త్రసంతానమే.

మీతాతగారికిమాత్రం ఇద్దరుకుమాళ్ళు. మీతండ్రిగారూ పెత్తండ్రిగారూ. అంతా మహాపండితులు. సర్వశాస్త్రపారంగతులు. మంత్రశాస్త్ర స్వరూపులే. మీ పెత్తండ్రిగారుమాత్రం ఎందుచేతనో మంత్రశాస్త్రంమీద అభిమానం త్యజించి కేవల జ్ఞానిగా తత్త్వచింతనలో గడపుతూ నిష్కామయోగులై తురీయం స్వీకరించారు. మావంశంలో పదితరాలుగా మేము మీకు సేవకులుగా ఉన్నాము. మా ఇంట్లోనూ మాతండ్రి దాకా అందరికీ ఏకపుత్ర సంతానమే. నాకు సంతానమే లేదు. మాపూర్వులందరికీ ఒక్కొక్కరే దొరలు. నాకు మీపెత్తండ్రి గారు, మీతండ్రిగారు ఇద్దరుదొరలు. నాకు చిన్నప్పటినుండి మీతండ్రిగారిమీదనే ఎక్కువభక్తిగా ఉండేది. ఆయన్నే కొలిచాను. మీపెత్తండ్రిగారు నన్ను పట్టించుకోనూ లేదు. నేను ఆయన్ను సేవించనూ లేదు. మీతండ్రిగారికి అనేకమంది శిష్యులు. వేంకటకృష్ణయ్య చౌదరిగారు, కృష్ణస్వామిగారు, ఆయన శిష్యులే. ఈఊళ్లో అనేకమంది ఆయనదగ్గర ఏదో ఉపదేశం పొందినవాళ్ళే. ఆంధ్రదేశంలో శ్రీవిద్యోపాసకుల్లో ఆయన సిద్ధమూర్తి. అనేకమందికి పూర్ణదీక్ష ఇచ్చారు. ఆయన పరదేవతా స్వరూపమని నావంటివారి నమ్మకం.

మీతండ్రిగారికి నాకూ ఉన్న అనుబంధం చిత్రమైనది. అసలు మాకుటుంబానికీ, మీవంశానికీ ఉన్న సంబంధమే చిత్రమైనదేమో. అవిచ్ఛిన్నమైన అనుబంధం నాతో తెగిపోతూన్నది. నాకు చిన్నప్పుడే భార్య మరణించింది. గాంధీగారి ఉద్య

మాలలో జైలుకు పోవడంలో నాకు తిరిగి వివాహంచేసుకో వడానికి పురుషత్తు దొరకలేదు. నేను నిస్సంతును. మాతండ్రి మీతాతగారిని సేవించినట్లే నేను మీతండ్రిగారిని సేవించాను. మీతాతగారు మాతండ్రికి బోధించినట్లుగా-నాకు మీతండ్రి గారు అనేకములైన మహావిద్యారహస్యాలు బోధించారు. మీతండ్రిగారికృపవల్ల నాకు దార్శనిక విషయాలు అన్నీ తెలుసు. కౌలతంత్రగ్రంథాల్లో ఉన్న సర్వవిషయాలూ అవ గాహన అయినాయి. హఠయోగం, రాజయోగం నాకుయిష్ట మైనవి. ఇదంతా మీతండ్రిగారికి నా పైన ఉన్న వాత్సల్య కటాక్షాలేకారణంగా లభించినవి. వారు నన్ను సంపూర్ణంగా అనుగ్రహించారు. మీపూర్వ పురుషులు మహామంత్రసిద్ధులై శుభాగమపంచక ప్రతిపాద్యమైన సమయ దక్షిణాచారమును ప్రచారంలో నిల్పి రక్షిస్తుండగా తత్సేవకులమైన మేము సర్వ వామాచార నిష్ణాతులమై, నిగూఢ పాండిత్య ప్రబుద్ధులమై వారిని సేవించుకుంటూ పరిచారకులుగా ఉండేవాళ్ళమట.

మీ వంశంలో పూర్వ పురుషుల్ని గురించి అనేక గాథ లున్నాయి. మీ ముత్తాతగారిని గురించి వినండి. ఆయన భైరవమూర్తిగారు. మంత్రశాస్త్రంతోపాటు ఆయన సంగీత సాహిత్య భరతశాస్త్రనిష్ణాతులు. మంత్రశాస్త్రంలోనూ, తర్క వ్యాకరణ వేదాంత అలంకారిక శాస్త్రాలలోనూ, భరతం లోనూ, వారిదే సభా ప్రథమతాంబూలం. ఆయనను మైసూరు, విజయనగరము, జయపూరు, బరోడా, దర్భాంగా

వంటి సంస్థానాధిపతులు ఆహ్వానించి మహాగౌరవాలు చేశారుట. ఆయన్ను మాతాత శోభనాద్రి సేవించాడు. ఒకసారి నూజివీటి సంస్థానాధిపతులు ఆకిరిపల్లెలో శ్రీ శోభనాద్రిస్వామివారి కల్యాణోత్సవాలకు వీరిని ఆహ్వానించారుట. మాతాత శోభనాద్రి ముందునడవగా ఆయన ఆకిరిపల్లెవెళ్ళారుట. ఆకిరిపల్లె కాలి నడకను మనఊరికి ఐదామడలు. వైశాఖపూర్ణిమకు కల్యాణోత్సవాలు. వైశాఖ బహుళ పాడ్యమినాడే భైరవమూర్తిగారి తల్లిగారితిథి. ఐనా ఆరాత్రి కల్యాణోత్సవాలు చూచిరావచ్చునీ ఆ సంస్థానాధిపతుల ఆహ్వానం త్రోసిపుచ్చలేకా! భైరవమూర్తి గారు కళ్యాణోత్సవాలకు వెళ్ళారుట. అక్కడ ఆకిరిపల్లెలో ఒకసత్రంలో చూడవచ్చిన బ్రాహ్మణులకు భోజనవసతి ఏర్పాటు జరిగినది. ఆహూతులైవచ్చిన నైష్ఠికులకు, స్వయం పాక వ్రతాలున్నవాళ్ళకైనా ప్రత్యేక సదుపాయాలు చెయ్య బడలేదట. భైరవమూర్తిగారి దేవతార్చనకు ఆ సత్రపువంట లో వీలేకలుగలేదట. ఈయన దేవతార్చన చేస్తుండగానే అచ్చటి బ్రాహ్మలు భోజనాలు ప్రారంభించారుట. భైరవ మూర్తిగారికి ఆవేదనఐ - ఏమిచెయ్యాలో తోచక దుఃఖించారుట. ఇంతలో ఆగ్రామంలో సంస్కృత పాఠశాలలో అధ్యాపకులుగా ఉంటున్న సత్యనారాయణశాస్త్రిగారు భైరవమూర్తి గారి శిష్యులు కావడంవల్ల దర్శనానికివచ్చి జరిగిన సంగతి సందర్భాలుగ్రహించి అప్పటికప్పుడు తాము ఆ సత్రంలోనే స్వయంగా భైరవమూర్తిగారికి వంటచేసి పెట్టారుట. అందు చేత ఉపద్రవం ఆగిపోయిందట.

ఆ సాయంత్రం కల్యాణము. భైరవమూర్తిగారికి ఆ రోజు అతివాసం అవటంచేత ఆరాత్రి భోజనం లేదుట. ఆరాత్రి కూచిపూడి భాగవతులు ప్రహ్లాదనాటకాన్ని ప్రదర్శిస్తున్నారుట. నాటకం దగ్గరకూడా భైరవమూర్తిగారివంటి విద్వాంసులకు ఆలనాపాలనా లేకపోయిందట. భైరవమూర్తిగారికి మనః ఖేదంగా ఉన్నదిట. రాత్రి పదిగంటలకు ప్రారంభమై తెర ఎత్తినారుట.

తెరఎత్తగా "రాజువెడలె రవి తేజముతోడను" హిరణ్యకశిపుడు చిందులు త్రొక్కుతున్నాడు. అతని ప్రక్కన రాజపత్ని లీలావతి. ఆ మెపారిజాతాపహరణంలోవలెభామాకలాపంలోవలె సత్యభామాదేవివలె వేషంకట్టింది. భైరవమూర్తిగారు మహావేత్త. ఆయనకు అసహ్యంవేసింది. లేచి బిగ్గరగా "ఈ నాటకంలో ఆహార్యకం సంప్రదాయవిరుద్ధంగా ఉన్నది స్వామివారి కల్యాణోత్సవాలలో ప్రదర్శించతగిన యోగ్యతకలదిగా లేదు. నిలపండి!" అని అన్నారుట. వాదోప వాదాలు జరిగినాయిట. ఆయన వాదం "ఈ నాటకానికి ప్రహ్లాదుడు నాయకుడు. ఈ నాటకంలో నాయకి లేనేలేదు. లీలావతి నాయకుని తల్లి. ఆమె శృంగారనాయకి కానేకాదు. ఆమె శృంగారనాయకిగా వేషంవెయ్యడం తప్పు. ఆహార్యకవివరణలో జాయప సేనాని రచించిన నృత్తరత్నావళిలో ఇట్లాగే ఉన్నది. అభినవగుప్త, కీర్తిధర, భట్టతంపు, విరచితాలైన భరతశాస్త్ర వ్యాఖ్యానాలలో కూడా ఇట్లాగే ఉన్నది. కుమారగిరి వసంతరాజీయం

కూడా ఇట్లాగే చెబుతున్నది. లొల్ల లక్ష్మీధరాచార్యులవారి పూర్వుడైన పిరించి మిశ్రులవారు రచించిన 'భరతార్ణవ పోతం'లో కూడా ఇట్లాగే చెప్పబడింది. ముడుంబ నరసింహా చార్యుల వారి భరత సర్వార్థసంగ్రహం, సోమన్న గారి నాట్య చూడామణి, శుద్ధత త్త్వ వెంకటాచార్యులవారి 'సారము' నా అభిప్రాయాన్ని బలపరుస్తున్నాయి. సింహాచల క్షేత్రంలోనూ అహోబలంలోనూ దేవాలయ శిఖరాలమీద ప్రహ్లాద చరిత్ర శిల్పరూపంలో సంతరించబడి ఉన్నది. ఆశిల్పాలలో లీలావతి రూపాన్నిచూస్తే నా వాదంలో బలం ఏమిటో అవగాహన అవుతుంది.

నాటకాలుగాని, ఇతర కళలుగాని, పారిషదులైన ప్రజలకు ధర్మస్వరూపాన్ని మన సంప్రదాయవ్యవస్థా స్వరూ పాన్ని కళ్ళకు కట్టడంలో ప్రయోజనాన్ని పొందాలి. అట్లా చెయ్యలేనిది మన దేశంలో కళగాదు. విద్యకాదు. అట్లా చెయ్యలేకపోతే అది నిష్ప్రయోజనమే. నాయకుని తల్లిని లీలావతిని శృంగార నాయకిగా వేషధారణం చేయించి, అహా ర్యక దోషభూయిష్ఠమైన ఈ ప్రదర్శనం అచ్చమైన ధర్మాన్ని గాని, సంప్రదాయాన్నిగాని, అభివ్యక్తీకరించడానికి తోడ్ప డదు. కనుక ఈప్రదర్శనం కొనసాగకూడదు. ఆపివెయ్యాలి" సభలో ఉద్దండులైన పండితులున్నారు. కూచిపూడి భాగవతులు స్వయంగా మహాపండితులూ, మహాశాస్త్రవేత్తలూను. కొంత మంది పండితులు భాగవతుల తరఫున వాదించారు. నాటకం

నిల్చిపోయింది. పండితులు చివరకు ఏకగ్రీవంగా భైరవమూర్తి గారి వాదాన్ని అంగీకరించి ప్రదర్శనాన్ని నిషేధించారు. అప్పటికి రాత్రి రెండు గంటలైంది. అప్పుడే భైరవమూర్తిగారు కాలినడకను స్వగ్రామానికి బయలుదేరారుట. మా తాత శోభనాద్రి ముందునడుస్తూ వచ్చాడుట.

# 16

మర్నాడుదయం ఏడుగంటలకి భైరవమూర్తిగారు దేవపురంచేరారు. రావడం సరాసరి చెరువుకే వెళ్ళి అక్కడ స్నానం చేశారు. సేవకుడు శోభనాద్రి మాత్రం భైరవమూర్తి గారిని చెఱువుదగ్గర వదలి వారు వచ్చారని అమ్మగారికి చెబుదామని వారి ఇంటికి వెళ్ళాడుట. అక్కడ అతడు వెళ్ళేటప్పటికి విచిత్రమైన సన్నివేశం ఉన్నదిట. అయ్యగారి వాకిట్లో అయ్యగారి గేదె నెత్తురుకక్కుతూ పడిపోయి ఉన్నదిట. శోభనాద్రికి అమ్మగారు ఇట్లా చెప్పిందిట. "ఉదయం మామూలుగా పాలు పితకడానికి వచ్చేటప్పటికే ఈ గేదె ఇట్లాపడి ఉన్నది. ఏవో కూరగాయ వైద్యాలు చేస్తూనే ఉన్నాం అప్పటినుంచీ. గేదె తేరుకోలేదు. లేవలేదు. కళ్లు తెరవలేదు." శోభనాద్రికి అంతా అవగాహన అయింది. అతడు మిక్కిలి పొడగరి. మహాబలిష్ఠుడు. పట్టెడు మీసాలతో వీరబాహులాగా ఉండేవాడట. అతడు భూతాంకుశంకట్ట పట్టుకుని బలిష్ఠమైన బాహుదండాలతో భయాద్భుతంగా ఉండేవాడుట. అతడు ముందుకువచ్చి

గురుపత్నికి దూరంనుంచి సాష్టాంగ ప్రణామంచేసి,భూతాంకుశం కఱ్ఱతో గేదెదగ్గరకు నడచి, చుట్టూ ఉన్నవాళ్ళందరినీ తప్పుకోమని చెప్పి తన భూతాంకుశం దండంతో ఆ గేదె వెనకకాలి గిట్టమీద సన్నగా కొట్టినాట్ట. అంతే. అది క్షణంలో లేచినిల్చున్నదట. అంతా మామూలుగా అయిపోయిందట. మామూలుగా పాలు ఇచ్చిందిట. శోభనాద్రి అమ్మగారికి మనవిచేశాట్ట అయ్యగారికి ఇదిఏమీ చెప్పొద్దని. భైరవమూర్తిగారు చెఱువునుండి వచ్చి లోపలకువెళ్ళి అనుష్ఠానం ప్రారంభించారు. శోభనాద్రి ఇంటికి వెళ్ళాడు. గేదె మామూలుగా ఇతర పశువులతో పొలాలమీదికి మేతకు వెళ్ళింది మందతో కలసి.

భైరవమూర్తిగారు తమ తల్లిగారి ప్రతి సాంవత్సరిక శ్రాద్ధం ముగించారు- ఆబ్దికపు భోక్తలు భోజనంచేసి వెళ్లిపోయారు. ఇంట్లోవాళ్లు భోజనాలు చేస్తూ ఉన్నారు. శోభనాద్రి తన పనులు ముగించుకుని అయ్యగారివాకిట్లో భూతాంకుశంకఱ్ఱ పట్టుగుని ఎవరికోసమో ఎదురుచూస్తున్నట్లుగా నిల్చున్నాడు. కొంతసేపటికి నాలుగు గుఱ్ఱపుబండీలు వచ్చి నిల్చినై- "భైరవమూర్తిగారి యిల్లు ఇదేనా?" అని అందులోవాళ్ళు అడుగుతున్నారు. శోభనాద్రి బళ్ళదగ్గరకువెళ్లి "ఔను. ఏం కావాలి?" అన్నాడు. ముందుబండినుంచి నూజివీటి ప్రభువుల వారు దిగారు. ఆయన ఫలానా అని శోభనాద్రికి తెలిసి ఉండటంవల్ల నమస్కరించాడు. ఆయన శోభనాద్రి "నువ్వెవరు?" అని ప్రశ్నించారు. అందుకు శోభనాద్రి తాను "శోభనాద్రిననీ"

శ్రీ భైరవమూర్తి అయ్యవార్లంగారి సేవకుడననీ చెప్పు
కున్నాడు. వెనక రెండోబండినుంచి ఇద్దరు దిగారు. అందులో
వొకాయన కూచిపూడి భాగవతుల మేళానికి నాయకుడు.
ఆయన శోభనాద్రిని చూచాడు. అతని మీసకట్టు - ఆ కంటి
చూపు-పన్ను బిగింపు, చేతిలో భూతాంకుశం దండం దానిని
పట్టుగన్న వైఖరి-ఇవన్నీ చూడగా ఆ భాగవతుల నాయకునికి
తెలిసిపోయింది శోభనాద్రి మంత్రవేత్త అని. ఆయన అన్నాడు-
"నాయనా! మీ అయ్యవార్లంగారివరకూ అక్కరలేకుండానే
నువ్వే మమ్మల్ని రక్షిస్తావేమో! రక్షించు" దానికి శోభనాద్రి
చిరునవ్వు నవ్వి "జరిగినదేదో చెప్పండి" అన్నాడు. ఆ భాగవ
తుల నాయకుడు ఇట్లా అన్నాడు. "రాత్రి భైరవమూర్తిగారి
వివాదంవల్ల మా నాటకం నిల్చిపోయిందికదా! అది పరాభ
వంగా భావించి మా జట్టులో పండితుడొకడు తొందరపడి
భైరవమూర్తిగారిమీద క్షుద్రప్రయోగం చేశాడు. కాని
రెండుమూడు గంటల్లో - నువ్వో - మరి మీ అయ్యవారో
తిరిగి కొట్టినట్లుగా ఉన్నది. మా జట్టులోని వాళ్లందరికి - శ్రీ
ప్రభువులవారికీ అందరకూ రక్తవిరేచనాలు. అందరకూ ప్రాణా
పాయ పరిస్థితి వచ్చింది. మీ అయ్యవార్లంగారిని స్మరించి
బయలుదేరి వచ్చాము. వారి దయాభిక్ష అర్థించడానికి
వచ్చాము. క్షమార్పణ చెప్పుకోటానికి వచ్చాము. ఇందులో
నీచేత ఎంతఉన్నదో నాకు తెలియదు. నీవల్ల ఐతే నువ్వే
రక్షించు. మేము తొందరపడినందుకు మన్నించు" ఈ మాట

లకు శోభనాద్రి మళ్ళీ ఒకసారి మందస్మితంచేసి, మీసాలు
దువ్వి, చేతిలో గండాన్ని నేలమీదకొట్టి దానిమీద గడ్డాన్ని
మోపి ఇట్లాచెప్పాడు. "స్వామీ ! మా అయ్యవార్లంగారికి
ఈ సంగతి ఇంకా తెలియదు. ఇప్పుడు మనవి చెయ్యాలి. మీరు
చేసిన క్షుద్రప్రయోగం మా అయ్యవారి బఱ్ఱెను పడగొట్టింది.
నేనే దాన్ని తిప్పి పంపాను. కాని దాన్ని పూర్తిగా హరించి.
ఉపసంహరించి, మిమ్మలి పరిరక్షించడానికి నాకు శక్తిచాలదు. అది
మా అయ్యవార్లంగారు అనుగ్రహింపవలసిందే.' ఈ దినం వారి
తల్లిగారి తిథికావడంవల్ల ఇప్పుడే లోపల భోజనం చేస్తు
న్నారు. కొంచెంసేపట్లో బయటకువస్తారు." అని చెబుతుండగా
భైరవమూర్తిగారు బయటకు రానేవచ్చారు. అందరినీ
చూచారు. చూడగానే ఆయనకు అంతా అవగాహన అయింది.
అప్పుడాయన చేతిలో తమలపాకులున్నాయిట. ఆయన
తాంబూల సేవనంచేస్తూ బయటకు వస్తున్నారుట. చేతులో
ఉన్న తమలపాకుల్ని తుంచి వచ్చిన వాళ్ళచేత తినిపించారుట.
అందరికీ వెంటనే మామూలు ఆరోగ్యం వచ్చినట్లయి
మామూలుశక్తి కలిగిందట. భైరవమూర్తిగారు కూచిపూడి
భాగవతుల్ని 'ఇక ఎక్కడా మంత్రప్రయోగం చెయ్యవద్దు'
అని మందలించారుట. సభాముఖంలో కళావిషయికంగా
పాండితీవిషయికంగా వచ్చిన స్పర్థలు సభల్లోనే తీర్చుకోవాలి
గాని, ఇట్లా క్షుద్రమైన తుచ్ఛమైన ప్రయోగాలలోకి దింప
కూడ దన్నారుట. నూజవీటి ప్రభువులు ఆయన శక్తికీ, ఔదా

ర్యానికీ హర్షించి - అప్పుడే మనవూళ్లో రెండువందల నల్భై ఎకరాల భూమిని ఖండ్రికగా నిర్ణయించి భైరవమూర్తిగారికి శ్రోత్రియంగా ఇచ్చారుట. భైరవమూర్తిగారు మర్నాడే శివాలయానికి శంఖుస్థాపనచేసి త్వరలో పూర్తిచేసి స్వామికి నూటఇరవై ఎకరాల భూమిని ఇచ్చారుట. ఆ నూటఇరవై ఎకరాల భూమిని మనవూళ్ళో నల్భైనుంది హరిజనకుటుంబాలవారు తక్కువగుత్తలకు కౌలుచేస్తూ సుఖజీవనం చేస్తున్నారు. ఆయన మహాదాత. అనేక గృహదానాలు చేశారు. ఏడెకరాల మామిడి తోటలో హరిజనులకు ఇళ్లస్థలాలు ఇచ్చారు. అంచేతనే మా హరిజనవాడకు నేటికీ భైరవమూర్తి పురమనే పేరున్నది. ఆయన హయాంలోనే ఆయన శ్రోత్రియం ఆయన ఈవికి తట్టుకోలేక పోయిందట. ఆయన మరణించే నాటికి ఆయన కుమారుడైన మీ తాతగారికి మామూలు ఐదెకరాలభూమి మాత్రమే మిగిలిఉన్నదట.

# 17

మీ తాతగారిసంగతి మీరు వినేఉంటారు. మీతాతగారు వీరభద్రయ్యగారు. పదమూడో ఏటనే తండ్రిగారిని పోగొట్టుకున్నారుట. ఆయన ఐదవయేటనే ఉపనయనం అయిందిట. ఉపనయనం రోజునే శివపంచాక్షరి శ్రీమన్నారాయ అష్టాక్షరి ఉపదేశం చేశారుట తండ్రిగారు. ఆ సంవత్సరం గురు

పౌర్ణమి దినమున ఆయనకు తండ్రిగారు శ్రీవిద్యలో పాదుకాంతదీక్ష ఇచ్చారుట.

తండ్రిపోయిన కొద్దిసంవత్సరాలకు వీరభద్రయ్యగారు గుంటూరుజిల్లాలో మంగళగిరి వెళ్లారుట. వెంట మాతండ్రి సోమయ్య ఉన్నాడుట. మంగళగిరిలో వీరభద్రయ్యగారికంటె పెద్దదైన వారితోబుట్టువు ఉన్నదట. ఆమెకు సుస్తీగా ఉన్నదని చూచిరావడానికి వెళ్ళారుట. అక్కడ వారిఇంట్లో వీరభద్రయ్యగారు అనుష్ఠానం ముగించుకుని దేవతార్చన శ్రీచక్రార్చనతో సహా చేసి ఇంట్లో వాళ్లందరికీ తీర్థం ఇచ్చారుట. తీర్థం ఇచ్చే సమయంలో తమ బావగారిని చూడడానికి వచ్చిన కమ్మవారికికూడా తీర్థం ఇచ్చారుట.

తర్వాత భోజనంచేసి వరండాలో పిచ్చాపాటి మాట్లాడుతుండగా ఊళ్ళో సగంమంది వచ్చి చుట్టు ముట్టారుట. కారణమేమిటంటే - వీరభద్రయ్యగారివద్ద తీర్థప్రాశనం చేసిన వారిలో ఒకాయన ఇంటికిపోగా అక్కడ అనేక సంవత్సరాలుగా బ్రహ్మరక్షస్సుచేత బాధింపబడుతున్న ఆ రైతు యొక్క (ఇల్లుపట్టినవిధవ) ఆడపడుచు పెద్దరోదనంచేస్తూ చెప్పిందట. "ఓరీ! నువ్వు మహామంత్ర సిద్ధుల దేవతార్చనలో పరదేవతగా ఉన్న శ్రీచక్రతీర్థప్రాశనం చేశావు. ఇక నీ ఇంట్లో ఏబ్రహ్మరాక్షసీ ఉండేసావకాశంలేదు" అని బావురుమంటూ ఆమె తూలి పడిపోయిందట. అదివరకు ఆమెను ఎంతమంది భూతవైద్యులో చూచి బాగుచెయ్యలేక పోయారుట. ఆమె

పడుతున్న బాధ ఆ రైతు ఇంట్లో ఆమె చేస్తున్న రగడ ఊరం దరికీ తెలిసినవేనట. ఆకారణంగా ఊళ్ళో చాలమంది, ఈ చిత్రమైన సంగతులు విని మీతాతగారి దర్శనానికి వచ్చారుట. ఆ రైతు ఒక పెద్ద జమీందా రంతటి మోతుబరిట. ఆయన మన ఊరువచ్చి నూరెకరాల భూమినికొని మీతాతగారికి సమర్పించి వెళ్ళాడుట.

ఒకసారి మీతాతగారు తిరుపతియాత్రకు వెళ్ళారుట. వెంట మాతండ్రి సోమయ్య ఉన్నాడు. తిరుపతినుంచి కాల్నడకను ఇద్దరు సేవకులతో కంచివెళ్తూ ఒక ఊళ్లో ఒక బ్రాహ్మణుల ఇంట బసచేశారుట. ఆఇంటి గృహస్థు పెద్దరాజ వైద్యుడట. కార్వేటినగరం సంస్థానంలో ఆస్థాన వైద్యుడుగా ఉంటున్నాడట. ఆయన మీతాతగారితో సహాపంక్తి భోజనానికి వచ్చుటకుగాని, సత్కారవాక్యాలు చెప్పుటకుగాని, తీరికలేక ఏదో మానసికమైన బాధతో లోపల కూర్చుని పాతతాళపత్ర గ్రంథాలు తిరుగవేస్తున్నారుట. మీతాతగారు భోజనం ముగించుకుని ఆయనకు కృతజ్ఞతలు చెప్పుకోడానికి లోపలకు వెళ్లి ఆయన పడుతున్న ఆందోళనకు చకితులై ఆయన్ను ప్రశ్నించారుట. "అయ్యా! ఇంటికి వచ్చిన అతిథులతో మాట్లాడటానికికూడా తీరుబడిలేకుండా గ్రంథపఠనం చేస్తున్నారే! తమరు ఏదో చాలపెద్ద సమస్యనే పరిశీలన చేస్తున్నట్లుగా ఉన్నారు" ఆమాటలకు ఆగృహస్థు ఆతిథేయ సత్కారాలలో లోపానికి మన్నించమని తమప్రభువులవారి భార్యకు

రెండు సంవత్సరాలనుంచి జబ్బుగా ఉన్నదనీ ఎన్నిమందులు వాడినా గుణంకనపడటం లేదనీ ప్రభువులవారికి చాలా ఆందో ళనగా ఉన్నదనీ తమకు సంస్థానంలో చాలా అపకీర్తిగా ఉన్న దనీ చెప్పారుట. అప్పుడు మీతాతగారు ఆయనకు ధైర్యం చెప్పి, అప్పుడే ఆరాజవైద్యునితో కార్వేటి నగరానికి వెళ్ళి ఆరాత్రే శ్రీచక్రార్చనం చేసి రాణివాసంవారికి అమ్మవారి ప్రసాదం ఇచ్చారుట. రాణీవారికి ఆరాత్రి సుఖనిద్రపట్టి మర్నాటి ఉదయానికే గుణం కన్పించిందిట. కృతజ్ఞతామూర్తు లైన సంస్థానాధిపతులు మన ఊళ్ళో ఏభై ఎకరాలభూమిని తీసి మీ తాతగారికి ఇచ్చారుట. మీ తాతగారుకూడా మహా దాత. ఆయన సంపాదన అంతా దానధర్మాలకే చాలలేదు. పిత్రార్జితమైన ఐదెకరాల భూమినే చివరకు తమ కుమాళ్ళకు మిగిల్చారుట. మీ తాతగారి ప్రోద్బలంతోనే కార్వేటినగర సంస్థానంవారు శ్రీ విద్యాసపర్యాపద్ధతి అనే మంత్రశాస్త్ర గ్రంథం ప్రకటించారు. అది నేటికిన్నీ యావద్భారతంలోనూ తలమానికంగా ఉన్నది.

ఒకసారి మీ తాతగారు శ్రీ శృంగేరిలో శ్రీమత్పరమ హంస పరివ్రాజకాచార్యవర్యశివాభినవ సచ్చిదానంద విద్యా నృసింహ భారతీస్వాములవారి దర్శనానికి వెళ్తూ మధ్యే మార్గంలో ఒక ఊళ్ళో బసచేశారుట. వెంట మా తండ్రి సోమయ్యా, ఇంకో సేవకుడూ ఉన్నారుట. ఆ రోజు భోజనం ముగించుకుని బయలుదేరుతుంటే మా తండ్రి సోమయ్య మనవి

చేశాట్ట. ఆ ఊళ్ళో ఒక విచిత్రమైన పురుషుడున్నాడని, అతడు కల్కి అవతారమని చెప్పుకుంటున్నాడట. పేరు భగవాన్ కల్కిబాబా' అని పెట్టుకున్నాడట. నిజంగా దిగ్భ్రాంతిని కల్గించే శక్తులు కొన్ని ప్రదర్శిస్తాడుట. ఆయనకు అనేకమంది శిష్యులున్నారుట. అనేకమంది జమీందార్లు సంస్థానాధిపతులు ఆయనకు శిష్యులుగా ఉండి పుష్కలంగా ధనం ఇస్తున్నారట. ఆ ఊళ్ళోనే రాజప్రసాదంలాటి పెద్ద భవంతి కట్టించి అందులో హంసతూలికా తల్పంపై అప్సరః కాంతలవంటి స్త్రీలు పరిచర్యలతో సేవిస్తూ ఉండగా ఆయన మహాభోగాలు అనుభవిస్తూ ఉంటాడుట. సోమయ్య చెప్పిన ఈమాటలు విని వీరభద్రయ్యగారు తాము బసచేసిన గృహ యజమానిని 'బాబాను' గురించి ఏమిటని అడిగారుట. ఆయన చెప్పాడుట "మీ సోమయ్య చెప్పినవన్నీ నిజమైనమాటలే. బాబా ఈ ఊళ్లో చాలా ధర్మకార్యాలు చేస్తున్నాడు. ఒక ఉన్నత పాఠశాల, ఒక వేదపాఠశాల, ఒక ధర్మసత్రం బాబా నడుపుతున్నాడు. కాని ఆయనకు స్త్రీ వ్యామోహం అమి ంగా ఉన్నదనీ ఆ విషయంలో చాలా అవినీతిపరుడనీ జనం చెప్పుకుంటారు". ఈ మాటలు విని మీ తాతగారు మనకెందుకులే పొమ్మని ప్రయాణంకాగా మా నాయన బాబాను చూడాలని మంకుపట్టు పట్టటంచేత సరే పోయి చూచిరమ్మన్నారుట. మళ్ళీ ఏమి ఆలోచించుకున్నారో - తన సేవకుడు సోమయ్య ఏమి దుడుకుపనులుచేసి ఏవిపత్తులలోనో పడతాడని శంకించారో-తాముకూడా బయలుదేరారుట బాబాదగ్గరకి.

వీరభద్రయ్యగారు సోమయ్యతోనూ, ఇంకో సేవకుని తోనూ కలసి బాబాగారి ప్రాసాదం దగ్గరకువెళ్ళి లోపలకు కబురు పంపించారుట. తాము బాబాను చూడగోరుతున్నా మని. లోపల్నుంచి "సాయంకాలం శ్రీ బాబాగారు భక్తులంద రికీ దర్శనంఇస్తారు. అప్పుడు రండి" అని సమాధానంవచ్చిందట. "మేము బాబా భక్తులం కాము, పాంథులం. బాబాతో మాట్లాడాలి. ఆయనకు అభ్యంతరం లేకపోతే ఆయన అతి థ్యాన్ని స్వీకరిస్తాము. ఈమాట బాబాకు చెప్పండి" అని సోమయ్య ఆవార్త చెప్పినవాళ్ళతో అన్నాడుట. వాళ్ళు మళ్ళీ బాబాతో చెప్పడానికి నిరాకరించారుట. దానికి సోమయ్య కోపించి - తన చేతులో ఉన్న భూతాంకుశం దండాన్ని నేలమీద మూడుసార్లు కొట్టాడుట. ఒక మహాగ్ని ప్రజ్వలించి అది విజృభించి ప్రసాదంలోకి చొచ్చుకుపోయిందిట. ప్రాసాదంలో ఉన్న అన్ని వస్త్రాల్నీ దగ్ధంచేస్తూ బాబాగారు భోగిస్తున్న మందిరంలోకికూడా వెళ్ళి అక్కడ హంసతూలికా తల్పాన్ని భస్మంచేసిందట. బాబాగారు ఆయన్ను అప్పుడు సేవిస్తున్న స్త్రీలుమాత్రం ప్రమాదానికి గురికాలేదుట. బాబా తల్పం మీదనుంచి దూకి బయటకువచ్చి సంగతి తెలుసుకుని ఉగ్రుడై సోమయ్యనుచూచి ఛీత్కారంచేసి, చేతిలోఉన్న చేతిగుడ్డను సోమయ్యమీద విసిరాట్ట. అది ఒక మహా వజ్రా యుధంలాగా, కదలుతున్న పర్వతంలాగా విజృంభించి సోమయ్య మీదకు వచ్చిందట. అప్పుడు సోమయ్య దాన్ని తన భూతాం

కుశం కఱ్ఱతో కొట్టగా అది పసిఐ బాబాగారి నెత్తిమీద పడ్డదిట. అప్పటికి బాబాగారికి ప్రత్యర్థి శక్తి తెలిసింది. అయినా అహంకారంచావక కుయుక్తిగా సోమయ్యతో "మేము సాధు పులం - మాకు క్రోధంలేదు. మేము నిన్ను క్షమించాము" అని చెప్పి "ఇదిగో మా ప్రసాదం తీసుకో" అంటూ చేయి జాపాడుట. అరచేతిలో విభూతి పుట్టుకువచ్చిందట. సోమయ్య కదలలేదుట. బాబా అరచేతిలో విభూతిని నోటితో ఊదాడుట. విభూతి పెనుధూళిగాలేచి సుడిగుండంలాగా చుట్టుతూ సాగి సోమయ్యమీదకు విజృంభించినదట. దాన్నికూడా సోమయ్య భూతాంకుశం దండంతోకొట్టగా - అది ఆ భూతాంకుశం కఱ్ఱను సుడిగుండంలోకి లాక్కుందట. దానిశక్తి పెరిగిందట. ఆసందర్భాన్ని గ్రహించిన వీరభద్రయ్యగారు వెంటనే "సోమా" అని అరిచారుట. అప్పుడు సోమయ్యకు తెలిసింది. అది స్వామినాథప్రయోగం. సర్వదేవ సేనానాథుడైన కుమారస్వామి అప్రయోగానికి నాథుడు. వీరభద్రయ్యగారు 'సోమా' అని ఆదేశించడంలో ఆతడిని ఉమామహేశ్వరస్తవం చెయ్యమని. సోమయ్య ఉమామహేశ్వరస్తవం చేస్తూ ఆ సుడిగుండానికి నమస్కరించాడు. అది వెనుదిరిగి బాబా మీదకు విజృంభించింది. సోమయ్య భూతాంకుశంకఱ్ఱ తిరిగి అతనిచేతిలోకి వచ్చింది. సుడిగుండం తన మీదకు వస్తుండగా బాబాకు ఏమి చెయ్యాలో తెలియలేదు. ముచ్చెమటలు పోసినై. శరీరం పట్టుతప్పింది. సోమయ్య పాదాలమీదకు వచ్చి పడ్డాడు

రక్షించమని. సోమయ్య "ఈప్రయోగం ఉపసంహరించే శక్తి నాకు లేదు. నాకు ప్రత్యక్షపరమేశ్వరులైన గురుస్వామివారు" అని వీరభద్రయ్యగారిని చూపించగా బాబా వీరభద్రయ్య గారి పాదాలను స్వీకరించి క్షమాభిక్షకోరినాడుట. ఆయన నవ్వి తన బుడిచెంబులో ఉన్ననీళ్లు తీసుకుని ప్రోక్షించారుట. ఆసుడిగుండం అదృశ్యమై పోయిందిట.

బాబాదగ్గర వేతనాలు స్వీకరిస్తూ బాబా కల్కిఅవతార మేనని ప్రచారం చేస్తూన్న ఆంధ్రపండిత సింహాలు అనేకం అక్కడకు వచ్చి వీరభద్రయ్యగారికి ఎదురుగా సిగ్గుతో తలలు వంచి నిల్చుని ఉండగా బాబా వీరభద్రయ్యగారిపాదాలు వదలి వేశాడుట. బాబాను చూచి వీరభద్రయ్యగారు "బాబా! నువ్వు చిన్నతనంలో ఈషాళ్ళకొండ మీద గొఱ్ఱెలుకాస్తూ ఉండేవాడివి. ఆకొండమీద ఒకచెట్టుక్రింద కూర్చుని ఉండే ఒక సిద్ధునికి నమస్కరిస్తూ ఉండేవాడివి. ఆసిద్ధుడు ఈకొండ మీదనుంచి వెళ్ళిపోయే ముందు నిత్యమూ అతనికి నమస్క రిస్తున్న నీ వినయానికి సంతోషించి నీకొక మామిడిపండు ఇచ్చాడు. దానిని నువ్వు తిన్నావు. అప్పటినుంచీ నీకీ అపూర్వ శక్తులు వచ్చినై. అసలు సంగతి తెలియని నీవు ఈ శక్తులు నీకు సహజంగా ఉన్నవనీ నువ్వు భగవంతుడవనీ భ్రమించి నానా నాటకాలూఆడావు. అంతేనా" అనగా బాబాకు ఆశ్చ ర్యం అయింది. తనకు తప్ప ఇతరులకు తెలియని మామిడూపండు వృత్తాంతం ఈయనకెట్లా తెలిసిందా అని. బాబా తల ఊపి

"చిత్రం చిత్రం దేవరా!" అన్నాడు. వీరభద్రయ్యగారు మళ్ళీ చెప్పారుట "నీక్షుద్రశక్తులన్నీ నాజల ప్రోక్షణంతో హరింపబడ్డాయి. నువ్వు మామూలు మనిషివి మిగిలావు." బాబా చకితుడై తన్నుతాను చూచుకుని ఇంతవరకూ జిహ్వాగ్రంలో ఉన్న క్షుద్ర ప్రక్రియలు ఏవీ జ్ఞాపకం రాకపోవడాన్ని గమనించుకుని బావురుమంటూ ఏడుస్తూ వీరభద్రయ్యగారిపాదాలు పట్టుగొని వదలలేదట. వీరభద్రయ్యగారు జాలిపడి అతనికి రాజయోగవిద్య అనుగ్రహించి ఆదినంనుండి "విజనప్రదేశం"లో కర్పూరమంజరీ యోగాన్ని సాధింపమని ఆదేశించారుట.

అక్కడ సమావృతులై ఉన్న పండిత ప్రకాండుల్ని వీరభద్రయ్యగారు మందలించారుట. అందులో దర్శనసార్వభౌమ, అభినవ విద్యారణ్య అన్న బిరుదులు తగిలించుకున్న వారున్నారుట. వాళ్ళతో వీరభద్రయ్యగారు అన్నారుట. "మీకు కపిలప్రోక్తమైన సాంఖ్యమూ పాతంజలమైన యోగదర్శనమూ తెలుసునుకదా! మధుభూమికలగు క్షుద్రకక్ష్యలో ఉన్న సాధకులకు ఇటువంటిశక్తులు అలవడటం కద్దు. ఇంతమాత్రానికే వీణ్ణి కల్కి భగవంతుడని ప్రచారముచేసిన మీకు భారతీయదార్శనిక జ్ఞానం లేదని రుజువౌతున్నది. అంగీకరిస్తారా? లేక వాదనలో అపజయం స్వీకరిస్తారా?" అని హూంకరించారుట. ఆపండిత ప్రకాండులు తమ బిరుదు పత్రాలతో వీరభద్రయ్యగారి పాదాలమీాద శిరస్సులుంచి మ్రొక్కారుట. వీరభద్రయ్యగారు ఆపండితుల్ని లేవదీసి వాళ్ళతో ఒ

ట్రస్టు ఏర్పాటుచేసి బాబాదగ్గరవున్న ధనం యావత్తూ ఆ ట్రస్టుకు ఇప్పించి వాళ్ళనే ధర్మశాల, ఉన్నతపాఠశాల, వేద పాఠశాల జాగ్రత్తగా నిర్వహిస్తూఉండమని హెచ్చరించి వెళ్ళిపోయారుట. బాబా వీరభద్రయ్యగారి చరణాల్ని స్మరించుకుంటూ కొండలలోకి వెళ్ళిపోయాడుట.

# 18

ఒకసారి మీ తాతగారు పది అంకణాల మండువాలోగిలిని కట్టించి అందులో గృహప్రవేశానికి సన్నాహాలు చేస్తూ ఉండగా కోనసీమనుండి ఘనాంతస్వాధ్యాయుడైన బ్రాహ్మణుడొకడు యాచనకు వచ్చాడుట. శబ్దమయ ప్రపంచానికి ఏకచ్ఛత్రాధిపత్యం వహిస్తూఉన్న మనోహరమైన స్వరంతో ఆ బ్రాహ్మణుడు వేదాశీర్వచనం చెయ్యగా మీ తాతగారు ఆనందపడి "ఏమికావాలి" అన్నారుట. ఆ బ్రాహ్మణుడు తాను స్వగ్రామంలో చిన్న ఇల్లుకట్టుకోవడానికి ప్రయత్నిస్తున్నాననీ దానికి సాయం చెయ్యమనీ కోరాడుట. అందుకు మీ తాతగారు శుచిస్మితంగా నవ్వుతూ తయారుగా ఉన్న పదిఅంకణాల మండువాలోగిలిని దానము తీసుకోమనీ మన ఊళ్ళోనే ఉండమనీ అభ్యర్థించారుట. అందుకు బదులుగా ఆయన "ఇంత ఇంటిమీద ఆశతో నేనీ ఊరు వచ్చి ఏమి తినాలి" అనగా మీ తాతగారు గృహదానంతోపాటు సుక్షేత్రమైన పదెకరాల మాగాణిభూమినికూడా ఇచ్చారుట. ఇప్పుడా ఘనా

పాటిగారి కుమారుడే మన ఊళ్లో పెద్ద వకీలు రామచంద్రయ్యగారు.

ఎవరైనా పెళ్ళికి సాయము చెయ్యమని అర్థిస్తే మీ తాతగారు చెబుతుండేవారట. "పెళ్ళికి కావలసిన సొమ్ము అంతా నాదగ్గరే తీసుకోవాలి. నా సొమ్ము తీసుకెళ్ళి ఏ అప్రాచ్యుని సొమ్ముతోనూ కలపరాదు. అభివృద్ధికి రాకపోతే మమ్మల్ని ఇద్దర్నీ కలిపి తిడతారు." ఆయన నిలువబెట్టిన సంసారాలే మన ఊళ్ళో సగంమంది బ్రాహ్మణులవి. ఆయన దగ్గర బదుళ్లు తీసుకోని రైతులు మనఊళ్ళో లేరు. కృతజ్ఞతాగుణం హరించిపోని వాళ్ళంతా మొన్న మీ తండ్రిగారి సంస్కారానికి వచ్చినట్లున్నారు.

మీ తండ్రిగారు మీ పూర్వ పురుషులకి తీసిపోని వేత్త. ఆయన ఎంత మహానుభావుడో నాకు ప్రత్యక్షంగా తెలుసు. ఆయన చాలా నిరాడంబరుడు. అతి ప్రచ్ఛన్నశీలి. ఆయన కటాక్ష దీక్షవల్లనే నాకు లోకజ్ఞానం కలిగింది. ఆయనకు నేనే ప్రథమ శిష్యుణ్ణి. ఆయనకంటే నేను ఐదేళ్లు చిన్నవాణ్ణి. చిన్నప్పటినుంచే నాకాయనే దొరగారు. ఆయన బడినుండి వచ్చిన వెంటనే నేనాయన వెంటపడి తిరుగుతుండేవాణ్ణి చిన్నప్పటినుంచీ. ఆయన బళ్లో విన్న పాఠాలలో క్రొత్తసంగతులన్నీ నాకు ఉపన్యాసం చేసేవారు. అందుచేత నాకు అక్షర జ్ఞానంలేని రోజుల్లోనే బహుళమైన అధునాతన భౌతిక శాస్త్ర

జ్ఞానం, చరిత్ర, రాజకీయాలు, ఇతిహాసాలు, సంస్కృతాంధ్ర ఆంగ్ల సాహిత్యాలలో నిగ్గులు తెలిశాయి.

నాకు చిన్నవయసులో కళత్ర వియోగం కలిగి నేను కళవళ పడ్డాను. మీ తండ్రిగారు నా దృష్టిని గాంధీగారి ఉద్యమాలవైపు త్రిప్పారు. అప్పటినుంచీ నేను హరిజనోద్ధరణ లోనూ సత్యాగ్రహోద్యమాలలోనూ ఉంటిపోయాను. అక్కడ నాకు శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు పంతులు గారూ, శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులుగారూ, శ్రీ కాశీ నాథుని నాగేశ్వరరావు పంతులుగారూ నాయకులు.

ప్రకాశం పంతులుగారు అతి విచిత్రమైన వ్యక్తి. ఆయ నకు దేశభక్తి ముందు - స్వార్థత్యాగం ముందు - లోకంలో ఉన్న సర్వ ఐశ్వర్యమూ తృణమే. అల్పమే. ఆయనది మహా త్యాగతపస్సు శ్రీ కాళేశ్వరరావుగారు మహా మేధావి. బహు భాషావేత్త, పండితుడు, మర్మజ్ఞుడు, నిరాడంబరుడు.

శ్రీ నాగేశ్వరరావు పంతులుగారు రాజకీయము, సాహి త్యము, ఆధ్యాత్మికము సమానంగా పంటపండించిన మహాపురు షుడు. సాహిత్యానికి నిత్యకళ్యాణంగా తెలుగునేలమీద వెన్నెలకాయించిన మహనీయుడు. ఆంధ్రసరస్వతీదేవికిరాజరాజ నరేంద్రుడు, మనుమసిద్ధి, రెడ్డిరాజులు, శ్రీకృష్ణదేవరాయలు తంజాపురాంధ్రనాయకులు, మధురనాయకులు తర్వాత శ్రీ కాశీనాధుని వారు సర్వజనామోదకరమైన సేవచేసిన ముఖ్యులు. శ్రీ పంతులుగారి ఋణం, ఆంధ్రభాష, ఆంధ్రదేశం ఏమిచేసినా

తీర్చుకోలేవు. ఆయన ఆంధ్రనాయకులలోనే కాదు యావద్భారతంలోనూ నాయకవర్గంలో అతిపవిత్రులు. వేలుపెట్టి చూపించడానికి ఏ ఒక్క లోపమూ లేని పూర్ణపురుషులు. శ్రీ మదనమోహనమాలవీయా ఉత్తరభారతంలోనూ పంతులుగారు దక్షిణభారతంలోనూ నాయకులలో పుణ్యపురుషులు. పంతులుగారు శివైక్యంపొంది ఐదు సంవత్సరాలు దాటిపోయింది అప్పుడే. పంతులుగారికి మీ తండ్రిగారంటే చాలా ఇష్టం. ఒకసారి పంతులుగారు బొమ్మలూరునుంచి మీతండ్రిగారిని చూడటానికి వచ్చి మీతండ్రిగారి ఆతిథ్యం స్వీకరించడం నాకు జ్ఞాపకం ఉన్నది. సనాతనులమని చెప్పుగుంటూ పంతులుగారి బంధువులే వారి మీద అభాండాలు వ్రాస్తే వాటిని శాస్త్రీయంగా మీ తండ్రిగారు ఖండిస్తూ వ్యాసాలు వ్రాశారు. మీతండ్రిగారూ వారూ మాట్లాడుకున్న కొన్ని మాటలు జ్ఞాపకంవస్తున్నాయి. శ్రీకంఠభాష్యానికీ, శ్రీభాష్యానికీ ఉన్న సామ్యతను గురించి వాళ్లు మాట్లాడుకున్నారు.

దుర్మతి నామసంవత్సరంలో శివరాత్రికి నేనూ మీ తండ్రిగారూ శ్రీశైలం వెళ్ళాము. అక్కడ అప్పుడు శ్రీబోధానందభారతీ స్వాములవారున్నారు. అక్కడే పంతులుగారికి మీతండ్రిగారు నన్ను అప్పగించారు. నన్ను పంతులుగారు అప్పటినుంచే హరిజనోద్ధరణ కార్యక్రమంలో ప్రవేశపెట్టారు. నా రాజకీయ సాంఘిక జీవితానికి శ్రీపంతులుగారే ఆదర్శం.

మీ తండ్రి గారికి మంత్ర శాస్త్రంతోపాటు వేదాంగ జ్యోతిషంలో నిశితప్రజ్ఞ ఉండేది. మీ నాయనగారి చిన్నతనంలో జరిగిన విషయం చెబుతాను వినండి. మన వెంకట కృష్ణయ్యచౌదరిగారి తండ్రిగారు మనఊళ్లో పెత్తనం చలాయిస్తున్న రోజులు. ఆయన వెంకటనారాయణ చౌదరిగారు. ఆయనకు విష్ణాలయం కట్టించాలని అభిప్రాయం కలిగింది. మీ ముత్తాతగారు కట్టించిన శివాలయానికి ఎదురుగా స్థలనిర్ణయం చేసుగుని, శంఖుస్థాపన చేసి, ఆలయనిర్మాణం ప్రారంభించారు. మీ తండ్రిగారు తన కుమారుడైన వెంకట కృష్ణయ్యచౌదరి గారికి ముఖ్యుడైనా ఈయన పాండిత్య పావిత్ర్యాలు తెలియక వెంకటనారాయణచౌదరిగారు శంఖుస్థాపన ముహూర్తానికి మీ తండ్రిగారిని ఆహ్వానించలేదు. ఎదురుగావున్న శివాలయానికి ధర్మకర్తగానైనా మీతండ్రిగారు ఆయన దృష్టికి ఆనలేదు. దేవాలయం గోపురందాకా పూర్తి అయింది. ప్రతిష్ఠలకు ముహూర్తంకూడా నిశ్చయమైంది. ఇంతట్లో ఒకరోజు అకాలమైన మహాప్రళయంగా గాలివానవచ్చి - దేవాలయం విరిగి నేలమట్టమైపోయింది. వెంకటనారాయణచౌదరిగారు నిరుత్సాహపడలేదు. ఇంకోసారి ప్రయత్నం చేశారు. మళ్ళీ గోపురం వరకూ సాగి - విగ్రహప్రతిష్ఠలకు ముహూర్తం నిశ్చయింపబడిన స్థితిలో ప్రతిష్ఠలకు ముందే మళ్ళీ దేవాలయం నేలమట్టం అయింది. అప్పుడు ఆయన అనుకున్నాడు ఏదో దోషం ఉన్నదని. కన్పించిన ప్రతిపండితుణ్ణి, విద్వాంసుణ్ణి, ప్రతిజ్యోతిష్కుణ్ణి,

వాస్తుశాస్త్రజ్ఞుణ్ణి ఆయన సంప్రదించాడు. అందరూ అన్నిరకా లైన సమాధానాలూ చెప్పారు. ఆయనకు తృప్తికలుగలేదు. దేశంలోగల జ్యోతిషపండితుల, వాస్తుపండితుల ప్రశస్తి విని వాళ్ళను దర్శించివచ్చారు. తృప్తికలగలేదు. కంచిలోనూ, శ్రీరంగంలోనూ, వైష్ణవాగమాల్లో నిధులు ఉన్నారని విని దర్శించివచ్చారు. ఫలితం మామూలే. ఆయనకు విసుగెత్తింది. ఎవరోచెప్పగా సత్తెనపల్లి తాలూకాలో బెల్లంకొండ గాయత్రీ పంచాయతన పీఠాధిపతులైన శ్రీరామానంద సరస్వతీస్వాముల వారి వద్దకు చౌదరిగారు వెళ్ళారు. వెంకటనారాయణ చౌదరి గారు వెళ్ళేటప్పటికి శ్రీ స్వాములవారు ధ్యానంలో ఉన్నారు. కొంతసేపటికి లేచి బయటకువచ్చి వేచిఉన్న వెంకటనారాయణ చౌదరిగారిని చూచారు. చూస్తూనే అన్నారు. "చౌదరి గారూ! దేవాలయం నిర్మించే సంకల్పం మంచిదే. ముహూర్త నిర్ణయానికి ఇంతదూరం రావాలా? దోషాలుకూడా ఇంత దూరం రావలసిన అగత్యం లేకుండానే తెలుస్తాయి. మహా వేత్తలు మీ ఊళ్లోనే ఉన్నారుకదా!" ఈ మాటలకు చౌదరి గారికి ఆశ్చర్యం కలిగింది. తానెందులకు వచ్చిందీ శ్రీ స్వాముల వారికిగాని ఇతరులకుగాని తాను చెప్పలేదు. కాని శ్రీస్వాముల వారు అంతా గ్రహించారు. శ్రీ స్వాములవారికి చౌదరిగారు వినయంతో ఇట్లా మనవి చేసుకున్నారు. తానిదివరకు చేసిన రెండు ప్రయత్నాలు నిష్ఫలమయ్యాయని దేశంలో అనేక మంది పండితుల్ని ఆగమశాస్త్రవేత్తల్ని సంప్రదించినా తృప్తి

కలుగలేదని అందుచేత తపోనిధులైన శ్రీస్వామివారి దర్శనానికి వచ్చాననీ - విశదంగా మనవిచేసుగున్నారు. అంతావిని శ్రీస్వాములవారు "ఐతే మీ ఊళ్లో వీరభద్రయ్యవారి కుమారులు పరమేశ్వరరావుగారిని సంప్రతించారా?" అని ప్రశ్నించారు. చౌదరిగారు లేదన్నారు. శ్రీ స్వాములవారు "ఇంకేం ఆయనదగ్గరకెళ్ళి ముహూర్తం నిశ్చయించుకుంటే అంతా సరిపోతుంది" అని చెప్పి శ్రీ స్వాములవారు వెళ్ళిపోయారు. అక్కడ ఉన్నవారు చౌదరిగారితో చెప్పారు-ఇక రేపుదయం దాకా శ్రీ స్వాములవారు బయటకురారని. చౌదరిగారు తృప్తితోనూ, అతృప్తితోనూ, ఆశ్చర్యంతోనూ తిరిగి ఇల్లుచేరారు.

చౌదరిగారికి మీ తండ్రిగారిమీద ప్రత్యయం లేదు. ఆయన తన కుమారుడికి స్నేహితుడు. తాలూకాఫీసులో గుమాస్తాగా ఉన్నాడు. ఆయన పెద్ద విద్వాంసుడేమిటని అనుమానం. ఆయన శాస్త్రవేత్త అనీ, సమర్థుడనీ శ్రీస్వాములవారు చెప్పినా చౌదరిగారికి నమ్మకం కలగలేదు. అయినా శ్రీస్వాములవారు చెప్పారుగదా అని పరమేశ్వరరావుగారి దగ్గరకు తమ పురోహితుల్ని పంపి ముహూర్తం నిశ్చయించమన్నారు. పరమేశ్వరరావుగారు అంతకుముందే కర్ణాకర్ణిగా శ్రీస్వాములవారివద్ద జరిగిన సంగతులు వినిఉన్నారు. పురోహితులువచ్చి, నిర్ణయం చెయ్యమని కోరగా ప్రతివచనం కూడదని పరమేశ్వరరావుగారు ముహూర్తం నిశ్చయించి ఇస్తూ ఇట్లా అన్నారు. "అయ్యా! ఈ సంకల్పంలోనే ఏదో దోషం స్ఫురిస్తున్నది.

యజమానివస్తే వారితోమాట్లాడి ఆ దోషాన్ని వివరించి ఆ దోషనివారణోపాయాన్ని కూడా మనవిచేస్తాను. ఈ మాటలు చౌదరిగారికి చెప్పండి."

చౌదరిగారితో ఆ మాటలు చెప్పడానికి పురోహితుల వారు జంకారు. ఆయన సంకల్పమే దోషభూయిష్ఠంగా ఉన్నదని చెప్పడం ఎట్లాగా అని ఆయనకు అనిపించింది. అందుకని ఊరుకున్నారు.

ముహూర్తపుదినం మర్నాడే అయిన దినం వచ్చింది. ముహూర్తం సరిగ్గా సూర్యోదయకాలంలో. ఇదివరకు రెండుసార్లు భారీగా సాగిన దేవాలయ నిర్మాణం భ్రష్టమైపోవడంవల్ల చౌదరిగారికి ఈసారి ఏమౌతుందోనని ఆందోళనగా ఉన్నది. బెల్లంకొండస్వాముల వారంతవారు పరమేశ్వరరావుగారిపాండిత్యాన్ని ఉగ్గడించగా తాను స్వయంగా వారి దర్శనం చెయ్యక అపరాధం చేశానా అని అనిపించింది. ఆరాత్రి ఆయనకు నిద్దుర పట్టలేదు. పట్టిన కలతనిద్దురలో అన్నీ స్వప్నాలే. తాను కట్టిన దేవాలయాన్ని ఒక పెద్ద ఆంబోతు కొమ్ములతో పడగొట్టుతున్నట్లు - ఆలయనిర్మాణంకోసం తెచ్చిన వస్తు సంభారాన్ని అగ్నిహోత్రుడు పొట్టన పెట్టుకున్నట్లు; తాను ఆలయ నిర్మాణస్థలంలో నిల్చునిఉండగా త్రిశూలపాణియై మహాభయంకరుడై కాలభైరవాకృతిలోనున్న రుద్రుడు తనవైపు హుంకరిస్తున్నట్లుగా-తాను నమస్కరించి పాదాభివందనం చెయ్యగా చిత్రంగా ఆ రుద్రస్వరూపం చెఱువులో స్నానంచేసి చెంబుతో నీళు

పట్టుగుని వస్తున్న పరమేశ్వరరావుగారివలె మారిపోయినట్లుగా స్వప్నాలు వచ్చినై.

తెల్లవారుఝామున బ్రాహ్మీ ముహూర్తంలో చౌదరి గారు మంగళవాద్యాలతో దేవాలయస్థలానికి సకుటుంబ పురోహితంగా ఊరేగింపుగా బయలుదేరారు. పరమేశ్వరరావు గారిని శంఖుస్థాపన ముహూర్తానికి ఆహ్వానించలేదని చౌదరి గారికి మనస్సులో కొరతగానే ఉన్నది. వేరే దగ్గరమార్గం ఉండగా అప్రయత్నంగానే పరమేశ్వరరావుగారి వీధిమీదుగా ఊరేగింపు సాగించారు. పరమేశ్వరరావుగారి వీధిలోకిరాగానే ఎదురుగా చెఱువునుండి స్నానంచేసి వస్తూన్న పరమేశ్వరరావు గార్ని చూచి చౌదరిగారు స్తంభించిపోయారు. రాత్రి కలలో చౌదరిగారికి సరిగా అట్లాగే పరమేశ్వరరావుగారు కన్పించారు. చౌదరిగారిపట్టు సడలింది. అంతవరకూ తన కుమారుడు పరమే శ్వరరావుగారిని పొగడినప్పుడు సహించని చౌదరిగారు తనకు తెలియకుండానే పరమేశ్వరరావుగారికి పాదాభివందనం చేశారు. చౌదరిగారికి పరమేశ్వరరావుగారిపైన ఉన్న అకారణ కార్పణ్యం తెలిసి ఉన్న ఆయన కుమారుడు, భార్య, పురోహి తులూ ఈ నూత్నపరిణామానికి విస్మితులైనా సంతోషమే పొందారు. చౌదరిగారు లేచి పరమేశ్వరరావుగారితో "నన్ను మన్నించండి. శంఖుస్థాపన ముహూర్తానికి తమకు ఆహ్వానం పంపుకోలేదు. విస్మరించాను. క్షమించండి" అని ప్రార్థేయపడ్డారు. చౌదరిగారి వినయానికి అందరూ ఆశ్చర్యం పొందారు. పరమే

శ్వరరావుగారు చౌదరిగారివైపు సానునయంగా చూస్తూ "ఫరవాలేదు. ఇప్పటికైనా కన్పించారు. నా ముహూర్త నిర్ణయంకూడా నిష్ప్రయోజనం కాకుండా రక్షింపబడింది." అని పదిహేను నిమిషాలు అట్లాగే నిల్చుండమని చెప్పి ఇంటికి వెళ్ళి పాడిబట్టలతో తిరిగివచ్చారు. ఊరేగింపు సాగింది. ఊరేగింపులో నడుస్తూ పరమేశ్వరరావుగారు చౌదరిగారితో "మన ఊళ్ళో పేదవారైన బ్రాహ్మణులు శివాలయాలుకట్టించి ధర్మకర్తలుగా కీర్తి ప్రతిష్ఠలు పొందటమేమిటి ? మావంటి మోతుబరులు వెనక ఉండటమేమిటి? అని మీరు బాధపడి విష్ణాలయం కట్టాలనుకున్నారు. అందుకనే పోటీగా శివాలయం ఎదురుగా స్థలనిర్ణయం చేసుకున్నారు. ఆ కారణంచేతనే శివాలయ ధర్మకర్తనైన నామీద మీకు కోపం ఉన్నది. అందుచేతనే మీరు స్వయంగావచ్చి నన్ను సంప్రతించలేదు" అని అనగా దానికి చౌదరిగారు 'మన్నించండి, మన్నించండి' అన్నారు. పరమేశ్వరరావుగారు దానికి 'మాత్సర్యంతోనైనా సత్కార్యానికే ప్రయత్నించారు కదా! అది కొనసాగవలసిందే. కాని మీరు దేవాలయనిర్మాణానికి ఎంచుకున్న స్థలవిషయంలో కొంత దోషం ఉన్నది. అది శివాలయానికి ఎదురుగా ఉన్నది. ముక్కంటి కంటికెదురుగా బాగాలేదు. దక్షిణ దిక్కుగా ప్రతిష్ఠింపబడిన ముక్కంటి తన భక్తుడైన లంకేశ్వరుణ్ణే ఫాలలోచన జాతపావక శిఖలలో సకుటుంబంగా దహించాడు. ఆవిధమైన రామేశ్వర శివయంత్రంలాటిదే మన శివాలయంలోనూ

ప్రతిష్ఠించారు. ఆయంత్రశక్తివల్ల దానికంటె కెదురుగా ఏదిన్నీ అభివృద్ధికి రాదు. ఇది సామాన్య విషయం. ఇప్పుడు స్థలం మార్పుచెయ్యడానికి సమయంలేదు. కనక మీరు ముందుగా శివాలయానికి ఎదురుగా పరమ శివమూర్తి పరమవైష్ణవ శిఖామణి ఐన శ్రీప్రసన్నాంజనేయస్వామివారి ఆలయానికి శంఖుస్థాపన చెయ్యండి. ఆ తర్వాత మీరు నిర్దేశించుకున్న స్థలంలో శ్రీ పట్టాభిరామస్వామివారి ఆలయానికి శంఖుస్థాపన చెయ్యండి. అంతా సక్రమంగా జరుగుతుంది" అని సలహా చెప్పారు. చౌదరిగారు పరమేశ్వరరావుగారి ఆదేశం శిరసావహించి అట్లాగే చేశారు. ఆలయాలు సక్రమంగా నిర్మింపబడి మహా వైభవంగా ప్రతిష్ఠామహోత్సవాలు జరిగినై. అప్పటినుంచి చౌదరిగారికి వారికుటుంబం వారికి మీ తండ్రిగారంటే పరమ శివస్వరూపమే.

నేను మీకు మా గురువంశ వృత్తాంతం ఎందుకు చెప్పానంటే పాశ్చాత్యసంస్కృతి సాహిత్యమయమైన విద్యాసముపార్జనలో ఇన్నినాళ్ళుగా ఉన్న మీ మనస్సులో మన సంస్కృతి సంప్రదాయాలపైన నిత్యమైన ఆదరం పుట్టించాలని.

నేను ఈ రాత్రినుండి అవిరామమైన యోగాభ్యాసం మొదలు పెడుతున్నాను. తిరిగి శివరాత్రి వెళ్ళిన మర్నాడు కన్నులు తెరవటం. ఒకరోజు విరామంతో పునఃప్రారంభం. ఇక అట్లాగే జీవితాంతమూ. సాధకులకి గురుచరణ సన్నిధానమే సర్వతీర్థ సన్నిధానం. అందుకని మాగురువుగారి సమాధికి దగ్గర

గానే శాశ్వతంగా ఉండిపోదలచాను. శ్రీ వివేకానందస్వామి వారున్నూ గురువుగారి సమాధికి దగ్గరే ఉండిపోయారుకదా.

ఇక నేను మనవిచెయ్యాల్సిన విషయాలు లేవు. మీకు లౌకికంగా ఉద్యోగాన్వేషణలో కుటుంబపోషణకై అవసర మైతే శ్రీ ప్రకాశం పంతులుగారిని చూచి నాపేరుచెప్పి అర్థించండి. ఆయన తప్పక సాయంచేస్తారు. శ్రీ భోగరాజు పట్టాభి సీతారామయ్యగారికికూడా మీతండ్రిగారు మిత్రులే. ఇక మీరు వెళ్ళండి. చాలా పొద్దుపోయింది. శలవు. శివం" అని రామస్వామి మౌనముద్రపూని నిమీలితనేత్రాలతో నాసాంత దృక్కు అయ్యాడు.

నారాయణరావుకి కళ్ళల్లో నీరునిల్చింది. మహాపురుషులు జన్మించిన కోవలో తనవంటి అప్రయోజకుడు పుట్టినాడని కొంతసేపట్లే కూర్చుండి లేచి రామస్వామికి నమస్కరించి తండ్రి గారి సమాధికి ప్రదక్షిణీకరించి, సాష్టాంగంచేసి త్రోవలో శివాలయంమీదుగా వచ్చాడు. శివాలయం తలుపులు మూసి ఉన్నాయి. బయటనుంచే నమస్కరించాడు. ఊరంతా మాటు మణిగి ఉన్నది. "చాలారాత్రి అయిందన్నమాట." అనుకుంటూ ఇల్లు చేరాడు.

## 19

ఆ మర్నాడు నారాయణరావు అనుష్ఠానం ముగించు కొని భోజనంచేసి, చెయ్యి కడుక్కుంటుంటే వెంకటనర్సమ్మ

చెప్పింది ఫతీమా వచ్చిందని. నారాయణరావు బయటకు వచ్చి చూడగా ఫతీమా బ్రాహ్మణస్త్రీ వేషంతో వచ్చి శిరస్సు వంచుకుని నిల్చుని ఉన్నది. నారాయణరావు రాగానే అతనికి పాదాభివందనం చేసింది. నారాయణరావు ఆమెనంక "ఏల వచ్చితివి?" అన్నట్లుగా చూచాడు. ఆమె చెప్పింది. "ఈ సాయంత్రం మామగారు మద్రాసునుంచి తిరిగివస్తారు. మేము బహుశా ఇవ్వాళ రాత్రికే బందరు వెళ్ళిపోతాము. తిరిగి మీ దర్శనం సాధ్యపడుతుందో లేదో తెలియదు. కనుక ఇంకోసారి మీ దర్శనం చేసిపోదామని వచ్చాను. మీరు అనుగ్రహిస్తే మీ భుక్తశేషంకూడా ఆరగించుదామని వచ్చాను. నాకీ జన్మలో అది లభ్యం అవుతుందో లేదో." ఈ మాటలకు సమాధానం చెబుదామని నారాయణరావు గొంతు సవరించుకొంటుండగా లోపల్నుంచి ఈ మాటలు వింటున్న వెంకమ్మగారు "అమ్మాయీ! లోపలకురా!" అన్నది. నారాయణరావు తప్పుకొని త్రోవ ఇవ్వగా ఫతీమా లోపలకు వెళ్ళింది వెంకమ్మగారు ఫతీమాను ఆప్యాయంగా ఆదరించింది. అమిత వాత్సల్యంతో, కన్నతల్లిలాగా ఆమె ఫతీమాను కుశలప్రశ్నాదికం చేసింది. ఆమె వాత్సల్య మాధుర్యానికి, స్నిగ్ధహాస్యానికి, ఫతీమా చాలా మానసికస్వాస్థ్యం పొందింది. వెంకమ్మగారు అన్నది. "తెలుగునేలలో ఏడుకొండలపైన వేంచేసి ఉన్న శ్రీనివాసుడు అలమేలు మంగతాయారమ్మతోపాటు బీబీనాంచారమ్మనుకూడా ఆదరించాడుకదా. మరి నా బిడ్డ నారాయణ

రావు ఈ బూబమ్మను ఏలుకుంటే తప్పేమున్నది" అంటూ మందహాసం చెయ్యగా ఫతీమాకు ఆ ఇంటి కోడలు అయినంత ఆనందమైంది. వెంకమ్మగారి హృదయంలోని, భావాలలోని, మాటలలోని, చేతలలోని, నిష్కాపట్యానికి ఫతీమా మురిసి పోయింది. తరువాత వెంకమ్మగారి బలవంతంచేత వెంకట నర్సమ్మ ఫతీమాకు పసుపు కుంకుమ, పళ్ళు తాంబూలము ఇచ్చింది. ఇంట్లో గడివిప్పని చీరె ఉండగా అదికూడా పసుపు కుంకుమతోపాటు ఫతీమాకు వెంకమ్మగారు పెట్టించినారు. మిక్కిలి వినయంతో కృతజ్ఞతతో వాటన్నిటినీ దేవతాప్రసాదం లాగా ఫతీమా తీసుకుని కళ్ళకు అద్దుకున్నది. తరువాత వెంకమ్మ గారు లోపలకు వెళ్ళి పార్వతమ్మగారి పట్టుతాప్తా తెచ్చింది. ఫతీమాకు దగ్గరగా వచ్చి కూర్చుంది. వెంకటనర్సమ్మను పద్మావత మ్మను పిల్లలను దూరంగా పంపి నారాయణరావును లోపలకు రమ్మన్నది. నారాయణరావు లోపలకు రాగా

వెంకమ్మగారు ఫతీమాతో ఇట్లా ప్రసంగించింది. "అమ్మాయ్, వీడు నా చెల్లెలు కుమారుడు. నాకు వీడు దత్తపుత్రుడే. నా కెందుకో వీడంటే నా స్వంతబిడ్డకంటె ఎక్కువ అనిపిస్తుంది వాడికి నువ్వు ప్రియురాలివి!" అంటూ ఫతీమా చిబుకాన్ని పుణికింది. ఫతీమా పరవశురాలైంది. వెంకమ్మగారు "మీ ఇద్ద రినీ చూస్తూంటే ఎంత రమ్యమైన దాంపత్యం అవుతుందా! అనుకుంటున్నాను. కాని లౌకికమైన అవాంతరాల కారణంగా మీ దాంపత్యం సాధ్యపడదేమో ననిపిస్తోంది. ఏదో బలవత్తర

మైన దైవికశక్తి పూనుకోకపోతే మీ ఇద్దరి సాంగత్యం సంభవం కాకపోవచ్చు. 'మతం' ఒక సాధారణమైన లౌకిక వ్యవస్థ. నిజంగా మా మతానికి మతమనే పేరే లేదు. అది అనాదిగా సృష్టితోసహా ఉన్నది. ప్రేమ అలౌకికంగా జన్మాంతర సిద్ధమై బలంగా ఉన్నప్పుడు- దానికి శిష్టజనుల ఆశీర్బలం ఉన్నప్పుడు- మతాతీతంగా ప్రేమను నడుపుకోవడంలో దోషం లేదేమోనని నే ననుకుంటున్నాను. అట్టి ఉత్తమ ప్రేమకు దైవానుకూల్యం కూడా లభిస్తుందని నా నమ్మకం. ప్రేమమతాతీతంగా వర్ధిల్లి సఫలీకృతం కావాలంటే ఇతోధికంగా పెద్దల అశీస్సులూ దైవానుగ్రహం సాధించుకోవలసి ఉంటుంది. అందుకుగాను నేను చేయవలసిన సహాయం నేను చేస్తున్నాను.'' అంటూ ఆమె ఫతీమాకు ఇంకా దగ్గరగా జరిగి ఫతీమామీద పార్వతమ్మగారి పట్టుతాప్తా కప్పి మళ్ళీ అన్నది; "శ్రీ అమ్మవారి అవతారమైన నా చెల్లెలు దీన్ని ప్రతినిత్యమూ ధరించింది. దీనితోనే ఇన్ని సంవత్సరాలూ ధ్యానముద్ర పూనింది. అట్లా లోకోత్తరపావిత్ర్యాన్ని గడించుకున్న పట్టుబట్ట నీకిస్తున్నాను. నేను నాచెల్లెలు కవలలము. నేను అర్ధగడియ కాలం పెద్దదాన్నిట. కాని నాచెల్లెలే మంత్రసిద్ధురాలు. మా ఇద్దరికీ వివాహం ఒక్కసారే జరిగింది. అంతకు ముందురోజు మాతండ్రిగారే మాకు ప్రథమాచార్యులై గౌరీపంచాక్షరి సౌభాగ్య విద్యా ఉపదేశించారు. మాచెల్లెలు ద్వితీయాచార్యులైన భర్తగారి అనుగ్రహంతో ఉన్నత కక్ష్యలు సాధిం

చింది. ఆమె నాకెప్పుడూ అరుణకాంతి వైభవోపేతమై, అతర్క్యమై త్రైపురమహస్సంకాశమైన శ్రీ దేవి అవతారంగానే తోస్తూ ఉండేది. ఆమెబిడ్డ నారాయణరావుకి ప్రియురాలివైన నిన్ను ఉద్ధరించడానికి నేను నాకు లభించిన సౌభాగ్యవిద్యను నీయందు పాలించదలచుకున్నాను.” అంటూ షతీమాను దగ్గరకు తీసుకుని, మూర్ధాన్ని స్పృశించి, పట్టుతాపితాముసుగువేసి, సలక్షణంగా అక్షరమాలా యుక్తఆరోహణావరోహణాదిప్రక్రియలతో సాంగోపాంగంగా ఆ మంత్రరాజాన్ని ఆమె షతీమాకు అనుగ్రహించింది.

షతీమాకు తన సర్వపుణ్యఫలమూ సర్వ అదృష్టమూ రూపుకట్టి ఒక్కసారి కట్టెదుట సాక్షాత్కరించినట్లుగా అనిపించింది. వెంకమ్మగారు షతీమాకు బోధించింది - ప్రతిదినమూ త్రిసంధ్యలలోనూ తప్పక ఆజన్మాంతం జపం చెయ్యమని. వెంకమ్మగారు నారాయణరావుతో చెప్పి పార్వతమ్మగారి మంగళసూత్రాలు తెప్పించి షతీమాకు ఇప్పించింది. ‘వీటినిమార్చి నువ్వేదైనా ఆభరణం చేయించుకొని సర్వదా ధరించు. నీకు సర్వదా రక్షణము జరుగుతుంది” అనికూడా చెప్పింది. షతీమా తన శిరస్సు వెంకమ్మగారి పాదాలమీద ఉంచి మ్రొక్కింది. తరువాత నారాయణరావుకుకూడా పాదాభివందనం చేసింది. అతని పాదధూళి ధరించింది. వెంకమ్మగారు మళ్ళీ చెప్పింది. ‘ఇప్పుడు నువ్వు నిజంగా సౌభాగ్యవతివి అయ్యావు. స్త్రీకి సౌభాగ్యం కంటె కావలసింది వేరే ఏమున్నది? స్త్రీకి భర్తృస్వరూపమే

ప్రత్యక్షమైన భగవత్స్వరూపం. భర్తే స్త్రీకి సగుణబ్రహ్మమన్న మాట. సగుణ బ్రహ్మతుల్యమైన భర్తతో నిత్యప్రత్యక్షానుభవం స్త్రీ కోరేది. కాబట్టి ఉపాసనామూర్తిని భర్తృరూపంగా భావించి ధ్యానిస్తే ఫలితం కరతలామలకమే." ఈ మాటలలో ఏదో నూత్నరహస్యం ప్రస్ఫుటీకరింపబడినట్లుగా మహా నిగూఢ విషయమేమిటో స్వయంప్రకాశమైనట్లుగా ఫతీమాకు కన్నుల ఎదుట - త్రైలోక్యమోహనమై పురుషాకృతిగా పుంసాం మోహనరూపంగా శ్రీదేవి ప్రత్యక్షమైనట్లుగా భాసించి ఆ మోహనాకృతి తనకు అతి సుపరిచితమైన నారాయణరావువలె తోచగా ఆమె తిరిగి నారాయణరావు పాదాలమీద వ్రాలింది. ఆమె అర్ధనిమీలితంగా కేవలం నేత్రాలతో చూస్తున్నట్లుగా కాక, తత్త్వదతీతదృగ్విశేషంగా లోకాంతరాలను చూస్తున్న దానివలె కన్పించింది. నారాయణరావు ఆమెను లేవదీసి నిలువబెట్టగా వెంకమ్మగారువచ్చి సందెట బిగించిపట్టి శరీరాన్ని వాత్సల్యంతో స్పృశించి, చుబుకాన్ని ముద్దాడింది. అప్పుడు ఫతిమా కోలుకొని కన్నులు తెరచింది.

వెంకమ్మగారు ప్రేమతో దగ్గరకూర్చుని ఫతీమాచేత నాలుగు మెతుకులు తినిపించింది. తరువాత ఆమె ఎక్కివచ్చిన బండిలోనే ఆమె తిరిగి వెళ్ళిపోయింది. వెళ్లబోయే ముందు ఇంకోసారి వెంకమ్మగారికి, నారాయణరావుకి పాదాభివందనాలు చేసింది. వెంకమ్మగారు ఫతీమాను సందెట పట్టుకునే బండిదాకా తీసుకువచ్చి బండి ఎక్కించింది. పద్మావతమ్మ వెంకటనర్సమ్మకూడా

బండిదాకా వచ్చారు. ఫతీమా పేరుపేరు వరుసనా అందరి దగ్గరా శెలవు తీసుకున్నతర్వాత బండి కదలింది. నారాయణ రావుకూడా బయటకు వచ్చి చూస్తూనిల్చున్నాడు. బండి సందు మలుపు తిరిగేదాకా ఫతీమా నారాయణరావు వంక చూస్తూనే ఉన్నది.

# 20

ఫతీమా వెళ్ళింతర్వాత అంతా ఇంట్లోకివచ్చారు. ఫతీమాకు వెంకమ్మగారు శ్రీవిద్యా మంత్రోపదేశం చెయ్యడం అందరికీ విడ్డూరంగానే తోచింది. వెంకమ్మగారు ప్రచ్ఛన్న సాధకురాలు. ఆమెకు చిన్నతనంలోనే శ్రీవిద్య లభించింది. అప్పటినుంచీ జాగ్రత్స్వప్న సుషుప్తులలోకూడా నిత్యమననం చేస్తున్న తపస్విని. నారాయణరావుకి ఆమె శక్తి తెలుసును. అందుచేత నారాయణరావు ఆమెతో ఏమీ అనలేదు. కాని వెంకటనర్సమ్మ తన అభిప్రాయాన్ని ఆపుకోలేక "పెద్దమ్మా! ఈ తురకపిల్లకు శ్రీవిద్య ఇవ్వడం సంప్రదాయానికి విరుద్ధం కదా!" అని అన్నది. ఆమాటలకు వెంకమ్మగారు చిరునవ్వు నవ్వి "అమ్మాయీ! బ్రహ్మవిద్యా రహస్యాలు సంప్రదాయాలు సుగమాలు కావు. ఇటువంటి విషయాలలో ఏది సంప్రదాయమో, ఏది సంప్రదాయ విరుద్ధమో సాధకులకే తెలిసిన సంగతి. ఎవరికీ ఉపదేశంచేసే అభిలాష లేని నాకు - ఫతీమాను చూడగానే మంత్రోపదేశం చేయాలనే సంకల్పం కలిగింది.

అదే శ్రీ అమ్మవారి ఇచ్ఛ అని నేను గ్రహించి - ఉపదేశం చేశాను. అది అట్లాఉంచు. అనేకవిషయాలు సామాన్యదృ సంప్రదాయ విరుద్ధంగా కనిపిస్తాయి. కాని అవి అనుభవవిరుద్ధాలు కానప్పుడు విప్రతిపత్తి లేదు. మన భారతదేశంలో అనేకమంది అన్యమతస్థులు సనాతన మతప్రాంగణంలోకి వచ్చి మనసాధనా రహస్యాలు ఆకళింపుచేసుకుని సిద్ధిపొందినట్లు మన చరిత్రలు చెబుతూనే ఉన్నాయి. ఆసిద్ధపురుషులు రచించిన గేయాలు, ఇతర రచనలూ - నేటిదాకా ఉండనే ఉన్నాయి. ఆగేయాలూ గ్రంథాలూ చూస్తే - ఆ సిద్ధపురుషుల మహా తపశ్శక్తి ఎంతగొప్పదో నేటికీ ద్యోతకం అవుతూనే ఉన్నది. కబీరుదాసుకథ తెలియనివాళ్లు మనదేశంలో ఎవరున్నారు. మన ఆంధ్రులంతా మహాభక్తుడని మురిసిపోతూన్న భద్రాచల రామదాసు కబీరుదాసుకి ప్రత్యక్ష శిష్యుడేకదా! కబీరుదాస్ లాగానే నిర్గుణభక్తికవులైన గురునానక్, చాదూదయాళ్, రవిదాస్, మలూకాదాస్ మొదలగు వాళ్ళంతా సంఘంలో నిమ్నజాతులకు సంబంధించినవాళ్లేకదా. మన రామదాసుకథలో కూడా శ్రీరామచంద్ర ప్రభువు తానీషాను దివ్యదర్శనంతో అనుగ్రహించలేదా? కబీరుదాసుయొక్క అచంచల ప్రగాఢ శీలం తెలిసిన తర్వాత సనాతనుడైన రామానందయోగికికూడా అతణ్ణి శిష్యుడుగ స్వీకరింపక తప్పలేదు. ఉత్తరదేశంలో కృష్ణ భక్తుడై ప్రసిద్ధుడైన రసఖాన్ చరిత్ర మరీ చిత్రంగా ఉన్నది. అతడు సౌందర్యోన్మాది. సుందరమైన స్త్రీపురుషులు ఎవరు

కన్పించినా ఆలింగనం చేసుకునే వాడట. అతడు సుల్తానువారి బంధువు. అతని బెడద అన్నిమతాలవారికీ దుస్సహమే అయింది. చివరకు అతనికి తెలిసింది. గోపాలకృష్ణుడు సర్వమానవ సౌంద ర్యాన్ని తృణీకరింపగల కందర్పశతకోటి సుందరుడని. అంతే. ఆరోజునుంచీ రసఖాను కృష్ణభక్తుడైనాడు. శ్రీకృష్ణుని దివ్య మంగళవిగ్రహాన్ని వర్ణిస్తూ అనేకపాటలు రచించినాడు. భక్తా గ్రేసరుడై సిద్ధిపొందాడు. అతనికి బృందావన శ్రీకృష్ణమంది రంలో అమితమైన గౌరవసత్కారాలు జరిగాయి.

"భక్తిద్రావిడ ఊపజీ లాయే రామానంద్" అనిహిందీలో అభియుక్తి. ద్రావిడదేశంలో ఆళ్వార్లు నయనార్లు పోషించినది ప్రపత్తి ప్రధానమైనభక్తి. ఆళ్వార్లలో నయనార్లలో ఎందరు నిమ్నజాతివాళ్లు లేరు? మొన్నమొన్న . చిత్రమైన సంగతి విన్నాము. ఉత్తరదేశంలో ఒక మహమ్మదీయుడు సంగీతంలో మహావిద్వాంసుడు. ఆయన శ్రీకృష్ణభక్తుడు. కృష్ణభక్తిని గురించి ఆయన ఆంగ్లంలో ఒక గ్రంథంకూడా రచించాడని వింటున్నాము. ఆయనకు శుశ్రూషచేసి అనేకమంది హిందూ బాలురుకూడా సంగీతం నేర్చుకున్నారు. అందులో ఒకడు ఆయన్ను దాదాపు పుష్కరం సేవించి మహావిద్వాంసు డై నాడు. ఆఖరి రోజున అతను గురువుదగ్గర శెలవు తీసుకుంటూ ఉండగా గురువు అన్నాడు. "నాయనా! ఈరోజు నువ్వు నా కంటె మహావిద్వాంసుడవు. నీవల్ల నాకీర్తి నిలుస్తుంది. నాకు చాలా సంతోషంగా ఉన్నది. నీకు ఇష్టమైన దేదైనా కోరుకో,

ఇవ్వాలని ఉంది" అన్నాడు. శిష్యుడు తటపటాయిస్తూ భయ పడుతూ గురువుగారికి విన్నవించాడు. గురువుగారికి ఒక్కతే కూతురు. ఆమెను సర్వస్వంగా పెంచుకుంటున్నాడు. తా నామెను ప్రేమించాననీ - ఆమెకూడా తన్ను ప్రేమించిందనీ - తమ ఇద్దరికీ వివాహం చెయ్యవలసినదనీ శిష్యుడు అభ్యర్థించాడు. అసంప్రదాయకమైన శిష్యుని వాంఛకు గురువుగారు చాలా ఖిన్నుడైనాడు. కాని తను మాట ఇచ్చాడు కదా! కుమార్తెను పిలచి ఆమె అభిప్రాయం అడిగాడు. ఆమె శిష్యుణ్ణి ప్రేమించినమాట నిజమేనని చెప్పింది. గురువుగారికి ఏమీ తోచలేదు. శిష్యునితో "రేపు మాటాడుదాంలే" అన్నాడు. ఆరాత్రి అంతా తన ఇష్టదైవమైన శ్రీకృష్ణపరమాత్మను ధ్యానించాడు. తెల్లవారుఝామున స్వప్నం వచ్చింది. అందులో పరమాత్మ ఏదో అస్పష్టంగా తనకు త్రోవ చూపించినట్లుగా అనిపించింది. మర్నాడు శిష్యుణ్ణి పిలిపించి గురువు కాశీకి పద మన్నాడు. అక్కడ తన కుమార్తెను ఇస్తానన్నాడు. కాశీలో శ్రీ విశ్వనాథుని మందిర సమీపంలో తన కుమార్తెచేత ముమ్మారు గంగాస్నానం చేయించి అప్పుడు శిష్యుడితో అన్నాట్ట. "నాయనా గంగాదేవి పరమపావని. మహాపతితుల్ని కూడా పరమపావనుల్ని చేస్తుంది. నా కుమార్తె ఈ గంగా స్నానంవల్ల పవిత్ర అయింది. ఇకనుంచి దీనిపేరు గంగాసుత. ఇక ఈమె నీది. స్వీకరించు." అని కుమార్తెను అతనివెంటపంపి తాను తన స్వస్థలానికి వెళ్లిపోయాడట. అతను నిజంగా గొప్ప

పని చేశాడు. గంగామాత - ఢిల్లీసుల్తాను కూతురు - లవంగి పవిత్రమైన స్త్రీ అని రుజువుచేస్తే - ఈ సంగీతవిద్వాంసుని కూతున్నమాత్రం పవిత్రమైందిగా ఎందుకు చెయ్యలేదు? గంగామాతకు ధనికులనీ సుల్తానులనీ ప్రత్యేకాభిమానం లేదుగా! ఇవన్నీ సామాన్యుల కథలు. అసామాన్యుల గాథలు కూడా ఇట్లాగే ఉన్నాయి.

శ్రీశంకర భగవత్పాదాచార్యులవారికంటే విజ్ఞానంలో ఔన్నత్యం సాధించినవారుగాని, అంతకంటే పూజ్యులుగాని, పవిత్రులుగాని, మానవజాతి చరిత్రలోనే లేరు. ఆయన మీమాంసాభాష్యంలో "సర్వేషాంచ అధికారో విద్యాయాం పరంచ శ్రేయః" అని వ్రాశారు. "ఛండాలోస్తు సత్ ద్విజోస్తు" అన్న వారిమాటలు లోకప్రసిద్ధమేగా. భక్తవరేణ్యులైన శ్రీ భగవద్రామానుజాచార్యులవారు అష్టాక్షరీ మహామంత్రాన్ని లోకోద్ధరణ నిమిత్తం దేవాలయ గోపురంమీదనుంచి అందరికీ వినిపించలా? బ్రహ్మాండపురాణంలో శ్రీదేవి మహాత్మ్యం వివరించే సందర్భంలో "వర్ణాశ్రమ విహీనానాం - పాపిష్ఠానాం - నృణామపి, యద్రూపధ్యానమాత్రేణ దుష్కృతం సుకృతాయతే" అని ఉండనే ఉన్నది. అంచేత ఒకసారి స్మరిస్తే చాలు అమ్మవారు అందరికీ స్త్రీవిద్యాగ్రహణ యోగ్యత ఇవ్వనే ఇస్తుంది.

బ్రహ్మవిద్యకు మహావాక్యోపదేశం, తద్భావానుభవం పరిపూర్ణస్థితి. మహావాక్య ప్రాప్తి తురీయాశ్రమంలోగాని లేక

శ్రీవిద్యాపూర్ణ దీక్షలోగాని లభిస్తుంది. మూడోమార్గం లేనే లేదు. గృహస్థునికి మహావాక్యప్రాప్తికి బ్రహ్మజ్ఞాన పరికరమంతా శ్రీవిద్యాపూర్ణ దీక్షలో లభిస్తున్నది. కాబట్టి న్యాయంగా ఆలోచిస్తే క్రమమైన మహావాక్యోపదేశం లేందే భాష్యపఠన పాఠన అధికారంకూడా కన్పడదు. నిజంగా అట్టి భాష్యపఠన పాఠనావ్యాసంగం కల గృహస్థులంతా శ్రీవిద్యా పూర్ణదీక్షగైకొన్నవాళ్లు కారే? ఆవిద్వాంసులంతా అసాంప్రదాయికులేనా?

బ్రాహ్మణస్త్రీలకు క్షత్రియాది త్రైవర్ణికులకు శ్రీవిద్యలో బాలాపంచదశలవరకే అధికారం. అగస్త్యమహర్షి భార్య లోపాముద్రాదేవి. ఆమె క్షత్రియకన్య. ఆమెకు అధికారం ఎట్లావచ్చింది? కాని శ్రీవిద్యలో ఆమె మంత్రద్రష్ట కూడా అయింది. శ్రీవిద్యకు దక్షిణామూర్తిఋషి ప్రథమంలో. కాది విద్య శివవిరచితం. లోపాముద్రాదేవి కాది విద్యను హాదివిద్య చేసింది. నాటినుండి అమ్మవారు 'కాదిహాదిస్వరూపిణి' అయింది. శ్రీవిద్యా అధికారం లేకుండా లోపాముద్రాదేవి మంత్రద్రష్ట అయినగాథ మనోహరంగా ఉంటుంది.

ఆమెకు యుక్తవయస్సురాగా తండ్రిగారు స్వయంవరం జరుపుతామన్నారు. అదివరకే అగస్త్యమహర్షి సముద్రాన్ని ఆపోశన పట్టడం, వాతాపిని జీర్ణించుకోవడం లాంటి సంగతులు ఆమె వినిఉన్నది. అందుకని ఆమె తండ్రితో చెప్పింది. తాను నశ్వరమైన క్షత్రియపౌరుషాన్ని వరించడం లేదన్నది. సముద్రాన్ని ఆపోశన పట్టగలవానికంటె ప్రతాపవంతు డెవరు?

తానిదివరకే అగస్త్య మహర్షిని ప్రాణేశ్వరునిగా స్వీకరించానని కూడా చెప్పింది. కన్యను స్వీకరించమని అగస్త్యమహర్షికి కబురు పంపారు తండ్రిగారు. "బ్రాహ్మణుడై వనాలలో కంద మూలాలు తింటూ కాలక్షేపం చేస్తూన్న తనకు ఈరాజకన్య ఎందుకు?" అని అగస్త్యులవారు తిరస్కరించారు. ఆ తిరస్కారానికి లోపాముద్రాదేవి దుఃఖించింది. రాజగురువుల్ని, మహర్షుల్ని మార్గం చూపమని ప్రాధేయపడింది. వాళ్ళన్నారు - ఇందుకు శ్రీదేవి పాదాలు ఆశ్రయించడంకన్నా వేరేమార్గం లేదు. కాని నీకు శ్రీవిద్యాదీక్ష ఉపదేశం పొందడానికి అర్హత లేదు. కాబట్టి నువ్వే కేవలం అనన్య భక్తిభావన చేత శ్రీవిద్యను దర్శించి మంత్రద్రష్ట కావాలి. ఆపైనఅంతా పుష్పాపచయమే. లోపాముద్రాదేవి త్రికరణశుద్ధిగా శ్రీదేవి పాదాలు ఆశ్రయించింది. అమ్మవారు తపస్సుచేసి పరమేశ్వరుణ్ణి పొందింది. కనుక తపోవ్యగ్రత్వం కల భక్తురాండ్రను తప్పక కరుణిస్తుంది. అమ్మవారి పాదాలమీద దృష్టినిలిపి తాను అగస్త్యులవారియందు పూనిన పాతివ్రత్యం నిష్కల్మషం అయినదైతే తనకు శ్రీవిద్య భాసించాలని ఆమె శపథంచేసింది. ఆమె మనస్సులో శ్రీవిద్య హాదివిద్యగా భాసించి ఆమెను మంత్రద్రష్టను చేసింది. లోపాముద్రాదేవి హాదివిద్యను ఉపాసించగా శ్రీదేవి తన భక్తులు తన్ను సేవిస్తూండగా సన్నిధానం ప్రసాదించింది. శ్రీదేవి లోపాముద్రాదేవిని ఏమికావాలి అని అడుగగా లోపాముద్రాదేవి అగస్త్యులవారిని భర్తగా ప్రసాదించమని

కోరింది. శ్రీదేవి ఆశీర్వచనంతో లోపాముద్రా అగస్త్యులు దంపతులయ్యారు. అగస్త్యులవారితో సహా లోపాముద్రా దేవికూడా శ్రీవిద్యా చక్రవర్తులలో ముఖ్యస్థానంలో ఉన్నది.

నేను ఫతీమాకు లోపాముద్రాదేవి అర్చనా విధానం చెప్పాను. మహాసుకృతులై కారణజన్ములైనవారికి వర్ణాశ్రమాధారమైనపాత్రతాపాత్రత నిర్ణయింపవలసిన పనిలేదు. అనుష్ఠించేవారు సక్రమంగా అనుష్ఠిస్తే ఈవిద్య ఈ నాటికీ ఫలితం ఇస్తూనే ఉన్నది. అందుకు ఉదాహరణ మీ తలితండ్రులు పార్వతమ్మ పరమేశ్వరరావుగార్లే. స్త్రీ - విగతభర్తృక ఐన నాంవటి స్త్రీకూడా - పుత్ర సంతానం కలిగి ఉంటే - మంత్రోపదేశం చేయవచ్చునని ఆగమాలు అంగీకరిస్తున్నాయి. గురువు తానంతటనే అనుగ్రహిస్తే ఎనిమిది రెట్లు ఫలం.

నారాయణరావు సత్కులంలో పుట్టినవాడు. సంప్రదాయనిష్ఠ కలవాడు. ఫతీమా నిశ్చలమై దృఢమైన మనస్సు కలది. నారాయణరావును భగవంతుడుగా ఆరాధిస్తున్నది. ఈ విచిత్ర పరిస్థితుల్లో అమ్మవారి అభిప్రాయం ఎట్లా ఉన్నదో - ఫతీమా - నిర్విఘ్నంగా శ్రీవిద్యను ఉపాసిస్తే ఫలసిద్ధి ఎట్లా ఉంటుందో-సంప్రదాయశుద్ధుడైననారాయణరావును ఈ మ్లేచ్ఛకన్య తపస్సు ఏమిచేస్తుందో - అసలు నారాయణరావు ఈ మోహినీదేవిపై వ్యామోహాన్నీ ఎట్లా నిలువత్రొక్కు

కుంటాడో భవిష్యత్తులో చూడవలసిన విషయాలు. నారాయణరావు నాబిడ్డ. షతీమా నాశిష్య."

# 21

ప్రతిదినం సాయంకాలం నారాయణరావు తండ్రిగారి సమాధివద్దకువెళ్ళి ప్రదక్షిణీకరించి, సాష్టాంగముచేసి, రామస్వామికి నమస్కరించి, శివాలయానికివెళ్ళి వస్తున్నాడు. పరమేశ్వరరావుగారి సమాధికి నిత్యధూపదీప నైవేద్యాలకు వెంకటకృష్ణయ్యచౌదరిగారు ఏర్పాటు చేశారు. రామస్వామి అట్లాగే కూర్చుని ఉన్నాడు. అతనిచుట్టూ ప్రదేశం పరిశుభ్రమై, మొదటి రోజులలో హరిజనులచేతా ఆ తరువాత అన్నివర్ణములవారిచేతా, సేవ్యమై మహాక్షేత్రంగా మారిపోయింది. అక్కడ ముందుగా పెద్దపందిరి వెలిసింది. పందిరిపోయి అక్కడ పెద్ద మంటపమే తయారైంది. అందులో కథాకాలక్షేపాలు. అవిరళ రామనామ సంకీర్తన. పిన్నలూ - మహాపండితులూ వచ్చి రామస్వామికికాదు రామయోగికి సాష్టాంగదండ ప్రణామాలు చేసి పోవటాలు. స్త్రీలసంగతి చెప్పక్కర్లేదు. దీర్ఘ రోగాల వాళ్లు, సంతానంలేనివాళ్లు, భూతగ్రస్తులు, మానసిక రోగాలవాళ్ళు, ప్రాణాచారాలు పడటంవరకూ వచ్చింది. రామస్వామి - రామయోగి - ఆడూళ్ళో ఒక ప్రత్యక్ష దైవంగా వెలసినట్లు అయింది. ఆ మంటపం రామయోగి మందిరంగా ప్రసిద్ధమైపోయింది. ఆ పెద్ద మంటపంలో

రామస్వామిమాత్రం ఏమీ పట్టించుకోకుండా నిశ్చలమైన సంతత యోగసమాధినిష్ఠుడై పద్మాసనంలో ఉన్నాడు. వచ్చిన వాళ్ళంతా రామస్వామి యోగమందిరంవద్దా - పరమేశ్వర రావుగారి సమాధివద్దా కానుకలు ఇస్తున్నారు. పెద్దహుండీలు వెలసినాయి. అటు సమాధి, ఇటు రాజయోగిమందిరం - రెండూ కలసిపోయి ఏకవ్యవస్థారూపం పొందినాయి. ఉత్సాహ వంతులైన యువకులు, అన్నివర్ణాలవారు పాలకవర్గంగా ఏర్ప డ్డారు. పాలకవర్గానికి వెంకట కృష్ణయ్యచౌదరిగారే అధ్య క్షులు. నెలరోజులు తిరిగేటప్పటికే ఆ ఊరు ఒక మహా క్షేత్రమై, ప్రముఖయాత్రాస్థలంగా మారిపోయింది. ఊరికి క్రొత్తదశపట్టింది. ఊరే నిత్యకళ్యాణ మంటపంగా ఐపోయింది. యాత్రాజనంతో చిన్నచిన్న దుకాణాలవాళ్ళు, పళ్ళ అంగళ్ళ వాళ్ళు, హోటళ్ళవాళ్ళు చాలఎక్కువగా బాగు పడ్డారు.

మొదటినెల మాసికం, త్రైపక్షికం వెళ్ళగానే వెంకట నర్సమ్మ, పద్మావతమ్మ వెళ్ళిపోయారు. వెంకమ్మగారు పిల్లలనూ నారాయణరావునూ కనిపెట్టుకుని ఉన్నది. నారాయణరావు ఉద్యోగంకోసం అనేక ప్రయత్నాలు చేశాడు. మిత్రుడు గంగాధరరావుకోసం ప్రయత్నం చెయ్యగా అతను తటస్థపడనే లేదు. రమణయ్యగారిని, వేంకటేశ్వరరావుని సంప్రతించాడు. వాళ్ళేమీ చెయ్యలేక పోయారు. ఊళ్ళోనూ, తాలూ కాఫీసులోనూ, తన తండ్రిగారి పూర్వస్నేహితులందర్నీ

చూచాడు. అంతా అమితమైన సానుభూతిచూపుతూ ప్రేమగా మాటాడేవాళ్ళేగాని, ఫలితం మాత్రం కన్పించడంలేదు.

ఒకనాడు నారాయణరావు తాసిల్దారు జగన్నాథరావు నాయుడుగారిని చూచాడు. ఆయన నారాయణరావును ప్రేమతో ఆదరించి తన ఇంటికి తీసుకెళ్ళి కాఫీఇచ్చి "విశేషాలు ఏమిటి" అన్నాడు. నారాయణరావు తన ఉద్యోగప్రయత్నం చెప్పాడు. నారాయణరావు చెప్పినదంతావిని ఆయన సమాధానంగా ఇట్లా అన్నాడు. "సర్వీసు కమీషను ప్యాసుకాందే ఏమిన్నీ లాభంలేదు. టెంపరరీగా ఉద్యోగం ఇవ్వడానిక్కూడా కలెక్టరాఫీసువాళ్ళు చెయ్యవలసిందే. నావల్లకాదు. మీ తండ్రిగారి మంచితనాన్నిబట్టి నీకు సాయంచెయ్యాలనిఉన్నది. కాని మార్గం కన్పించటం లేదు. అంతేగాక నిన్నుగురించి మన జిల్లాలో విచిత్రమైన వార్తలు ప్రచారంలో ఉన్నాయి. నువ్వు మా కలెక్టరు సాయిబుగారి కుమార్తెకు పెద్దద్రోహం చేశావుట. కనుక నీమీద కలెక్టరుగారికి ఆగ్రహంగా ఉన్నదట. ఈ పరిస్థితులలో నీకు సాయం చెయ్యాలని ప్రయత్నిస్తే సాయంచెయ్యడానికి పూనుకున్నవాళ్లే కలెక్టరుగారి ఆగ్రహానికి గురికావచ్చు. ఈ కారణంచేత మన జిల్లాలో ప్రస్తుతము నీకెవ్వరూ సాయం చెయ్యక పోవచ్చు. ఇతరత్రా ప్రయత్నం చేస్తే బాగుంటుంది. మీ తండ్రిగారిమీద నాకున్న గౌరవం మూలాన నీకు ఈ రహస్యాలు చెప్పాను. ఏమీ అనుకోకు" అని ఊరడించి పంపారు. నారాయణరావుకి తనపైన ప్రచా

రంలో ఉన్న సంగతులు తెలిసినై. ఇక కృష్ణాజిల్లాలో ఉద్యోగ ప్రయత్నం చేసి లాభంలేదని నిశ్చయపరచుకున్నాడు.

రెండోనెల మాసికం వెళ్ళిన తర్వాత మూడోనెలలో మంచిరోజు చూచి ఇల్లు తెరచి శుభ్రంచేయించాడు. పుణ్యాహవాచకం జరిపించాడు. నారాయణరావు మళ్ళా ఆ ఇంట్లోకి కాపురం మార్చాడు. చేతిలో ఉన్న డబ్బు ఖర్చుకాకుండానే ఉద్యోగం సంపాదించాలని నారాయణరావుకి తొందరపుట్టింది.

ఇంటిమీద అప్పు రోజు రోజుకీ పెరుగుతోంది. ఎంత త్వరలోతీరిస్తే అంత మంచిది. అప్పుతీర్చడానికి మార్గం కన్పించడంలేదు. అట్లాగే ఉంచితే చివరకు ఊరికే ఇల్లు పోగొట్టుకోవలసివస్తుందేమో. నారాయణరావు మేనమామతో ఆలోచించి ఇల్లు బేరంపెట్టాడు. చాలామంది వచ్చి చూచారు. చివరకు ఆరువేలకు బేరం ఖరారైంది. డబ్బుచేతికిరాగానే నారాయణరావు రమణయ్యగారిదగ్గరకు వెళ్ళి అప్పు తీరుద్దామన్నాడు. ఆయన నారాయణరావును వెంటబెట్టుకుని వకీలు రామచంద్రయ్యగారి వద్దకు తీసుకువెళ్ళాడు. వకీలు రామచంద్రయ్యగారి దగ్గరే పర్వమేశ్వరరావుగారు ఇల్లు తనఖాతో అప్పుతెచ్చింది. వచ్చిన విషయం రమణయ్యగారు చెప్పగా, రామచంద్రయ్యగారు తనఖా పత్రం తెచ్చి చూచిరావలసిన మొత్తం లెఖకట్టారు. రమణయ్యగారు రామచంద్రయ్యగారితో మనవిగా "అయ్యా తనఖాపత్రంలో రూపాయ వడ్డీ వ్రాసిఉన్నది. పిల్లలు చిన్నవాళ్ళు. నారాయణరావుకి ఇంకా

ఏ ఉద్యోగమూ దొరకలేదు. మీరు అభిమానించి వడ్డీలో రాహితీ చేసుకోవలసినది" అని అన్నారు. రామచంద్రయ్య గారు అంగీకరించలేదు. లెఖప్రకారం ఇవ్వవలసిన మొత్తం అంతా ఇచ్చి బయటకు వచ్చిన తర్వాత రమణయ్యగారు నారాయణరావు ముందు రామచంద్రయ్యగారిని నానాతిట్లు తిట్టారు. విశ్వాసం లేనివాడనీ - తనతండ్రికి పరమేశ్వరరావు గారి తండ్రి పెద్దభవంతి - సుక్షేత్రమైన పదెకరాల భూమీ ఇచ్చి అభివృద్ధికి తీసుకురాగా - తాను పరమేశ్వరరావుగారి పిల్లలకు వడ్డీలో స్వల్పమైన అభిమానం చూపించలేకపోయా డని. ఏమనుకున్నా ఏమిలాభమున్నదని నారాయణరావు ఊరుకున్నాడు.

మర్నాడు సూర్యోదయానికిముందే వకీలు రామచంద్రయ్యగారు రమణయ్యగారిని వెంటబెట్టుకుని నారాయణ రావువద్దకురాగా అతనికి కారణము తెలియక తికమక పడ్డాడు. ఆయన ఆసమయంలో ఎందుకువచ్చాడో నారాయణరావుకి అర్థం కాలేదు. నారాయణరావు వాళ్ళిద్దరినీ కూర్చుండమని చాపవేశాడు. వాళ్ళు కూర్చున్నతర్వాత రామచంద్రయ్యగారు తనరాకకు కారణం చెప్పడానికి ఉపక్రమించారు.

తమతల్లిగారు తొంభైఏళ్ళ వృద్ధు ఇంకా బ్రతికిఉన్న దట. వీరభద్రయ్యగారు పెద్దభవంతి భూమి తనభర్తకు ఇచ్చిన సంగతులు ఆమెకు జ్ఞాకం ఉండడమే కాకుండా నిత్యస్మరణం చేస్తుందిట. ఆమె అప్పుడప్పుడు పరమేశ్వరరావుగారి కుటుంబ

క్షేమాలు అడుగుతూ ఉంటుందిట. చిత్రంగా ఆమె నిన్న సాయంకాలమే రామచంద్రయ్యగారిని ప్రశ్నించిందట పర మేశ్వరరావుగారి యోగక్షేమాలనుగురించి. అప్పుడే రామ చంద్రయ్యగారు ఆమెకు పరమేశ్వరరావుగారి స్వచ్ఛంద మరణవృత్తాంతమూ, పార్వతమ్మగారి సహగమనవృత్తాంతమూ చెప్పగా ఆమె దుఃఖపడినదట. ఆసందర్భంలోనే పరమేశ్వర రావుగారి కుమారుడు ఇల్లు అమ్మి తనబాకీ యావత్తూ అసలు ఫాయిదాలుతోసహా తీర్చినాడని చెప్పగా ఆమె విలవిల వేడ్చి "ఓరి నిర్భాగ్యుడా! వాళ్ళు మనఇల్లు నిలబెట్టినవాళ్ళు. నీ తండ్రిగారికి ఈ ఇల్లు సుక్షేత్రమైన పదెకరాలభూమి ఇచ్చిన వాళ్ళు. వాళ్ళు ఆపదలో ఉండి ఇల్లు అమ్ముకుంటుంటే నీకు శక్తి ఉండికూడా వాళ్ళ ఇల్లు నిలబెట్టలేక పోయావు పోనీ! కృత ఘ్నుడా! ఏముఖంపెట్టుకుని వడ్డీ వసూలు చేశావురా! వాళ్ళి చ్చిన మూడువేలగజాల నివేశనస్థలంలో నేటికి మనఇల్లు వాళ్ళ నడుమఅయింది. నువ్వు ఇంటిచుట్టూ దుకాణాలుకట్టి నెలకు మూడువేలకుపైగా అద్దెలు పోసుకుంటున్నావు. ఇదిఅంతా వాళ్ళచలవేగా! వాళ్ళవద్ద వడ్డీ ఎట్లాతీసుకున్నావురా! అప్రాచ్యుడా! వడ్డీసొమ్ము తిరిగి ఇచ్చి వచ్చేదాకా నేను గంగ ముట్టను" అని భీష్మించుకుని కూర్చున్నదట.

రామచంద్రయ్యగారు విధిలేక రమణయ్యగారిని పిలుచు కొని వచ్చాడు. వడ్డీకిగాను తీసుకున్న సొమ్ము యావత్తూ నారాయణరావుచేతిలోపెట్టి వెళ్ళాడు. నారాయణరావు

ఆయన్ను కృతజ్ఞతలతో సాగనంపాడు. నారాయణరావు ఆ సొమ్మును సద్వినియోగం చేశాడు. ఆసొమ్ముతో పశుశాలను కాపురానికి యోగ్యంగా మార్చివేశాడు. అందులోకి కాపురం మార్చి ఇంటిని కొన్నాళ్ళకు స్వాధీనంచేశాడు.

ఇల్లు అమ్మకం విషయంలోకూడా తమాషా జరిగింది. ఇల్లు కొన్నది జగన్నాథశాస్త్రిగారనే పెద్ద భూస్వామి. ఆయనకు స్వంతఇల్లు ఉన్నది. ఆయనకు మగసంతానంలేదు. పరమేశ్వరరావుగారు మహర్షివంటివాడనీ, ఆయన తపస్సుచేసిన ఇంట్లో కాపురం ఉంటే అభివృద్ధికి రాగలమనీ ఆశించి జగన్నాథశాస్త్రిగారా ఇల్లు కొన్నారు. జగన్నాథశాస్త్రిగారు ముఖ్యమైన పనులమీద కాకినాడవెళ్తూ - తన పెద్ద గుమాస్తాగా ఉన్న హరిశాస్త్రిని ఇల్లు అగ్రిమెంటు వ్రాయించి పని పూర్తిచెయ్యమని చెప్పివెళ్లారు. వెయ్యిరూపాయ లుబజానా ఇచ్చి మిగిలిన సొమ్ము పదిరోజుల్లోఇచ్చి దస్తావేజు వ్రాయించుకునేటట్లు, అట్లాజరక్కపోతే బజానా సొమ్ము వదులుకునేటట్లు హరిశాస్త్రి ఖరారువ్రాసిఇచ్చాడు. కాని జగన్నాథశాస్త్రిగారు కాకినాడనుంచి రాకపోవడంచేతనో హరిశాస్త్రి బద్ధకంచేతనో పదిరోజులలో అనుకున్న ప్రకారం సొమ్ము తెచ్చిఇచ్చి దస్తావేజు వ్రాయించుకోలేదు. ఖరారు షరతులప్రకారం బజానా ఇచ్చినసొమ్ము తిరిగి ఇవ్వక్కర్లేదు. విక్రయదస్తావేజు వ్రాసి ఇవ్వాక్కర్లేదు. రమణయ్యగారు ఆవిధంగా సలహాచెప్పి ఇతరత్రా ఇంకో వెయ్యి ఎక్కువగా

బేరంతీసుకువచ్చారు. జగన్నాథశాస్త్రిగారికి విక్రయం చెయ్యక పోతే తప్పులేదని తెలిసిన్నీ నారాయణరావు సమ్మతించలేదు. నెలాపదిహేను రోజులకు జగన్నాథశాస్త్రిగారు ఊరునుండి వచ్చి, హరిశాస్త్రిద్వారా సొమ్ము పంపగా - నారాయణరావు దస్తావేజు వ్రాయించి రిజిష్టరుచేసి ఇచ్చాడు. ఆ సాయంత్రమే జగన్నాథశాస్త్రిగారికి హరిశాస్త్రిద్వారా తెలిసింది. ఊళ్లో అందరూ అనుకుంటున్నారుట - పెద్ద మోతుబరి భూస్వామి, సంపన్నుడు జగన్నాథశాస్త్రి వ్రాయించుకున్న ఖరారుప్రకారం నడచుకోక మాట తప్పి వెళ్ళితే ఏదో చేసినప్పటికీ - పరమేశ్వరరావు గారి కొడుకు తండ్రిగారికీర్తికి తగినట్లుగా పెద్దమనిషిగా వ్యవహరించాడట. ఎట్లాగైనా గుణాల్నిబట్టి మర్యాదలు కాని, ధనాల్నిబట్టి కాదుట. ఇటువంటి మాటలకు జగన్నాథశాస్త్రి గారికి తలవంపులైంది. తప్పు జరిగినమాట నిజమేనాయెను. తన వల్ల బీదవాడైన నారాయణరావుకి రెండువేల రూపాయలు నష్టము బంధువర్గంలో నిష్ఠూరాలు. ఐనా ఆ కుర్రవాడు పరమయోగ్యంగా వ్యవహరించాడు. అనుకున్న ప్రకారము జరగలేదని మాటవరసకైనా అనలేదు. జగన్నాథశాస్త్రిగారికి చీమలు జెర్రులు వంటినిండా ప్రాకినట్లుగా ఉన్నది. ఊళ్ళో తల ఎత్తుగుని తిరగటం సంభవంకాదేమోనన్నంత పరాభవం జరిగి నట్లు ఆయన భావించుకుని బాధపడ్డాడు. నారాయణరావును మనస్ఫూర్తిగా మెచ్చుకుని, తనవల్ల జరిగిన పొరపాటు దిద్దు బాటు చేసుకోవాలని శాస్త్రిగారు నిశ్చయించుకున్నారు. ఆ

మర్నాడే శాస్త్రిగారు నారాయణరావుని కలుసుకుని అధిక ధర పలికిన వెయ్యిరూపాయలు, ఖరారు షరతులు ఉల్లంఘించి నందుకు బజానా నష్టం క్రింద వెయ్యి రూపాయలు ఒకటిన్నర నెలకు మొత్తం విక్రయం సొమ్ముమీద వడ్డీ నూరురూపాయలు వెరశి రెండువేల నూరురూపాయలు అతని చేతిలో ఉంచాడు. నారాయణరావు కొంచెం పస్తాయించగా - శాస్త్రిగారు 'ఉంచ మని' కోరారు. నారాయణరావు కాదని చెప్పలేక తీసుకొని మనస్ఫూర్తిగా జగన్నాథశాస్త్రిగారికి నమస్కరించి "మీరు నిజంగా మహనీయులు" అని వినుతించాడు. ఈవిషయాలు తెలుసుగుని రమణయ్యగారు నారాయణరావుతో 'నాయనా ధర్మం ఎప్పుడూ గౌరవింపబడుతూనే ఉంటుంది. అందుకు ఈ నిదర్శనం చాలు" అని చెప్పి హృదయపూర్వకంగా నారాయణ రావు చేసినపనే తన సలహాకంటె ఉత్తమమైనదని అంగీక రించారు.

నారాయణరావుకి ఉద్యోగవిషయం పెద్ద సమస్య అయింది. తెలిసినవాళ్ళందరినీ అడిగాడు. దూరంలోఉన్న తన స్నేహితులకీ తండ్రిగారి మిత్రులకీ వ్రాశాడు. ఫలితం లేక పోయింది.

ఒకనాడు సాయంకాలం మామూలుగా సమాధిదగ్గరకు వెళ్ళి అక్కడ ప్రదక్షిణనమస్కారాలుచేసి, రామయోగి మంది రంలో నమస్కరించి, శివాలయంలో స్వామిదర్శనంచేసి వస్తుం డగా వెంకటకృష్ణయ్యచౌదరిగారు కన్పించి కుశలప్రశ్నాదికం!

చేశారు. నారాయణరావు సమాధానం చెప్పాడు. చౌదరిగారు నారాయణరావుతో "ఉద్యోగప్రయత్నాలు చేస్తున్నారా?" అన్నాడు. దానికి ప్రత్యుత్తరంగా నారాయణరావు తన ఉద్యోగ ప్రయత్నాలన్నీ నిష్ఫలంగా ఉన్నాయని వివరాలు చెప్పాడు. రేపుసాయంత్రం మా ఇంటికిరండి అని చెప్పి చౌదరి గారు వెళ్ళిపోయారు.

మర్నాడు సాయంకాలం నారాయణరావు చౌదరిగారి ఇంటికి వెళ్ళాడు. వాకిట్లోకి వెళ్ళగానే అతనికి నందమ్మ జ్ఞాపకం వచ్చింది. వెంటనే గోశాలలోకివెళ్ళి నందమ్మను చూచాడు. నందమ్మనుచూడగా అతనికి తండ్రిగారి స్మృతులువచ్చి నిస్పృహగా నుంచున్నాడు. నందమ్మకు నారాయణరావును చూడగా ప్రాణాలు లేచివచ్చినట్లై, నారాయణరావు చేయినాకి, కళ్ళనీళ్లు పెట్టుకుని అతని భుజాలమీద మూతినిపెట్టి దుఃఖించింది. నందమ్మ దుఃఖాన్ని ఆపుకోలేక 'అంబా' అని రెండు మూడు సార్లు అన్నది. లోపల ఉన్నచౌదరిగారు ఈఅరవుకు పశుశాల లోకి వచ్చారు. నారాయణరావును చూచి, ఎంతసేపైందివచ్చి అన్నారు. నారాయణరావు ప్రకృతిలో పడి ఇంతకుముందే అన్నాడు. చౌదరిగారు 'నందమ్మ ఇంకా నాన్నగారిని మరచి పోలేదు' అని అంటూ లోపలకు నడిచారు. నారాయణరావు ఆయన్ను అనుసరించాడు. నారాయణరావు కూర్చున్నతర్వాత చౌదరిగారు లోపలకువెళ్ళి నాలుగు అరటిపళ్లు, రెండుబత్తాయిలు, గుప్పెడు ద్రాక్షపళ్ళుగలపళ్ళెం తెచ్చి నారాయణ

రావు ముందు పెట్టి 'తీసుకోండి' అన్నారు. నారాయణరావు ఒకటి రెండు ద్రాక్షపళ్ళు తింటుండగా చౌదరిగారిభార్య వచ్చి కుశలప్రశ్నాదికం చేసింది. నారాయణరావు సముచితంగా సమాధానాలు చెప్పాడు. చౌదరిగారు భార్యతో "అబ్బాయి గారు ఇక్కడ ఎన్నిప్రయత్నాలు చేసినా ఉద్యోగం దొరక లేదు. అందుచేత మద్రాసువెళ్ళమనీ, మనఅల్లుడ్నిచూడమనీ చెబుతున్నాను" అని అన్నారు. ఆమె సమాధానంగా "మీ ఇష్టం. మనఅల్లుడు సంగతి మీకు తెలుసు. నాకు తెలుసు. పని ఎంతవరకు సానుకూలమౌతుందో!" అని అన్నది. చౌదరిగారు ఆమాటలకు తలఊపి "మన ప్రయత్నలోపం ఉండకూడదు!" అని అన్నారు. ఆమె లోపలకు వెళ్ళిపోయింది. చౌదరిగారి అల్లుడు చంద్రగారు పెద్దఉద్యోగి. మద్రాసులో ప్రభుత్వ కార్యాలయంలో ఒక శాఖాధిపతి. చౌదరిగారు తమఅల్లుడు పేర ఉత్తరము వ్రాసి ఇచ్చారు.

చౌదరిగారు నారాయణరావు ఇద్దరూ కలసి బయటకు వచ్చారు. పరమేశ్వరరావుగారి సమాధివద్దకు వెళ్ళి ప్రదక్షిణ నమస్కారాలు చేసి, రామయోగిమందిరంలో నమస్కరించి, శివాలయంలో స్వామిదర్శనంచేసి, అక్కడనుంచి చౌదరిగారు ధర్మకర్తలైన శ్రీ ప్రసన్నాంజనేయస్వామి. శ్రీ పట్టాభిరామ స్వామివార్ల ఆలయాలలోకి వెళ్ళి సేవించి బయటికి వచ్చారు.

ఇద్దరూ కలిసి నడిచారు. రామస్వామి మహాత్తును ఇద్దరూ ప్రశంసించారు. అంతర మందిరం తలుపులు వాటంతట

అవి మూసుకు పోవడానికి ఆశ్చర్యం వెలిబుచ్చారు. నారా యణరావు తమ ఆలయ వ్యవహారాలు ప్రభుత్వానికి ఆ దినమే స్వాధీనం చేశాననీ. లెఖలు తయారుచేసి ఆ ఉదయంవరకూ నిలువ ఉన్న రొఖంతో అన్నీ అప్పగించాననీ చెప్పాడు. చౌదరిగారు 'తొందరపడ్డారేమో' అన్నారు. నారాయణరావు సమాధానం చెప్పలేదు.

నారాయణరావు ఇల్లు సమీపించగా చౌదరిగారు "నాయనా!" అని చేతిలో ఏభై రూపాయలు ఉంచి మద్రాసు ఖర్చులకు అన్నారు. మళ్ళీ "నాయనా! మా అల్లుడు విచిత్ర మైన మనిషి. నీకు ఏసాయమూ చెయ్యకపోతే ఏమీ అనుకోకు. బాధపడకు. మా అన్న బారిష్టరు కృష్ణస్వామి ఉన్నాడు. అత నికి ప్రభుత్వంలో చాల పలుకుబడి ఉన్నది. నువ్వు సరాసరి ఆయన ఇంటికే వెళ్ళు. ఆయన బంగళా లజ్ లో ఉంది. నేను రేపే ఆయనకు ఉత్తరం వ్రాస్తున్నాను. నీవు ఎల్లుండి మెయి లులో బయలుదేరుతున్నావని. నీవు ఆవల ఎల్లుండి ఉదయము మద్రాసు చేరుతావు." చౌదరిగారి మాటలకు నారాయణరావు తల ఊపాడు. నారాయణరావు చౌదరిగారిని సాగనంపి ఇంట్లోకి వెళ్ళాడు.

మేనమామలకు తన ప్రయాణవృత్తాంతం చెప్పి వాళ్ళను తరచుగా ఇంటికివచ్చి "అజ" కనుక్కోమని కోరి నారాయణ రావు ప్రయాణసన్నాహంలో ఉన్నాడు. వెంకమ్మగారికి రెండు నెలలకు కావలసిన పైఖర్చు చేతికిచ్చి - రెండు నెలలకు కావల

సిన వస్తువులు కొని తెచ్చి ఇచ్చి సిద్ధమయ్యాడు. తమ్ముళ్ళనీ చెల్లెలునీ తను లేకుండా ఉండటానికి సమ్మతి పరచాడు. నారాయణరావు తన ప్రయాణ వివరాలు బావగార్లకు ఉత్తరాలలో వ్రాశాడు.

# 22

అనుకున్నట్లుగా నారాయణరావు మద్రాసులో రైలు దిగాడు. రైలుదిగి ఆశ్చర్యపడ్డాడు. మద్రాసు పట్టణాన్నిగాని, సెంట్రల్ స్టేషన్నుగాని చూచి ఆశ్చర్యపడలేదు. కృష్ణస్వామిగారు స్టేషనుకు తనకోసం రావడం అతనికి ఆశ్చర్యం కలిగించింది. ఆయన నారాయణరావును సాదరంగా పలకరించి, భుజాలమీద చేతులువేసి కౌగిలించుకున్నారు. నౌకరుకి సామానులు అప్పగించి నారాయణరావును స్వంతకారులో ఇంటికి తీసుకువెళ్ళారు. ఆయన ఇంట్లో ఇదివరకే నారాయణరావుకోసం అన్నిసదుపాయాలూ చేయబడి ఉన్నాయి. అతడు ఉండటానికి ప్రత్యేకంగా గది ఏర్పాటుచేయబడిఉన్నది. దానికి ప్రత్యేకంగా మరుగుదొడ్డి, స్నానాలగది ఉన్నాయి. ఇంటికి రాగానే కృష్ణస్వామిగారు నారాయణరావుకి అతనివసతి చూపించి ఒక ప్రత్యేకనౌకరును అప్పగించి తనపనిలో మునిగిపోయారు. నౌకరు నారాయణరావుకి ఫలహారాలు తెచ్చియిచ్చాడు. స్నానం ముగించి సంధ్యావందనాది అనుష్ఠానం ముగించి, అల్పాహారంచేసి, తిరిగి కృష్ణస్వామిగారితో మాట్లాడ

టానికి ప్రయత్నించాడు. అప్పుడు అతనికి తెలిసింది. కృష్ణ స్వామిగారు చాల పెద్ద వకీలు. ఆయన గవర్నమెంటువారికి ముఖ్యవకీలు. హైకోర్టులో పెద్ద ప్లీడరు. వాకిటినిండా కక్షిదార్లు. ఊపిరాడనంత పని. నౌకరు నారాయణరావుతో చెప్పాడు. "ఆదివారంగాని ఆయనతో మాట్లాడటానికి పడదని", ఆదేవీధిలో నాలుగిళ్ళవతల మంచి బ్రాహ్మణహోటలున్నదనీ - అక్కడ నారాయణరావుకోసం భోజనం ఏర్పాటు చేశామనీ చెప్పాడు. నారాయణరావు మధ్యాహ్నం భోజనం చేసి వచ్చి కొంచెం విశ్రమించి, వెంకటకృష్ణయ్య చౌదరిగారి అల్లుడు చంద్రగారిని చూచుటకు బయలుదేరాడు. అప్పుడు కృష్ణస్వామిగారి పెద్దగుమస్తా కన్పడి ఎక్కడ కన్నాడు. నారాయణరావు చంద్రగారిని చూడాలని చెప్పి కృష్ణస్వామిగారితో ఎప్పుడు మాట్లాడటానికి వీలవుతుంది అని అడిగాడు. కృష్ణ స్వామిగారు సాయంకాలము కోర్టుపని ముగించుకుని కాస్మాపాలిటన్ క్లబ్బుకి వెళ్ళి రాత్రి పొద్దుపోయిగాని రారని చెప్పాడు. చంద్రగారు ప్రభుత్వ కార్యాలయంలో శాఖాధిపతి అనీ - యుద్ధం రోజులు రావడంవల్ల ఆయన చేయలేనిదేమీ లేదనీ అన్నాడు. కృష్ణస్వామిగారి గుమస్తా - ఆయన ద్వారా పరమేశ్వరరావుగారి ప్రశస్తి వినిఉన్నాడు. పరమేశ్వరరావుగారు పోయారని వార్త వచ్చినప్పుడు ఆయనపడ్డ దుఃఖాన్ని చూచిఉన్నాడు. ఆరోజు బారిష్టరుగారు స్వయంగా స్టేషనుకివెళ్లి నారాయణరావును తీసుకువచ్చారని ఆయనకు

తెలుసు. అందుచేత నారాయణరావుమీద ఆయనకు గౌరవ భావం ఏర్పడింది. ఆయన నారాయణరావుతో అన్నాడు. "అబ్బాయిగారూ! మీరు చంద్రగారితో ఏదో పనిమీద వచ్చినట్లున్నారు. ఆయన చాలా సమర్థుడు. అనేకులికి మేలు చేసినవాడు. కాని ఆయనది విచిత్రమైన స్వభావము. ఎందు చేతనో బ్రాహ్మలకు ఆయన విముఖుడని విన్నాను. అయినా - నీ అదృష్టం ఎట్లా ఉందో?" ఈ మాటలువినగా నారాయణ రావు పెంచుకున్న ఆశలు చిత్రంగా మాయమైనాయి. వెంకట కృష్ణయ్య చౌదరిగారిభార్య చెప్పినమాటలు, చౌదరిగారు ఆఖరుసారిగా "మా అల్లుడు ఏమిచేయకపోయినా నువ్వు ఏమీ అనుకోవద్దు" అన్నమాటలు జ్ఞాపకానికివచ్చి - చంద్ర గారి దగ్గరకు పోవడమే విరమించుకుందా మనుకున్నాడు. మళ్ళీ చౌదరిగారి మాటలు "మన ప్రయత్నలోపము ఉండ రాదు." జ్ఞాపకమై - ప్రభుత్వాలయానికి పోవటానికే నిశ్చ యించుకున్నాడు. కృష్ణస్వామిగారి గుమాస్తాతో ప్రభుత్వాల యానికి పోవడానికి బస్సురూటు - ఏదని అడుగగా ఆయన అన్నాడు. "యుద్ధంరోజులు కావడంవల్ల క్రొత్తవాళ్ళను జార్జికోటలోకి పోనివ్వడం లేదు. చంద్రగారి అనుమతి ముందుగా పొందకపోతే ఆయన్ను చూడటానికే వీలులేదు." నారాయణ రావుకు ఏమిచెయ్యాల్లో తెలియలేదు. ఆ గుమాస్తాగారే చంద్రంగారికి టెలిఫోనుచేసి ఆయనతో దేవపురంనుంచి వెంకట కృష్ణయ్య చౌదరిగారు పంపగా, పరమేశ్వరరావుగారి కుమా

రుడు నారాయణరావు వచ్చిఉన్నాడనీ - అతడు చంద్రగారిని కలుసుకో కోరుతున్నాడనీ చెప్పాడు. దానికి చంద్రగారు ప్రత్యుత్తరం చెప్పారు. నారాయణరావును జార్జికోటకు పంప మనీ - అతన్ని లోపలికి రానివ్వడానికి ఏర్పాట్లు తాను చేస్తు న్నాననీ, ఆ సంగతులు గుమాస్తాగారు నారాయణరావుతో చెప్పి జార్జికోటకు వెళ్లుటకు బస్సురూటు వివరాలు చెప్పాడు.

నారాయణరావు జార్జికోటకు వెళ్ళాడు. పెద్ద అభ్యంత రాలు లేకుండానే చంద్రగారి గదిలోకి నారాయణరావు చేరుకోగలిగాడు. చంద్రగారు నారాయణరావును మామూలు కుశలప్రశ్నలువేసి వాటికి నారాయణరావు సమాధానం చెప్పే లోగాకే వచ్చినపని ఏమిటన్నారు. నారాయణరావు అంతా క్షేమం అని చెబుతూ వెంకట కృష్ణయ్యచౌదరిగారు వ్రాసి ఇచ్చిన ఉత్తరాన్ని చంద్రగారికి ఇచ్చాడు. చంద్రగారు ఉత్తరం చదువుకుని చింపి బుట్టలోవేసి నారాయణరావువంక అయిష్టంగా చూస్తూ "నారాయణరావ్ ! నువ్వు మా మామ గారికీ ముఖ్యుడవని నాకు తెలుసు. నేను నీకు ఉద్యోగం విష యంలో ఏమీ చెయ్యలేను. నేను మా మామగారికి విషయా లన్నీ వివరంగా వ్రాస్తాను. ఆయన నీకు చెప్తాడు. ఇక నువ్వు వెళ్ళొచ్చు" అన్నాడు. నారాయణరావు 'చిత్తం' అంటూ లేచాడు. మళ్ళీ చంద్రగారు "ఇదిగో ఈ కాఫీ తీసుకుని వెళ్ళు" అని కాఫీ ఇచ్చాడు. నారాయణరావు "థాంక్ యూ! నాకు అలవాటులేదు!" అనిచెప్పి బయటకు వచ్చాడు.

తరువాత మూడ్రోజుల్దాకా నారాయణరావుకి కృష్ణ స్వామిగారితో మాట్లాడటానికి పడలేదు. నాలుగోరోజు ఆది వారం రాగా నారాయణరావు కృష్ణస్వామిగారితో తనగోడు చెప్పుకున్నాడు. కృష్ణస్వామిగారు చాలా సానుభూతితో మాట్లాడారు. నారాయణరావుకి క్రొత్త ఆశలు చిగిర్చి ఆయన్ను ఏదైనా ఉద్యోగం ఇప్పించమని కోరాడు. దానికి కృష్ణస్వామిగారు బదులుచెప్పారు. "అబ్బాయీ! నువ్వు నా గురువుగారి కుమారుడివి. నీమీద నాకు ఎక్కువగా అభి మానం ఉన్నమాట వాస్తవమే. అభిమానాలు, స్నేహాలు, బంధుత్వాలు ప్రభుత్వపుటుద్యోగాల్లో జోక్యం కల్పించుకో రాదు. నేను నా అభిమానాన్ని పురస్కరించుకుని నీ విష యంలో జోక్యం కల్పించుకుంటే దేశంలో నాపేరు నవ్వుల పాలు అవుతుంది" ఈ మాటల్లో భావాలు, ఉద్దేశాలు, నారా యణరావుకి అవగాహనే కాలేదు. కృష్ణస్వామిగారు మంచి వాడో - చెడ్డవాడో తనమీద అభిమానం ఉన్నవాడో - లేనివాడో నారాయణరావుకు అర్థంకానేలేదు. కృష్ణస్వామి గారు నారాయణరావుతో ఇంకా అన్నారు. "ఇంకా నువ్వు వారం పదిరోజులు పట్టణంలోఉండి వ్యాపార సంస్థల్లో ఉండి ఎక్కడైనా ప్రయత్నించు. మద్రాసులో బ్రాహ్మణ యువకులకు మాత్రమే ఉద్యోగాలిచ్చే సంస్థలు కొన్ని ఉన్నాయి. అందులో కూడా నీకు లాభం ఉండదేమో! ఎంచేతనంటే వాటిల్లో కొన్ని అయ్యంగార్లకు మాత్రమే ఉద్యోగాలిస్తాయిట. నీకు

లాభం లేదు. అయినా ప్రయత్నించు" అని చెప్పి "నూరు రూపాయలు ఇచ్చి పట్టణంలో ఖర్చులకు" అని అంటూ మళ్ళీ "నువ్వు ఇక్కడ ఉన్నంతకాలం మా ఇంట్లోనే ఉండు. ఇట్లాగే భోజనం చేస్తూ ఉండు" అని ఇంతలో ఏదో టెలిఫోను రాగా లేచి వెళ్లిపోయారు. నారాయణరావుకు దిక్కుతోచలేదు. తనకిచ్చిన గదిలోకి వెళ్ళి పడుకొని ఏమిచెయ్యాలో తెలియక పాతసంగతులు నెమరువేసుకున్నాడు. తన తండ్రిగారు, చిత్రమైన ఆయన జీవిత విశేషాలు, తన తల్లిగారు, ఆమె పాతివ్రత్యం, వెంకటకృష్ణయ్య చౌదరిగారి ఆర్ద్రత, రామస్వామి యోగ సమాధి, అనేక విషయాలు మనస్సులో మెదలి, మనస్సును ఎక్కువగా ఆర్ద్రపరచినవి. ఏదో మెత్తదనము, ఏదో బాధ, ఏవో స్మృతులు. రామస్వామి మాటలు జ్ఞాపకానికి వచ్చినై. రామస్వామి అన్నాడు: ప్రకాశం పంతులుగారు తన పేరు చెబితే సహాయం చేస్తారని. వెంటనే లేచి కృష్ణస్వామిగారి గుమాస్తా దగ్గరకు వెళ్లి ప్రకాశంపంతులుగారి అడ్రసు తెలుసుకుని అక్కడకు వెళ్ళడానికి మార్గం తెలుసుకుని అప్పుడే బయలుదేరాడు.

అప్పుడే ప్రకాశంపంతులుగారి ఇంటికిపోగా లోపల నుంచి శ్రీ పట్టాభి సీతారామయ్యగారు వస్తున్నారు. ఆయన ఎవ్వరో తనకు తెలుసును - గనుక నారాయణరావు ఆయనకు నమస్కరించాడు. ఆయన నారాయణరావును పరిశీలనగా చూచి "మీది దేవపురమా ఏమిటి?" అన్నారు. నారాయణ

రావుకి పరమాశ్చర్యం వేసింది. "అవునండీ ? నేను పరమేశ్వర రావుగారి కుమారుణ్ణి" అని చెప్పాడు. ఆయన చిరునవ్వు నవ్వి "ఔనురా! నేను అట్లాగే అనుకున్నాను. పాపం మీ నాన్న పోయాడని విన్నాను" అని సానుభూతి ప్రదర్శింపగా నారాయణరావు కృతజ్ఞతతో చూశాడు. ఆయన తన్ను ఎలా గుర్తించాడా? అని అర్థముకాక తికమకలు పడుతుంటే ఆయన మళ్ళీ అన్నాడు. "ఈ మధ్య మావాళ్ల కుర్రాడు మోహన రావు రాజమండ్రిలో నీ క్లాసుమేటు లేడూ - వాడే నీ ఫోటో చూపించాడు. నీకు కాలేజీలో చాలా పెద్ద పేరు ఉందటగా! నీకు మావాళ్లపిల్లను ఇప్పించాలని వాడు గట్టి ప్రయత్నం చేశాడు. ఇంతలో మీనాన్న పోయాడని తెలిసింది. సరేగాని పంతులుగారింటికి వచ్చావెందుకు?" అని అన్నారు. నారాయణ రావు వినయంగా తన కష్టాలూ, ఉద్యోగ ప్రయత్నాలూ చెప్పుకున్నాడు. పట్టాభిగారు సావధానంగా విని నారాయణ రావుతో అన్నారు. "ప్రకాశం పంతులుగారు బెజవాడ వెళ్లారు. వారు కారులో రావాలి. ఇంకా ఎంచేతనో రాలేదు. వారూ, నేనూ, ఈ సాయంత్రం బొంబాయి వెళ్లవలసిఉంది. వారు రాకపోయినా నేను ఈ రాత్రికి వెళ్లక తప్పదు. నీకు ఉద్యోగం కావాలన్నావు కదా! బెంగుళూరులో నా స్నేహితు డొకడు ఇంగ్లీషు దినపత్రిక నడుపుతున్నాడు. పత్రిక పేరు ప్రోగ్రస్. వాళ్ల ఆఫీసులో నిన్ను సహాయ సంపాదకునిగా తీసు కొమని ఉత్తరం వ్రాసి ఇస్తాను" అని చెప్పి అప్పుడే జాబు

వ్రాసిఇచ్చి వెళ్ళిపోతూ "బహుశా ప్రకాశం పంతులుగారిని నువ్వు కలుసుకోనేలేవేమో. బహుశా ఇప్పుడు కాకపోతే నేనుకూడ నీకు కన్పించేవాణ్ణి కానేమో" అని బయటకువచ్చి అక్కడఉన్న కారెక్కి వెళ్లిపోయారు.

ఆసాయంకాలంలోగా-తిరిగి నారాయణరావునాలుగైదు సార్లు ప్రకాశం పంతులుగా రింటికివెళ్ళి - పంతులుగారు బెజవాడనుంచి వచ్చారేమోనని చూశాడు. ఆయన బెజవాడ నుంచి తిరిగి రాలేదు. ఇక మర్నాడు ఆయన్ను కలుసుకో వచ్చునని తలచి ఏమి చెయ్యడానికీ తోచక - చూడవలసిన కొన్ని ముఖ్యప్రదేశాలు చూచి, సాయంకాలానికి నారాయణ రావు తిరువళిక్కేణిలో సముద్రం ఒడ్డుకి చేరుకున్నాడు.

# 23

వ్యవధీవిరామం లేకుండా, తరంగాలు ఒక దానివెంట ఒకటీవస్తున్నాయి. అన్నీ గట్టువరకూ వచ్చేవే-గట్టుచేరేవరకూ అన్నీ అదరిపాటు చూపేవే. జీవితంలో నిత్యకష్టతరంగాలలో ఉన్న నారాయణరావు ఈ సముద్రపు తరంగాల్ని చూస్తూ - జీవితాన్ని మరచిపోతూ కూర్చున్నాడు. కాలసముద్రంలో దినములులాగా, జీవిత సముద్రములో కష్టపరంపరలాగా-మన స్సముద్రములో ఊహావైవిధ్యంలాగా అనంతమైన ఈ తరంగ సముదాయం - చూచినకొద్దీ చూడాలనిపిస్తూ - అనితరసాధ్య

మైన భగవత్ సృష్టిని జ్ఞప్తికి తెస్తూ - ఆస్తికతా ప్రబుద్ధులకు భగవత్సన్నిధానంగా ఆనందాన్ని చేకూరుస్తూ అట్లాగే నిరంతరంగా ఉంటూ ఉన్నది. ఈ ప్రకృతి అక్కడక్కడ తన మహా సౌందర్యాన్ని ప్రస్ఫుటంచేస్తూ తత్తత్ ప్రదేశాలలో తత్తద్ సమయాలలో - తన యందున్న భగవత్ స్వరూపాన్ని ప్రస్ఫీకరింపజేస్తూ - అంతలో ఆగాధంగా అనిర్వచనీయంగా ఉంటూ-మానవుల్ని ఆడిస్తూన్నది. నారాయణరావు సముద్ర తరంగాల్ని చూస్తూ ఊహాతరంగాల్ని నిలుపుకొని - ఏదో మానసికమైన ప్రశాంతితో కూర్చుని ఉన్నాడు.

ఇంతలో ఎవ్వరో వెనుకనుంచివచ్చి - తన ముందుగా ఎడమప్రక్క కూర్చుని చేత్తో తన పాదాలు స్పృశించి కళ్లకు అద్దుకోగా - నారాయణరావుకి స్మృతివచ్చినట్లయి చూశాడు. ఆమె ఫతీమాబేగము. ఆమె చిరునవ్వుతో అన్నది. "ఏమండీ ఎప్పుడు వచ్చారు" అని మధురస్నిగ్ధమైన భాషణ చేసింది. నారాయణరావు "నువ్వు ఇక్కడకు ఎట్లా వచ్చావు?" అని అన్నాడు. దానికి ఆమె "ముందు మీసంగతి చెప్పండి" అని అన్నది. నారాయణరావు తాను తన జిల్లాలో ఉద్యోగం కోసం చేసిన ప్రయత్నాలు ఫలించక పోవడం, ఇల్లు అమ్మి బాకీలు తీర్చుట, వెంకటకృష్ణయ్య చౌదరిగారి సలహాతో మద్రాసు వచ్చుట, ఇక్కడ చౌదరిగారి అల్లుడు చంద్రగారిని చూచుట, ఆయనగారి నిరాదరణ, బారిష్టరు కృష్ణస్వామిగారికి వెంకట కృష్ణయ్య చౌదరిగారికి తన తండ్రిగారికిగల సంబం

థము, తాను బారిష్టరుగారిని అర్థించుట, ఆయన సహాయనిరాకిరణం చెయ్యటం, తరువాత తనకు వేరే మార్గము తోచకపోవడం, రామస్వామి మాటలు జ్ఞాపకంవచ్చి ప్రకాశం పంతులుగారిని దర్శించడానికి వెళ్ళడం—అక్కడ పంతులు గారు లేకపోవడం, కాని పట్టాభిగారు కన్పించి బెంగుళూరులో ప్రోగ్రెస్ అనే దినపత్రికలో సహాయ సంపాదకుడుగా చేరమని ఉత్తరం ఇవ్వడం - మొదలగు సంగతులు క్లుప్తంగా వివరించాడు. ఆమె "రామస్వామి ఎవ్వరు?" అన్నది. నారాయణ రావు "అడగవలసిన ప్రశ్న అడిగావు" అని "రామస్వామి మా తండ్రిగారి హరిజన శిష్యుడు. పూర్వం హరిజనసేవా సంఘంలో ముఖ్యమైన పాత్రలు నిర్వహించినవాడు. శాసన సభ్యుడు. అన్ని గాంధేయ ఉద్యమాలలోనూ నిస్వార్థ దృష్టితో పాల్గొన్నవాడు. చివరకు మా తండ్రిగారి మరణానంతరం సర్వసంగపరిత్యాగియై నిత్య యోగసమాధిలో ఉంటూ మాఊళ్లో రామయోగిగా వెలసినవాడు" అని ఉదాత్త స్వరంతో మహాగౌరవం వ్యక్తం అవుతుండగా ఆమెకు వివరించాడు. ఆమె రామయోగి మహిమాన్వితుడని తెలిసికొంది. అతనికి మనస్సులో నమస్కరించి, నారాయణరావు పాదాలు స్పృశించి కళ్ళకు అద్దుకున్నది. నారాయణరావు 'నీ సంగతులు చెప్పినావు కావు' అన్నాడు. ఆమె 'నాగాథ చెబుతాను. అది చాలా ఉన్నది. ముందు శ్రీ పార్థసారథిస్వామివారి ఆలయానికి వెళ్ళివద్దాము రండి' అన్నది. ఇద్దరు లేచి స్వామివారి ఆలయం దగ్గరకు నడిచారు.

ఆమె పూలు, టెంకాయ, కర్పూరం కొన్నది. హారతికీ అర్చనకూ టిక్కట్లు కొన్నది. ఇద్దరూ ప్రదక్షిణీకరించి లోపలకు వెళ్ళారు. ప్రదక్షిణం చేస్తుండగా నారాయణరావు అనుకున్నాడు. "భగవంతుని చిత్రం ఎట్లాఉన్నది! ఈ తురకపిల్లను ప్రక్కన పెట్టుకుని నేనీ దైవదర్శనానికి రావలసి ఉంది కాబోలు." ఫతీమాకూడా తాను అనుకున్నది "భగవంతుని చిత్రం ఎట్లాఉన్నది! భగవంతుని అనుగ్రహం ఇట్లాగే ఉంటుంది కాబోలు! నేను మహమ్మదీయనై బ్రాహ్మణుని ప్రేమించి, అతనిని భగవంతుడుగా ఆరాధిస్తూ అతనిని చేపట్టడానికి అవకాశం లేకపోయినా, అతనితో కలసి, అతని భార్యలాగా నేడు ఈ దేవాలయంలో దైవదర్శనం చెయ్యడానికి ఈశ్వరానుగ్రహం ఉన్నదికాబోలు" అని. ఇద్దరూ స్వామిసన్నిధికి వెళ్ళారు. అర్చకులు ఫతీమాకు ఎక్కువగా గౌరవం చూపటం నారాయణరావు గమనించాడు. స్వామికి హారతి పట్టారు. నీలసుందరమైన సజీవాకృతిగా ఉన్న ఆ గీతాపరమేశ్వరుని విగ్రహం మందస్మితంచేస్తూ ఉన్నది. ఆ మందస్మితం బ్రాహ్మణయువకుడూ, బ్రాహ్మణవేషంలో ఉన్న మహమ్మదీయ యువతి, దంపతుల్లాగా తనదగ్గరకు వచ్చారని చేసినట్లుగా ఉన్నది అని నారాయణరావుకు భాసించింది. ఫతీమాకు, శుచిస్మితుడైన భగవంతుని చిరునవ్వులో భగవద్గీతా రహస్యమైన కర్మయోగానికి నూత్నార్థాలు స్ఫురిస్తున్నట్లుగా ఉన్నది. నారాయణరావు స్వామికి నమస్కరించి ఫతీమావంక చూచాడు. ఆమె అర్థనిమీలితంగా

పరమేశ్వరరూపాన్ని దర్శిస్తూ వైఖరీవిధంగా ఏదో ధ్యాన శ్లోకం పఠించి ముగించింది. అక్కడ ఆ జనసమర్దంలో తనతో కలసి వచ్చిన ఫతీమా తన భార్యలాగానే తన్ను అంటిపెట్టుకుని జనంవత్తిడికి తన్ను రాసుకుంటూ భగవత్సన్నిధానంలో తన్ను ఒత్తుకుంటూ తనతోకలసి తీర్థ ప్రసాదాలు స్వీకరించి, తన్ను వెంబడిస్తూ బయటకు రావడం ఇదంతా నారాయణరావుకి విస్మయంగా ఉన్నది. బయటకు వచ్చినతర్వాత నారాయణరావు ఆమెను ప్రశ్నించాడు. "నిన్ను అర్చకులు ఇంత గౌరవంగా చూస్తున్నారే? నువ్వు ఎవరో తెలియదా ?" ఆమె ఆ మాటలకు సమాధానంగా "వాళ్ళకు నేను హిందువుగా ప్రభవించలేదని తెలియదు. తెలిస్తే లోపలకు రానిస్తారో లేదో మరి" అని నవ్వుతూ "వాళ్ళు నన్ను కృష్ణభక్తురాలైన స్మార్త బ్రాహ్మణస్త్రీగా భావిస్తున్నారు. నేను ప్రతినిత్యమూ ఇక్కడకు దర్శనానికి వస్తున్నాను. అందుకుని అర్చకులు నన్నెరుగుదున్నారు. వచ్చినప్పుడల్లా రూపాయి తక్కువకాకుండా కానుక వేస్తానుకదా! వాళ్ళకు గౌరవ మెందుకుండదు ?" అని మళ్ళీ నవ్వి ముఖముఖమంటపంలోకి నడిచింది. నారాయణరావు ఆమెను అనుసరిస్తూ ఆమెను అనుసరిస్తూ "రోజూ ఎందుకూ ?" అన్నాడు. ఇంతలో ఆమె ముఖమంటపంలో కూర్చుంటూ నారాయణరావును కూర్చోపెట్టి నవ్వుతూ ఇట్లా అంది. "నే నుపాసించేది శ్రీమాతృదేవిని కదా! "శ్రీకృష్ణ శ్శ్యామలాదేవి శ్రీరామో లలితాంబికా" అని పెద్దలన్నారు. అందుకని ప్రతిదినం స్వామి

దర్శనం చేస్తున్నాను. లలితోపాఖ్యానంలో అమ్మవారు స్వయంగా "మమైవ పౌరుషం రూపం గోపికా జనమోహనం" అని అన్నది. పైగా భగవంతుడు మన్మథునికే తండ్రి. అనుగ్రహించవచ్చునుకదా! మా ఇల్లుకూడ ఇక్కడకు దగ్గరే! అని నవ్వింది. మళ్ళీ "చూడండి నాకు ఇవ్వాళ ఎంత భగవదనుగ్రహం ఉన్నదో! ఇవ్వాళ నాకు భగవంతుడు నేను మీ సహచరురాలుగా ఉండగా దర్శనం తీర్థప్రసాదాలు అనుగ్రహించాడు. శ్రీకృష్ణపరమాత్మ అంటే శ్యామలాదేవి నన్ను మీ భార్యగా అంగీకరించిందన్నమాట. నాకు మంత్రదీక్ష అయిననాడు మీ పెత్తల్లిగారు మీ చేతిమీదుగా నాకు మంగళసూత్రాలు ఇప్పించింది. నేను ఇంటికివెళ్ళి ఆ సూత్రాలను - మీ హస్తస్పర్శతో పావిత్ర్యములైన ఆ సూత్రాల్ని అన్యస్పర్శతో దుష్టంచేయకుండా వెంటనే కంఠసీమలో కట్టేసుకున్నాను. ఇదిగో చూడండి" అంటూ మెళ్ళోవి మంగళసూత్రాలు అతనికి చూపిస్తూ తాకించి నవ్వుతూ మళ్ళీ "తిరిగి నా సూత్రాలకు మీ స్పర్శభాగ్యం ఇవ్వాళ భగవంతుని సన్నిధానంలో కలిగింది. భగవంతునిముందు చోటులేక మీరు నన్ను ఒత్తుకుని నుంచున్నారు కదా! అప్పుడు బాహువులచేత జరగలేదుగాని అతి సన్నిహితాస్పాలనా పర్యవసానంగా నేను మీ ఆలింగన సౌఖ్యం పొందనే పొందాను" అంటూ మళ్ళా సూత్రాలు నారాయణరావుకి తగిలించబోయింది. నారాయణరావు కొంచెం జరిగి చురుకుగా చూస్తూ "ఇట్లా హద్దుమీరి

ప్రవర్తిస్తే నేను వెళ్ళిపోతాను" అని లేచాడు. ఆమె "ఫరవా లేదులెండి, పదండి నేనుకూడా వస్తున్నాను"అని లేచి వెనక్కు తిరిగి "శ్రీకృష్ణశ్శ్యామలాదేవి శ్రీరామో లలితాంబికా ఉభాభ్యాం రామకృష్ణాభ్యాం నమోనమః పునః పునః" అని మధురంగా మందస్వరంలో రాగయుక్తంగా అన్నది.

ఆమె నారాయణరావును తన ఇంటికి రమ్మన్నది. అతడు సుముఖత చూపలేదు. అమె ప్రాధేయపడుతూ అన్నది. "మీకు చెప్పవలసినవి చాలా ఉన్నాయి. పైగా మా ఇల్లు ఇక్కణ్నుంచి మైలాపూర్ లజ్ కిపోయే త్రోవలోనే ఉన్నది" అని త్రోవతీసింది. ఇద్దరూ కాలినడకనే బయలుదేరారు. తాను ఇంట్లో ఒకర్తెనే ఉంటున్నాననీ, ఇంట్లో వంటకు అయ్యంగార్ల ముసలమ్మ ఒకామె ఉన్నదనీ తాను నిష్ఠగా బ్రాహ్మణ జీవితమే గడుపుతున్నాననీ అతనికి తన ఇంట్లో చాలా సదుపాయంగా ఉంటుందనీ చెప్పింది. అతడు బిడియపడనక్కరలేదని చెప్పింది. ఇద్దరూ లోకాభిరామాయణం మాట్లాడుతూ నడుస్తున్నారు. ఇంతలో ఎడ్వర్డు ఇలియట్స్ రోడ్డు రానేవచ్చింది. ఆమె ఇల్లు కూడా వచ్చేసింది. ఆమె ఇదే తన ఇల్లు అని చూపింది. లోపలకు రమ్మన్నది. అతడు రేపు వస్తాకదా అన్నాడు. ఆమె బలవంతము చేసింది. అతడు మెత్తబడలేదు. కాని యాదాలాపంగా గేటులోపలికిమాత్రం నడిచాడు. ఇంతలో ఒక ముసలామె బ్రాహ్మణస్త్రీ బయటకువచ్చి నవ్వుతూ "రాక రాక వచ్చిన మీ ఆయన్ను బయటనే నిలిపి మాటాడుతున్నావేమిటి?" అన్నది

ఆమాటలకు నారాయణరావు చకితుడై, ఆమె ఎవరో తన్ను ఎట్లా ఎరిగినదో ఆ మాటలేమిటో సిగ్గుపడిపోయాడు. ఫతీమాకు మాత్రం ఆ మాటలు సంతోషహేతువులుగా ఉండి ఆమె నవ్వుతూ "ఆయన రేపు వస్తానంటున్నారు" అని అన్నది. ఇక గేటుముందుగా బలవంతాలు బాగుండవని విరమించుకొని "రేపు శ్రావణశనివారం! మీరు వచ్చేదాకా నేను గంగముట్టను. తప్పక రావాలి. వస్తారుకదూ ?" అని అతనివంక చూస్తూ గేటుకు అడ్డంగా నిల్చుంది. "సరే" అని అనకపోతే గేటు తెరవనియ్యదని నారాయణరావుకి అర్థమై 'సరే! అన్నాడు. ఆమె ఒక్క 'నిమిషం ఆగండి' అని వంగి ఆతనికి పాదాభివందనంచేసి "రేపు తొందరగా రండి. కాఫీవేళకే రండి" అని అంటూ గేటు తీసింది. నారాయణరావు ముందుకు వెళ్ళిపోయాడు. ఏదో తప్పుపని చేస్తున్నప్పుడు పదిమందీ చూడగా సిగ్గుపడినట్లు సిగ్గుపడుతూ చరచరా నడచి వెళ్ళిపోయాడు. తమకు ఇష్టంలేని వాళ్ళదగ్గర్నుంచి పిల్లలు వెళ్ళిపోయినట్లు వెళ్ళిపోయాడు. అతడు కన్పించకపోయినా ఆమె చాలాసేపు గేటు దగ్గరనే ఉండి అతడు వెళ్ళినవైపు చూస్తూ నిల్చుండిపోయింది. లోపలనుంచి వచ్చి మాటాడిన ఆమె గేటు దాకావచ్చి "ఐతే అమ్మాయ్ అతను కన్పించడంలేదుగా! ఇంకా గేటుదగ్గర ఎందుకూ" అంటూ ఫతీమాను లోపలకు తీసుకెళ్ళింది.

# 24

ఆ రాత్రి నారాయణరావుకి కృష్ణస్వామిగారింట్లో నిద్రపట్టలేదు. మంచంమీద పడుకున్నాడేగాని ఏదో ఆవేదనగా అసందర్భంగా ఉన్నది. తనకు అడుగడుగునా ఈ ఫతీమా ఏమిటి? ఆమెకు తనమీద ఇంత అనురాగ మేమిటి? ఈ బ్రాహ్మణస్త్రీ వ్రతం ఏమిటి? శ్రీవిద్యాదీక్ష ఏమిటి? సర్వదేవతలు తన్ను పరీక్షిస్తున్నట్లుగా ఉన్నది. కొంతసేపటికి పట్టిన కలత నిద్దురలో స్వప్నాలు. తన తల్లిగారు పార్వతీదేవివలె సర్వదేవతాస్త్రీలచేతా సేవింపబడుతూ మహాసింహాసనంమీద కూర్చుని ఉన్నది. ఆమెకు వెంకమ్మగారు, ఫతీమా, చెరొక ప్రక్కా నిల్చుండి వింజామరలు వీస్తున్నారు. తాను తన తల్లిగారికి వందనంచేయగా - ఆమె తన్ను చేయిజాపి అందుకుని లేవనెత్తి, దగ్గరకు తీసుకొని, తొడపై కూర్చుండబెట్టుకున్నది. తాను ఆ మహాదేవి అంకసీమపైన చిన్న బాలకునిలాగా ఉన్నాడు. తాను ఫతీమావంక చూడగా ఫతీమా వింజామర పట్టుట ఆపి తన తల్లిగారి రెండవ తొడపై కెక్కి కూర్చున్నది. తాను తల్లిగారి కుడితొడమీద, ఫతీమా ఎడమతొడమీద - జగన్మాతయైన శ్రీపార్వతీదేవి, కుమారస్వామిని, అతని ప్రియురాలు శ్రీ వల్లీదేవిని దగ్గరగా తీసికొని ఆదరించినట్లుగా ఉన్నదా దృశ్యం. వెంకమ్మగారికి మహానందం అయినట్లుగా ఆమె ఆనందబాష్పాలు రాలుస్తున్నది. సర్వదేవతాస్త్రీలు

సంతోషిస్తున్నారు. ఇంతలో తాను తల్లిగారివంక చూడగా ఆమె శ్రీ పార్థసారథి స్వామివారిలాగా ఉన్నది. ఆ ఊర్ధ్వ పుండ్రము, ఆ విశాలనేత్రాలు, ఆ మధురహాసము, సాయం కాలం తాను దర్శించిన స్వామివారివలె ఉన్నది. గీతామృత ప్రదానం చేస్తున్నప్పటి స్వామివారి ప్రసన్నతవలె ఆమె సుప్ర సన్నంగా ఉన్నది. తాను అప్రయత్నంగానే

కరకమల నిదర్శితాత్మముద్రః
పరికల్పితోన్నత బర్హి బర్హ చూడః
ఇతరకరగృహీతవేత్రతోత్రో
మమసన్నిధిమాతనోతుశౌరిః ॥

సహస్రమూర్ధాన మనంతశక్తిం
సహస్రబాహుం పురుషం పురాణం
శయానమబ్ధౌ లవితేతవైన
నారాయణాఖ్యం ప్రణతోఽస్మిరూపమ్ ॥

అని స్తుతించాడు. సర్వమూ మహాతేజోవంతంగా ఐపో యింది. తల్లిగారు ఇంకా శ్రీపార్థసారథిస్వామివారివలెనే ఉన్నారు. ఆమె నిల్చుండి ఉండగా ఆమె పాదాలు ఆశ్ర యించి తాను కూర్చుని ఉన్నాడు. తనకు లలితాసహస్రంలోని 'విశ్వగ్రాసా విద్రుమాభావైష్ణవీ విష్ణురూపిణీ' అన్న నామా వళి జిహ్వాగ్రంమీదకు వచ్చింది. ఇంతలో మెలకువ వచ్చింది.

ఎదుట కృష్ణస్వామిగారి నౌకరు నుంచుని ఉన్నాడు. తన్ను పిలుస్తున్నాడు. నారాయణరావు కళ్ళు తెరిచి అతన్ని

చూస్తూ "ఏమిటి" అన్నాడు. అతను "ఈ రోజు మీరింకా నిద్ర లేవ లేదేమిటి? భారతదేశం అంతాఆందోళనలో పడిపోయి నానాఇదిగా ఉంటేనూ!" అన్నాడు. నారాయణరావు అర్థం గాక మంచంమీదనుంచి లేచి "నీ మాటలు నాకు అర్థం కాలేదు. అసలుసంగతి ఏమిటి?" అన్నాడు. అతడు వివరాలు చెప్పాడు. "ఈ తెల్లవారుఝామున బొంబాయిలో మహాత్మా గాంధీగారిని, కాంగ్రెసు అగ్రనాయకు లందరినీ, ప్రభుత్వం వారు నిర్బంధంలోకి తీసుకున్నారుట. రాత్రి కాంగ్రెసు కార్య వర్గం సమావేశమై బ్రిటిషువాళ్ళను మనదేశంనుంచి వెళ్ళి పొమ్మని తీర్మానించిందట. మన పట్టాభిగారు నిన్న సాయంత్రం విమానంలో బొంబాయి చేరారట. కాంగ్రెసు కార్యవర్గంలో పాల్గొన్నారుట. ఆయనకూడా మిగిలిన కాంగ్రెసు కార్యవర్గ సభ్యులతో నిర్బంధింపబడ్డారుట. ప్రకాశంపంతులుగారు బెజ వాడనుంచి మద్రాసు వస్తూ త్రోవలో కావలిలో విశ్రాంతి తీసు కుంటూ ఉండగా ఆయన్నుకూడా నిర్బంధంలోకి తీసుకున్నా రుట. ఈ వార్తలన్నీ ఇప్పుడే రేడియోలో వచ్చాయి. మన కృష్ణస్వామిగారు గవర్నమెంటువారికి ముఖ్యం గనుక రాత్రి గవర్నరువారి వద్దకు వెళ్ళి ఇంతకుముందే వచ్చారు."

ఈ కొత్తవార్తలతో నారాయణరావుకి మతిపోయి నట్లయింది. ఏమీ పాలుపోలేదు. లేచి స్నానానుష్ఠానాలు త్వరగా ముగించి, బెంగుళూరు వెళ్ళిపోదామని నిశ్చయించు కున్నాడు. ఇంతలో కృష్ణస్వామిగారు కన్పించగా ఆయన

దగ్గర శెలవుతీసుకుని, గుఱ్ఱంబండి మాట్లాడుకొని దాంట్లో సామాను వేసుకుని, నారాయణరావు ఫతీమా ఇల్లు చేరాడు. అక్కడ ఆమెతో రెండు మాటలు చెప్పి సెంట్రల్ స్టేషనుకి పోవాలని అతని అభిప్రాయం. కాని అతడు ఫతీమా ఇల్లు చేరే టప్పటికి ఆమె గేటుదగ్గరే వున్నది. ఆమె ఇతనికి కాళ్ళు కడిగి లోపలకు తీసుకువెళ్ళింది. ఇతడు గ్రహించడానికి ముందే ఇతని సామానులు బండిలోంచి దింపి లోపల పెట్టించి బండి వానికి డబ్బిచ్చి పంపివేసింది. నారాయణరావు సామాన్లతో కూడా రావడం ఆమెకు చాలా సంతోషం కలిగించింది. ఆమె ఫుల్లసరోజపుష్పంలాగా వికసితవదనంతో మందహాసంతో కని పిస్తున్నట్లుగా వున్నది. నారాయణరావును కుర్చీలో కూర్చో బెట్టి పంకా వేసింది. లోపలన్నుంచి ముసలామె కాఫీ తెచ్చి బలవంతం చెయ్యగా నారాయణరావు తీసుకున్నాడు.

ఇల్లు చూడడానికి నారాయణరావును ఫతీమా లోప లకు రమ్మన్నది. నారాయణరావు లోపలకు వెళ్లాడు. లోపల చాలా పరిశుభ్రంగా - చాలా ప్రశాంతంగా వున్నది. పడక గదిలో మంచానికి ఎదురుగా నారాయణరావు ఫోటో పెద్దది ఉన్నది. ఇంట్లో ప్రతిగదిలోనూ నారాయణరావు చిత్తరువులు ఉన్నాయి. పూజామందిరంలో నారాయణరావుకి ఆశ్చర్యం కలిగించే చిత్తరువున్నది. అక్కడ నారాయణరావు చిత్రం - స్త్రీవేషంతో - చతుర్బాహువులతో-మణికిరీటంతో-సౌభాగ్య లక్ష్మీదేవిలాగా - రత్నసింహాసనంమీద - అభయహస్త సుంద

రంగా మందస్మితంగా - సుప్రసన్నంగా - నేత్ర పర్వంగా ఉన్నది. దాని పక్క దీపారాధన. పాదాలదగ్గర గంధకుంకు మార్చన - పుష్పాలూ. నారాయణరావుకి తెలిసింది. ఆమె వెంకమ్మగారు ఉపదేశించిన మహామంత్రాన్ని నిష్ఠగా అనుష్ఠిస్తున్నది. ఆమె మహా తపస్సు చేస్తున్నది. తనయందు ఆమెకు గల ప్రేమను దైవారాధనగా మార్చుకొని తద్వారా ఆమె ఉన్నత కక్ష్యలు సాధించడానికి ప్రయత్నిస్తున్నది. ఆమె పూర్వభారతీయ పతివ్రతా శిరోమణుల కోవకు చెందినది. వాళ్ల ఉపాసనా రహస్యం తెలుసుగుని వాళ్ళ అడుగుజాడలలోఅనుకరిస్తున్నది. ఈ విషయాలు మనస్సులో తెలియగా నారాయణరావునకు ఆమె యందు గౌరవం, వినూత్నమైన ప్రేమ పునరుద్భవించినై. హృదయంలో ఆర్ద్రత కల్గినది. ఇల్లు అంతా చూపించి నారాయణరావును తిరిగి ముందుగదిలోకి తీసుకు వచ్చింది ఫతీమా. అప్పుడు నారాయణరావు ఫతీమాతో అన్నాడు. "ఫతీమా! నువ్వు నిజంగా దేవతాస్త్రీవి. శాప కారణంచేత ఇట్లా మానవస్త్రీగా పుట్టావు." అతని ఈమాటలకు ఆమె నవ్వుతూ "కారణజన్మమై తను వికారముకల్గిన పెంపు తప్పునే" అని అన్నది. నారాయణరావు ఆశ్చర్యంతో "తిక్కన్నగారిని చదివేవే?" అన్నాడు. "తిక్కన్నగారేమిటి మహానుభావా! కవిత్రయం. సోమనద్వయం, విశ్వామిత్ర త్రయం చదివాను - ఇంకా మీ పూర్వజన్మచరిత్ర వ్రాసిన కవినీ - ఆయన గురువునీ మిత్రుల్ని చదివాను" అన్నది.

నారాయణరావు ఆశ్చర్యంతో "విశ్వామిత్రత్రయ మేమిటి ? నా పూర్వజన్మచరిత్ర ఏమిటి ?" అన్నాడు. ఆమె నవ్వుతూ - "తెనాలిరామకృష్ణుడూ, శ్రీకృష్ణదేవరాయలవారూ, నాచన సోమన్న వీళ్ళు ముగ్గురూ ఒక్కొక్క విధంగా విశ్వామిత్రులు, ఇక మీ పూర్వచరిత్ర అంటే వలచివచ్చిన కాంతను తృణీకరించి సాహిత్యంలో పెద్ద పేరు తెచ్చుకున్న మహానుభావుని చరిత్ర ! తెలియదా !" అని నవ్వింది. నారాయణరావు "మను చరిత్రలో ప్రవరుడా ఏమిటి !" అన్నాడు. ఆమె - "అవును, పెద్దనగారిని, ఆయనగురువు శ్రీనాథుణ్ణి, మిత్రులు అష్టదిగ్గజాల్ని చదివాను -ఇతర భాషల్లో ఒకళ్ళిద్దరు మహాకవులు. తెలుగులో సంస్కృతంలో శతాధికంగా మహాకవులు!" అని అన్నది.

షతీమాచేసిన ఈ ప్రసంగానికి నారాయణరావు ముగ్ధుడైనాడు. దేశంలో అనేక ఇతర విషయాలలోవలెనే - సాహిత్యంలో కూడా అనేక మూఢనమ్మకాలు ఉన్నాయి. వాటిని పట్టించుకోకుండా ఈమె స్వయంకృషిచేసి స్వయంగా పరిశీలన చేస్తున్నది అనుకున్నాడు.

ఇంతలో ముసలామె లోపలనుండి వచ్చి నారాయణరావును లోపలకు రమ్మని పిలువగా వెళ్ళాడు. అతని స్నానానికి, జపానుష్ఠానానికి భోజనానికి కావలసిన అన్ని సదుపాయాలూ సిద్ధంగా ఉన్నాయి. ఆమె చెప్పింది. తాను బ్రాహ్మణ స్త్రీనని, అతడు సంకోచ పడవలసిన అవసరం లేదనీ. నారా

యణరావు భోజనం చేస్తున్నప్పుడు మళ్ళీ ఆమె చెప్పింది. ఆమెది తిరుపతిట. తనకు దిక్కెవ్వరూ లేక తిరుపతిలో వంటలు చేస్తూ బ్రతుకుతున్నదట. ఫతీమాతల్లి ఆమెకు పినతల్లి కూతురట. తల్లి చెప్పడంవల్ల ఫతీమాకు ఈమె ఉనికి తెలిసి పిలిపించుకున్నదట. వచ్చినప్పటినుంచీ తాను ఇంటిపెత్తనం చూస్తూ ఆమెకు తల్లిగా ప్రవర్తిస్తున్నదట.

# 25

నారాయణరావు భోజనం ముగించుకొని రాగా-అతణ్ణి విశ్రాంతి తీసుకోమని ఫతీమా పక్కవేసింది. ఆతడు విశ్రాంతి తీసుకుంటుండగా ఫతీమా వెళ్లి నారాయణరావు భుక్తశేషం భుజించివస్తూ

"ధన్యున్ లోకమనోభిరాము, కుల విద్యారూపతారుణ్య సౌ
జన్య శ్రీ బలదాన శౌర్య కరుణా సంశోభితున్ నిన్ను నే
కన్యల్ గోరరు! కోరదే మును రమాకాంతాలలామంబు రా
జన్యానేకపసింహ, నావలననే జన్మించెనే మోహముల్ ॥"

అని శ్రీ రుక్మిణీ సందేశపు పద్యం చదువుతూన్నది. ఆమె కంఠం మధురమైనది. పోతన్నగారి రచన మధురము, పద్యం మధురభావ పరిపూర్ణము. ఫతీమా దానిని మధురంగా చదివింది. నారాయణరావు ఆహ్లాదపడ్డాడు. ఇంతలో ఫతీమా దగ్గరకురాగా అన్నాడు. "ఫతీ! తెలుగు కవులమీాద నీవు

చేసిన ప్రసంగంలో పోతన్నగారిని వదలినావే ?" శతీమా నవ్వి "మీ స్నేహంవల్లా, మీ పెత్తల్లిగారి అనుగ్రహంవల్లా నాకు శ్రీదేవి ప్రసన్నత లభించింది. నేను 'మూకపంచశతి' చదువుతూ ఉంటాను. అంచేతనేమో సాహిత్యాభిమానం పుట్టుకువచ్చింది. తెలుగుకాని సంస్కృతంగాని చదివింవల్లా తెలిసిపోతోంది. నాకు పోతన్నగారు కవిమాత్రమేకాదు.

సంస్కృతంలో చూడండి. కృతయుగంలో బ్రహ్మ వేదాలు పలికాడు. ఆ తరువాత అనేకమంది కవులు వచ్చారు. కాని కృతయుగాంతంలో ఈ తర్వాత కవుల నామరూపాలు లేకుండాపోయాయి. బ్రహ్మ, ఆయన పలికిన వేదాలు మిగిలాయి. త్రేతాయుగాంతంలో నిల్చినది వాల్మీకి కోకిల మొక్కటే. ద్వాపరయుగాంతంలో శ్రీ వ్యాసభగవానుడూ ఆయన రచనలూ మిగిలాయి. ఆయా యుగప్రసిద్ధకవులైన బ్రహ్మ, వాల్మీకి, వ్యాసరచనల్ను మనం నేటికీ నిత్యపారాయణ చేసుకుంటున్నాం. కాళిదాస భవభూతుల రచనలుకూడా ఇట్టి నిత్యపారాయణా యోగ్యతను సాధించుకో లేకపోయాయి. ఆధ్యాత్మికదృష్టి లేని కేవల సాహిత్యవేత్తలకు కవిగా తెలియని శ్రీశంకరభగవత్పాదులవారి రచనలు వాల్మీకి వ్యాసుల రచనలతో తుల్యమైన నిత్యపారాయణా యోగ్యతను కల్గిఉన్నాయి. ఆయన రచనల్లో మంత్రతుల్యమైన శబ్దసిద్ధి ఉన్నది. ఆయన దక్షిణామూర్తి స్తోత్రం - శాంతరససిద్ధికల మహాకావ్యమే. ఆయన చాల సంవత్సరాలక్రితమే మనోహరమైన వచన రచన చేశారు. ప్రస్తా-

నత్రయ భాష్యంలో ఆచార్యులవారి వచనం శబ్దసౌందర్యానికీ, విషయ స్పష్టీకరణకూ, మనోజ్ఞమైన శైలికీ మౌలిక రచన. ఆయన వచన రచనలే నిత్య మనన, నిత్య పారాయణా యోగ్యాలై భారతదేశాన్నే పునీతం చేశాయి.

తెలుగుభాషతో ఇట్లా నిత్యపారాయణాయోగ్యత ఆర్జించుకున్న రచన శ్రీ పోతన్నగారి భాగవతం. అందులో గజేంద్రమోక్షం, రుక్మిణీకల్యాణం, ప్రహ్లాదచరిత్ర, గోపికాగీతలు. ఇవి వ్యాస వాల్మీకులకు తీసిపోని రచనలు. ఇవి ఏభాషకైనా అలంకారాలే. మనభాషలో మణిదీపాలు. పాలుకురికి బసవపురాణంకూడా కొన్నిచోట్ల ఆవిధమైన ఆదరం పొందుతున్నదనీ, వేములవాడ శ్రీరాజరాజేశ్వరస్వామివారి ఆలయములో సోమనాథుని బసవపురాణాన్ని ఉదాత్తానుదాత్త స్వరాలతో వేదంలాగా పఠిస్తారనీ విన్నాను.”

ఫతీమా మాటలకు నారాయణరావు సంతోషపడ్డాడు. “ఫతీ, నువ్వు సంస్కృతాంధ్రసాహిత్యాలు ఆపోశనపట్టావు. నీ వివేకం, ఆలోచనాశక్తి, భావుకత, నిజంగా ఉన్నతకక్ష్యల్లో ఉన్నాయి” అన్నాడు. ఆమె “ఇదంతా మీ పెత్తల్లిగారి కటాక్షం” అని అన్నది. నారాయణరావుకి ఆమె అసాధారణ ప్రజ్ఞావంతురాలని బోధపడింది. అన్యమతంలో పుట్టి స్వల్పకాలంలో సంస్కృతాంధ్రసాహిత్యాల్ని, సనాతన మతసంస్కృతుల్నీ, ఇంతబాగా అవగాహన చేసుకోవడం సామాన్య విషయంకాదు. అనేకమంది సంప్రదాయనిష్ఠులకు తెలియని

రహస్యాలు ఆమె మాట్లాడింది. ఇది ఆమె సుకృతమే. ఆమెది కారణజన్మమే. ఇట్లా ఆలోచించి నారాయణరావు "ఫతీ! నువ్వు నిజంగా గొప్పదానివి!" అని ఏదో నూతన గౌరవాభిమానంతో ఆమెవంక చూచాడు. ఆమె మందస్మితంగా "మీరు మాటిమాటికీ నన్ను "ఫతీ! ఫతీ" అంటున్నారు. నేను పేరు మార్చుకున్నాను. అన్నట్లు మీకు చెప్పలేదుగా - చెబుతాను" అని "కాఫీ తెస్తాను" అంటూ లోపలకు వెళ్ళింది.

ఇరవై నిమిషాలకు తిరిగి వచ్చిన ఫతీమా సంభ్రమాశ్చర్యాలతో - ఒక వినూతన ఆనంద ఆవేశాలతో - గబగబా నారాయణరావు దగ్గరకు వచ్చి అతనికి పాదాభివందనం చేసింది. ఈ ఆవేశం ఆనందం ఉత్సాహం ఏమిటో అర్థంగాక నారాయణరావు ప్రశ్నార్థకంగా ఆమెవంక చూచాడు. ఆమె చెప్పింది. "లోపలకు వెళ్ళి కాఫీకి పాలు కాగడానికి ఆలస్యం ఉండగా రేడియో పెట్టాను. వార్తలు వచ్చినై. అందులో మన దేవపురంలో రామస్వామిగారిని గురించి అద్భుతమైన వార్తలు. ఈ ఉదయం కాంగ్రెసు నాయకుల్ని అందర్నీ నిర్బంధంలోకి తీసుకున్నట్టుగా - రామస్వామిగారినికూడా నిర్బంధించడానికి పోలీసువారు రామయోగి మందిరం దగ్గరకు పోయారుట. యోగశక్తిచేత మూయబడిఉన్న తలుపుల్ని పోలీసువారు తెరవలేక సతమతమవుతూండగా, ఊళ్ళో అన్ని కులాలవారూ-చుట్టుప్రక్కల పదిఊళ్ళ హరిజనులువచ్చి చుట్టుముట్టారుట. పోలీసువారు యోగమందిరంలోకి ప్రవేశించగూడ

దని జనం అభ్యంతరం చెప్పారుట. ఆంగ్లో ఇండియన్ అయిన పోలీసు డిప్యూటీ సూపర్నెంటు ఆ జనంమీద కాల్పులు సాగించమని ఉత్తర్వులు చేశాట్ట. పోలీసువాళ్లు యాత్తైమంది. జనం పదివేలదాకా ఉన్నారు. పోలీసులు పస్తాయించేరుట. వాళ్లుకూడా పైగా భారతీయులే. వాళ్లు నిష్కారణంగా యోగమందిరం దగ్గర ఆయుధప్రయోగం చెయ్యమని ధిక్కరించారుట. ఆ సమయానికి డిప్యూటీ కలెక్టరుగారు వచ్చి - పోలీసువారిని వెనక్కు తీసుకువెళ్ళి - జనంయొక్క ఉద్రేకాన్ని ఉపశమింపచేశారుట. ఆ తరువాత డిప్యూటీ కలెక్టరుగారు తన గౌరవాన్ని తెలుపుకోవడానికి యోగమందిరంలోకి వెళ్ళి నమస్కరించగా లోపల మందిరంలో తలుపులు వాటంతటవి తెరుచుకుని రామస్వామిగారు బయటకు వచ్చారుట. ఆయన డిప్యూటీ కలెక్టరుగారితో అన్నారుట "నన్ను నిర్బంధంలో ఉంచదలచుకుంటే నేను సిద్ధమే పదండి." దానికి డిప్యూటీ కలెక్టరుగారు కళ్ళనీళ్ళు పెట్టుకుని "స్వామీ కేవలము ఆధ్యాత్మికంగా తపస్సమాధిలో ఉన్న మిమ్మల్ని బాధపెట్టటం ప్రభుత్వోద్దేశంకాదు. ఆ పోలీసు అధికారి పైవారి ఉత్తర్వులు లేకుండా తొందరపడ్డాడు. అయినా మన ప్రజలు స్వాతంత్ర్యాన్ని పోగొట్టుకున్నా మతాన్నీ, మహాపురుషుల్నీ, సంస్కృతినీ పోగొట్టుకోవడానికి సిద్ధంగా లేరు. ప్రాణాలైనా ఒడ్డి రక్షించుకుంటారు" అంటూ రామస్వామిగారికి పాదాభివందనం చేశారుట. మళ్ళీ తలుపులు మామూలుగా మూసుకు

పోయాయిట. ఆ ప్రాంతంలో రామయోగిగారిని పోలీసులు కాల్చి చంపారని పుకార్లు లేచాయనీ అవి నిజంకావనీ జరిగిన వృత్తాంతం ఇదనీ జనం ఆందోళన చెందనక్కరలేదని రేడియోలో చెప్పారు.

రామస్వామిగారు మీ తండ్రిగారి శిష్యులు, మీకు ముఖ్యులు. ఈ వార్త విని ఆనందాన్ని ఆపుకోలేక మీకు వచ్చి నమస్కరించాను. మిమ్మల్ని చూస్తే మీ తండ్రిగారు, రామస్వామిగారు దర్శనం ఇస్తున్నారా అనిపిస్తోంది. ఇట్టి మహనీయమైన మీ కుటుంబంతో అనుబంధం కలిగిన నేను గర్విస్తున్నాను" అని ఫతీమా నా రా య ణ రా వు కి ఎదురుగా కూర్చున్నది.

నారాయణరావు కళ్ళుమూసుకుని తండ్రిగారిని, రామస్వామిగారిని స్మరించి నమస్కరించి కళ్లు తెరిచాడు. మనస్సు ఏదో ప్రశాంతిగా ఉన్నదని గ్రహించాడు. ఫతీమా అతని వంక చూస్తూ కూర్చున్నది. నారాయణరావు ఫతీమావంక చూచి "ఐతే నీవు పేరుమార్చుకున్న సంగతులు చెబుతానన్నావు" అన్నాడు. 'చెబుతాను' అని ఫతీమా మొదలు పెట్టింది. నారాయణరావు కుతూహలంగా వింటున్నాడు.

## 26

"ఆరోజు నేనుమీఇంట్లోమీపెత్తల్లిగారి అనుగ్రహానికి పాత్రురాలనై ఆమెవద్ద త్రైలోక్యమోహనమైన సౌభాగ్య

విద్యనుపొంది మీ భుక్తశేషాన్ని భుజించి వెళ్లాను. నేను వెళ్లే టప్పటికే మానాన్న మద్రాసునుంచి వచ్చి ఉన్నారు. నా పసుపు కుంకుమ, కాసెపోసిన చీరకట్టు, జుట్టుముడి, ఏమీ ఆయనకు నచ్చలేదు. ఆయనకు చాలా మనస్తాపమైంది. నాకు విశృంఖల మైన స్వాతంత్ర్యం ఇచ్చి నన్ను పాడుచేస్తున్నదని మాతల్లి గారిని ఆయన మందలించాడు. మా తల్లిగారికి ఆయనకు మాటామాటా వచ్చింది. ఆమె ఆయనకు అన్నీ వివరంగా చెప్పింది. "షరీనా నారాయణరావును ప్రేమిస్తున్నది. నారా యణరావునుతప్ప ఇతరుని వివాహం చేసుకోనని నిశ్చయంచేసు కున్నది" ఆ మాటలు ఆయనకు రుచించలేదు. అట్లా పనికిరా దని, కుమార్తెకు నచ్చచెప్పవలసిన బాధ్యత తల్లికి ఉన్నదని ఆయన అభిప్రాయము. మా తల్లిగారు తాను హైందవ స్త్రీయై యుండి - మహమ్మదీయుని ప్రేమించి, ఆయనమతాన్ని స్వీకరించి ఆయన అభిరుచులకు అనుకూలమైన వేషధారణ చేయలేదా ? అట్లే ఆమెకుమార్తె హిందువును ప్రేమించి, హైందవస్త్రీవలె వేషధారణముచేసి, బొట్టుపెట్టుకుని శిరోలంకరణం చేసుకొని, హైందవమతాన్ని స్వీకరించి, తాను ప్రేమించిన హైందవుని పెండ్లాడటంలో-దోషంగాని-అసంబద్ధంగాని ఏమీ లేదని మా తల్లిగారు గట్టిగా వాదించింది. పైగా విద్యావంతులై మార్గ దర్శకులైన తమవంటి తల్లితండ్రులు, ఇట్టి వివాహానికి ప్రోత్స హించవలసిన బాధ్యతకూడా ఉన్నదని ఆమె చెప్పింది. మా తండ్రిగారికి కోపం తగ్గలేదు. మేము దేవపురంనుంచి బందరు

వెళ్ళిన తరువాత మాతల్లిగారికి తండ్రిగారికి తీవ్ర వాదోప వాదాలు జరిగినై. మా తండ్రిగారు ఖచ్చితంగా చెప్పారు. "షతీమా మామూలుగా మహమ్మదీయ యువతిలాగా దుస్తులు వేసుకుని తీరాల్సిందే. నారాయణరావు మహమ్మదీయుడై మన పిల్లను పెండ్లిచేసుకుంటే అభ్యంతరంలేదు. మనపిల్ల హిందూమతాన్ని తీసుకుంటే మనకు అవమానమే. ఇప్పటికే షతీమా ప్రవర్తనవల్ల సాటివాళ్ళలో - పెద్దపెద్ద ముస్లీలవద్ద తలవంపులుగా ఉన్నది. నాకుమాత్రె ప్రేమకథా ప్రచారంవల్ల నా క్రింది ఉద్యోగులకుకూడా నా మీద భయ గౌరవాలు సన్నగిల్లినై."

మా తల్లిగారుకూడా తీవ్రంగానే ప్రతివాదం చేసింది. ఇద్దరకూ మాటలు పెరిగినై. ఇరవై రెండేండ్ల దాంపత్యజీవితంలో వాళ్ళెప్పుడూ ఘర్షణ పడిఉండలేదు. అటువంటి వాళ్ళిద్దరిమధ్యా నామూలంగా తీవ్రమైన అభిప్రాయ భేదాలు వచ్చినై. ఎడమొగం పెడమొగంగా అయింది. మాటలు లేకుండా పోయినాయి. ఒకరినొకరు చూచుకోవడమే మానుకున్నారు. మా తండ్రిగారు ఇంటిదగ్గర ఉండటమే మానుకున్నారు. ఇంట్లో భోజనం లేనేలేదు. అంతవరకు మా తల్లిగారి సాహచర్యంలో పరమశాకాహారిగా ఉన్న ఆయన, రాత్రింబవళ్లు క్లబ్బుల్లో, క్యాంపుల్లో గడుపుతూ - మాంసాహారిగా మారిపోయి, త్రాగుడు మొదలుపెట్టి ఇంటికి రావడమే గగనమైపోయింది. మా తల్లిగారికి ఆయన ప్రవర్తన చాలా ఆందో

శన కలిగించింది. ఆమెకు మనశ్శాంతి లేకుండా పోయింది. ఆమె అన్నం ముట్టుకోవడమే మానుకున్నది. నేనెంత బలవంతం చేసినా ఫలితం లేకపోయింది. ఆమె లోపలలోపల కుమిలి మిక్కిలి బాధపడింది. జీవితంలో త్రిప్పుకోవడానికి వీల్లేని తప్పిదం చేసినట్లుగా మహాభారమైన దుఃఖాన్ని భరించింది.

ఈ దుఃఖంవల్ల, అశాంతివల్ల, నిరాహారస్థితివల్ల ఆమెకు పదిరోజుల్లో రోగం ముంచుకువచ్చింది. వారంరోజులదాకా మాతండ్రిగారు పట్టించుకోలేదు. ఆయన పట్టించుకుని వైద్యోపచారాలు మొదలుపెట్టే సమయానికే ఆమె రోగం ముదిరి పోయి చేయిజారిపోయింది. తరువాత ఆమె నాలుగురోజులే బ్రతికింది అసలు ఆమెకు జీవించడం ఇష్టంలేనట్లుగా నాకనిపించింది. ఏదో చేసిన తప్పి దానికి ప్రాయశ్చిత్త ప్రాయోపవేశం చేస్తున్నట్లుగా ఆమె మరణోన్ముఖంగా ఉన్నది. భారత స్త్రీకి ఇతర నాగరిక దేశాలలోగా తాను ప్రేమించిన పురుషుణ్ణి వివాహమాడే స్వాతంత్ర్యమున్నదనీ దాన్ని పోగొట్టుకోవద్దనీ నాకు పదేపదే ఆమె చెప్పింది. తనవైపు బంధువులు ఎవ్వరెవ్వరు ఎక్కడ ఉన్నదీ పట్టీవ్రాసి తలక్రింద పెట్టి ఉంచినది. నా స్వాతంత్ర్యాన్ని ఎన్ని త్యాగాలైనాచేసి నిల్పుకుంటానని నానుంచి ప్రమాణం తీసుకున్నది. నా సమస్యమూలంగా, పరమ అశాంతితో, ప్రాయోపవేశంలో మా తల్లిగారు మరణించింది.

అంతవరకు మాగుమ్మంతొక్కని మాతండ్రిగారి బంధుజనం వెంటనే బెల్లానికీపట్టిన సన్నచీమలలాగా మూగారు.

వాళ్ళందరికీ నేను కంటకం అయ్యాను. ఎవరికీ నా పద్ధతులు, నా బట్టలు, నా తిలకం, నా శిరోలంకరణం ఏవీ నచ్చలేదు. నేను పితృద్రోహం మతద్రోహం చేస్తున్నానుట. నేను చేసేపని సక్రమంగా లేదట. అంతా ప్రతిరోజూ నామీద ఏవో కల్పించి మా తండ్రిగారితో చాడీలు చెప్పేవారే. నేను ఆ దినం మీ యింట్లో భోజనం చేసినప్పటినుంచి బ్రాహ్మణహోటలునుంచి క్యారియరుతో తెప్పించుకుని భోజనం చేస్తున్నాను. నా స్నానం, నా జపం, నా భోజనం మా తండ్రిగారి బంధువులకు అన్నీ ఏవగింపుగానే ఉన్నాయి. నామీద మా తండ్రిగారికి కల్పించి చెప్పని మాటలేదు. ఆయన నాతో మాట్లాడటం నన్ను చూడటంకూడా మానేశారు.

మా తల్లిగారు మరణించేటప్పటికి మా తండ్రిగారి వయస్సు నల్భైమూడు సంవత్సరాలే. బంధువులు ఆయనకు రెండో పెండ్లి ప్రయత్నంచేశారు. పెద్దఆస్తి, పెద్దఉద్యోగము. సంబంధం దొరకడానికి కష్టం లేనేలేదు. పేదఇంటి యువతి, ఇరవైఆరేళ్ళ వయస్సుది దొరకడం - వివాహం జరగటం ఆమెవచ్చి ఇంటికి యజమాని కావడం - జరిగినై. ఆమె వచ్చి నప్పటినుంచీ నాకు చాలా బాధలు వచ్చినై. మా తండ్రిగారికి నా స్నాన జపానుష్ఠాలపైన ఇష్టం లేకపోయినా, ఆయన నా మీద చేయి చేసుకోలేదు. నన్ను వేధించలేదు. మా పిన్తల్లి అట్లాగాక నన్ను వేధించడం మొదలుపెట్టింది. నేను స్నానం చేసి జపం చేసుకునేటప్పుడు ఏదో ముఖ్యమైన పని ఉన్నదని

పిలవడం - వచ్చి ముట్టుకోవడం చేసేది. తలుపులు వేసుకొని లోపల కూచుని జపం చేస్తుంటే తలుపులు తెరచేదాకా దబ దబా బాదేది. నేను ఉపయోగించుకునేందుకు తెచ్చుకున్న పసుపు కుంకుమ లాక్కు_వెళ్ళి మట్టిలో పారవేసేది. నేను బ్రాహ్మణహోటలునుంచి తెప్పించుకుంటున్న కేరియరులో- నేను ఎదురుగా లేకపోతే మాంసపుకూరలు, పలావు కలిపివేసేది. ఇట్లా నా నిష్ఠకు, నా జపానికి, భోజనానికి, నానాకష్టాలు పెట్టేది. నేను భోంచేస్తుండగా ఎందుకు తినవని మాంసభోజ్యాలు విస్తట్లో వేసేది. నేను ఆ సంకట పరిస్థితుల్లో క్షోభ పడుతూ - గత్యంతరం లేక - మా తల్లిగారిలాగానే ప్రాయోపవేశం చేసి ప్రాణత్యాగం చెయ్యాలని నిశ్చయించుకుని భోజనం మానుకున్నాను. భోజనపాన స్నానాదులు మానుకుని పద్మాసనంలో కూర్చుండిపోయాను. మా తల్లిగారు పోయినతర్వాత ఒకటి రెండు సార్లకంటె మా తండ్రిగారిని చూచుటకు నాకు వీలుపడలేదు.

నేను ప్రాయోపవేశం ప్రారంభించిన మూడోరోజున మా తండ్రిగారికి తెలిసింది. ఆయన మా తల్లిగారిలాగా నేను కూడా చనిపోతానని భయపడ్డారు. వెంటనే నేను కూర్చున్న గదిలోకి వచ్చారు. నేను కళ్లు మూసుకుని ఉన్నాను. ఆయన వచ్చీ రావడం నన్ను పిలిచారు. నేను నిస్త్రాణంగా ఉండి - పలుకలేదు. ఇక ఆయన దుఃఖం ఆగలేదు. నాదగ్గర కూర్చుని నన్ను తన ఒడిలోకి తీసుకున్నారు. నేను కళ్ళు తెరచి

చూచాను. నాకు దుఃఖం ఆగక బావురుమన్నాను. ఆయన కూడా నాతో కలసి ఏడ్చారు. మా తల్లిగారు మరణించిన నాటి దుఃఖం - ఆయన అప్పుడు అనుభవించి, విలవిలలాడిపో యారు. నన్ను బుజ్జగించి, నాచేత వేణ్ణీళ్ళస్నానం చేయించి నేను అనుష్ఠానం చేస్తుంటే ఎదురుగా కూర్చుని - తర్వాత నాచేత పళ్ళరసం - తేనె - మజ్జిగ త్రాగించారు.

ఆయన నేను మాతల్లిగారి గొప్పతనాన్ని గురించి చెప్పుకున్నాము. ఆమె దేవతాత్వాన్ని గురించి పొగడు కున్నాము. మా తల్లిగారి సద్గుణాలుఆరోజున మా తండ్రి గారికి జ్ఞాపకం వచ్చినై. నన్నుగురించి మాతల్లి గారు చేసిన వాదం, ఆమె చెప్పినట్లుగాప్రేమ విషయంలో స్త్రీకి గల హక్కు, సబబుగా ఉన్నాయనీ - ధర్మసమ్మతంగాఉన్నా యనీ - ఆయనకు అప్పుడు తట్టింది. మళ్ళీ నన్ను చూచి చూచి దుఃఖపడి, నాకు అన్యాయం చేశానని ఆయన ఖేదపడ్డాడు. ఆయన తనంతట తాను తేరుకొని మా పినతల్లితో సంప్రతించక నన్ను వెంటనే నా అన్నిసామాను లతో ప్రయాణంచేసి కారులో బెజవాడ తీసుకువచ్చారు. అక్కడ ఆయన క్యాంపులో పనులు చూచుకుంటుంటే నేను విశ్రాంతి తీసుకున్నాను. బెజవాడనుంచి సరాసరి మద్రాసు తీసుకువచ్చి ఇక్కడ నన్ను వైద్యకళాశాలలో మొదటి తరగ తిలో చేర్పించారు. నాకు స్త్రీ విద్యార్థినుల వసతి గృహంలో గది చూచారు.

ఆయన నాకు చెప్పారు. తనకు ఆరులక్షల రూపాయల ఆస్తి ఉన్నదనీ అందులో సగం రొఖంగా మార్చి మూడు లక్షల రూపాయలు నాపేర బ్యాంకులో పదిరోజులలో వేస్తున్నాననీకూడా అన్నారు. ఆరోజే నాపేర బ్యాంకులో ముప్పయివేలరూపాయలు డిపాజిట్టు చేశారు. నన్ను చూడాలని ఎప్పుడు అనిపిస్తే అప్పుడు వచ్చి చూచిపోతాననీ - నాకు ఆయన్ను చూడాలని ఉంటే తంతి ఇవ్వమనీ వెంటనే వస్తాననీ చెప్పాడు. నాకు అన్ని విషయాలలో సంపూర్ణ స్వాతంత్ర్యమున్నదనీ - ఎప్పుడూ ధర్మాన్ని వదలిపెట్టవద్దని ఆయన నాతో చెప్పి వెళ్ళిపోయారు. ఆయన చెప్పినప్రకారం పదిరోజుల్లో నాపేర బ్యాంకుకి మూడులక్షలు వచ్చినై. తరువాత ఆయన రెండుసార్లు వచ్చి చూచిపోయారు.

హాస్టల్లో నా స్నాన జపానుష్ఠానాలకు అనుకూలంగా లేక ఇల్లు తీసుకున్నాను. మాతల్లిగారి బంధువులకై అన్వేషించగా ఎవరూ కన్పించలేదు. చివరకు ఈమె మా తల్లిగారికి పెత్తల్లిగారి కుమార్తె ఉన్నదని తెలిసింది. ఈమె పేదరాలు. ఎవరూ దిక్కులేక వంటలుచేసుకుని బ్రతుకుతున్నది. ఈమెను తిరుపతినుంచి నేను తీసుకునివచ్చి కాపురం పెట్టాను. ఇక ఈమే నాకు దిక్కు. నేనే ఆమెకు దిక్కుగా అయింది. యుద్ధభయంతో ఎవాక్యుయేషన్‌వల్ల ఈ ఇల్లు చౌకగా అమ్మకానికి వచ్చింది, కొన్నాను. ఇది స్వగృహం. ఇంట్లో నాకు మా తల్లిగారు బదులు ఈమె ఉన్నది. కొంత ప్రశాంతి లభించింది. చదువు

బాగానే సాగుతున్నది” అని ఆగి ఆమె కళ్ళు తుడుచుకున్నది. తన్నుబట్టి ఆమె తల్లిని పోగొట్టుకున్నదనీ తండ్రిని దూరం చేసుకున్నదనీ తనకోసమే త్యాగజీవితం గడుపుతున్నదనీ తెలుసుకున్న నారాయణరావు హృదయం స్పందించి కళ్ళు తుడుచుకున్నాడు.

ఆమె మళ్ళీ చెప్పింది. “నా నిత్యస్నాన జపానుష్ఠానాలు భోజనం అచ్చంగా మీ పద్ధతిలో ఉన్నాయన్నానుగా, పైగా బ్రాహ్మణ స్త్రీలాగానే బొట్టు కట్టు జుట్టు అంతా హైందవ విధానమే. కనుక పేరు ‘ఫతీమా’ అని ఉంటే అందరికీ సంజాయిషీ ఇవ్వవలసివస్తుందని ముందుగానే మెడికలు కాలేజీలో చేరడానికి ముందే నాపేరు ‘సుమతి’ అని మార్చుకున్నాను. ఇప్పుడు నేను సుమతిని. ఫతీమాను కాదు. అడిగిన వారికి నాకు పెళ్ళి ఐనదనే చెబుతునాను. కాలేజీలో కూడా అట్లాగే వ్రాయించాను. నాకు మంగళసూత్రాలు ఉండనే ఉన్నవి. మా పెత్తల్లిగారి సలహామీద తెలుగు బ్రాహ్మణ ముత్తైదువలాగా నల్లపూసలు మట్టెలు చేయించుకున్నాను. ఇప్పుడు సర్వేసర్వత్రా నాపేరు మిసెస్ సుమతీ నారాయణరావు” అని అతనివంక సగర్వంగా నవ్వింది. ఆతడూ మందస్మితం చేశాడు. ఆమె మళ్ళీ చెప్పింది. “ఇక్కడ అందరికీ నేను బ్రాహ్మణస్త్రీనే. వివాహితను. నాభర్తగారు ఢిల్లీలో పెద్ద ఉద్యోగంలో ఉన్నారు. ఆయన మిలటరీ డాక్టరు. ఆయన పట్టుపట్టగా నేనుకూడా డాక్టరీ చదువుతున్నాను. ఈ మాటలు

ఎట్లా వాడుకలోకి వచ్చాయో నాకు తెలియదు. లోకం అట్లా చెప్పుకుంటున్నది. మన భారతంలో ఏకలవ్యుని కథఉన్నది. ఏకలవ్యుడు గురువును స్వయంవరంగా స్వీకరించి విద్యాసిద్ధి పొందగలిగాడు. భారత స్త్రీ తన భర్తను స్వయంవరంగా స్వీకరించి, ఆరాధించి, ప్రేమతపస్సిద్ధి యెందుకు సాధించకూడదు? అక్కడ గురువుగారి సమ్మతితో నిమిత్తంలేదు. ఇక్కడ భర్తగారి సమ్మతితో నిమిత్తంలేదు. అక్కడ ఫలసిద్ధి ఉంటే ఇక్కడ కూడా ఉండవలసిందే. భగవదారాధన ఉన్నది. విగ్రహారాధన విషయం ఉన్నది. అదే స్త్రీవిషయంలో పాతివ్రత్యం. మనం వరించు ఇష్టదేవతల అంగీకారంపూని మనం పూజిస్తున్నామా? లేదే? అట్లాగే స్త్రీకి - తన భర్తవిషయంగా - ఆరాధన ఎందుక్కాకూడదు?" అని సుమతి తీక్షణంగా చూచి నవ్వింది. నారాయణరావు "ఎందుక్కాకూడదు? కావచ్చు" అని నవ్వాడు.

సుమతి ఇంకా చెప్పింది. "నిన్నటిరోజు చాలా విచిత్రమైన రోజు. నాజీవితంలోనే ముఖ్యమైనది. నిన్న శ్రావణ శుక్రవారం. అమ్మవారికి ప్రత్యేక ఆరాధన చేశాను. ప్రసాదం గ్రహించాను. అసలు మొన్నరాత్రి సుఖస్వప్నాలతో నిన్న తెల్లవారింది. నిన్నటి రోజున పుష్యమీనక్షత్రం అవటంవల్ల నాలుగు చిన్నాల బంగారం కొన్నాను. ఇట్లా ఇరవై ఏడుసార్లు కొని శ్రీ చక్రం చేయిద్దామని ఆలోచన. బంగారంమీద అమ్మవారిని ఉంచి పూజించాను. నిన్న సాయంకాలం బీచికివెళ్ళి

శ్రీపార్థసారథి స్వామివారి దర్శనం చేసివద్దామని బయలు దేరాను. "యశ్శివో నామ రూపాభ్యాం యాదేవీసర్వ మంగళా..." అనుకుంటూ వాకిట్లో కాలుపెట్టాను. పార్వతీ దేవిలాగా పెద్దముత్తైదువ ఎదురైంది. అన్నీ శుభసూచనలే. త్రోవపొడుగునా మంగళ వాయిద్యాలే. ఏమిటీ శుభ వాద్య విశేషమని ఆనందించాను. ప్రెసిడెన్సీ కాలేజీ దగ్గర రోడ్డుదాటి బీచిలో కాలుపెట్టాను. ఎదురుగా మీరు కూర్చుని ఉన్నారు. కాదేమో అనుకున్నాను. గబగబా మీదగ్గరకు నడిచాను. కాకపోవడమేమిటీ - మీరే - అసలు మీరే - దీర్ఘమైన ఊర్ధ్వకాయం - దృఢమైన నాసాదండం - పెద్దకళ్ళు - విశాలమైన ఫాలం-ఏదో అనిర్వచనీయమైన తేజస్సును ప్రస్ఫుటంచేసే దృక్కులు - అనంత గంభీరమైన సముద్ర గర్భంలోకి చూస్తూ కూర్చుని ఉన్నారు. మీదగ్గరకు వచ్చి కూర్చున్నాను."

# 27

నారాయణరావు ఆసాయంత్రం బెంగుళూరు వెళతానని ప్రయాణం అయ్యాడు. సుమతి పెందరాళే వంట చేయించింది. భోజనాలు జరుగుతున్నాయి. రేడియోలో వార్తలు వస్తున్నాయి.

దేశంలో అన్ని ప్రాంతాలలోనూ విప్లవం చెలరేగింది. గాంధీమహాత్ముణ్ణి ఇతర నాయకుల్ని నిర్బంధంలోకి తీసుకున్నారన్న వార్తకు దేశం అంతా ఉడికిపోయింది. దేశం మహా

క్రోధోజ్వలంగా మారిపోయింది. ప్రజల ఆవేశం, ఆగ్రహం, కట్టలు తెంచుకున్నై. ఉద్రేకంలో ప్రజలు అనేకచోట్ల టెలిఫోను స్తంభాలు తీసివేశారుట. అనేకచోట్ల రైలుపట్టాలు తొలగించారుట. అనేక పోలీసు స్టేషన్లమీద దాడిచేశారుట. అనేక చిన్నచిన్న ఆఫీసుల్ని తగలబెట్టారుట. ఈ అనిశ్చిత పరిస్థితి కారణంగా మద్రాసునుంచి బయలుదేరే రైళ్ళు రెండు రోజులు నిలుపుదల చేశారుట. ఈవార్తలు వింటుంటే నారాయణరావుకి ఏమీ పాలుపోలేదు. అతని ప్రయాణం నిల్చిపోయింది. తిరిగి కృష్ణస్వామిగారి ఇంటికి పోదామనుకున్నాడు. అది భావ్యంకాదని ఆ ఆలోచన విరమించుకున్నాడు. ఇక్కడే ఉంటే దోషం ఏమున్నది? ఇక్కడ అంతా సక్రమంగా పరిశుభ్రంగా ఉండనే ఉన్నది. వంటామె బ్రాహ్మణి. ఇంట్లో ఆచారాలన్నీ హైందవంగా ఉన్నాయి. పైగా వెళ్లిపోవడం మర్యాదగానూ ఉండదు. ఇక్కడే ఉండాలని నిశ్చయించుకున్నాడు. అతడు భోజనం ముగించుకుని బయటకు వచ్చిన తర్వాత సుమతి అతని కళ్ళలోకి చూచింది. ఇక్కడ రెండు నాళ్ళు గడపడానికి వ్యతిరేకభావంతో ఉన్నాడేమోనని. అతడు తృప్తిగా ఉండటం - ఆమెకు తెలిసిపోయింది. అతను రెండురోజులు తన ఇంట్లో ఉంటాడని.

ఆ రెండునాళ్లూ ఆమె శలవు పెట్టింది. కాలేజీ సంగతే మరచి పోయింది. ఆ రెండు రోజులూ హామేషా ఆమె అతన్ని కనిపెట్టుకుని ఉంది. అతనికి ఎప్పుడు ఏమి కావాలో అతడు

అడగకుండానే సమకూర్చింది. అతనికి పరిచర్యలు చేయడంలో, అతనికి బహురుచ్యమైన పదార్థాలు తయారుచేయించడంలో అతన్ని సర్వసంలగ్న దృష్టితో సేవించడంలో ఆమెకు ఆ రెండునాళ్లూ గడిచాయి. ఆమె నిత్యమూ ప్రాతస్సాయంకాలాలలో అతని పాదాలకు శిరస్సు తాకించి నమస్కారం చేయటంలో తప్ప అచ్చమైన శీలముగల వాళ్ళిద్దరూ ఆ రెండు రోజులలో స్పృశించుకోనైనా లేదు. వాళ్ళిద్దరూ ప్రేమైక దృష్టులతో చూచుకోవడం, అభిమానంగా మాట్లాడుకోవడం, ఆర్ద్రీత వెళ్ళబుచ్చుకోవడం, మక్కువలు చూపించుకోవటం, ఇష్టాగోష్ఠితో ప్రొద్దుపుచ్చుకోవటం, ఒకళ్ళ నొకళ్లు పరిహాసం చేసుకోవటం, అరమరికలు లేకుండా ప్రవర్తించడం అన్నీ ప్రేమ పత్నులైన దంపతులలాగానే ఉన్నాయి కాని - అసలా ఇద్దరూ మన్మథుని జయించిన కామేశ్వరీ కామేశ్వరులభక్తులు కావడం చేతనేమో-కించిత్తుకూడా కామోద్రేకం ప్రదర్శించుకోలేదు.

రైళ్లు తిరిగి రాకపోకలు ప్రారంభించిన మర్నాడు నారాయణరావు బెంగుళూరు ప్రయాణము కట్టాడు. సుమతి అతన్ని సాగనంపడానికై రైలుస్టేషనుకి వచ్చింది. అతనికి సెకండుక్లాసు టిక్కట్టుకొని ఆమె తెచ్చి ఇచ్చింది. అతడు తీసుకోడానికి సంకోచింపగా ఆమె బలవంతంచేసి చేతిలోపెట్టింది. అతడు రైలుపెట్టెలో ఎక్కి కూర్చున్నాడు. ఆమెకూడా వెళ్లి పక్కన కూర్చున్నది. అప్పుడు ఇష్టాగోష్ఠిలో నారాయణరావుకి చెప్పింది. "మీరు మద్రాసు వచ్చి పదిరోజులైనా ఉద్యోగ

విషయంలో ఏమీ తేలలేదుకదా! బెంగుళూరులో మీ చేతికి డబ్బు ఎప్పుడు వస్తుందో ఇంటికి పంపడానికి ఎప్పుడు సావకాశం అవుతుందో ఇంటిదగ్గర ఏమి ఇబ్బందిగా వుందో- మీ సమ్మతి లేకుండా నిన్న వెంకమ్మగారి పేర రెండువందల రూపాయలు మీరు పంపినట్లుగా పంపాను. క్షమించండి." ఈ సంగతులకు నారాయణరావు "బాగాలేదు" అని చిరుకోపం ప్రదర్శించాడు. ఆమె "బాగానే ఉన్నది. ఫర్వాలేదు లెండి" అని మందస్మితం చేసింది. "మీరు బెంగుళూరులో అనవసరంగా ఇబ్బంది పడకండి. డబ్బు అవసరమైతే నాకు వ్రాయండి. సంకోచ పడకండి. నాసొమ్మంతా మీదేకదా! మీసొమ్ము మీరు వాడు వాడుకోవడానికి భిడియం ఎందుకు?" అంటూ ఏదో లోకాభి రామాయణంలోకి దింపింది. ఏవో కబుర్లు జరిగినై. రైలు కదలే సమయం దగ్గరపడుతున్నకొద్దీ ఇద్దరికీ ఏదో అశాంతి ఎక్కువ అవుతూన్నది. ఏదో తెలిసిన ఆపత్తు సన్నిహితం అవుతున్నట్లుగా వున్నది. ఇద్దరూ ఆలోచిస్తూ కూర్చున్నారు.

సుమతి మళ్లీ నారాయణరావుతో అన్నది. "ఈ జన్మలో మన మిద్దరం భార్యాభర్తలమై దాంపత్యజీవితం గడిపే అవకాశం లేనేలేదు. నే నిట్లా మీ భక్తురాలిగా మీ పాద ధ్యానం చేసుకుంటూ వైద్యవృత్తితో ప్రజాసేవచేస్తూ జీవితం గడుపుతుంటాను. మీకు అనుగ్రహం కలిగితే ఎప్పుడైనా చూచిపోతూండండి. ఇట్లాగే ఎల్లప్పుడూ ఇంటిని సంప్రదాయ శుద్ధిగా ఉంచుతాను. నా కెప్పుడైనా రావాలనిపిస్తే వచ్చి

మీ దర్శనం చేసి మీకు ఇబ్బంది కలిగించకుండా వెళ్ళి పోతాను. ఈ మాత్రం అనుగ్రహించండి." అంటూ ప్రార్థేయ పూర్వకంగా చూడగా నారాయణరావు నవ్వాడు.

సుమతి మళ్ళా చెప్పింది. "మీకు బాధ్యతగా మీ తమ్ములు చెల్లెలు ఉన్నారు. వాళ్ళను మీరు పైకి తీసుకుని రావలసి ఉన్నది. అందుకని మీరు పెళ్లిచేసుకోక తప్పదు. మీ కులంలోనే చేసుకోవలసివుంది. అందువలన నేను బాధ పడను. మీరు వెంటనే వివాహం చేసుకుంటేనే నాకు నిజంగా సంతోషం. నా జీవితానికి అదే అసలు సాఫల్యహేతువు కూడాను. స్త్రీత్వం మాతృత్వంతోగాని పండదు. నాకు మీరు భర్తలు. కాని మనకు దాంపత్య జీవితం లేదు. మరి నాస్త్రీత్వం ఎట్లా మాతృత్వంలో పర్యవసించాలి ? ఆత్మాభిన్నంగా మీరు నా యందున్నారు. కాబట్టి మీ సంతానమే నా సంతానము. ఆవిధంగానే నాకు మాతృత్వసిద్ధిన్నీ. శరవణభవుడైన కుమార స్వామి గిరిజానందనుడుగాను గాంగేయుడుగాను కీర్తిపొంద లేదా ? బ్రహ్మ మానసపుత్రులైన నారద సనకసనందనాదులూ, వసిష్ఠాది ప్రజాపతులూ బ్రాహ్మీపుత్రు లేకదా! నాకు ఈవిధంగా నైనా మాతృత్వాన్ని ప్రసాదించమని మిమ్మల్ని అర్థిస్తున్నాను." అని ఆమె నారాయణరావువంక దీనంగా చూచింది. నారా యణరావు మౌనంగా ఉన్నాడు. సుమతి "నామాటలు మీ మనస్సుకి నొప్పికలిగిస్తే నన్ను క్షమించండి !" అని అన్నది. దానికి నారాయణరావు "సుమతీ ! అంతా ఈశ్వర సంకల్ప

విధానాన్ని బట్టి జరుగుతూ ఉంటుంది. నిన్ను క్షమించడానికే మున్నది ఇందులో! నాకు బాధ కలిగించేమాటలు నువ్వు అంటావా? అంతా భగవదభిమతం ప్రకారం జరుగుతుంది. మనం కాలగమనాన్ని మార్చలేము. శిరస్సువంచి భగవన్నిర్ణయాన్ని వహించవలసినవాళ్ళం. ఏఆలోచనలూ అక్కరలేదు" అని అన్నాడు. సుమతికి అతని మాటల్లో ఆంతర్యం బోధపడలేదు. అతని మనస్సు నొప్పిపడిందో సుముఖతగా ఉన్నదో, ఆమెకు తెలియనేలేదు. ఆమె మళ్ళీ అన్నది. "మీరు నామీద సర్వదా అనుగ్రహం ఉంచాలి." నారాయణరావు ఏమీ చెప్పలేదు. ఆమె అతని మనస్సుని కష్టపెట్టినాననుకొని, బాధపడి దీనంగా, ప్రార్థేయపూర్వకంగా క్షమించమని అన్నట్లుగా చూచింది. నారాయణరావుకి అప్పుడు తెలిసింది-మానసికంగా ఆమె బాధపడుతున్నదని. ఆమెను నొప్పించడం ఇష్టంలేక అన్నాడు. "సుమతీ! నీమనస్సుకి బాధకల్గించడం నాకు సమ్మతం కాదు. నువ్వు అన్నట్లుగా మనం ఇద్దరం దాంపత్యజీవితం గడపటం అసంభవమే. కాని మన ఇద్దరిమధ్యా ఏదో పూర్వజన్మానుబంధం ఉన్నమాట యదార్థమని ఆత్మనా అంగీకరిస్తున్నాను. ఇట్లా మనిద్దర్నీ సన్నిహితుల్ని చెయ్యడంలో విధి యొక్క ఉద్దేశమేమిటో? నీమీద నాకు సర్వదా అచంచలమైన గౌరవాభిమానాలు ఉంటాయి. ఈ గౌరవాభిమానాల్ని అపార్థంచేసుకుని లోకం ఏదో చేస్తుందని నాకు భయంలేదు. నాకు గౌరవపాత్రురాలైన నీ మాటలు నేను శ్రద్ధగా

విన్నాను. నీ మాటల్లోని భావాన్ని నేను గౌరవంగా చూస్తు న్నాను. ఎంతవరకుసమాదరించిఆచరణలోకితీసుకురాగలనో అది భగవదభిమతంమీద ఆధారపడి ఉంది. ఇప్పుడు ఇంతకంటె చెప్పలేను" అని అన్నాడు. ఆమె కళ్ళల్లోకి చూచాడు. ఆమె కళ్ళలో నీళ్ళు నిలచాయి. తుడుచుకున్నది. అతడు అన్నాడు. "ఊరుకో సుమతీ! వివేకవతివి. ఇంద్రియనిగ్రహంతో ఇంద్రి యాల రాజైన మనస్సును జయించడానికి ప్రయత్నిస్తున్న దానివి. ఇట్లా బెంబేలుపడకూడదు" అని ఓదార్చాడు.

బండి బయలుదేరుతున్నది. ఆమె దిగి బండికి ప్రక్కగా వచ్చి అతనికి ఎదురుగా బండికి చేరువగా నిల్చున్నది. అతడు లేచి కిటికీలోంచి తల బైటపెట్టి ఆమెవంకచూస్తూ నుంచు న్నాడు. బండీ కదలింది. ఆమెవైపుగా అతను చెయ్యిజాపాడు. ఆమె స్పృశించి వదలిపెట్టింది. రెండుచేతులతో అతనికి నమస్క రించింది. అతడు ఆమెవంక అట్లాగే చూస్తూ నిల్చునిఉన్నాడు. బండీ తొందరపడింది. ఆమె బండితోపాటు పదిగజాలు నడ చింది. బండీ బాగా తొందరపడింది. ఆమె బండితోపాటు నడవ లేకపోయింది. బండి విజృంభించింది. ఇక నడచి లాభంలేదని ఆమె ఆగిపోయింది. అతడు ఆమెను చూస్తూనే ఉన్నాడు. ఆమె అతనిని చూస్తూనే ఉన్నది. ఆమె కన్పించినంతసేపూ అతడు చూశాడు. బండి కన్పించినంతసేపూ చూచి - ఆమె ఇంటికి వెళ్ళింది.

# 28

బెంగుళూరులో నారాయణరావుకి అంతా అనుకూలంగా జరిగింది. వెళ్ళగానే ఉద్యోగం దొరికింది. పత్రిక ఆఫీసు మావళ్ళీలో ఉంది. దగ్గర్లో వసతి ఏర్పాట్లుకూడా దొరికాయి. కానీ ఉద్యోగాన్ని కనిపెట్టుకుని ఉంటే జీవయాత్రకు అభ్యంతరం లేదు. ఐనా మంచిదని కొందరు మిత్రుల సలహామీద మద్రాసు సర్వీసు కమీషను పరీక్షలకుకట్టి అనంతపురం వెళ్ళి వ్రాసివచ్చాడు

బెంగుళూరులో ఒడుదుడుకులు లేకుండా నారాయణరావు గడుపుతున్నాడు. యజమాని దగ్గర మంచిపేరే సంపాదించుకున్నాడు.

ఆ సంవత్సరం భాద్రపదమాసం వచ్చింది. వినాయక చతుర్థి వచ్చింది. నారాయణరావుతో కలసి పనిచేస్తున్న కన్నడ బ్రాహ్మణు డొకాయన నారాయణరావును తన ఇంటికి భోజనానికి రమ్మన్నాడు. ఆయన ఇల్లు మల్లేశ్వరంలో. నారాయణరావు ఉదయమే స్నానానుష్ఠానాలు ముగించుకుని వెళ్ళాడు. వాళ్ళ ఇంట్లో గణేశపూజాదికాలు ముగించి భోజనంచేసి విశ్రాంతితీసుకొన్నాడు. సాయంకాలం తన బసకు బయలుదేరాడు. అప్పుడు మిత్రుడు అన్నాడు - ఆదగ్గరగా ఉన్న శివాలయంలో శృంగేరీ శంకరుల ఉపన్యాసం ఉన్నదనీ, శ్రీవారు చాతుర్మాస్యం అక్కడ జరుపుతున్నారనీ. శ్రీవారిని దర్శించాలన్న కుతూహలంతో నారాయణరావు బయలుదేరాడు.

వీళ్ళు వెళ్ళేటప్పటికే ఉపన్యాసం ప్రారంభం అయి ఉన్నది. శ్రీవారికి నమస్కరించి ఎదురుగా కొంతదూరంలో ఖాళీగా ఉన్నచోట వీళ్ళు కూర్చున్నారు. సుఖాసనంలో కూర్చుని నారాయణరావు శ్రీవారివంక చూచాడు. నారాయణరావుకి తన మనస్సులో తండ్రిగారు తురీయాశ్రమం తీసుకుని బ్రతికిఉంటే ఎట్లా ఉండేవారో - అన్న ఆలోచన అప్పుడప్పుడు వస్తూ ఉంటుంది. ఆ ఆలోచన వచ్చినప్పుడు అతని మనస్సులో తండ్రిగారి మూర్తి ఒకవిధంగా భాసిస్తూ ఉంటుంది. నారాయణరావు ఇప్పుడు శ్రీవారివంక చూడగా సరిగ్గా తన మనస్సులో అప్పుడప్పుడు భాసిస్తున్న మూర్తిలాగా ఉన్నారు. ఆ ప్రకాశమానమైన నేత్రములు, శారదానిలయమైన వదనము, బ్రహ్మతేజస్సు, పుంభావరూపంగా వచ్చినట్లున్నది. ఆ తేజస్సు ప్రసన్నమై, ఆహ్లాదకరమై మానసికదృష్టికి అమృతసేచనంగా దివ్యానుభవదాయిగా ఉన్నది. ఆ తేజోదర్శనంతోనే ఆకర్షింపబడ్డ నారాయణరావు సర్వదృష్టీ శ్రీవారి ముఖపద్మము మీదా వ్యాఖ్యాన సింహాసనాధిష్ఠితములైన శ్రీవారి చరణకమలాలమీదా సంచరించింది.

శ్రీవారు ఉపన్యాసం కన్నడభాషలో చేస్తున్నారు. నారాయణరావుకి కన్నడభాష రాదు. కాని శ్రీవారి ఉపన్యాసంలో చాలభాగం సులభ సుందరంగా తత్సమ తద్భవ పదాలతో కించిత్ సంస్కృతజ్ఞానం ఉన్న అందరికీ తెలిసేటట్లుగా ఉన్నది. నారాయణరావుకి ఉపన్యాసం కదళీఫల పాకసిద్ధిగా

తేటతెల్లంగా తెలుస్తున్నది. శ్రీవారి వాక్కు స్వచ్ఛమై అనర్గళమై శారదకాల పూర్ణిమా శశికిరణ సముదాయంలో అమృతవర్షంలాగా ఉన్నది. అతి ప్రసన్నగంభీరమై శారదా సన్నిధానంలాగా ఉన్నది. వ్యాఖ్యానసింహాసనాధిష్ఠిత భారతీదేవి విజ్ఞానప్రసాదం పంచిపెట్టుతున్నట్లుగా ఉన్నది. ఉపన్యాసం భాషా సంక్రాంతమైన పరిధులు అతిక్రమించి సమీకృత పావిత్ర్యమై అందరి మనస్సుల్నీ ఆహ్లాదపరుస్తున్నది. శ్రీవారి కంఠధ్వని మనోహరమై, సంగీతశాస్త్ర సారభూతమైన ప్రణవధ్వనిగా పారవశ్యాన్ని కలిగిస్తున్నది. వైయాకరణుల అష్టవిధస్ఫోటవాదానికి ప్రత్యక్షోదాహరణంగా శబ్దనిత్యత్వాన్ని నిరూపిస్తున్నట్లుగా ఉన్నది. ఈ మహాపారవశ్యంలో ఉన్న నారాయణరావు శ్రీవారు శాంతివచనం చెప్పి ముగింపు చేసినట్లుగా వెంటనే గ్రహించలేదు. శబల బ్రహ్మ సన్నిధానంనుంచి ఒక్కసారి వెలుపలకు త్రోయబడినట్లుగా అయింది ఉపన్యాసం ఆగినప్పుడు నారాయణరావుకి. అంతా లేచి నుంచున్నారు. శ్రీవారున్నూ లేచారు. నారాయణరావున్నూ లేచాడు. అందరూ శ్రీవారికి పాదాభివందనం చేసి వెళ్తున్నారు. నారాయణరావు కూడా వెళ్ళి పాదాభివందనం చేస్తూఉండగా నారాయణరావు శిరస్సుమీద శ్రీవారు హస్తస్పర్శ చేశారు. ఆ స్పర్శ ఏదో లోకానుభవంగా ఉండి, పంచకోశ సమ్మోహనంగా ఉండగా నారాయణరావు లేచి నుంచున్నాడు. శ్రీవారు నారాయణరావును చూచి తెలుగులో "నాయనా నువ్వు మా బసకు రా!

మేము అనుష్ఠానం ముగించేలోగా నువ్వు సంధ్యావందనం ముగించు. తరువాత మనం మాట్లాడుకుందాము" అని అన్నారు. నారాయణరావు "మహాప్రసాదం" అన్నాడు. శ్రీవారు పల్లకీలో విడిదికి వెళ్ళిపోయారు. నారాయణరావుకి మహాశ్చర్యం వేసింది. ఏమిటీ చిత్రం! ఇంతమంది కన్నడుల మధ్యలో శ్రీవారు తన్ను తెలుగువాడని గుర్తించారు. "ఆహా! శారదామూర్తి! వారికి తెలియని దేముంటుంది" అనుకున్నాడు. శ్రీవారికి తనపైన అభిమాన వాత్సల్యాలు ఎందుకో? ఇంతలో తన మిత్రుడు దగ్గరకు రాగా అతనితో జరిగిన విషయం చెప్పాడు. అతడు ఆశ్చర్యంపొంది నారాయణ రావును సంధ్యావందనం తర్వాత శ్రీవారి బసకు చేర్చాడు.

నారాయణరావు వెళ్ళేటప్పటికి శ్రీవారు శ్రీపీఠ దేవతార్చనం శ్రీచక్రార్చనం స్వయంగా చేస్తున్నారు. చతుష్షష్టి ఉపచారాలతో చక్రార్చనం జరిగింది. స్వస్తివాచకం జరిగింది. మంగళహారతి జరిగింది. అందరకూ తీర్థప్రసాదాలు ఇచ్చారు. శ్రీవారు తమ విశ్రాంతి మందిరంలోకి వెళ్లారు. ఆయన లోపలకు వెళ్ళగానే సన్నిధి కార్యదర్శి బయటకు వచ్చి "శ్రీవారు సాయంకాలం కన్పించిన తెలుగు యువకుణ్ణి రమ్మంటున్నారు" అని బిగ్గరగా అరిచాడు.

నారాయణరావు ఉత్తరీయం నడుముకి బిగించి, లోపలకు వెళ్ళి అక్కడ ఆసీనులై ఉన్న శ్రీవారికి "నకర్మణా" చెబుతూ పాదాభివందనం చేశాడు. శ్రీవారు సంజ్ఞచెయ్యగా

కూర్చున్నాడు. శ్రీవారు నారాయణరావును పరిశీలనగాచూచి. తర్వాత ప్రక్కన ఉన్న సన్నిధి కార్యదర్శివంక చూశారు. అతడు ఆజ్ఞ గ్రహించి - తలుపులువేస్తూ బయటకు వెళ్ళిపో యాడు. శ్రీవారి సన్నిధిలో నారాయణరావు ఒక్కడే మిగి లాడు. శ్రీవారు నారాయణరావువంక ప్రసన్నంగా చూస్తూ ప్రసంగించారు. "నాయనా! సాయంకాలం ఉపన్యాసం చేస్తూ నిన్ను చూశాను. ఎందుకనో నువ్వు నా దృష్టిని ఆకర్షించావు. ఉపన్యాసం చేస్తున్నప్పుడు నాదృష్టి సభలో నాలుగుమూలలా సంచరిస్తూ పునః పునః నీమీద వ్రాలింది. నీమీద చాలాసేపు నిల్చింది. అంచేతనే నువ్వు పాదాభివందనం చేస్తున్నప్పుడు ఇక్కడకు రమ్మనిచెప్పాను. తర్వాత ఆలోచించాను. నువ్వు నా దృష్టిని ఇంత ఎక్కువగా ఆకర్షించడానికి కారణం ఏమిటని? నీ సుకృతం ఏమిటని? అంతా అవగతం అయింది. నువ్వు శ్రవణానక్షత్రజాతకుడవే కాకుండా వైదికగ్రహాలైన గురు శుక్రులూ బుద్ధిగ్రహమైన బుధుడు కేంద్రకోణ వాక్‌స్థానాల్లో ఉండి నీకు శ్రీవిద్యాయోగం పట్టించాయి. మండలగ్రహాలు మోక్షప్రాప్తి సమకూరుస్తున్నాయి" జాతకంగురించి ఇట్లా శ్రీవారు చెప్పినమాటలు నారాయణరావుని ఆశ్చర్యచకితుణ్ణి చేసినై—అక్షరాలా నిజం కావడంవల్ల అతడు 'చిత్తం' అన్నాడు. శ్రీవారు నారాయణరావు ముఖం లోకిచూస్తూ "నీకు పరివ్రాజకయోగంకూడా ఉన్నది. ఐతే అది ఇంత తొందరలో లేదు. నీకు సంతానమున్నది. గృహస్థాశ్రమంనుంచి

తురీయం - కళత్రవియోగం తరువాత. నీకు ద్వితీయకళత్రం - సూర్యభగవానుడికి ఛాయాదేవిలాగా - ఛాయామాత్రంగా ఉన్నదేమో. ఇద్దరూ లోకోత్తమ పతివ్రతలు. వాళ్ల మనసుల్ని కష్టపెట్టకు, వాళ్లిద్దరూ శ్రీదేవికి ముఖ్యులు'' అని శ్రీవారు కళ్లుమూసుకుని ఏదో జ్ఞాపకం తెచ్చుకున్నట్లయి మళ్లీ తెరచి "ఇప్పుడు గ్రహించాను. నీ తేజస్సు అర్థమైంది. నువ్వు మా ముఖ్య అంతేవాసి పరమేశ్వరరావు కుమారుడివి. అతడు బ్రహ్మీభూతుడయ్యాడని విన్నాను. భో! మహాదేవ శంభో! శివ శ్శివోహం'' అని కళ్లు మూసుకున్నారు. మళ్లీ కళ్లుతెరచి మందస్మితం చెయ్యగా నారాయణరావుకి అంతా విచిత్ర విస్మయ సంపుటీకరణంగాఉండి చేతులు జోడించాడు. అతని వంక శ్రీవారు వాత్సల్య సర్వస్వంగా కటాక్షదృక్కులు పరపారు. నారాయణరావు ఆగలేక శ్రీవారి పాదాలమీద వ్రాలిపోయాడు. శ్రీవారు వాత్సల్యంతో అతనిని లేవనెత్తి దగ్గర కూర్చోబెట్టుకుని ఇట్లా అన్నారు. "నాయనా రేపు ప్రాతఃకాలంలో నీకు పాదుకాంతదీక్ష ఇవ్వాలని నిశ్చయించాను. ఈరాత్రి ఇక్కడనే కూర్చుని తెల్లవార్లూ నీవు మీ తండ్రి దగ్గర గ్రహించిన శివపంచాక్షరి జపంచెయ్యి. రేపు బ్రాహ్మీ ముహూర్తంలో ఇక్కడ గంటమ్రోయిస్తారు. అప్పుడు నువ్వు లేచి స్నానజపానుష్ఠానాలు పూర్తిచెయ్యి. నీకు కావలసిన సదుపాయాలు అన్నీ సన్నిధికార్యదర్శి చూస్తాడు. నేను రేపు సూర్యోదయకాలంలో మళ్ళీవస్తాను'' అంటూ శ్రీవారు లేచి వెళ్ళిపోయారు.

శ్రీవారు సూర్యోదయకాలంలో వచ్చారు. నారాయణ రావు సిద్ధంగా ఉన్నాడు. శ్రీవారు శ్రీవిద్యా మహారహస్యాన్ని వివరించి, సుభగోదయంలో, సదాచార దీపికలో ఉన్న ధర్మరహస్యాన్ని తెలిపి సమయదక్షిణాచార విధానాన్ని అవగాహనచేశారు. మహాగణపతితో ప్రారంభించి సర్వమహామంత్ర మండలాన్ని మహాపాదుకాంతంగా ప్రదానం చేశారు. శుభాగమపంచకమే శరణ్యమని చెప్పారు. త్రిసంధ్యలలోనూ సంధ్యావందనంతోపాటు చెయ్యమనీ - భావనోపనిషత్ ప్రకారంగా అంతర్యాగం ఆచరించమనీ - కుమారుడు పైకివచ్చేదాకానో - లేక తురీయప్రాప్తి అయ్యేదాకానో శ్రీచక్రార్చనం కల్పసూత్ర ప్రకారం చేస్తుండమని చెప్పారు. ఇక మళ్ళీ మాట్లాడే సావకాశం లేదు గనుక ఇన్నివివరాలు చెప్పామన్నారు. ఉపదేశించిన మంత్రాలు జపం చెయ్యమని ఆయన వెళ్లిపోయారు. వెళ్లే ముందు నారాయణరావు పాదాభివందనం చెయ్యగా - శిరస్సును పాదాఘ్రులతో స్పృశించి లేవనెత్తి ఆలింగనంచేసి - కూర్చోపెట్టారు.

శ్రీవారి ఆలింగనంతో నారాయణరావుకి ఏదో అపరిచితమైన పులకరింతలై -వారు పాలించిన కటాక్ష మాహాత్మ్యం మనుకుంటూ జపం ప్రారంభించి మహానందమేదో ఉపలబ్ధి అయినట్లుగా-కణ్ఠ్యాంతరాలు అధిగమిస్తూ బాహిరస్మృతి శూన్యుడై ధ్యానముద్రలో ఉండిపోయాడు.

మళ్ళీ నారాయణరావు కళ్ళుతెరచేటప్పటికి సూర్యోదయం అవుతున్నది. అతడు గబగబా లేచి స్నానంముగించి-పీఠదేవతా దర్శనానికి వెళ్ళాడు. అక్కడ జరుగుతున్న దేశకాల సంకీర్తనవల్ల నారాయణరావుకి తెలిసింది తాను మూడు నాళ్లు శ్రీవారి అనుగ్రహంవల్ల ధ్యానముద్రలో ఉన్నానని.

దేవతా దర్శనంచేసి జపానుష్టానాలు ముగించాడు. ఇంతలో శ్రీవారు పిలువగా వెళ్ళి పాదాభివందనంచేసి తీర్థ ప్రసాదాలు స్వీకరించాడు. శ్రీవారి అనుజ్ఞను తీసుకొని మళ్ళీ నమస్కరించి తన బస చేరుకున్నాడు.

# 29

తలిదండ్రుల సాంవత్సరికాలకు గాని, నారాయణరావు ఇంటికి పోకూడదనుకున్నాడు. ఈలోగా మేనమామ రమణయ్యగారి భార్య కాలంచేసిందని ఉత్తరం వచ్చింది. తన పరిస్థితులలో తాను బయలుదేరి రాలేకపోతున్నానని నారాయణరావు మేనమామకు వ్రాశాడు. ఫరవాలేదు లెమ్మని ఆయనసమాధానం వ్రాశాడు. తలిదండ్రుల సాంవత్సరికాలకు నాలుగు రోజులు ముందుగా నారాయణరావు బయలుదేరదామని ఆలోచనలో ఉండగా-అకస్మాత్తుగా ఉత్తరం వచ్చింది. వెంకమ్మగారు బావిదగ్గర నీళ్ళుతోడుతూ పడిపోయిందనీ - నడుమూ మోకాళ్ళూ నొప్పిచేశాయనీ - ఆమెకు ముంపుగా జ్వరం

వచ్చిందనీ - తగ్గలేదనీ చిన్నమేనమామ వ్రాసిన ఉత్తరము. నారాయణరావు ఆదుర్దాగా పదిహేనురోజుల సెలవుమీద ఇల్లు చేరుకున్నాడు.

తలిదండ్రుల సాంవత్సరికాలు ఇంకా పదిరోజు లున్నాయి. ఇంటికివచ్చిన తర్వాత నారాయణరావుకి తెలిసింది. భార్యపోయిన తరువాత పెద్దమేనమామ మంచం పట్టాడని. ఆయనకు పక్షవాతం వచ్చింది. ఆయనకు సంతానం కూతు రొక్కతే. పదహారేళ్ళది. పెండ్లికావలసిఉన్నది. ఆయన షావు కారు గుమాస్తాచేస్తూ అద్దెఇంట్లో కాలక్షేపం చేస్తున్నాడు. పక్షవాతం వచ్చినతర్వాత ఆయనకు గడపటం కష్టమై పోయింది. ఆయన తమ్ముడు వెంకటేశ్వరరావు సంపాదనకూడా అంతంతమాత్రమే. పైగా ఇంట్లో చూచేవాళ్ళుకూడా లేరు. ఇక వేరేగత్యంతరం లేక వెంకమ్మగారు రమణయ్యగారిని ఆయన కుమార్తె లక్ష్మీదేవమ్మను తీసుకువచ్చి తన దగ్గరే ఉంచుకున్నది. తనకు లక్ష్మీదేవమ్మ చేదోడు వాదోడుగా కూడా ఉంటుంది. వచ్చినప్పటినుంచీ - అందులో వెంకమ్మగారు మంచంపట్టినప్పటి నుంచీ - లక్ష్మీదేవమ్మే ఇంటిపనులన్నీ చక్కబెడుతున్నది. వెంకమ్మ గారి సుస్తీ సమయంలో ఆమె లేకపోతే ఎంతో ఇబ్బంది అయ్యేది. ఈ అన్నిసంగతులు నారాయణరావుకి వాటంతటవి తెలిసినై. ఇక ఈ ఇద్దరూ తనమీద ఆధారపడినవాళ్లేనని తేలి పోయింది. నారాయణరావు వెంకమ్మగారికి, రమణయ్యగారికి

తగిన చికిత్స ఏర్పాటుచేశాడు - అతని రాకతో అసలు వెంకమ్మ గారికి సగం రోగం కుదిరినట్లే అయింది.

ఇంతలో తలిదండ్రుల సాంవత్సరీకాలు వచ్చినై. ఎవరి ఇబ్బందులు వాళ్ళకు ఉండటం మూలాన తోబుట్టువులు ఎవరూ రాలేదు. తనకు వీలయినంతగా నారాయణరావు తల్లిగారి సాంవత్సరిక శ్రాద్ధమూ, తండ్రిగారి ఆరాధనా వెళ్ళబుచ్చాడు.

ఆ మూడురోజులూ ఇంట్లో పనులు ఎక్కువై రమణయ్యగారికి పరిచర్య సరిగ్గా జరుగలేదు. నాలుగోరోజు ఉదయానికి ఆయనకు స్మారకంలేదు. వెంటవెంటనే నారాయణరావు అందుబాటులోఉన్న సర్వచికిత్సా చేయించాడు. తరువాత ప్రొద్దు ఎక్కేటప్పటికి ఆయన మరణించాడు. ఆయన తమ్ముడు వేంకటేశ్వరరావు నారాయణరావు సహాయంతో కర్మలోపం లేకుండా అంత్యక్రియలు ముగించాడు. ఆ తర్వాత రెండు మూడు రోజుల్లో బెంగుళూరు వెళ్ళిపోవాలని నారాయణరావు నిశ్చయించుకున్నాడు.

ఆరోజు సాయంకాలానికిగాని నారాయణరావుకు తండ్రిగారి సమాధివద్దకు వెళ్ళడానికి తీరికకలగలేదు. సమాధిమీద శివాలయం పూర్తిఅయి, నిత్యపూజోత్సవాలతో శోభాయమానంగా ఉన్నది. ఎదురుగా రామస్వామి యోగమందిరం లోకి వెళ్ళాడు. అక్కడ ఒక సుందరమైన ఆరామం తయారైంది. యోగమందిరంలో అంతరాలయంలో రామస్వామి

ఉన్నాడు. ఆ అంతరమందిరం తలుపులు ఎప్పుడూ మూసుకుని ఉంటాయట. బహిర్మందిరం చాలా జనసమ్మర్దంగా ఉన్నది.

అక్కడనుంచి నారాయణరావు తమ ధర్మకర్తృత్వంలో ఉన్న శివాలయానికి వెళ్ళాడు. ఆలయం చాలా మారి పోయింది. పరిశుభ్రత అన్నమాటే లేదు. సాయంత్రం ఆరు గంటలైనా అర్చకుడు తలుపులు తెరవలేదు. నారాయణరావు ముఖమంటపంలో కూర్చున్నాడు. కొంతసేపటికి క్రొత్త అర్చకుడువచ్చి తలుపులు తెరిచి దీపారాధనచేశాడు. నారాయణ రావు బావిదగ్గరకు వెళ్ళి పాదప్రక్షాళనంచేసుకుని, ప్రదక్షిణీక రించి లోపలకు వెళ్ళేటప్పటికి లోపల ఇంకా ఇద్దరుఉన్నారు. వాళ్ళెవరో చూడకుండానే నారాయణరావు కళ్ళుమూసుకుని ధ్యానించి అర్చకుడు హారతి వెలిగిస్తుండగా కన్నులు తెర చాడు. అర్చకుడు అర్చనముగించి హారతిపట్టి, తీర్థ ప్రసాదాలు రుద్రపాదాలు బయటకు తెచ్చి, గర్భగుడి బయటఉన్న ముగ్గు రిలో నారాయణరావునుగాక మరొక్కరికి ముందుగాఇచ్చి, తరు వాత రెండవవారికిఇచ్చి, చివరకు నారాయణరావుకు ఇచ్చాడు.

నారాయణరావుకి అర్చకుడు తీర్థప్రసాదాలు ఇస్తుం డగా - ఆ మిగిలిన ఇద్దరూ అప్పుడు ఇతనివంక చూచారు. నారాయణరావుకూడా అప్పుడే వాళ్ళ ముఖాలు చూచాడు. అందులో ఒకాయన వకీలు రామచంద్రయ్యగారు. అర్చకుడు ధర్మకర్త అయిన నారాయణరావుకి న్యూనతగా చిట్టచివరకు తీర్థప్రసాదాలు ఇవ్వడం రామచంద్రయ్యగారికి నచ్చలేదు.

ఆయన అర్చకునితో అన్నాడు. "ఏమయ్యా! వంశపారంపర్యా ధర్మకర్త నారాయణరావు ఉన్నాడు. నాకు ఐదేళ్ళ వయస్సు నుంచీ నిత్యం సేవించుకుంటున్న నేను ఉన్నాను. మాకు ప్రథమ గౌరవం చేయవలసిఉండగా - ఈ క్రొత్త ఆయనకు ఎట్లా ఇచ్చావయ్యా?" అని. అర్చకునికి రామచంద్రయ్యగారు పేరు మోసిన వకీలని తెలుసును. ఇప్పుడు నారాయణరావును ఫలానా అని గ్రహించాడు. అందుచేత వినయంగా "అయ్యా! వారు ఈ దేవాలయానికి ఎగ్జిక్యూటివు ఆఫీసరు. అందుకని ఇచ్చాను" అని అన్నాడు. ఎగ్జిక్యూటివు ఆఫీసరు నారాయణ రావువంకా, రామచంద్రయ్యగారివంకా చురచురా చూచి వెళ్ళిపోయాడు. రామచంద్రయ్యగారు నారాయణరావు పర స్పరం కుశలప్రశ్నాదికం చేసుకున్నారు. నారాయణరావు ఆల యంలో ఉంచిన దేవతార్చనను తీసుకుని ఇల్లు చేరాడు.

మర్నాడు వెంకటకృష్ణయ్య చౌదరిగారిని చూడాలని నారాయణరావు వెళ్ళగా ఆయన సకుటుంబంగా ఉత్తరదేశ యాత్ర వెళ్ళారని తెలిసింది. నందమ్మను చూడాలని అభిలాష కలిగిన నారాయణరావు విచారించగా పాలెగాపువల్ల సంగ తులు తెలిసినాయి. నందమ్మ చౌదరిగారి దొడ్డిలోకి చేరినప్పటికీ బెంగ విడిచిపెట్టనేలేదట. సరిగా మేత మేయనేలేదట. సరిగా నీళ్ళు త్రాగలేదుట. సరిగా పాలు ఇవ్వలేదుట. రాత్రింబవళ్ళు 'అంబా' అని అరుస్తూ ఉండేదిట. చౌదరిగారు ఎంత ప్రయ త్నించినా అది పరమేశ్వరరావుగారిని మరచిపోలేదుట.

నాలుగునెలలక్రితం ఒకరోజు తెల్లవార్లూ 'అంబా' అంటూనే ఉందిట. తెల్లవారుఝామున దాని అరుపు వినబడలేదుట. మామూలు అరపులేనని ఎవ్వరూ పట్టించుకోలేదట. తెల్లవారి చూడగా అది నిర్జీవంగా పడిఉందిట. చౌదరిగారు దానిని ఊరేగించి పరమేశ్వరరావుగారి సమాధి ఆలయానికి దగ్గరలో ఖననం చేయించారుట. నందమ్మ మరణగాథ నారాయణరావుకి దుఃఖాన్ని తెచ్చింది. అతడు ఏమీతోచక బాధగా ఊరంతా తిరిగాడు. సంవత్సరంలో ఊరంతా మారిపోయింది. ఊళ్ళో ఎన్నో క్రొత్తక్రొత్త ఆఫీసులు వెలిశాయి. త్రోవలో ఒకచోట తమ దేవాలయానికి ఎగ్జిక్యూటివు ఆఫీసు ఉన్నది. లోపలకు వెళ్ళాడు. అక్కడ నారాయణరావుకి తెలిసిన వైశ్యయువకు డొకడుండి నమస్కరించాడు. నారాయణరావు అతనిని "నువ్వ ఇక్కడ ఉద్యోగం చేస్తున్నావా?" అన్నాడు. అతను ఔనని నారాయణరావుతో బయటకు వచ్చాడు.

నారాయణరావు అతణ్ణి స్వామివారికి రొక్కంనిలువ ఎంత ఉన్నదని అడిగాడు. అతడు నారాయణరావుని చిన్న ప్పటినుంచీ యెరుగును. మొదటినుంచీ నారాయణరావుకి ఆ ఊరిలో ఉన్న గౌరవం అతనికి తెలుసును. పైగా తను ఉద్యో గంచేస్తూ ఆ వంశం వాళ్ళ ధర్మమే తింటున్నాననే అభిమానం కూడా అతనికి ఉన్నది. ఇన్ని కారణాలుగా అతడు నారాయ ణరావునుండి నిజము దాచలేకపోయి మెల్లిగా వివరాలు చెప్పాడు. "ఈ సంవత్సరం వసూళ్ళు బాగానే జరిగినై.

సాంవత్సరిక నికరాదాయం పదిహేనువేలు. కాని మా ఎగ్జి క్యూటివు ఆఫీసరుగారి మామగారు విజయవాడ మునిసిపాలిటీలో కౌన్సిలరుగా పోటీచేసినప్పుడు పదివేలు ఖర్చుపెట్టాము. మిగిలింది ఉద్యోగుల జీతాలూ. ఆఫీసరుగారి ట్రావెలింగు ఖర్చులూ. ఈ కారణంగా ప్రతిసంవత్సరం ఈ ఊళ్లో వేదపాఠశాలకూ, ధర్మసత్రానికీ, హరిజన విద్యార్థి వసతి గృహాలకూ ఇది వరకుఇస్తున్న వార్షికాలు ఇవ్వలేదు. ఆసంస్థలలో వేదపాఠశాల వాళ్లు ఏమీ చెయ్యలేదుగాని మిగిలినవాళ్లు అర్జీలు పెట్టారు. హరిజనవసతి గృహంవాళ్లు రాజకీయ ప్రచారంకూడా చేశారు. దేవాలయంతాలూకు కళ్యాణమంటపం జీర్ణావస్థలో ఉండి పడి పోతూండగా దానిని బాగుచేయించామనీ - పదివేలు ఖర్చు అయ్యాయనీ మేము సంజాయిషీ పంపుకున్నాము. కాకపోతే కళ్యాణమంటపానికి నూరురూపాయలు ఖర్చుపెట్టి వెల్లవేయించి రంగులు వేయించాము. ఈ ఆఫీసరుగారికి ప్రభుత్వంతో మంచి అండ ఉన్నది. అక్కడ ఒక మంత్రిగారికి, ఈ ఆఫీసరుగారి పిన్నత్తగారికి బలమైన స్నేహముట - పిన్నత్తగారు వెళ్ళి రాజధానిలోనే ఉంటున్నది. ఆమెకు మంత్రిగారు పెద్దబంగళా కట్టించి ఇచ్చారుట. ఆయన ఎప్పుడూ అక్కడే ఉంటాడుట. ఆ మంత్రిగారి శాఖలో ఆమెకు తెలియకుండా ఆమెకు ముడుపు చెల్లుబడికాకుండా ఏమీ జరగటానికి వీల్లేదుట. ఆమె సాధారణంగా మంత్రిగారి భార్యననే చెప్పుకుంటుందిట. ఆమె మద్దతువల్ల ఆఫీసరుగారికి వ్యతిరేకంగా ఏమీ జరుగలేదు.'' ఈ

మాటలు విని నారాయణరావు దుఃఖపడ్డాడు. 'భగవంతుని నిర్ణయము ఇట్లా ఉన్నది కాబోలు' అనుకుని ఊరటపడ్డాడు.

చాంద్రాయణంచేసి ఇంటికిరాగా వెంకమ్మగారి పరిస్థితి బాగాలేదు. లక్ష్మీదేవమ్మ ఉపచారాలు చేస్తున్నది. మళ్ళీ పదిహేనురోజులు శలవు పొడిగించకతప్పలేదు నారాయణరావుకి. లక్ష్మీదేవమ్మ పెండ్లీడు వచ్చినపిల్ల. తలిదండ్రుల నిద్దరినీ పోగొట్టుకున్నది. ఇప్పుడు ఆమె అంత దుఃఖంలోఉండి వీళ్ళ ఇంటెడు పనీ చేస్తున్నది. ఆమె లేకపోతే తమ గతి ఏమయ్యేదోనని నారాయణరావు అనుకున్నాడు. ఆమెకూ వేరేదిక్కు లేదు. ఆమెకు తల్లివైపు బంధువులు లేరు. పిన్నతండ్రి సామంతుడు కాడు. ఇక వెంకమ్మగారు, నారాయణరావే ఆమెకు దిక్కు. ఆమె విషయము ఏమిచేయాలో నారాయణరావుకి తోచలేదు. వెంకమ్మగారి జబ్బు నయంఅయింతర్వాత లక్ష్మీదేవమ్మ సంగతి విచారించాలనుకున్నాడు. కాని వెంకమ్మగారికి బాగుఅయ్యేటట్లు లేదు. ఆ రోజు మరీ అధ్వాన్నంగా ఉన్నది. డాక్టరు వెంకమ్మగారి కుమారుడికి కబురు పంపమని చెప్పాడు. ఆమెకు జ్వరం తీవ్రంగా వచ్చింది. జ్వర తీవ్రతవల్లనేమో స్మృతి లేకుండా ఉంటున్నది. మర్నాటికి ఆమెకుమారుడు వచ్చాడు. ఆమెకు కొంత జ్వరతీవ్రత తగ్గింది. కళ్ళుతెరిచి కొడుకుని చూచింది. దగ్గర కూర్చుండబెట్టుకుని వళ్ళు నిమిరింది. కొడుకు స్నానానికి వెళ్ళగా నారాయణరావుని పిలిచి దగ్గర కూచోపెట్టుకుంది. అతనితో చెప్పింది. "నాయనా! సుమతి నాకు

క్షేమసమాచారాలు తెలుపుతూనే ఉన్నది. ఆమె మహాభక్తు రాలు. అక్క మహాదేవి, మీరాబాయివంటిది. ఆమె సిద్ధి పొందడానికి నీపైన ప్రేమ నిమిత్తకారణం. ఆమెకు నీయందు కామవాంఛ లేదు. నీవు వివాహం చేసుకుంటేగాని తమ్ముళ్లనూ చెల్లెలనూ పెంచలేవు. లక్ష్మీదేవమ్మ యోగ్యురాలు. ఆమె కూడా నాకు శిష్య. గుణవంతురాలు. నీఇష్టము" అని ఆయా సమువల్ల మాట్లాడక కళ్ళు మూసుకున్నది. తిరిగి గంటసేపుకి గాని ఆమె కళ్ళు తెరవలేదు.

ఆమె తిరిగి కళ్లు తెరిచేవరకూ నారాయణరావు ఆమె ప్రక్కనే కూర్చున్నాడు. వెంకమ్మగారి కుమారుడు స్నానం ముగించి భోజనంచేస్తున్నాడు. ఇంతలో వాకిట్లో ఎవరో పిలు వగా పిల్లలు తలుపులు తీశారు. వచ్చిన ఆమెను వాళ్లు వెంకమ్మ గారి మంచంవద్దకు తీసుకువచ్చారు. ఆమె సుమతి. సుమతి రాకకు నారాయణరావు ఆశ్చర్యపడ్డాడు. కళ్లు తెరచిన వెంకమ్మగారు ఎదురుగా సుమతి కన్పడగా ఆనందపడింది. సుమతి వెంకమ్మగారికి, నారాయణరావుకి పాదాభివందనం చేసింది. వెంకమ్మగారు చేయిజాపగా ఆమె దగ్గరకువచ్చి కూర్చున్నది. నారాయణరావు లేచివెళ్ళి - సుమతి వచ్చినదని లక్ష్మీదేవమ్మతో చెప్పాడు. ఆమెకూడా వెంకమ్మగారి దగ్గరకు వచ్చింది. ఆమెను కూడా వెంకమ్మగారు దగ్గర కూర్చుండబెట్టుకుంది. ఆ ఇద్దరి చేతులూ తన రెండుచేతులతోనూ తీసుకుని వెంకమ్మగారు

వాళ్ళ చేతుల్ని గుండెలమీద పెట్టుకుంది. ఆమె తృప్తిగా - ఆనందంగా కళ్లు మూసుకుంది. మళ్ళీ కళ్లు తెరవలేదు.

అంతా పావుగంటలో అయిపోయింది. ఆమె మరణానికి కన్నబిడ్డలలాగా దుఃఖించారు సుమతీ, లక్ష్మీదేవమ్మ. నారాయణరావుకూడా దుఃఖపడ్డాడు.

వెంకమ్మగారి కుమారుడు ఆమెకు దహనసంస్కారాలూ, సంచయనమూ చేసి, శెలవుదొరకని కారణంచేత తను ఉద్యోగం చేస్తున్న ఊళ్ళోనే నిత్యకర్మలు చేస్తానని వెళ్ళిపోయాడు. వేంకటేశ్వరరావుద్వారా, రహస్యంగా అతనికి వెంకమ్మగారి అంత్యక్రియలలో ఖర్చుపెట్టమని సుమతి రెండు వందలు ఇచ్చింది. అస్థి సంచయనం అయినతర్వాత తానుకూడా వెళతానని సుమతి ప్రయాణమైంది. ఈ నాలుగురోజుల్లో సుమతికి లక్ష్మీదేవమ్మకు స్నేహం సన్నిహితమైన బాంధవ్యంగా మారిపోయింది. వెంకమ్మగారి మరణం వాళ్ళను ఏకోదరుల్నే చేసింది. ఇంకా నాలుగురోజులు ఉండమని లక్ష్మీదేవమ్మ బలవంతం చెయ్యగా సుమతి ఉన్నది

వాళ్ళిద్దరూ ఇంత సన్నిహితంగా అక్కా చెల్లెళ్లలాగా ఉండటం నారాయణరావుకికూడా ఆశ్చర్యాన్ని కలిగించింది. వాళ్ళిద్దరూ మాట్లాడుకుంటుంటే - నారాయణరావు రావడం జరిగితే ఇద్దరూ లేచినిల్చుంటారు. లక్ష్మీదేవమ్మ తలవంచుకుని లోపలకు వెళ్ళిపోతుంది.

సుమతి వెంకమ్మగారి మరణసమయానికి ఎట్లా రాగలిగి నదీ నారాయణరావుకి చెప్పింది. శెలవలుగనక కొంతమంది విద్యార్థినులతో కలసి హంపీ విజయనగరానికి వెళ్ళిందట చూద్దామని. ఆమెకు విజయనగర శిథిలాలు హృదయవిదారకంగా ఉన్నాయిట. చక్రతీర్థ కోదండరామస్వామివారి ఆలయం లోనూ, శ్రీ విరూపాక్షస్వామివారి ఆలయంలోనూ నిత్యదీప ధూప నైవేద్యాలు జరుగుతున్నాయిట. తాను శ్రీ విరూపాక్షస్వామివారి దర్శనంచేసి, పంపాదేవి అమ్మవారిని సేవించి, భువనేశ్వరీ అమ్మవారిని సేవించడానికి వెళ్ళిందట. అక్కడ అమ్మవారిని దర్శించి, అర్చన చేయించి, తీర్థప్రసాదాలు స్వీకరించిన తర్వాత అక్కడ ముఖమంటపంలో కూర్చోవాలని ఊహతోచి కూర్చున్నదట. కూర్చుని అమ్మవారివైపు చూడగా అమ్మవారు అతిప్రసన్నంగా - పరమకరుణామయంగా తనకు మంత్రోపదేశం చేసిననాటి వెంకమ్మగారివలె ఉన్నదిట. అప్పుడు తనకు అనిపించిందిట. గురువే భగవతీ స్వరూపంగదా అని వెంకమ్మగారు సజీవంగా అక్కడ కూర్చునట్లే అనిపించిందట. అట్లా చాలాసేపు చూస్తూ కూర్చోగా - తనపైన ఏదో మహనీయమైన శక్తి ఆచ్ఛాదించినట్లు ఆత్మనా తెలిసినట్లయి పైకి చూచిందట. అక్కడ దేవాలయ మంటప శిరోభాగంలో మంత్రపూతమైన శ్రీచక్రం శిలానిర్మితంగా ప్రతిష్ఠింపబడి ఉన్నదట. దాని తేజోబలంచేత తనకు అమ్మవారు మహాప్రసన్నంగా దర్శనం ఇచ్చిందని తనకు తెలిసినదట.

అక్కడనుంచి ఇవతలకు వచ్చినా - మనస్సులో సంపూర్ణంగా వెంకమ్మగారి స్వరూపమే. ఎంతసేపయినా ఇతర ఊహ రాలేదుట. ఆరాత్రి వెంకమ్మగారి దర్శనమే స్వప్న తరంగాలుగా వచ్చి - ఇతరం ఏమీ ఆలోచింపనీయలేదుట. మనస్సులో ఏదో ఆవేదనగా ఉండి, వెంకమ్మగారిని చూడాలనిపించి - అక్కడనుంచి సరాసరి దేవపురం వచ్చిందట. ఈ మాటలకు నారాయణరావు విస్మితుడై "నువ్వు చాలా అదృష్టవంతురాలివి" అన్నాడు.

సుమతి వారంరోజులుండి వెళ్ళిపోయింది. నారాయణరావు వేంకటేశ్వరరావు ఆయనభార్య వెంకమ్మగారి అంత్యక్రియలకు వెళ్ళి ముఖ్యమైన మూడురోజులుండి వచ్చారు.

తిరిగి వచ్చినరోజే వేంకటేశ్వరరావు నారాయణరావు ఇంటికివచ్చి వెంట తీసుకువెళ్లాడు. ఇద్దరూ కలసి పరమేశ్వరరావుగారి సమాధివద్దకు వెళ్ళారు. అక్కడ ప్రదక్షిణీకరించి, శివదర్శనంచేసి తీర్థప్రసాదాలు తీసుకుని, రామస్వామి యోగమందిరంలో నమస్కరించి, దూరంగా వెళ్లి కూర్చున్నారు. వెంకటేశ్వరరావు నారాయణరావును మెల్లిగా హెచ్చరించాడు. "నారాయణా! నీ చిన్నప్పటినుంచీ మీ అమ్మ మీ నాన్న లక్ష్మీదేవిని మా కోడలు అంటూండేవాళ్లు. మా అన్నయ్య, వదినగారు నిన్ను అల్లుడుగా పొందాలనే అభిలాషలో ఉండేవాళ్ళు. మీ నాన్న మాహాత్మ్యం తెలిసినవాళ్లు - ఆయనతో వియ్యం పొందటానికి ఎవళ్లు ఉబలాటపడరు? అసలు

లక్ష్మీదేవి పుట్టినప్పుడు మీ అమ్మ పార్వతమ్మగారే దానికి లక్ష్మీదేవి అని పేరుపెట్టింది. నువ్వు నారాయణుడవాయె. అందుచేత. మీ అమ్మ అభిప్రాయం అది. మీనాన్న అభిప్రాయమూ అదే. మా అన్నయ్య వదినగార్ల అభిలాషకూడా అదేనని చెప్పాను. మీ తలిదండ్రులు పోవడం - దానికి తలిదండ్రులు పోవడం - లక్ష్మీదేవి వివాహం ప్రస్తావనకు రాలేదు. మొన్న మా పెద్దక్కగారు వెంకమ్మగారు పోయినప్పుడు నేను లక్ష్మీదేవిని మా యింటికి వచ్చిఉండమని చెప్పాను. అది సమాధానము చెప్పలేదు. సుముఖత చూపించలేదు. పిన్నతల్లి బలవంతముచేస్తే చెప్పిందట. తనకు బుద్ధి తెలిసినప్పటినుండి అందరూ దాన్ని నారాయణరావు భార్య అని పిలుస్తూ ఉండటంచేత అది అప్పటినుంచి నిన్నే భర్తగా భావిస్తున్నదట. తనకు తలితండ్రులు లేరుగనుక తనస్థానం భర్త ఇంటిలోనేనట. దాని భావం తెలిసిపోయింది కనుక నీ అభిప్రాయంకూడా చెప్పు" అని అన్నాడు. నారాయణరావుకి ఉక్కిరిబిక్కిరైంది. మేనమామకు ఏమి చెప్పాలో తెలియక "నన్ను కొంతసేపు ఆలోచించుకోనీ మామయ్యా" అన్నాడు. ఆ ఆలోచనతోనే ఇంటికి వచ్చాడు.

నారాయణరావుకి ఇల్లు అంతా లక్ష్మీమయంగా ఉన్నది. పాతఇల్లు అమ్మి గోశాలను ఇల్లుగా మార్చుకున్న తర్వాత - పాతఇంటిలోని చాల సామగ్రిని ఈ గోశాలలో పెట్టడానికి స్థలమే లేకపోయింది. వయసుమళ్ళిన వెంకమ్మగారిచేతిలో ఆ

సామాను సరిగా సర్దుబాటు చేయబడక ఇంట్లో నుంచునే దానికే సావకాశం లేకుండా ఉండేది. వెంకమ్మగారు పోయిన తర్వాత ఇంటిపెత్తనం లక్ష్మీదేవమ్మ చేతిలో పడింది. ఆమె ఈ పదిరోజులనుంచీ ఇంటిని పరిశుభ్రం చేసింది. అవసరంలేని సామాను అటక ఎక్కించింది. ఏది ఎక్కడ పెట్టాలో, ఎట్లా పెట్టితే నాజూకుగా ఉంటుందో అట్లా అన్ని సర్దుబాటుచేసి ఇల్లు శుభ్రంగానూ విశాలంగానూ ఉండేటట్లు చేసింది. ఈ సర్దుబాటువల్ల ఇంటికి క్రొత్తకళ వచ్చింది. నారాయణరావు ఇంట్లో అడుగు పెట్టగానే అతనికి తెలిసిపోయింది. లక్ష్మీదేవి గృహ యజమానురాలి పదవి స్వీకరించినదనీ ఆ పదవీ నిర్వహణలో ఆమెకు చాలా నేర్పు ఉన్నదనీ. ఈ ఇంట్లో - ఇది ఆమెకు మేనత్తగారి ఇల్లేగనుక ఇక్కడ ఆచారాలు, అలవాట్లు, రుచులు, నిష్ఠలు, పూజలు, పునస్కారాలు, అన్నీ ఆమెకు చిన్నప్పటినుంచీ తెలిసినవే. పార్వతమ్మగారి హయాములో లక్ష్మీదేవమ్మ తరచు మేనత్తగారింటికి వస్తూపోతూనే ఉండేది. లక్ష్మీదేవమ్మ ఆ ఇంటికి సరిగ్గా సరిపోయింది. ఆరాత్రి అంతా నారాయణరావుకి లక్ష్మీదేవమ్మ ఆలోచనే.

మర్నాడు నారాయణరావుకి అంతా ప్రియత్వంగా ఉన్నది. అతనికి ఇష్టమైనకూర, ఇష్టమైన పెరుగుపచ్చడి, అతనికి ఏమి ఎట్లా కావాలో అన్నీ అట్లా - అతని జపానికీ - శివార్చనకీ అన్నీ సలక్షణంగా సమకూర్చింది. అనేక సంవత్సరాల నుంచీ ఆ ఇల్లు నిర్వహిస్తున్నదానివలె సమర్థించింది. ఆ దినం

నారాయణరావుకు ప్రతి పనిలోనూ, లక్ష్మీదేవమ్మే కనిపించింది. అతడనుకున్నాడు "ఏమిటీ అనుబంధాలు ?" అతనికి అర్థమయింది. ఇంట్లో ఎవరో ఆడదిక్కు ఉండితీరాలి. తన చెల్లెలూ, తమ్ముళ్ళూ ఆడదిక్కు లేనిదే ఉండలేరు. తన తలితండ్రులు ఉంటే ఈ లక్ష్మీదేవితోనే తనకు వివాహం అయ్యేది. విచిత్రమైన పరిస్థితుల్లో ఆమె తన ఇంట్లో ఆడదిక్కుగా వచ్చింది. ఇది భగవదిచ్ఛ కాబోలు" అని ఆలోచన చేశాడు. అతడు లక్ష్మీదేవితో చిన్నప్పటినుంచీ మాట్లాడి ఎరగడు. ప్రతివాళ్లూ నారాయణరావును లక్ష్మీదేవి భర్త అని నవ్వుతూ అనడంచేత అతడు సిగ్గుపడుతూ ఉండేవాడు. ఆమెవంక ఇంతవరకూ సరిగ్గా చూడనైనా లేదు. ఈ రోజు ఆమెను ధైర్యంచేసి పరిశీలనగా చూచాడు. ఆమె మహాసౌందర్యవతి. తేజస్సు అతిలోకంగా ఉన్నది. ఆమె కులవధూ సహజస్నిగ్ధ నిశ్చలాపాంగ దృష్టితో నారాయణరావును చూచింది. ఆ దృష్టిలో తనకు తెలిసిన దివ్యత్వం ఏదో స్పృహ్యమానంగా ఉన్నదనిపించింది. అతను అనుకున్నాడు. "ఈమె భగవద్దత్తమైన వధువు" అని. అయినా ఫతీమా, సుమతిమూలంగా తన్నుగురించి దేశంలో విచిత్రమైన కథలు వ్యాపించినాయి. అందుచేత ఈమె అభిప్రాయము ఏమిటో తెలుసుకోవడంలో తప్పులేదని భావించి ఆమెతో ఇట్లా అన్నాడు. "చిన్నమామయ్య నాతో నీసంగతి మాట్లాడాడు. చిన్నత్తయ్యతో నువ్వు ఇక్కడనే ఉంటానని చెప్పావుట. నేను అందరూ అనుకునేంత సజ్జనుణ్ణికాను. నీకు

సుమతి వ్యవహారం తెలియదేమో" అని అంటూ ఆమెవంక చూచాడు.

అతని మాటలకు ఆమె కొంచెం సిగ్గుపడినా తడబాటు లేకుండా నెమ్మదిగా స్పష్టంగా నిశ్చలంగా సమాధానం చెప్పింది. ఒక్కసారి అతని ముఖంవంకచూచి తర్వాత అతని పాదాలమీద దృష్టి కేంద్రీకరించి మాట్లాడింది. "అక్క సుమతి వెంకమ్మ అత్తయ్యగారికి మొదటి శిష్యురాలు. నేను రెండోదాన్ని. అక్క మిమ్మల్ని దైవంగా ఆరాధిస్తున్నది. నేను మిమ్మల్ని భర్తగా సేవించుకోవాలని ఆశపడుతున్నాను. ఆమె మిమ్మల్ని మీ గుణగణాల్ని బట్టీ రూపసౌందర్యాన్ని బట్టీ ప్రేమించింది. నేను పుట్టడమే మీ భార్యగా పుట్టితినాయె. ఆమె స్వయంగా నిలబడి ఆర్జించి జీవితం వెళ్ళబోసుకోగల తాహతు కలది. నేను మీపాదాలు ఆశ్రయించి బ్రతుకవలసినదాన్ని. ఆమె అన్యమతస్థయై, సనాతనమతాన్ని ఆశ్రయించి, పరదేవతా పాదధ్యానంతో తపస్సిద్ధి పొందబోతున్నది. నేను సనాతన మతంలోనేపుట్టి - ఆ సంప్రదాయసిద్ధిగా భర్తృపాదార్చన చేసుకోవలసినదాన్ని. ఆమె మిమ్మల్ని వలచి వచ్చినది. నేను మీ కులవధువును. మీ వంశవిషయాలూ, అత్తయ్య మామయ్య గార్ల పవిత్రగాథలూ తెలిసిన ఏ కన్య మిమ్మల్ని వరించదు? నేను మీ మేనమామ కూతురనై పదిమందిచేతా మీభార్యగా చూడబడుతున్నదాన్ని. ఈ స్థానాన్ని పోగొట్టుకోకూడదనే నా సర్వ ఆశలూను. నా భావాలు క్లుప్తంగా చెప్పాలంటే

పూర్వం శ్రీ రుక్మిణీదేవి అమ్మవారు శ్రీకృష్ణస్వామికి పంపిన సందేశమూ అందులో మనోహరమైన పద్యం జ్ఞాపకం వస్తున్నది" అని అంటూ "ధన్యున్ లోకమనోభిరాము" అని శబ్దశుద్ధిగా శ్రావ్యంగా సన్నగా అన్నది.

ఆమెకుగల నిశ్చితాభిప్రాయానికీ విజ్ఞానానికీ నారాయణరావు ఆశ్చర్యమూ సంతోషమూ పొందాడు. 'రుక్మిణి కల్యాణ' భాగాన్ని పెళ్ళికాని కన్యలచేత పారాయణ చేయించడం తెలుగుదేశంలో ఆచారంగా ఉన్నది. ఈమెచేతకూడా వెంకమ్మగారు పారాయణం చేయించిందన్నమాట అనుకున్నాడు. భారత, భాగవత, రామాయణాలు అవగాహన చేసుకుంటే తెలియని ధర్మాలూ విషయాలూ అంటూ లేవు. అంచేతనే మన భారత స్త్రీలంతా విజ్ఞానవతులుగానూ, విదుషీమణులుగానూ, మహాపతివ్రతలుగానూ పేరుతెచ్చుకున్నారు. అని నారాయణరావు భావించాడు.

భోజనంచేసి నారాయణరావు సరాసరి చిన్నమేనమామగారి ఇంటికి వెళ్ళాడు. ఆయన భోజనం చేస్తున్నాడు. ఇతడు వెళ్ళి ప్రక్కన కూర్చోగా - వెంకటేశ్వరరావుకి అర్థమైంది. మేనల్లుడు సంతోషంగా ఉన్నాడని, "ఏంరా!" అన్నాడు. నారాయణరావు మెల్లిగా "నేను ఆలోచించాను మామయ్యా! కుటుంబంలో ఇప్పుడు నువ్వు పెద్దవాడివి. నీ మాట శిరసావహించాలని నిశ్చయించుకున్నాను" అని అన్నాడు. వేంకటేశ్వరరావుకి నవ్వు వచ్చింది. "ఓరి భడవా! నీవు వట్టి ఛాంద

సుడ వనుకున్నాను. చాలా లౌకికం నేర్చుకున్నావురా !" అని పకపకా నవ్వాడు. మేనమామ మేనల్లుళ్ళ పరిహాసం అర్థంకాక వెంకటేశ్వరరావు భార్య చూస్తూ నిలబడింది. వెంకటేశ్వర రావు ఆమెవంక చూస్తూ "ఏమి తెల్లమొహంవేసి చూస్తు న్నావు. వీడి లౌకికం నీకు అర్థంకాలేదా! పోనీలే - సాయం త్రంలోగా వీళ్ళయింటికి వెళ్ళి పిల్లలందరినీ - లక్ష్మీదేవిని మన ఇంటికి తిసుకురా! వీడి లౌక్యం లక్ష్మీదేవి నీకు చెప్పుతుంది. దానికి వీడి తిరుగుళ్ళు అన్నీ తెలిసిపోయాయి" అని నవ్వాడు. ఆమెకుకూడా అర్థం అయింది. మళ్ళీ వెంకటేశ్వరరావు అన్నాడు "లక్ష్మీదేవిని పెళ్ళికూతుర్నిచేసి వీడి చేతుల్లో పెట్టి - అన్నీ పూర్తిచేసేవరకూ - అంతా ఇక్కడే ఉంటారు" అని ఆ సాయంత్రమే వెంకటేశ్వరరావు దైవజ్ఞుని విచారించి ముహూ ర్తమః నిశ్చయించాడు. వారంరోజులలోనే వివాహం నిషేకం నిరాడంబరంగా జరిగిపోయాయి.

# 30

లక్ష్మీదేవమ్మ పినతండ్రితో చెప్పి సుమతికి ప్రత్యేకంగా ఉత్తరం వ్రాసింది పెండ్లికి రమ్మని. వెంకమ్మగారి మరణసమయ ములో జరిగిన సంఘటనతో వాళ్ళమధ్య ఏకోదరభావం ప్రబలమైంది. ఈపది పదిహేను రోజుల్లోనూ వాళ్ళు రెండు మూడు ఉత్తరాలు వ్రాసుకున్నారు.

ఈ పెళ్ళివార్త సుమతికి సంతోషాన్నే ఇచ్చింది. నాల్గు రోజుల స్నేహంతో సుమతికి లక్ష్మీదేవిమీద ప్రేమగౌరవాలు మాత్రమే కాకుండా ఆమె తన బహిఃప్రాణమే అన్నంతగా ఆత్మీయత ఏర్పడింది. తనకు లభించని నారాయణరావు వాల్లభ్యము తన బహిఃప్రాణమైన లక్ష్మీదేవికైనా లభిస్తున్నదికదా అని సంతోషపడింది. తనూ లక్ష్మీదేవీ వెంకమ్మగారి శిష్యురాళ్లు. నారాయణరావును తను భర్తగా మానసికంగా స్వీకరించింది. కనుక వాళ్ళ సంతానమే తన సంతానం. తనకూ ఆవిధంగానే మాతృత్వసిద్ధి లభించాలి. లక్ష్మీదేవికి చక్కని చంద్రహారాన్ని కానుకగా వేంకటేశ్వరరావు పేర పంపింది. వెంకటేశ్వరరావుకీ లక్ష్మీదేవికీతప్ప - ఇంకెవరికీ ఆ హారం సుమతి పంపినట్లు తెలియదు. నారాయణరావుకే తెలియలేదు.

వేంకటేశ్వరరావు తనకు ఉన్నదానిలో అతిఘనంగా శుభకార్యాలు ముగించాడు. పండుగలు చేసినట్లుగా చేశాడు. ఆయన వెళ్లి పిలువగా పరమేశ్వరరావుగారి రెండవ కుమార్తె సరస్వతమ్మా, ఆమెభర్త వెంకటప్పయ్యా, పిల్లలూ పెళ్ళికి వచ్చారు. పరమేశ్వరరావుగారూ, పార్వతమ్మ పోయినప్పుడు కూడా రాని ఈ కుటుంబం - వివాహానికి రావడం అందరికీ అచ్చెరువుగానేఉన్నది. పెళ్లికి నారాయణరావు ఇతర తోబుట్టువులు వాళ్ళకుటుంబాలూ ఇంకా ఇతరబంధువులూ అంతా వచ్చారు. పెళ్ళి సలక్షణంగానే జరిగింది. పరమేశ్వరరావుగారి రెండవకుమార్తె సరస్వతమ్మా ఆమె భర్తా - చీటికీమాటికీ

గల్లంతుచేశారు. పెళ్లిలో మర్యాదలు బాగా జరుగలేదనీ వంటలు రుచిగా లేవనీ - తమ ఇద్దరికీ ముందు సీటలు వెయ్య లేదనీ - నానా అల్లరీ చేశారు. "నాతమ్ముడు పెద్దచదువు చదివి బెంగుళూరులో పెద్దఉద్యోగంలో ఉన్నాడు. అతని పెళ్ళికి అచ్చట్లు ముచ్చట్లు బాగా జరుగుతాయి అని ఆశపడి వచ్చాము. ఈ దిక్కుమాలిన సంబంధం సరిగా అప్పగింత బట్ట లైనా పెట్టలేదు" అని సరస్వతమ్మ సాధించిపోసింది. ఆమెభర్త ఆమెకు వంతపాట పాడాడు. పెద్ద ఆడపడుచు, ఆమె భర్త ఏమీ మాట్లాడలేదు. వాళ్లకుకూడా లాంఛనాలు గిట్టుబాటు కాలేదని ఉన్నది. కాని బయటపడటం ఇష్టంలేక ఊరు కున్నారు. మూడో ఆమె వెంకటనర్సమ్మ. ఆమెకూ ఆమెభర్త భీమనాథరావుకీ ఈ సంబంధమూ ఈపెళ్ళీ సంతోషాన్ని కలిగిం చినై. కావలసిన సంబంధం. పిల్ల గుణవతి. సౌందర్యవతి. ఇంట్లో కలసిపోయేది. ఆడదిక్కులేని ఈ కుటుంబాన్ని లక్ష్మీ దేవి చక్కగా దిద్దుకుపోతుంది. ఈ అభిప్రాయాలుకల వెంకట నర్సమ్మా, భీమనాథరావూ కలుపుగోరుతనంగా పెళ్లిలో పూను కుని నడుంకట్టి నిర్వహించారు. పూర్వం రెండువందల రూపాయ లతో జ్ఞానోదయం అయిన ముకుందరావూ పద్మావతమ్మా కూడా నడుంకట్టి నిలబడి కార్యక్రమాన్ని నిర్వహించి సంతో షాన్నే ప్రదర్శించారు.

ఆడపడుచులుగాని, ఇతరులుగాని తమవాదాన్ని సమర్థిం చక తాము చేస్తున్న అల్లరికి హర్షించక ముభావంగా ఉండటం

వల్ల - సరస్వతమ్మకూ, ఆమె భర్తకూ అక్కసు ఎక్కువై పట్టలేక వెళ్ళిపోయారు. నారాయణరావు అభ్యర్థనమీద వెంకటేశ్వరరావుకూడా ఈ అల్లరిని పట్టించుకోలేదు. కాని వెంకటేశ్వరరావు భార్యమాత్రం మెత్తమెత్తగా అన్నది. "మేమూ పిల్లలు కలవాళ్లం. మాకు శక్తి ఇంతకంటే లేదు. లక్ష్మీదేవికి తలిదండ్రులు ఆస్తి ఏమీ ఇచ్చిపోలేదు. మేము ఎక్కడనుంచి తెచ్చి ఖర్చుపెట్టాలి? అంతేగాక పార్వతీపరమేశ్వరులవంటి తన తలిదండ్రులు ఇదివరకే తమ అభిమతం వెల్లడించిపోవడం వల్ల నారాయణరావు లక్ష్మీదేవిని పెండ్లాడుతున్నాడు. వాళ్ల ఆజ్ఞను నిర్వహించడమే ఇది. లాంఛనాలకు అల్లరిచేస్తే ఏం లాభం?"

సరస్వతమ్మనూ ఆమె భర్తనూ వాళ్ళు అల్లరి చేసిన కొద్దీ బంధువులు పట్టించుకోవడం మానేశారు. చివరకు పలకరించడంకూడా మానేశారు. నారాయణరావుకూడా పట్టించుకోకుండా ముభావంగా ఉన్నాడు. అందుచేత వివాహం అయిన మర్నాడే - సరస్వతమ్మ కుటుంబం వెళ్లిపోయింది. వెళ్లిపోయేటప్పుడు ఉండమని ఎవరూ బలవంతం చెయ్యలేదని ఆఖరి చిందులు త్రొక్కారు. మిగిలిన తోబుట్టువులు పదహారో రోజు పండుగదాకా ఉండి, లక్ష్మీదేవమ్మ కాపురానికివచ్చి అన్నీ బాగా సర్దుకునిపోతున్నదని చూచి మరీ వెళ్ళారు. లక్ష్మీదేవమ్మ ఇల్లు చక్కదిద్దుకోవడంలో, నారాయణరావు మనస్సును

గ్రహించి, అన్నీ ఏర్పాటుచేయడంలో చూపుతున్న చాక చక్యానికి వాళ్లంతా సంతోషించారు.

# 31

త్వరగా తిరిగిరమ్మని నారాయణరావుకి బెంగుళూరు నుంచి ఉత్తరాలు వస్తున్నాయి. ఇద్దరు తమ్ములు, చెల్లెలు, తనూ, భార్య - ఇంతమందికి సౌకర్యమైన ఇల్లు తక్కువఅద్దెలో బెంగుళూరులో దొరకదు. ఇంతమందితో అంతపెద్ద బస్తీలో సంసారం నడపడానికి ఆర్జనచాలదు. ఇక్కడ వీళ్ళను వదలిపెట్టి వెళ్లడానికిలేదు. ఈ ఆలోచనలతో సతమతమవుతుండగా నారాయణరావుకి సర్వీసు కమీషనువారి ఉత్తర్వులు వచ్చాయి. గుంటూరుజిల్లా రివిన్యూ డిపార్టుమెంటుకు ఇతన్ని వేసినట్లు, ఆ కలెక్టరునుంచి పోస్టింగు ఉత్తర్వులు వస్తాయని. వేంకటేశ్వరరావు మొదలైన బంధువులంతా సలహాచెప్పారు. "గవర్నమెంటు ఉద్యోగం, స్థిరమైంది. రివిన్యూ డిపార్టుమెం టులో గుమాస్తాగాచేరి కలెక్టరుగా రిటైరు కావచ్చును. పైగా గుంటూరుజిల్లా మనకు దగ్గరలో ఉంది. గుంటూరుజిల్లా రివిన్యూ డిపార్టుమెంటులో చేరడం మంచిది." అనుభవంలేని నారాయణరావుకు ఈ సలహాలు సమంజసంగా తోచినాయి. అతడు బెంగుళూరు యజమానికి వినయంగా తన కుటుంబ పరి స్థితులు తెలుపుతూ తనయందు చూపిన ఆదరానికి కృతజ్ఞత తెలుపుతూ తన కుటుంబస్థితులవల్ల తిరిగి ఉద్యోగానికి రాలేక పోతున్నానని వ్రాశాడు.

పది హేనురోజుల్లో గుంటూరుజిల్లా కలెక్టరాఫీసునుంచి ఉత్తర్వులు రావడం నారాయణరావు గురజాల తాలూకాఫీసులో గుమాస్తాగా చేరడం జరిగిపోయింది.

నాలుగునాళ్లు పనిచేసి చిన్న ఇల్లు కుదుర్చుకుని తిరిగి వచ్చి కుటుంబాన్ని తీసుకెళ్ళి కాపురంపెట్టాడు. ఆఫీసులో పరిస్థితులు నారాయణరావుకి విచిత్రంగా ఉన్నాయి. అది ఒక క్రొత్తప్రపంచంగా తోచింది. అంతా కుళ్లు. ప్రతివాళ్లూ క్రింది ఉద్యోగులమీద కారాలూ మిరియాలూ నూరడం పై ఉద్యోగుల కాళ్ళుపట్టి బ్రతకడం. వాళ్ల తీరేవేరు. అది ఒక కశ్మలం. నారాయణరావు రోజులు గడుపుతున్నాడు. ఎట్లాగో నానా అవస్థలతో సంవత్సరం గడిచింది.

ఒకరోజు అకస్మాత్తుగా గంగాధరరావు వచ్చాడు. ఊళ్ళో ఉండగా అతనికోసం ప్రయత్నించినా దొరకలేదు. ఇవ్వాళ అతనే వెతుక్కుంటూ వచ్చాడు. చిన్ననాటి స్నేహితుణ్ణిచూసి నారాయణరావుకి ప్రాణాలు లేచివచ్చాయి. అతనికి మర్యాదలుచేసి, భోజనంపెట్టి కుశల ప్రశ్నాదికాలతో కబుర్లలోకి దిగాడు. ఆరోజు ఆదివారం కావడంమూలాన తీరుబడిగా ఉండి, నారాయణరావుకి సంతోషంగా ఉన్నది.

గంగాధరరావు ఏదో చింతాక్రాంతంగా ఉండటం హృదయపూర్వకంగా మాట్లాడకపోవడం నారాయణరావు గమనించాడు. అతన్ని నిలవతీసి 'ఏమిటి సంగతి' అన్నాడు. గంగాధరరావుకి కళ్ళనీళ్ళువచ్చి తమాయించుకొని "నీకు

చెబుదామనే వచ్చాను. నువ్వు తలచుకుంటే నా కష్టాలు గట్టెక్కుతాయి. మీ తండ్రిగారి మహాత్మ్యం నాకు తెలియదా? ఆ ఋషులవంశంలో పుట్టిన నువ్వు నాకు ఈ చిన్నసహాయం చెయ్యగలవనే ఆశతోనే ఇంతదూరం నిన్ను వెతుక్కుంటూ వచ్చాను. నాకష్టాలు చెబుతాను విను" అని మొదలుపెట్టాడు.

"నువ్వు రాజమండ్రి కాలేజీలో చదువుతున్నప్పుడు నేను గుంటూరులో చదివానుగా. అప్పుడు నాకొక క్లాసుమేటు ఉన్నది. ఆమెపేరు కనకాంగి. పేరుకితగ్గ రూపం. చాలా తెలివైంది. నేను కాలేజీలో అప్పుడు చదువుతున్న విద్యార్థులందరిలోనూ ధనవంతుణ్ణి. నాపైన అజమాయిషీ లేదు. నా ఇష్టంవచ్చినట్లు ఖర్చుచేసేవాడిని. నాకంటె ఖరీదైన దుస్తులు వేసే విద్యార్థులు ఉండేవాళ్ళుకారు. నా చుట్టూ కావలసినంత వందిమాగధ బృందం ఉండేది. నేను తేలికగానే కనకాంగి పరిచయం సంపాదించాను. ఆమెది కళావంతుల కులం. తల్లికి ఈమె ఒక్కర్తే కూతురు. తల్లి కూతురుమాట ఏదీ కాదనేది కాదు. సంవత్సరంలో ఇద్దరం కలిసి ఒకే ఇంట్లోకి మారాము. రిజిష్టరు మ్యారేజి చేసుకున్నాము. మూడేళ్ళూ ఆమె తల్లి కూడా ఉండటంమూలాన చాలా హాయిగా గడిపాము. ఎట్లాగో ఇద్దరం బి. ఏ. పూర్తిచేశాము. కావలసినంత ఉన్న నాకు ఉద్యోగం దేనికి? ఇంతలో ఆమె తల్లికూడా గతించింది. కనకాంగికి మద్రాసులో మకాం పెట్టాలని అభిలాష కలిగింది. మద్రాసులో ఇల్లుకొని కాపురం పెట్టాము.

మద్రాసులో సుఖమయ జీవితాన్ని గడుపుతూ సంవత్సరకాలం బాగానే జరిగింది. చేతినిండా డబ్బు. స్వంత ఇల్లు. అదుపులేనిస్వేచ్ఛ. మేముచూడని సినిమాలేదు. వినని గానసభ లేదు. మద్రాసులో తెలుగువాళ్లలో మేము ప్రముఖులమై పోయాము. కనకాంగి అందమైనది. చదువుకున్నది. సాంఘిక మర్యాదలు తెలిసినది. అందరూ ఆమె పరిచయంకోసం తహ తహ పడేవాళ్లే. మద్రాసులో సినిమా సంబంధంగా ఉన్న తెలుగు జనానికి కనకాంగిని ఆశ్రయించడం అలవాటై పోయింది. మా యింటికి అన్నిరకాలవాళ్ళూ రావడం మొదలైంది. వాళ్ళ పొగడ్తలు వింటూ సంతోషపడుతూ కాలం గడిపేది కనకాంగి. ఆమె సినిమాలో నాయకిగా బాగా రాణిస్తుందనీ - ఆమెను మించిన సౌందర్యవతి లేదనీ ఆ వందిమాగధులు చెబుతూ ఉండేవాళ్ళు. ఆమెకు వాళ్ళు ఎక్కించిన పైత్యం తలకు ఎక్కింది. నేను ఎన్నిచెప్పినా ఆమెకు నచ్చలేదు. సినిమాకంపెనీ ప్రారంభించి, ఆమె నాయకిగా సినిమా తియ్యమని పట్టుపట్టింది. నేను ఏమీ చెప్పలేకపోయాను. ఆమె ఆవందిమాగధులతో అన్ని ఏర్పాట్లు చేసివేస్తున్నట్లు చెప్పి వేసింది. ఇక మా యింటికివచ్చే జనసంఖ్య పెరిగిపోయింది. ఎక్‌స్ట్రాలు, సంగీతంవాళ్లు, ఆఫీసుకుర్రాళ్ళు, రోజూ అనేకమంది వచ్చిపోతూండేవాళ్ళు. పాటలు ఇప్పించమని యువకవులు - కథలు సంభాషణలు వ్రాస్తామని కొందరు రోజూ వచ్చేవారు. కనకాంగి వాళ్లమాటలు వింటూ సరేనని చెబుతూ ఉండేది. ఆ

కవులలో ఇద్దరు కథలు వ్రాసి కనకాంగికి వినిపించి - ఆమె నాయకిగా నటించే భాగం ఎక్కువగా ఉండేటట్లు గొప్పగా వ్రాశామని చెబుతూ వాళ్ళిద్దరూ కలిసి కథ సంభాషణలు, పాటలు వ్రాస్తున్నట్లు పత్రికలలోకూడా కబుర్లప్రోగులు వచ్చే టట్లు చేశారు. ఒక డైరక్టరుకూడా తయారైనాడు. వాడు నిర్విరామంగా కనకాంగిని పొగడటం-ఆమె అందాన్ని మెచ్చు కోవడమూ - తెల్లవారి నప్పటినుంచీ రాత్రి పదిగంటలదాకా వాడు మా ఇంట్లోనే ఉండేవాడు. ఆమెకు నాతో గడ-డం కంటె వాడితోనే ఆహ్లాదంగా ఉన్నదని నాకు తెలిసిపోయింది. వాళ్ళిద్దరూ కలిసి షికార్లుకూడా ప్రారంభించారు.

వాడి ద్వారా కనకాంగికి సినిమా పరిశ్రమలో వ్యక్తు లందరూ పరిచయమయ్యారు. నాకు చెప్పకుండానే ఒక సిని మాలో నటించడానికి బుక్ అయింది. ఇక షూటింగు ఉన్నా లేకపోయినా యింట్లో ఉండేదికాదు. నాకు ఆమె దర్శనమే అపురూపమైపోయింది. ఒక్కొక్కప్పుడు వారమురోజులు ఇంటికి వచ్చేదికాదు. నాకర్లతో 'ఔట్ డోర్ సీక్వెన్స్'కి వెళ్ళివచ్చానని చెప్పేది.

ఆమె ప్రవర్తనను గురించి పుకారులు బయల్దేరి నా చెవులవరకూ వచ్చినై. నాకు ఏమి చెయ్యాలో తెలియలేదు. ఇంతలో పదిరోజుల క్రితం ఆమె ఇంటినుంచి వెళ్ళి ఇంతవరకు తిరిగి రాలేదు. నాకు ఏమీ తోచక ఇట్లా వచ్చాను" అని గంగాధరరావు ముగించాడు.

నారాయణరావుకి ఆలోచన తోచలేదు. గంగాధరరావును ఔపచారిక వాక్యాలతో సముదాయించి భోజనాది సౌకర్యాలతో ఆహ్లాదం కలిగించి విశ్రాంతి తీసుకోమన్నాడు. ఆ రాత్రి బాగా ఆలోచించి నారాయణరావు ఒక నిర్ణయానికి వచ్చాడు. పదిహేనురోజులు శెలవు పెట్టి గంగాధరరావును తీసుకుని బయలుదేరాడు.

# 32

నెల్లూరులో కొంత పని ఉన్నదని గంగాధరరావు అక్కడ నారాయణరావుతో కలిసి దిగాడు. పని ముగించుకుని మళ్ళీ రైలుకు బయలుదేరుదామనుకుంటుండగా గంగాధరరావుకి తెలిసిన వాడొకడు కనిపించాడు. అత డొక ప్రైవేటు టాక్సీ డ్రైవరు. తన కారులో ఎవరినో మద్రాసునుంచి నెల్లూరు తీసుకువచ్చాడట. ఇప్పుడు తిరిగి వెళ్లుతున్నాడట. మద్రాసు వస్తే వీళ్ళను తీసుకువెళ్తానన్నాడు.

రాత్రి భోజనాలుచేసి బయలుదేరారు. వెనకసీట్లో గంగాధరరావు నారాయణరావు కూర్చున్నారు. మగత నిద్రలో తూగుతో విశ్రాంతిగానే కూర్చున్నారు. నడిరాత్రి దాటిపోయింది. మద్రాసు ఇక ముప్ఫై నలభై మైళ్ళకంటె దూరంలేదు. ఇంతలో కారు టప్పమని ఆగిపోయింది. గంగాధరరావు, నారాయణరావు ఉలిక్కిపడి లేచారు. 'టైరు బర్స్ట్'

అయిందనీ స్టెప్నీ లేదని డ్రైవరు చెప్పాడు. 'తెల్లవారిన తర్వాత ఏదో చెయ్యవచ్చుననీ అంతవరకు కారులోనే నిద్ర పొమ్మనీ' అన్నాడు. వేరే చేయగలిగినది ఏమీ లేదుకూడా. ముగ్గురుకలసి కారును కొంచెం రోడ్డుప్రక్కకు కదిలించి చక్రాలక్రింద రాళ్ళు పెట్టారు.

దగ్గరలో ఎక్కడా ఊరు ఉన్నట్లు కన్పించడంలేదు. దూరంగా రోడ్డుకి పడమటగా మంట కన్పడుతున్నది. తనకు దాహం అవుతున్నదనీ అక్కడ మంచినీరు లభించవచ్చుననీ గంగాధరరావు అక్కడకు వెళదామన్నాడు. డ్రైవరుకి చెప్పి నారాయణరావు గంగాధరరావు ఆవెలుతురువైపుకి నడిచారు.

రోడ్డువదలి పడమటవైపుకి వెలుతురుకు సూటిగా ప్రయాణం చెయ్యగా ఒక ఫర్లాంగులో ఒక చిన్న కంకర రోడ్డు తగిలింది. చూడగా ఈ కంకరరోడ్డు కొంచెం ఎగువ భాగంనుంచి మెయిన్‌రోడ్డునుంచే చీలివస్తున్నదనీ ఆ మంట వైపుకే పోతున్నదనీ వాళ్లకు తెలిసింది. దానివెంట నడిచారు.

ఆ మంటచుట్టూ మానవాకృతులు ఉన్నట్లు కన్పించింది. ఏదో జంతువు గట్టిగా మూలుగుతున్నట్లు విన్పించింది కూడాను. వీళ్ళిద్దరూ మంటవైపేచూస్తూ నెమ్మదిగా ప్రయాణము చేశారు. మంట దరిదాపులకు వచ్చిచేరారు. మంటకు ఒకప్రక్క ఒక కౌపీనమాత్ర వస్త్రధారణంలో ఉన్న సన్యాసి ఒకడు ఎత్తుగా ఉన్న మట్టిదిబ్బమీద పులిచర్మం వేసుకుని పద్మాసనంలో కూర్చుని ఉన్నాడు. ప్రక్కనే త్రిశూలం ఒకటి

గ్రుచ్చి ఉన్నది. అతనికి దగ్గరగా ఒక పందిపిల్ల బంధింపబడి నేలమీద పడివుండి 'ఘుర్ ఘుర్' మంటున్నది. సన్న్యాసికి ఎదురుగా అయిదుమంది కూర్చుని ఉన్నారు. వాళ్ళు నాగరికులుగానే ఉన్నారు. ఏవో మాట్లాడుతున్నారు.

నారాయణరావు గంగాధరరావును మాట్లాడవద్దని సంజ్ఞ చేసి మెల్లగా ఆ మంటకు యాభైగజాలదూరంలో ఉన్న ఒక పెద్ద మఱ్ఱిచెట్టు దగ్గరకు దారితీశాడు. ఇద్దరూ మఱ్ఱిచెట్టు వెనకప్రక్కకుచేరి మంటదగ్గర జరుగుతున్న తతంగాన్ని పరిశీలించడం మొదలుపెట్టారు. చెట్టుకి ఇవతలప్రక్క ఒక రహదారి బంగళా - పారెస్టు బంగళా ఉన్నట్లు కనిపించింది.

మంటదగ్గరనుంచి మాటలు వినబడుతున్నాయి. ఆ మాటాడుతున్నవాడు కనకాంగికి స్నేహితుడైన సినిమా డైరక్టరేనని గంగాధరరావు పోల్చిచెప్పాడు. ఆ సమయంలో అతడు అతని సహచరులు ఈ సన్న్యాసి ఇదంతా ఏదో అయోమయంగా ఉన్నది.

సినిమా డైరక్టరు సన్న్యాసిని పొగడుతున్నాడు. "మహాత్మా మీరు దివ్యశక్తులు కలవాళ్ళని మేము విని మిమ్మల్ని ఆశ్రయించాము. మీకోసం ఇవ్వాళ ఉదయంనుంచీ ఇక్కడనే ఉన్నాము. తమ రాకకోసం ఎదురుచూస్తూ ఉన్నాము. తమరు తమశిష్యుడు భైరవయ్య చెప్పినట్లు రాత్రి పదిగంటలకే వస్తారనుకున్నాము. కాని తమరు ఇక రారేమోనని భావించుకుని తిరిగి వెళ్ళిపోదామనుకుంటుండగా తమరు

రానేవచ్చారు. రావడమే తడవుగా పూజకూడా సంపూర్తి చేశారు. ఇక ఇప్పుడు మా ప్రార్థన మన్నించండి" అని సన్యాసికి నమస్కరించాడు.

సన్యాసి తల పంకించి మండుతున్న నిప్పువైపు చేయి జూపాడు. అతడు చెయ్యి జూపగానే మంట భగ్గుమని రెండు గజాలు పైకిలేచింది. చుట్టూమూగి ఉన్న జనం దిగ్భ్రాంతులయ్యారు. సన్యాసి మళ్ళీ చెయ్యి పైకెత్తి "ఓం నమో భగవతి జ్వాలామాలిని దేవదేవి సర్వభూత సంహారకారికే జాతవేదసి జ్వలంతి జ్వల జ్వల ప్రజ్వల ప్రజ్వల హ్రాం హ్రీం హ్రూం రరరరరరర హుం ఫట్ స్వాహా" అన్నాడు. మంట భగభుగలతో పైకిలేచింది. సన్యాసి మళ్ళీ "ఓం ఇం హ్రీం శ్రీం ఇంగ్లాం ఇం నమో భగవతి వార్తాళి వార్తాళి వారాహి వారాహి వరాహ ముఖి అంధే అంధిని నమః రుంధే రుంధిని నమః జంభేజంభిని నమః మోహే మోహిని నమః స్తంభే స్తంభిని నమః సర్వదుష్ట ప్రదుష్టానాం సర్వేషాం సర్వవాక్చిత్త చక్షుర్ముఖగతి జిహ్వా స్తంభనం కురుకురు శీఘ్రం వశయం ఐం గ్లాం ఇంఠః ఠః ఠః ఠః హుంఫట్ స్వాహా" అంటూ త్రిశూలంతో పందిపిల్లను గ్రుచ్చి యెత్తి మంటలో వేశాడు. పందిపిల్ల గగ్గోలుగా ఘుర్ ఘుర్ మంటూ దిశలు పగులకొట్టి, అంతలో నిశ్శబ్దమైపోయింది. మంట బహుళంగా విజృంభించి మళ్ళీ ప్రశాంతత పొందింది. సన్యాసి మంటవంకే చూస్తూ

కూర్చున్నాడు. చుట్టూచేరిన జనం మళ్లీ సన్యాసికి దగ్గరగా వచ్చి కూర్చున్నారు.

సన్న్యాసి వాళ్ళవంక చూడగా సినిమా డైరెక్టరు చెప్పడం మొదలుపెట్టాడు. "మేము తీసుకువచ్చిన స్త్రీ బంగాళాలో ఉన్నది. ఆమె మేము చెప్పినట్లు వింటుంది. ఆమె భర్త చాలా ధనవంతుడు. కొన్నిలక్షలకు అధికారి. అతడిని తొలగించివేస్తే - ఆ అపారధనమంతా ఆమె స్వాధీనంలోకి వస్తుంది. అప్పుడు మనఇష్టమే ఇష్టము. అతనిని తొలగించివేస్తే - మీరు కోరినచోట మఠం కట్టిచ్చి ఇస్తాము. అతనిపేరు గంగాధరరావు" అని చెప్పగా సన్న్యాసి శిరఃకంపనం చేశాడు.

గంగాధరరావుకి, నారాయణరావుకీ జరుగుచున్న తంతు అర్థమైనది. గంగాధరరావు చాలా ఆవేశం పొంది ముందుకు దూకడానికి ప్రయత్నం చెయ్యగా - అధికమైన ప్రయత్నంతో నారాయణరావు ఆపగలిగాడు. నారాయణరావు భయపడవద్దని గంగాధరరావును శాంతపరచి మెల్లిగా చీకటిలో బంగాళా వరండాలోకి తీసుకువెళ్ళాడు. ఆప్రక్కన ఉన్న కారునుచూచి గంగాధరరావుకి ఆశ్చర్యం వేసింది. ఆ కారు గంగాధరరావుదే. మెల్లిగా వెళ్ళి కారులో చూచాడు. వెనుకసీట్లో సన్నగా మూలుగుతూ కనకాంగి ఉన్నది. ఆమె కేశవస్త్రాల తీరునుబట్టి చూస్తే ఆ అయిదుగురూ ఆమెమీద అఘాయిత్యం చేసినట్లు కన్పించింది. నారాయణరావుకికూడా అంతా అర్థం అయింది.

ఇంకా సినిమా డైరక్టరు ఏవో చెబుతూనే ఉన్నాడు. సన్న్యాసి కన్నులు మూసుకుని వింటున్నాడు.

గంగాధరరావు కారు ముందుతలుపులు తీసి నారాయణ రావును ముందుసీట్లో కూర్చోమని సంజ్ఞచేశాడు. నారాయణ రావు కూర్చున్న తరువాత గంగాధరరావు డ్రైవరు సీట్లో కూర్చుని - స్టార్టింగు తాళపుచెవితీసి ప్రక్కనవున్న సొరుగు మూత తీశాడు. అతడు ఊహించినట్లుగా అతని రివాల్వరు కూడా అక్కడ యథాస్థానంలో ఉన్నది. దాన్ని చేత్తోపుచ్చుకుని కారు స్టార్టుచేసి లైటు వేశాడు. ఆ చప్పుడుకు మంట చుట్టూ ఉన్నవాళ్ళు గబుక్కున లేచారు. సన్న్యాసి కన్నులు మూసుకుని అట్లాగే కూర్చుని ఉన్నాడు. గంగాధరరావు గాలి లోకి రివాల్వరు పేల్చాడు. మంటచుట్టూ చేరిన మనుష్యులు దౌడుతీశారు. గంగాధరరావు కారును మంట దగ్గరకు తీసుకు వెళ్ళాడు. ఇంకా సన్న్యాసి కన్నులు మూసుకుని అట్లాగే కూర్చుని ఉన్నాడు. నారాయణరావు గంగాధరరావుతో చెప్పాడు సన్న్యాసి ప్రాణాలు ఎప్పుడో పోయాయనీ అతన్ని గురించి పట్టించుకోవలసినది లేదనీ.

గంగాధరరావు కారును తోలుకుంటూ మెయిన్ రోడ్డుకు వచ్చి అక్కడ టాక్సీలోఉన్న తమ సామాన్లు తీసుకుని మద్రాసు వచ్చి చేరాడు.

కనకాంగికి ఆస్పత్రిలోకూడా స్మృతి రానేలేదు. ఆమె రెండురోజుల తర్వాత ఆస్పత్రిలోనే ప్రాణాలు విడిచింది.

నారాయణరావు గంగాధరరావును సముదాయించి మద్రాసు ఇల్లు అమ్మించి స్వంత ఊరు చేర్పించాడు.

# 33

సుమతి మద్రాసులోనే ఉంటూ మెడికలు కాలేజీలో చదువు పూర్తిచేసి వైద్యంలో పట్టం పుచ్చుకున్నది. ఆమె బొట్టూ, చీరె, కట్టూ, భక్తీ, మితభాషణమూ ఆమెకు కళాశాలలో మంచిపేరే తెచ్చిపెట్టాయి. ఆమె వినయవతి అనీ, ఉత్తమ బ్రాహ్మణకుల స్త్రీఅనీ అందరూ ఆమెను భావించేవారు. ఆమె ఐదుసంవత్సరాలలో కళాశాలలో ఎవ్వరితోనూ మాట్లాడి ఎరుగదు. విద్యార్థులతోనే కాకుండా విద్యార్థినులతోనైనా సన్నిహితంకాలేదు. కాని ప్రతిసంవత్సరమూ పరీక్షలలో ప్రథమశ్రేణిలో ప్రథమగణ్యగా ఉత్తీర్ణురాలౌతూ అనేకమైన బహుమతులు గెలుచుకుంటూ వచ్చింది. ఐనా అధ్యాపకవర్గంలో వారితోనైనా అనవసరంగా మాట్లాడి ఎరుగదు. ఎప్పుడూ వినయభూషణాన్ని విసర్జించి ఎరుగదు. కళాశాలలో ఎవ్వరికీ ఆమె వృత్తాంతం తెలియలేదు. ఎవరికీ ఆమె మహావ్రతనియమాన్ని పాలిస్తున్న మహా సాధకురాలని తెలియదు. అందరికీ ఆమె వివాహిత ఐన బ్రాహ్మణస్త్రీ అనే భావమే స్థిరమైపోయింది.

పరీక్షలు ప్యాసయి, ఆరునెలలు ఆస్పత్రిలో పనిచేసి పట్టం చేతికి తెచ్చుకున్నతర్వాత సుమతికి ఏమి చేయాలనే

ప్రశ్న ఎదురైంది. తన తండ్రిగారిని పిలిపించి ఆలోచించింది. ఆయన నీ ఇష్టమన్నాడు. తండ్రిగారు రిటైరు కావలసిన సమయం దగ్గరపడుతున్నదనీ ఆయన స్వస్థలానికివెళ్ళి ఉండదల చాననీ చెప్పి వీలయినంతవరకు తనకూ తన కుటుంబానికీ దూరంగా ఉండమని మాత్రం సలహా చెప్పాడు. ఆమె పేరు మార్చుకున్నట్లుగాని, మద్రాసులో ఉండి చదువుకుంటున్నట్లు గాని తనవైపు బంధువులకెవ్వరికీ తెలియనివ్వ లేదన్నాడు. తన రెండో భార్యకుకూడా చెప్పలేదట. వాళ్ళంతా ఈమె ఎవ రినో పెండ్లిచేసుకుని ఉంటుందని అనుకుంటున్నారట.

ఆమెకు ప్రభుత్వోద్యోగం చెయ్యాలని బుద్ధి పుట్ట లేదు. ఏమిచెయ్యాలో తోచనూలేదు. ఇల్లు తాళం పెట్టి - వంటచేస్తూ తనవద్దఉన్న బంధువుతో కలసి ఉత్తర దక్షిణ తీర్థాలన్నీ సేవించి వచ్చింది. ముఖ్యంగా అమ్మవారి ఆలయా లన్నీ వదలిపెట్టకుండా దర్శనంచేసి వచ్చింది. కాశీలో అన్న పూర్ణాదేవీ, విశాలాక్షీదేవి దర్శనాలుచేసి గంగాభవానిలో స్నానంచేసి అతిలోకపావిత్ర్యాన్ని సంపాదించుకున్నట్లు ఆనం దపడింది. అవంతిలో మహాకాళి ఆలయంలోనూ వింధ్యాద్రి పైన వింధ్యవాసినీదేవి ఆలయంలోనూ కాంచీపురంలో కామాక్షీదేవి ఆలయంలోనూ, మధురలో మీనాక్షీదేవి ఆలయంలోనూ - శ్రీశైలంలో భ్రమరాంబికాదేవి ఆలయం లోను - ఆమెకు దివ్యలోకానుభూతి కలిగినట్లు అనిపించింది. ఆమె మనస్సు మిక్కిలి ప్రశాంతమయమై ఏదో సుపరిచిత మాధుర్యావధున్ని అధిగమించి ఆనందకోశ సంచారం చేసింది.

ప్రక్కనఉన్న వంటఆమె కోరికమీద ఆమె తిరుపతికి కూడా వెళ్ళింది. అది ఏమిచిత్రమో - సుమతికి - ఎక్కడ చూచినా - అది అమ్మవారి క్షేత్రంగా ఉన్నచిహ్నాలే కన్పించాయి. చివరకు అంతరాలయం దగ్గరపైకిచూస్తే - దేవాలయంమీద అమ్మవారి వాహనమైన సింహం నాలుగుప్రక్కల కన్పించింది. సుమతికి ఆనందోత్సాహం ద్విగుణీకృతమై "శ్రీమాతా, శ్రీమహారాజ్ఞీ, శ్రీమత్సింహాసనేశ్వరి" అంటూ లలితా సహస్రనామం పఠిస్తూ లోపలకు వె

ఎదురుగా కళ్యాణ శ్రీ వేంకటేశ్వరులు - సర్వాభరణా భూషిత సుందరస్వరూపంతో - శ్రీ బాలాత్రిపురసుందరీ అమ్మవారిలాగా - సుమతి మనస్సుకి భాసించగా - ఆమె ఎలుగెత్తి వైఖరీరూప వాగ్ధునీ ప్రవాహంగా "చిద్రూపీ పరదేవతా భగవతీ శ్రీరాజరాజేశ్వరి" అని స్తుతించి కన్నులుమూసికొని శ్రీదేవిని ధ్యానించి కన్నులు తెరువగా శ్రీ స్వామివారి కిరీటంలో మేనుప్రస్తార శ్రీ చక్రరాజం ధగద్ధగలాడిపోయింది.

స్వామివారి దర్శనం ముగించుకుని సత్రానికి వచ్చి - సుమతి ఆలోచించడం మొదలుపెట్టింది. ఎందుచేత తనకంటికి ఈ క్షేత్రం స్త్రీ దేవతామయంగా కనిపిస్తున్నది? శ్రీ వేంకటేశ్వరులు తనకు శ్రీ మాతృమూర్తిగా ఎందుకు దర్శనం ఇచ్చారు? ఆమెకు సమాధానాలు భాసించలేదు. కాని శ్రీ స్వామివారిపేరులో దీర్ఘాంతమైన "బాలా" ఉండి స్త్రీలింగ

ద్యోతకమైన పరిచర్యలుకూడా జరగటం ఆమె భావాలకు కల వరింతలు చేకూర్చినాయి.

సౌందర్యలహరీ రచనతో శ్రీ విద్యాసంప్రదాయ మానవౌఘంలో ఉత్తమస్థానాన్ని అలంకరించిన శంకర భగవత్పాదాచార్యులవారి సంప్రదాయంలో ప్రథమస్థానంలోఉన్న శృంగేరీ పీఠాధిపతులొక్కరే ఈనాటికీ ఈ ఆలయంలో పల్లకీ మీద - పాదచారులుకాకుండా - ప్రదక్షిణీకరించే ఆచారం ఉన్నదట. వైష్ణవ పీఠాధిపతుల కెవ్వరికీ ఈ హక్కు లేదట. అద్వైత పీఠాధిపతులు వచ్చినప్పుడు వైష్ణవ అర్చకులు ప్రక్కకువెళ్ళడం - స్వాములవారలే స్వయంగా పూజించడం జరుగుచున్నదట. ఆ స్వాములవార్లు పాంచరాత్ర ఆగమం ప్రకారంకాకుండా, శుభాగమకల్ప సూత్రముల ప్రకారము శ్రీదేవీ అర్చనమే చేస్తున్నారట. రెండువందల సంవత్సరాల క్రితము పుష్పగిరి పీఠాధిపతులు పల్లకీమీద స్వామి దర్శనానికి కొండకు వస్తున్నారట. ఈ ఏడు కొండలూ శేషాహిస్వరూపం గనుక - కాలు మోపడమే వైష్ణవాపచారంగా భావించే వైష్ణవులు, అర్చకులు, పుష్పగిరి స్వాములవారిని పల్లకీ దిగి నడచిరావలసిందిగా చెప్పారట. స్వాములవారు వృద్ధుడు. నడచి కొండ ఎక్కగలశక్తి లేనివాడు. నడచి కొండ ఎక్కడం తన పల్లకాదని - అక్కడనుంచే స్వామివారికి నమస్కరించి, తిరిగి పల్లకీలో కూర్చుండి - కొండదిగి దిగువతిరుపతికి వెళ్ళి పోయారట. కొండమీద ఆలయంలో అకస్మాత్తుగా అర్చ

మూర్తులైన ఉత్సవవిగ్రహాలు మాయమైపోయాయట. వైష్ణవ అర్చకులు జరిగిన తప్పిదం తెలుసుకుని పుష్పగిరి స్వాముల వారిని ఆశ్రయించి క్షమాపణ వేడుకొనగా ఆయన తన దేవతార్చనలోకి వేంచేసి ఉన్న ఆలయ ఉత్సవ విగ్రహాలను తిరిగి ఇచ్చారట. పీఠాధిపతులను పల్లకీలో కూర్చుండబెట్టి మంగళ వాయిద్యాలతో ఊరేగింపుచేసి స్వామి దర్శనం చేయించారట. ఈ సందర్భం కారణంగా పుష్పగిరి పీఠాధిపతులు నేటికిన్నీ "ఉద్దండ" పౌరుషనామాన్ని బిరుదుగద్యలో ధరిస్తూనే ఉన్నారట. ఈ వివరాలు అక్కడ చేరిన వృద్ధ యాత్రికుల ప్రసంగాలలో సుమతి విని - ఆమె ఆనందపడింది. "శ్రీదేవి నారాయణి - ఆమె వైష్ణవమాయలో కూడా తనకు ఇష్టమైన త్రిపురసుందరీరూపంలోనే దర్శనం అనుగ్రహించింది" అని సుమతి భావించుకుని తృప్తిపడింది. ఆ తృప్తిలో ఇంక నాలుగునాళ్ళు కొండమీదనే ఉండి శ్రీ స్వామివారిని త్రిసంధ్యలయందు నిత్యమూ దర్శించింది. మిగిలిన సమయమంతా విడిదిలో కూర్చుని మంత్రజపంచేస్తూ ఉన్నది. గుడికి బయలు దేరుతూ శ్రీ లలితా సహస్రనామం ఆవృత్తి పారాయణ ప్రారంభించి తిరిగివచ్చేదాకా చెయ్యడం. ఇట్లా నాలుగురోజులు గడచినాయి.

నాలుగవనాటి రాత్రి పవళింపుసేవలో దర్శనంచేసి వచ్చి - స్వామివారి ప్రపత్తి శ్లోకాలు చదువుకుంటూ సుమతి సుఖనిద్రపోయింది. తెల్లవారుఝామున సుఖస్వప్నంలో తాను

స్వామివారి దర్శనంచేసి వస్తూండగా - ఆలయంనుంచి ఒక వృద్ధ బ్రాహ్మణ స్త్రీ తనతోకూడా వచ్చింది. ఆమె మీ దేవూరని సుమతిని ప్రశ్నించింది. సుమతి తనది ఏవూరని చెబుతుంది? తన తండ్రి ఊరు తానెన్నడూ చూడలేదు. తన తల్లి ఊరేదో తనకు తెలియదు. ఈ ఆరేళ్లు చదువుకున్న మద్రాసే తనఊరా? తన మనస్సులోని ఊహలను గుర్తించినట్లుగా - ఆ ముసలి ముత్తైదువ "అమ్మాయీ! స్త్రీలకు భర్తగారి ఊరే తన ఊరు కదా! అదే నివాసస్థలం" అని అన్నది. ఆ మాటలు అంటూ ఆ ముసలి ముత్తైదువ తిరిగి ఆలయంలోకి వెళ్ళిపోయింది. ఆలయం లోలోపలికి వెళ్ళిపోతూ మహా జ్వాజ్వల్యమానంగా ప్రకాశిస్తూ స్వామివారి విగ్రహంలో కలసిపోయింది. సుమతికి మెలకువ అయి - లేచి కూర్చుని గాద్గదికంగా

"శ్రీమన్ కృపాజలనిధే! కృతసర్వలోక సర్వజ్ఞ!
శక్త! నతవత్సల! సర్వశేషిన్ స్వామిన్! సుశీల సుల
భాశ్రిత పారిజాత శ్రీవేంకటేశ చరణౌ శరణం ప్రపద్యే".

అని ధ్యానించి స్వామివారి ఆలయ ముఖంగా సాష్టాంగ నమస్కారం చేసింది.

మర్నాడు తిరిగి మళ్లీ స్వామిదర్శనంచేసి తీర్థప్రసాదాలు స్వీకరించి, మద్రాసు వచ్చి చేరింది. మద్రాసువచ్చి చేరిన వారము నాళ్ళలోనే - ఇల్లు మంచి ధరకు అమ్మివేసి, లారీమీద సామానులు వేసుకుని దేవపురం వెళ్ళింది. అక్కడ ప్రస్తుతానికి ఇల్లు అద్దెకు తీసుకుని కాపురం పెట్టింది. తరువాత తగిన

వసతులున్న ఇల్లుకొని ఆడూళ్లో ఉచిత ప్రసూతి వైద్యశాల స్థాపించి ప్రజాసేవ ప్రారంభించింది. ముఖ్యంగా మాతృమూర్తులైన స్త్రీజనసేవచేస్తూ కాలం గడపుతున్నది. స్వామివారు స్వప్నదర్శనం ఇచ్చి నీ భర్తగారి ఊరే నీ నివాసస్థలమని ఆదేశించినట్లుగా భావించుకొని ఆవిధంగా చేసింది. స్వామివారు స్త్రీరూపదర్శనం ఇవ్వడంవలన స్త్రీజనసేవ తన కర్తవ్యమని భావించుకున్నది.

ఆమె దైవభక్తి కారణంగా, ఆమె మనశ్శుద్ధికారణంగా, ఆమెచేతి చలువకారణంగా, ఆమె సౌశీల్యం కారణంగా-ఆమె వైద్యశాల పెద్దపేరే సంపాదించుకున్నది. ఆమెను ఎరుగున్నవారు ఆ ఊరులో ఎవ్వరూ లేక పోవడంమూలాన ఆమె బ్రాహ్మణ స్త్రీ అనీ వివాహిత అనీ ఏదో కారణంచేత భర్తకు దూరంగా ఉంటున్నదనీ మహాభక్తురాలనీ మహా గుణవంతురాలనీ మహా ఆచారవంతురాలనీ మహా దయామయి అనీ చేతి చలువకల ఆమె అనీ మహాత్మురాలనీ త్వరలోనే ఆమెకీర్తితో ఆ ఊరు నిండిపోయింది.

## 34

నారాయణరావు రివిన్యూ ఇనస్పెక్టరుగా ఉండగా ఒక సంవత్సరం పెద్ద తుపానువచ్చి నానాభీభత్సమూ చేసింది. పంటలు చాలా దెబ్బతిన్నాయి. రైతులు శిస్తుమాఫీకి అందో

ళనచేశారు. పరిస్థితులు ఆకళింపు చేసుకోవడానికి రివిన్యూ బోర్డు మెంబరు స్వయంగా తనిఖీకి వచ్చాడు. ఆయనవెంట కలెక్టరు, డిప్యూటీ కలెక్టరు, తహశీల్దారు మొదలగు శిబ్బంది ఉన్నారు.

నారాయణరావు పనిచేస్తున్న ఫిర్కాలో రోడ్డుమీద ఉన్న ఒక గ్రామానికి మెంబరు తనిఖీకి వచ్చాడు. రోడ్డుకి ప్రక్కగాఉన్న భూముల్ని చూచాడు. క్రింద అధికారులు పంటమదింపు ఎట్లాచేశారో చూద్దామని గ్రామకరణంవద్ద ఉండే అడంగులు లెక్క ఆయన కావాలని తీసుకున్నాడు. అది త్రిప్పుతూ మొదటిపేజీ తీశాడు. మొదటిపేజీ తీసినవాడట్లాగే, తదేకదీక్షతో - మొదటిపేజీనుండి పదిపేజీలుచదివి - కలెక్టరును చూచి "రివిన్యూ ఇనస్పెక్టరు ఎవరు?" అన్నాడు. ఏమి తప్పిదం జరిగిందోననీ అది తమమీదకూడా ఎంతవరకు ఆరోపింపబడుతుందోననీ - తహశీల్దారు, డిప్యూటీ కలెక్టరు తల్లడిల్లి పోయారు. ఎవరూ ఏ సమాధానం చెప్పవలసిన అవసరం లేకుండానే, నారాయణరావు ముందుకుపోయి నమస్కరించి 'నేనే రివిన్యూ ఇనస్పెక్టరుని' అని అన్నాడు. మెంబరు అతన్ని దగ్గరకుపిలచి వీపుమీద చెయ్యివేసి మంచిచెడ్డలు కుశలప్రశ్నలతో తెలుసుకున్నాడు. తర్వాత ఆ పుస్తకం కలెక్టరు చేతిలో ఉంచగా ఆయనకూడా ఆ పదిపేజీలుచూచి నారాయణరావు వంక ప్రేమగౌరవాలతో చూచాడు.

ఆ మొదటి పదిపేజీలలో ఆ ఊరునుగురించి, ఆ ఊరి నీటిపారుదల వసర్లనుగురించి, వాటి లోపాలనుగురించి, వాటి అభివృద్ధికి అనుసరింపవలసిన విధానంగురించి, అక్కడ పశు సంపదనుగురించి, వాటికిగల సదుపాయాలనుగురించి, వాటికి మామూలుగా వచ్చే జాడ్యాలనుగురించి, వాటి నివారణకు ఉన్న సదుపాయాలను గురించి, ఆ ఊరిలో పండే పంటలను గురించి - వాటి సాలుసరి దిగుబడిని గురించి, వాటి అభివృద్ధికి కావలసిన అవసర చర్యలనుగురించి, రైతుల ఆచార వ్యవహారాలనుగురించి, ఊళ్ళో చిన్న రైతులకు, వ్యవసాయపు కూలీలకు సంవత్సరం పూర్తిగా పనులు కల్పించడానికి చేయవలసిన పనులను గురించీ - ఆ ఊరిని సౌభాగ్యసదనం చెయ్యడానికి తీసుకోవలసిన ముఖ్యచర్యలనుగురించి - పది పేజీలలో - స్పష్టంగా కూలంకషంగా వ్యాఖ్యానం వ్రాయబడిఉన్నది. ఆ ఊరి భూముల సారాన్నిగురించీ, సర్వే సెటిల్మెంటు తప్పులను గురించీ పరాలు ఉన్నాయి. ఇట్టి మదింపు వ్యాఖ్యానం వ్రాయడానికి ఒక్కొక్క ఊరికీ మూడు నెలలైనా కావాలి. మిక్కిలి సామర్థ్యము, ఆకళింపు, అనుభవం, బహువిషయ పరిజ్ఞానం, నిశితపరిశీలన కావాలి. వచ్చేముప్పయి ఏళ్ళలో ఆ వూరికి ఏ ప్రభుత్వమైనా చేయవలసిన పనులన్నీ ఉన్నాయి. బోర్డు మెంబరుకి, కలెక్టరుకి తెలిసింది నారాయణరావు మహాప్రజ్ఞావంతుడని.

మెంబరు ఎందుకు మెచ్చుకుంటున్నాడో తెలిసిన తర్వాత తహశీల్దారు మనవిచేశాడు. "తనఫిర్కాలో ఉన్న ముప్పయి ఊళ్ళకు నారాయణరావు ఇటువంటి వ్యాఖ్యానాలు వ్రాశాడని". మెంబరు సంతోషపడి నారాయణరావుతో 'నీకు ఎప్పుడే వుపకారం కావలసినా భయపడక నాదగ్గరకురా' అని హామీ ఇచ్చాడు. కలెక్టరుగారు నారాయణరావుతో "ఇప్పుడు నీ కేమన్నా కావాలా ?" అన్నారు. దానికి నారాయణరావు వినయంగా తన రివిన్యూ ఇనస్పెక్టరీకాలం పూర్తిఅయిందని - తన్ను తిరిగి కలెక్టరాఫీసుకి బదిలీ చేయించమనీ కోరాడు. కలెక్టరుగారు సరే నన్నారు.

కలెక్టరు సరేనన్నమాట కాయితాలమీదకు వచ్చి నారాయణరావుకి ఉత్తర్వులు చేరడానికి నెలరోజులు పట్టింది. నారాయణరావు కలెక్టరు ఆఫీసులో జాయిను అవడానికి వెళ్ళే లోగా ఆ కలెక్టరుకు బదిలీఅయి వెళ్ళిపోయాడు. శిరస్తాదారుకి నారాయణరావుమీద అకారణ వైరం కలిగింది. తనను ఆశ్రయించకుండా కలెక్టరునే క్యాంపులో ఆశ్రయించి పని చేసుకున్నాడని. అందుచేత నారాయణరావును పనికిమాలిన రికార్డురూములో వేశాడు. అక్కడ నారాయణరావు సంవత్సరమున్నాడు. అతనికి ఆలనా పాలనా లేకుండా ఉన్నది. రికార్డురూమునుంచి అవసరమైనపుడు ఫైళ్ళు ఇవ్వడం మళ్ళీ తీసుకోవడం తప్ప వేరేపని లేదు. వ్రాతపని అసలే లేదు.

ఈ పరిస్థితులలో ప్రభుత్వంవారి నుంచి ఉత్తర్వు ఒకటి వచ్చింది. దేశంలో కమ్యూనిస్టుల విద్రోహ చర్యలు విజృంభించినాయి. ఆ పరిస్థితులలో ముఖ్యమైన రికార్డులు ఏవిధంగా భద్రపరుప వలసినదీ కొన్నిసూచనలు ఉన్నాయా ఉత్తర్వులలో. దానిమీద కలెక్టరు "మనరికార్డు రూము పరిస్థితి ఏమిటి? ప్రభుత్వము వారి సూచనలు మన రికార్డురూముకి ఎట్లా అనువర్తింపచెయ్యాలి" అని ప్రశ్న వ్రాశాడు. దానిమీద సమాధానంగా నారాయణరావు శ్రద్ధగా వివరణలతో వ్రాసి పంపాడు. నారాయణరావుకి ఆంగ్లేయ భాషమీద ఎక్కువ అధికారమే వుండటంవల్ల అతడు వ్రాసినదాంట్లో భాషా పాండిత్యమూ, లాలిత్యమూ, స్నిగ్ధత్వమూ, శబ్దాధికారమూ, ప్రస్ఫుటంగా ఉండి ఐ సి. యస్. ఉద్యోగి ఐన కలెక్టరుని మోహితుణ్ణిచేశాయి. ఆఫీసుల్లో సజీవమైన భాష కనబడక విసుగుగా ఉన్న కలెక్టరుకు ప్రాణం లేచివచ్చినంతపనిఅయింది. వెంటనే నారాయణరావును పిలిపించి "ఇంత ప్రతిభావంతుడవు పనికిమాలినచోట ఎందుకు ఉన్నావు" అని ప్రశ్నించాడు. ఆ ప్రశ్నకు సమాధానం లేక నారాయణరావు మౌనంగా వినయాన్ని ప్రదర్శించాడు.

ఆ సాయంత్రంలోగా నారాయణరావుకి ఉన్నత కక్ష్య గుమాస్తాగా ప్రమోషను లభించింది.

మరి రెండు సంవత్సరాలు గడచినాయి. నారాయణరావు మెజిస్టీరియల్ హెడ్‌గా పని చేస్తున్నాడు. అతనికి అంతశ్శుద్ధి

కలవాడనీ - నిజాయితీపరుడనీ - సమర్థుడనీ - వినయము కల వాడనీ పేరు వచ్చింది.

సుమతి తండ్రి యాహ్యా ఆలీని ఆ జిల్లాకు కలెక్టరుగా వేశారు. ఆయన ఛార్జి తీసుకున్నాడు. ఆయన రెండో భార్యతో నలుగురు పిల్లలతో వచ్చి చేరాడు. ఆయన వస్తున్నాడని తెలిసినప్పుడే - ఆయన వచ్చిన తరువాత - తనకు సంకట పరిస్థితులు కలుగవచ్చునని నారాయణరావు శంకించాడు. సుమతిని నారాయణరావు ఈమధ్య కలుసుకోలేదు. తన రెండో మేనమామ మరణించగా దేవపురం వెళ్ళివచ్చాడు. అక్కడ సుమతి ప్రసూతి వైద్యశాల నడుపుతూ ప్రఖ్యాతిని గడించినదని తెలుసుకున్నాడు. ఆమె తనకు సంబంధించిన స్త్రీ అని ఆ ఊళ్ళో ఎవరూ గ్రహించలేదని కూడా తెలిసింది. ఆమెను తాను వెళ్ళి కలుసుకుంటే - ఆ ఊళ్ళో ఆమె పూర్వగాథ చిలువలు పలువలతో ప్రచారమై ఆమె కీర్తికి చెరుపు కలుగవచ్చుననే అభిప్రాయంతో అత డామె ఇంటివైపు పోలేదు. ఇప్పుడామెకూ తండ్రికీ మధ్య సంబంధం ఎట్లా ఉన్నదో? ఆమె తండ్రిని చూడవచ్చి తన్ను కలుసుకుంటే తన పరిస్థితి ఏమి కావాలి?

నారాయణరావు తన ఉద్యోగధర్మంలో ప్రతిరోజూ యాహ్యా ఆలీ వద్దకు వెళ్ళివస్తూనేఉన్నాడు. ఐతే అతడు తన్ను గుర్తుపట్టినాడో లేదో నారాయణరావుకి ఆకళింపు కాలేదు. గోడలమీద వ్రాతలనాడు ఒక్కసారిమాత్రమే తన్ను

చూచాడాయన. యాహ్యా ఆలీకి తన పేరు తెలుసునో తెలియదో? సాధారణంగా అధికార్లకు క్రింద ఉద్యోగులపేర్ల మీద నిఘా ఉండదు. వాళ్ళ వాళ్ళ బ్రాంచీల పేర్లతోనే వ్యవహారం జరుగుతుంది. ఒకటి రెండుసార్లు తన్ను పరిశీలనగా చూచినప్పుడు గుర్తించాడేమోనని అనుమానం కలిగింది.

ఒకనాడు ఒక సంఘటన జరిగింది. ఒక శాసనసభ్యునికి ఒక ఊళ్ళో ఒక సినిమాహాలు ఉన్నది. అదేఊళ్ళో - మరొకరు ఇంకో సినిమాహాలు కట్టించారు. ఆ రెండో హాలుకి లైసెన్సు ఇవ్వవద్దని శాసనసభ్యుడు కలెక్టరుగారితో చెప్పాడు. కలెక్టరు నారాయణరావును పిలిచి ఆ రెండవహాలుకి లైసెన్సు గైరు మంజూరుచేస్తూ ఉత్తర్వులు వ్రాసిపెట్టమన్నాడు. నారాయణ రావు వచ్చి కాయితాలు తిరగవేశాడు. ఆరోగ్యశాఖవారు- విద్యుచ్ఛాఖవారు, పంచాయతీవారు, తహశీల్దారు - మొదలైనవారంతా రెండోహాలుకి లైసెన్సు ఇవ్వమని అనుకూలంగా సిఫారసులుచేశారు. ఆ పరిస్థితులలో ఇక్కడ గైరు మంజూరుచేయడం సాధ్యంకాదు. ఈ విషయాలే కాయితం పై వ్రాసి కలెక్టరుకి పంపాడు.

కాయితాలు చూడగానే కలెక్టరు మండిపడ్డాడు. వెంటనే నారాయణరావును పిలిపించి నానా దుబారామాటలు అన్నాడు. తన మాట ధిక్కరించాడనీ శాసనసభ్యుని గౌరవం నిలబెట్టలేదనీ దూషించాడు. అసంగతమైన దూషణాలకు నారాయణరావు కంపించాడు. చాలా కష్టంమీద ఆవేశాన్ని

ఆపుకొని "అయ్యా! మనమిద్దరం ప్రభుత్వోద్యోగులమే. మన దేశంలో ధర్మము పాలింపబడునట్లు చూడవలసిన బాధ్యత మీకువలెనే నాకూడున్నది. మీ మాటమీదకంటె ప్రభుత్వ శాసనంమీద, సహజమైన న్యాయధర్మాలమీద నాకు గౌరవం ఎక్కువగా ఉండాలి. అవి ఉల్లంఘింపరానివి. శాసనము శాసన సభ్యునికి వ్యతిరేకంగా ఉంటే నే నేమిచెయ్యను? శాసన సభ్యుడు క్రింద ఆఫీసుల్లో అనుకూలంగా వ్రాయించుకోవల సింది. ఇక్కడకువచ్చి బాధపెట్టితే ప్రయోజనమేముంటుంది? కారణరహితంగా మీరు నన్ను తూలనాడుతున్నారు. మీకు నాపని తృప్తిగా లేకపోతే సంజాయిషీ కోరవచ్చును. నేను ఇవ్వవచ్చును. అంతేగాని నోరు పారవేసుకుని తూలనాడటం మీకుగల హక్కులకు బయట ఉన్నది" అని చెప్పి నారాయణ రావు ఇవతలకు వచ్చాడు. పది నిమిషాలలో నారాయణ రావును సస్పెండు చెయ్యడం, ఛార్జీ అప్పగింత చేసుకోవడం జరిగిపోయాయి. నారాయణరావు శాంతంగా ఇల్లు చేరు కున్నాడు.

ఆమర్నాడు సాయంకాలానికి నారాయణరావుకి కలెక్టరాఫీసునుంచి మరో వుత్తర్వువచ్చింది. సస్పెన్షను ఉత్తరువులు రద్దుచేసి అతన్ని మద్రాసులో రివిన్యూబోర్డులోకి ప్రమోషను మీద బదిలీ చేశారని ఉన్నదాఉత్తర్వులో. నారాయణ రావు ఆశ్చర్యానికి మితిలేదు. నారాయణరావు విచారించగా ఆదినము బోర్డుమెంబరువచ్చి ఉన్నారనీ ఆయన పూర్వం నారా

యణరావును మెచ్చుకున్న మెంబరేననీ తెలిసింది. ఆయన్ను చూడటానికివెళ్ళి కలెక్టరు తానారోజున ఒక అవినయుడైన గుమాస్తాను శిక్షించినట్లు ప్రగల్భాలు కొట్టగా - మెంబరు వివరాలు అడిగి కలెక్టరును మందలించి, నారాయణరావును ప్రమోషనుమీద బదిలీచేయించాడని తెలిసింది.

వారంరోజుల్లో నారాయణరావు మద్రాసువెళ్ళి రివిన్యూబోర్డులో చార్జి తీసుకొన్నాడు. తన కుపకారం చేసిన మెంబరుగారి యింటికివెళ్ళి కృతజ్ఞతలు చెప్పుకున్నాడు.

కొంతకాలం మామూలుగానే జరిగిపోయింది. అక్కడ కూడా నారాయణరావుకు సమర్థుడనే పేరు వచ్చింది. బోర్డులో పనిచేస్తున్న గుమాస్తాలు బోర్డులో అనుభవంలేని నారాయణరావును సూపర్నెంటుగా వెయ్యడం తమ హక్కులకు భంగకరమని అప్పీళ్ళుచేశారు. అన్నిటికీ వ్యతిరేకంగా మెంబరు వ్రాశాడుట. ఈ వివరాలు కర్ణాకర్ణిగా నారాయణరావుకి తెలిశాయి. తరువాత పదిరోజులకి మెంబరు కబురుచెయ్యగా నారాయణరావు ఆయన ఇంటికివెళ్ళి చూచాడు. ఆయన ఆదరంగా నారాయణరావును లోపలకు తీసుకువెళ్ళి కూర్చోపెట్టి కుశలప్రశ్నాదికంచేసి ఇట్లా అన్నాడు. 'సినిమాహాలు విషయంలో నీవల్ల వ్యతిరేకం చెయ్యబడిన శాసనసభ్యుడు ఇక్కడ మంత్రిగారికి కావలసినవాడు. ఆతడు నీపైనేగాక నిన్ను ప్రమోషనుమీద ఇక్కడకు రప్పించానని నామీదకూడా అనేక చాడీలు మంత్రిగారికి చెప్పాడు. నిన్న మంత్రిగారు

నన్నుపిల్చి చాల అసందర్భంగా మాట్లాడాడు. ఆయనకు నీ ప్రమోషను విషయంలో మాట్లాడే హక్కు లేదని నేను చెప్పాను. చాలా వాగ్వాదం జరిగింది. ఆయన అన్నమాటలు నాకు గౌరవభంగంగా ఉన్నాయి. ఆ మాటలు ఆయన ఉప సంహరించుకోవాలనీ - లేకపోతే నేను రాజీనామా ఇస్తున్నా. ననీ - నేను ఆయనతోనూ - ప్రధానకార్యదర్శితోనూ చెప్పి వచ్చాను. ప్రధాన కార్యదర్శి కల్పించుకుని ఆయనచేత "నేను విచారిస్తున్నాను" అని అనిపించాడు. నాకు దీర్ఘకాలం శెలవు మంజూరుచేశారు. నేను ఈదినమే ఛార్జి ఇస్తున్నాను. ఆ శాసనసభ్యుని పట్టుదలమీద నిన్ను తిరిగి కలెక్టరాఫీసుకి పంపించ వచ్చును. మనిషి ప్రయోజకుడనిపించుకోవడానికి ప్రభుత్వో ద్యోగమే అవసరంలేదు". ఈ మాటలు విని నారాయణరావు చాలా బాధపడ్డాడు. తనవల్ల ఆయనకు బాధ కలిగినందుకు మన్నించమని చెప్పి తనయందు గల అభిమానానికి కృతజ్ఞతలు తెలిపి వెంటనే అక్కడనే కాయితం తీసుకుని రాజీనామా వ్రాసి మెంబరుగారిచేతిలో ఉంచాడు. ఆయన రాజీనామా పత్రం చదివి "నీవు పౌరుషవంతులు చేయవలసిన పని చేశావు. అభివృద్ధిలోకి వస్తావు" అని చెప్పి నారాయణరావు రాజీనా మాను అంగీకరించాడు.

ఆ సాయంకాలము నారాయణరావు ఇంట్లో విచా రంగా కూర్చుని ఉండగా మామూలు పిచ్చాపాటీకి వచ్చిన ఇంటి యజమాని నారాయణరావుయొక్క దైన్యస్థితికి చకి

తుడై కారణం అడిగాడు. నారాయణరావు వివరాలు చెప్పాడు. ఆయన విచారపడి "అయ్యా! మాదసలు పొన్నేరి. అక్కడ నాకు పెద్ద వ్యాపారం వున్నది. చాలా బస్సులు ఉన్నాయి. పిల్లల చదువుకోస మీ ఊరు చేరి ఇక్కడ ఇల్లు కొన్నాను. మిమ్మల్ని చూచినప్పటినుంచి నాకు మీయందు భక్తి భావం కలిగినది. అమ్మగారిద్వారా మా ఆడంగులు తమ తలిదండ్రుల పుణ్యగాథలు విని నాకు చెప్పగా నేను చాలా ఆనందపడ్డాను - పుణ్యపురుషులు మా ఇంట్లో ఉన్నారని. మిమ్మల్ని నేను వదలను. మీరు పొన్నేరిలో ఉండి నా వ్యాపారమంతా ఆజమాయిషీ చెయ్యండి. డిప్యూటీ కలెక్టరు జీతం తీసుకోండి" అని ప్రాథేయపడ్డాడు. నారాయణరావుకు వేరే గత్యంతరమే లేక - పైగా అది భగవదిచ్ఛగా తోచి - మర్నాడే సకుటుంబంగా పొన్నేరి వెళ్ళి కొత్త ఉద్యోగంలో చేరాడు.

# 35

నారాయణరావు తమ్ముల చదువులు పూర్తి అయి ఎవరి ఉద్యోగాలు వాళ్ళు చేసుకుంటున్నారు. వాళ్ళకు పెళ్ళిళ్లు కూడా అయినాయి. నారాయణరావు చెల్లెలి పెళ్ళికూడా అయినది. అన్ని బాధ్యతలు తీరినవి. కొంతభారము తీరినట్లుగా అనుకున్నాడతను. తన చెల్లెలుకు మొదటిపురుడు పోసి, అత్త

వారింటివద్ద దింపి, తిరిగి తాను షాన్నేరి వెళ్లుటకుగాను నారాయణరావు విజయవాడలో రైల్వేప్లాటుఫారంమీద మెయిలు కోసం ఎదురుచూస్తూ ఉన్నాడు. మెయిలులో ప్రయాణంచేసి సూళ్ళూరుపేటలో దిగి అక్కడనుంచి మొదటిబస్సు ఎక్కితే షాన్నేరికి ఎనిమిది గంటలలోపుగా వెళ్ళవచ్చును.

ఇంకా గంటకుగాని మెయిలురాదని తెలుసుకుని నారాయణరావు ప్లాటుఫారంమీద పచార్లుచేస్తూ, ఏమీతోచక హిగిన్ బాదమ్స్ పుస్తకశాలవద్దకు నడిచాడు. దానికిప్రక్కనే ఆడవాళ్ల వెయిటింగురూము ఉన్నది. అందులోనుంచి ఏదో సుపరిచితమైన కంఠధ్వని "స్వామీ" అని పిల్చినట్లయి ఠక్కున నిల్చిపోయి తిరిగిచూశాడు. తన్ను సమీపిస్తున్నది సుమతి. కొన్ని సంవత్సరాలుగా ఇద్దరూ కలుసుకోలేదు.

కుశలప్రశ్నాదికాలు అయి ఒకరి సంగతులు ఒకరు తెలుసుకున్నారు. మెడికలు కాలేజీలో ఏదో వైద్యసభకు సుమతి మద్రాసు వెళ్లుతున్నదని నారాయణరావుకీ, అతడు సూళ్ళూరుపేటవరకూ ఆ మెయిలులోనే ప్రయాణం చెయ్యబోతున్నాడని ఆమెకు తెలిసింది. సుమతి నారాయణరావు టిక్కట్టు అడిగి తీసుకున్నది. దాన్ని పైక్లాసుకి మారుస్తుందని అతనికి తెలుసును. అతను రెండవ తరగతి టిక్కెట్టు తీసుకుని ఉన్నాడు. అతననుకున్నట్లుగానే అతనికికూడా మొదటి తరగతి టిక్కెట్టు తీసుకువచ్చింది. "ఎందుకీ మార్పు?" అని అతడు చిరునవ్వు నవ్వాడు. "ఇన్నాళ్లకు కన్పించారు. ఈ

ప్రయాణంలోనైనా నన్ను మీతో కలసి కూర్చోనివ్వ కూడదా ?" అని ఆమె నవ్వుతూనే అన్నది. ఏమి చెప్పినా ఆమె నొచ్చుకుంటుందని నారాయణరావిక ఆ విషయాన్ని ప్రస్తావించలేదు. ఏదో మామూలు లోకాభిరామాయణం నడిచింది. ఇంతలో మెయిలువచ్చి ప్లాటుఫారంమీద నిల్చింది. టిక్కెట్టు కలెక్టరు సహాయంతో సుమతి, నారాయణరావులు ఖాళీగా ఉన్న కంపార్టుమెంటుకోసం వెదికారు. రెండుసీట్లు ఉన్న కూపే ఒకటి ఖాళీగా ఉండటం తటస్థించింది. దానిలో ఎక్కమని టిక్కెట్టు కలెక్టరు చూపించాడు. సాధారణంగా సన్నిహితులైన స్త్రీపురుషులకుగాని అటువంటి 'కూపే' ఇవ్వరు. ఆమెతోకలసి అందులో ఎక్కనని చెప్పుట నాగరికము కాదని నారాయణరావు మాట్లాడకుండా ఎక్కికూర్చున్నాడు. ఆమె కూడా ఎక్కి సామాను సర్దుకున్నది.

బండి కదలకముందే ఆమె కొన్ని ఫలాలు అల్పాహారాలు తెచ్చింది. నారాయణరావునుకూడా ఆరగించమన్నది. నారాయణరావు రెండుపళ్ళు తీసుకున్నాడు. బండి కదలిన తర్వాత పైబెర్తులో నారాయణరావు తన ప్రక్కపరచుకున్నాడు. "ఏమండీ! అప్పుడే పడుకుంటారా! కొంచెంసేపు మాట్లాడకూడదా ?" అన్నది. "అబ్బే! అప్పుడే పడుకునేందుకు కాదు. కొంతసేపైన తర్వాతనైనా పడుకోవాలిగా!" అన్నాడు. "అయితే కూర్చోండి" అని ఆమె అనగా నారాయణరావు మళ్లీ కూర్చున్నాడు.

ఆమె "కొంచెం ఉండండి" అని పద్మాసనం వేసికొని కన్నులు మూసుకుని బిగ్గరగానే త్రైలోక్యమోహన కవచం చదివింది. ఆమె చదువుతూ ఉండగా నారాయణరావుకూడా కన్నులు మూసుకుని ధ్యానించి ఆ తర్వాత నెమ్మదిగా శాంతి పాఠం అన్నాడు. ఆ నిమీలిత దృక్కులూ తాను కవచాన్ని ప్రారంభించగానే అతడు పొందిన భక్త్యావేశమూ - శాంతి పాఠం చెప్పిన పద్ధతి ఆమెకు వెంటనే బోధపడింపె నారాయణ రావు శ్రీవిద్యా పూర్ణదీక్షాభిషిక్తుడని.

ఆమె అతనికి దగ్గరగా జరిగి "బృహదారణ్యకంలో లోకాతిశాయిగా జ్ఞానభిక్ష పంచిపెట్టిన మహర్షి మీద మీకు గౌరవం ఉన్నదా ?" అన్నది. "బ్రహ్మవిద్వరీయుడైన యాజ్ఞ వల్క్య మహర్షిని గౌరవించనివాళ్లు ఉంటారా ?" అని అత డన్నాడు. "ఐతే ఆ మహర్షికి ఎంతమంది భార్యలండీ ?" అన్నది. సుమతి ఈ మాటలు ఎందుకు అన్నదీ నారాయణరా వుకి అవగాహన అయింది. యాజ్ఞవల్క్య ఋషికి ఇద్దరు భార్యలు. ఆయన జీవన్ముక్తుడు. సాధనకుగాని బ్రాహ్మణత్వానికి గాని ఇద్దరు భార్యలను స్వీకరించడంవల్ల అడ్డేమీ లేదని చెప్ప డానికి ఆమె ఈ ప్రస్తావన చేసినట్లు విద్యమానం అయింది. అతడు సమాధానంగా "ఇద్దరు భార్యలను స్వీకరించే అధికా రము, యోగ్యత, యాజ్ఞవల్క్య మహర్షివంటివారికి ఉన్నవి గాని అల్పిష్ఠులకు ఉండవు" అని అన్నాడు. ఆమె మందస్మి తంగా "గట్టివారే !" అని అన్నది. అతడుకూడా నవ్వినాడు.

అతన్ని తిరిగి సంభాషణలోకి దింపాలని ప్రయత్నిస్తూ ఆమె సంభాషణ మళ్ళీ ప్రారంభించింది. "నాయందు అభిమానము ఉంచి మీరు నన్ను అనుగ్రహించాలి. నేను దురదృష్టమో అదృష్టమో ఒకవిధమైన సాధనాక్రమంలో పడ్డాను. పతినే పరదైవంగా ఆరాధించే పతివ్రతలు, ఆ పతితో సర్వేచ్ఛలూ తీర్చుకుంటూ ఎంత ఆనందం అనుభవిస్తున్నారో నాకు తెలుస్తున్నది. నేను పతిని దైవంగా ఆరాధిస్తుంటాని. నాపతితో నాకు సంయోగాది శారీరక సంబంధాలు లేవాయెను. పైగా నేను అనుష్ఠిస్తున్నది లోపాముద్రాదేవిచే ద్రష్టమైన హాదివిద్య. ఆమె శ్రీదేవినే అగస్త్యరూపంగా ఉపాసించింది. నేనుకూడా శ్రీదేవినే మీ స్వరూపంగా ఆరాధిస్తున్నాను. అమ్మవారి అనుగ్రహంచేత లోపాముద్రాదేవికి అగస్త్యులవారితో వివాహం జరిగి ఆయనతో శాశ్వతమైన దాంపత్యసౌఖ్యం లభించింది. కాని నా జీవితం వక్రమార్గంలో నడుస్తున్నట్లుగా ఉన్నది. మీతో నాకు వివాహంగాని దాంపత్య సౌఖ్యంగాని లభించే సావకాశం కన్పించడంలేదు. మరి నా మంత్రోపాసన వృథా కావలసినదేనా? నేను పురశ్చరణచేస్తున్న మంత్రసిద్ధికీ, నా పాతివ్రత్యసిద్ధికీ నాకు భర్తృసౌఖ్యం లభించితీరాలి. మరి మీరు ప్రవరాఖ్యుడికంటే ఎక్కువ బెట్టుగా ఉన్నారు!" ఈ మాటలు మెత్తగా, అతి నాజూకుగా, శృంగారంగా - అతి స్నిగ్ధంగా ఆమె అన్నది.

నారాయణరావుకి ఆమె మనస్సు అవగాహన అయింది. ఆమె ఏమి తొందర పడుతుందోనని అప్రమత్తంగా కూర్చుని చిరునవ్వు నవ్వుతూ "ఇంతకూ నేను చెయ్యవలసిన అనుగ్రహము ఏమున్నదిలే!". అన్నాడు. ఆమె ప్రత్యుత్తరంగా "మిమ్మల్ని మీ ధర్మాన్ని నిర్వహించమంటున్నాను. నేను ఆశ్రయించిన మంత్రరాజము ఫలసిద్ధిని ఇవ్వకపోతే - లోకంలో మంత్రశాస్త్రం మీదనే గౌరవం తగ్గుతుంది. అదిగాక మంత్ర విద్యను వ్యవస్థీకరింపవలసిన బాధ్యత మీకు ఉండనే ఉన్నది కూడాను. మంత్రము సిద్ధిపొందక "ధృతనానావ్రత సంచయంబులు యదుద్దిష్టంబులా యెల్ల దేవతలుఙ దూలిన ఖండశః కృత మహత్త్వంబైన ఫాలస్థపాణితలుల్" మీతో మొరపెట్టుకుంటున్నారు. ఇన్ని సంవత్సరాలుగా మీకోసం తపస్సు చేస్తున్న నన్ను ద్వితీయభార్యగా - లక్ష్మీదేవమ్మ అక్కగారి సమ్మతితోనే స్వీకరించండి. కనీసం చరణదాసిగానైనా సన్నిధిలో ఉండటానికి అనుగ్రహించండి. యయాతిమహారాజుకు శర్మిష్ఠాదేవిమీద ఉన్న కనికరంకూడా మీకు లేదాయేను. కనీసం ఒక్కసారైనా నాకు మీ ఆలింగనం ప్రసాదించండి. అందులో అధర్మమేమీ లేదు. నేను పరకీయనుకాదు. నేను త్రికరణశుద్ధిగా మిమ్మల్ని ఆరాధించడంమూలాన మీ సన్నిధిలో నా ఉద్వేగము పట్టశక్యంకాకుండా ఉన్నది. నన్ను రక్షించండి!" అని ఆమె నారాయణరావు పాదాలమీద వ్రాలిపోయింది. నారాయణరావు ఆమెను లేవనెత్తి కూర్చోబెట్టి "సుమతీ! ఊరకే

తొందర పడతావెందుకు! నేనుకూడా సాధకుడనే. నాకు లక్ష్మీ దేవమ్మ శరీరం మినహా సృష్టిఅంతా శ్రీ మాతృదేవీ స్వరూపమే. అందుకనే "స్త్రీణాం పాద తలం దృష్ట్వా గురువద్భావయేత్సదా" అని కుబ్జికా తంత్రంలో సముచితంగా అన్నారు. నేను నిన్ను భార్యగా స్వీకరించడం ఎట్లా? ఈ మాత్రం సన్నిహితత్వం, ప్రసన్నత ఇవే నీకు తపస్సిద్ధి కలిగినట్లు చెబుతున్నాయేమో!" అని సముదాయించాడు. అతడెన్ని చెప్పినా ఆమెకు తృప్తికలుగలేదు. ఇట్లాగే వాదప్రతివాదాలతో, ఉత్తరప్రత్యుత్తరాలతో ఆ రాత్రి మద్రాసు మెయిలుబండి సూళ్ళూరుపేట చేరగా నారాయణరావు దిగిపోయాడు.

# 36

కాలం మామూలుగా గడుస్తున్నది. నారాయణరావు యజమాని చాలా గౌరవంగా చూస్తున్నాడు. నారాయణరావుకి ఏలోపమూ రానివ్వడంలేదు. ఒకరోజున అకస్మాత్తుగా దేవపురంనుంచి నారాయణరావుకి తంతి వచ్చింది. విప్పి చూడగా అందులో ఉన్న సంగతులివి. వెంకటకృష్ణయ్యచౌదరిగారి భార్యకు చాలా ఎక్కువ ప్రమాదమైన జబ్బుగా ఉన్నదని, ఆమె నారాయణరావును చూడాలనికోర్కె ప్రకటించినదనీ, అందుచేత తప్పకరావలసినదనీ. తంతి ఇచ్చినది వెంకటకృష్ణయ్య చౌదరిగారి కుమార్తెవలె ఉన్నది.

నారాయణరావు దేవపురం కాపురం వదలి తర్వాత దేవపురం ఎప్పుడు వెళ్ళినా వెంకటకృష్ణయ్యచౌదరి గారిని చూడటమే పడలేదు. తన తండ్రిగారి సాంవత్సరికాలకు చౌదరిగారు యాత్రలలో ఉన్నారు. తరువాత కొన్నాళ్ళకే చౌదరిగారు మరణించారు. ఆయన మరణించినప్పుడు నారాయణరావుకి వర్తమానంకూడా లేదు. ఆ తరువాత తన బంధువులద్వారా చౌదరిగారి మరణవార్త విన్న నారాయణరావు చౌదరిగారి భార్య రుక్మిణమ్మగారిపేర పరామర్శ ఉత్తరం వ్రాశాడు. దానికి సమాధానమూ లేదు. ఇన్నాళ్ళ కిప్పుడే తంతి. నారాయణరావు ఏమి చెయ్యాలని ఆలోచించాడు.

వెంకటకృష్ణయ్యచౌదరిగారు ఆయనభార్య రుక్మిణమ్మ గారు ఉత్తములు. వాళ్ళిద్దరకూ తన కుటుంబముపైన ప్రేమ గౌరవాభిమానాలు ఉన్నాయి. వారికి తాను కృతజ్ఞతా ఋణ గ్రస్తుడై ఉన్నాడు. ఆ కృతజ్ఞతా భావాన్ని వ్యక్తంచేసుకోవ డానికైనా తాను వెళ్ళిరావడం మంచిదని నారాయణరావు అభిప్రాయపడ్డాడు.

మర్నాడు బయలుదేరి రాత్రి తొమ్మిది గంటలకు దేవపురం చేరుకున్నాడు. తన చిన్న మేనమామగారి కుమారు డేదో చిన్న ఉద్యోగంచేస్తూ కుటుంబభారం వహిస్తూ బాధలు పడుతుండగా నారాయణరావు తమ ఇంట్లో ఉండమని ఇల్లు ఇచ్చాడు. నారాయణరావు వాళ్ల యింటికి వెళ్ళాడు. అతడు దేవపురం వెళ్ళి కొన్ని సంవత్సరాలైంది. ఇంటిముందు బండి

దిగగానే అతనికి ఆశ్చర్యం వేసింది. ఎదురుగా తమ పాత ఇల్లు లేదు. అక్కడ చిన్న దేవాలయ మొకటి వెలసినది. ఇంతల్లో మేనమామ కుమారుడు బయటకువచ్చి నారాయణరావును లోపలకు తీసుకువెళ్ళాడు.

రాత్రి భోజనాలు ముగించుకుని విశ్రాంతి తీసుకుంటున్నప్పుడు లోకాభిరామాయణంలో మేనమామ కుమారుడు నారాయణరావుతో ఆ దేవాలయ వృత్తాంతము చెప్పాడు.

"ఈ ఊరిలో కొన్ని సంవత్సరాలక్రితం ఎక్కడనుంచో వచ్చి ఒక బ్రాహ్మణ లేడీడాక్టరు ఉచితప్రసూతి వైద్యశాల నడుపుతున్నది. ఆమె పేరు సుమతి. ఆమె మహాయోగిని అని చెప్పుకుంటారు. ఆమె చేతితో తాకితేనే జాడ్యాలు నయమౌతాయట. ఆమెకు ఉన్నంత కీర్తి, గౌరవమూ, ఈ ఊళ్ళోవున్న అందరు వైద్యులను కలిపినా లేదు ఈమధ్య మీ పాత ఇల్లు అమ్మకానికిరాగా ఆమె కొన్నది. అక్కడ ఆమె దేవాలయం కట్టించింది. అది శ్రీ త్రిపురసుందరీదేవివారి ఆలయం. కాని లోపల విగ్రహం తిరుపతి శ్రీ వేంకటేశ్వరస్వామివారిలాగా ఉన్నదని కొందరంటారు. ఊరంతా అదొక చిత్రంగా చెప్పుకుంటారు. ఆ విగ్రహం పురుషుడు స్త్రీవేషం వేసుకున్నట్లుగా ఉంటుందని కొందరూ - స్త్రీ పురుషవేషం వేసుకున్నట్లుగా ఉంటుందని కొందరూ అంటూ ఉంటారు. ఇంతకూ ఆలయం మాత్రం ఉత్తమంగా ఉంటుంది. కొద్ది రోజులలోనే విపరీతమైన జనాకర్షణ కలిగింది. ఇంకో విశేషమేమంటే గర్భాలయం

వరకూ అన్ని మతాలవారికీ అన్ని కులాలవారికీ ప్రవేశం ఉన్నది.

ఆ డాక్టరమ్మ ప్రతిరోజూ సూర్యోదయానికిముందే ఈ ఆలయానికి వచ్చి దర్శనం చేసుకుని వెళ్ళి, వైద్యం ప్రారంభిస్తుందట. ఆమె తేజస్సూ, ఆచారాలు, భక్తీ - ఈ ఊళ్ళో అందరినీ మెప్పించాయి. ఆడరోగులు ఇంకో వైద్యురాలివద్దకు పోవడమే లేదు."

నారాయణరావుకు లోపల సంతోషము కలిగినా బయటకు ఏమీ అనలేదు. సుమతియొక్క పూర్వగాథ ఊళ్ళో ప్రచారం కానందుకుకూడా అతనికి సంతోషమే అయింది.

మర్నాడు ఉదయమే లేచి ప్రాతరనుష్ఠానం ముగించుకొని వెంకటకృష్ణయ్యచౌదరిగారి ఇంటికి వెళ్ళాడు. నారాయణరావు వెళ్ళేటప్పటికి చౌదరిగారి అల్లుడు చంద్రగారు ఇంటిలో లేరు. ఇల్లు చాలా మారిపోయింది. వాకిట్లో ముందు ఇదివరకు గోశాల ఉండేది. ఇప్పుడక్కడ మోటారుషెడ్డు ఉన్నది. ఇంటి ముందుభాగము అంతా తీసివేయబడి రెండు అంతస్తుల మేడగా పునర్నిర్మాణము జరిగింది. వాకిట్లో చాలా మంది ఉన్నారు. చాలా హడావిడిగా ఉన్నారు. నారాయణరావును తెలిసినవారెవ్వరూ లేరా గుంపులో. కొంతసేపు నారాయణరావు తారట్లాడినా ఇతని సంగతి ఎవ్వరూ పట్టించుకో లేదు. నారాయణరావే అక్కడ ప్రముఖుడుగా పెత్తనము చెలాయిస్తున్న పెద్దమనిషి దగ్గరకు వెళ్ళి "అయ్యా!

శ్రీ వెంకటకృష్ణయ్యచౌదరిగారి భార్యకు జబ్బుగా నున్నదట. ఆమెను నేను చూడవలసి ఉన్నది!" అని అన్నాడు. ఆ ప్రముఖుడు నారాయణరావువంక పరకాయించిచూచి "మీరు నారాయణరావుగారా!" అన్నాడు. నారాయణరావు ఔనని శిరఃకంపనం చేశాడు. ఆ ప్రముఖుడు నారాయణరావును సాదరంగా లోపలకు తీసుకువెళ్ళి - ఎయిర్ కండిషన్డు గదిలో కూర్చోబెట్టి చంద్రగారికి టెలిఫోనులో నారాయణరావుగారు వచ్చారని చెప్పాడు.

పది నిమిషాలలో చంద్రగారు ఫలాహారాలు పట్టించుకుని వచ్చి - వచ్చీరావడంతో "నమస్కారమండీ పంతులుగారూ! తమ రిప్పుడు పాన్నేరిలో ఉంటున్నారట!" అని నారాయణరావు సమాధానం చెప్పకముందే "ఫలహారం తీసుకోండి!" అని చెప్పి కూర్చున్నాడు. నారాయణరావు "చిత్తం!" అని "నన్ను మన్నించాలి. నేను భోజనానికిముందు అల్పాహారాలు తీసుకోను" అన్నాడు. ఆయన 'సరేలెండి" అని నారాయణరావును లోపల గదిలోకి తీసుకువెళ్ళి సోఫామీద కూర్చోబెట్టాడు. తాను ప్రక్కగా కూర్చుని నౌకరును పిల్చి, ఏదో చెప్పాడు.

కొంతసేపటికి చంద్రగారి భార్య - వెంకటకృష్ణయ్య చౌదరిగారి కుమార్తె వచ్చి, నమస్కరిస్తూ "జ్ఞాపకం ఉన్నదాండి!" అన్నది. నారాయణరావు ప్రతినమస్కారం చేస్తూ 'చిత్తం' అన్నాడు. ఆమె తనభర్త చంద్రగారివంక చూచి

మందస్మితంచేసి లోపలకు వెళ్ళింది. అంతలోనే మళ్ళీ తన తల్లిగారిని వెంటబెట్టుకుని చక్కావచ్చింది. ముసలితనం మూలాన కొంతవఅకూ - కొంత చూపు తగ్గుదల, పండిన జుట్టుగాక - ఇతరత్రా - ఏ అనారోగ్యము ఉన్నట్లు కన్పించ లేదు. ఆమెవచ్చి ఎదురుగా సోఫాలో కూర్చోగా నారాయణ రావు "నమస్కారం పిన్నిగారూ!" అని అన్నాడు. ఆమె "నమస్కారం నాయనా" అని కొంతసేపాగి - నారాయణరావు వంక దృష్టిని కేంద్రీకరించి అన్నది : "మిమ్మల్ని చూచి ఎంత కాలమైంది! వారు పోయినప్పుడు మీరు తప్పక వస్తారనుకు న్నాను. మీమీద వారికి అధిక అభిమానం కదా! ఆయన మీసంగతి తలచుకోని రోజు ఉండేదికాదు. మిమ్మల్ని చూస్తుంటే పాతరోజులు జ్ఞాపకం వస్తున్నాయి. అంతా బాగు న్నారా!" అని అడిగింది. నారాయణరావు "అంతా బాగానే ఉన్నాము" అని సమాధానం చెప్పాడు.

ఆమె గొంతు సవరించుకొని "చూడు నాయనా! మీ బావగారు ఇక్కడ మంత్రిగా అవడానికి పోటీచేస్తున్నారు. మన పెద్దమాలపల్లె - భైరవమూర్తిపురంలో వాళ్ళు - మనకు వ్యతిరేకంగా ఉన్నారు. నీవు వాళ్లకు కొంచెం చెప్పు నాయనా!" అని అన్నది. నారాయణరావుకి అప్పుడు అంతా అర్థం అయింది. చంద్రగారి పన్నాగము తెలిసింది. అప్పుడు తాను ఏమిచెప్పినా బాగుండదు. తన కుటుంబానికి వెంకటకృ ష్ణయ్యచౌదరిగారు అండగా ఉండేవారు. ఈమె ఆయనకు

భార్య. తనకు తల్లివంటిదే. ఆమె ఎట్టి కారణముచేత చెప్పినా, తా నామెమాట శిరసావహించవలసినదే. ఇట్లా ఆలోచించి నారాయణరావు "సరే" అని అన్నాడు. ఆమె మరికొంతసేపు కూర్చుని తరువాత లేచి, కుమార్తె సహాయంతో లోపలకు వెళ్ళిపోయింది. నారాయణరావు చంద్రగారు బయటకు వచ్చారు. నారాయణరావుతో చంద్రగారు "భైరవమూర్తి పురానికి ఎప్పుడు వెళ్ళుదాము?" అని అన్నాడు. ఆ మాటకు నారాయణరావు "మీ ఇష్టము" అన్నాడు. "ఐతే రాత్రికి వెళదాము. హరిజనులు అంతా ఇళ్లలో ఉంటారు. మీ రెక్కడ దిగారు? రాత్రి ఏడుగంటలకు ఇక్కడకు రండి" అని ఒక్క బిగిని చంద్రగారు మాట్లాడగా నారాయణరావు 'చిత్తం' అని బయటపడ్డాడు. నారాయణరావు తిరిగి మేనమామ కుమారుని ఇల్లు చేరుకుని భోజనంచేసి అతనితో పిచ్చాపాటి మాట్లాడేటప్పుడు అతడు చెప్పాడు.

"మనకు స్వాతంత్ర్యం వచ్చిన సమయంలో ఐ. సి. యస్. ఉద్యోగులలో భారతీయులుకూడా కొంతమంది ఉద్యోగ విరమణం చేశారు. వారికి భారతీయులచేత నడుప బడుతున్న ప్రభుత్వంలో కొలువుచెయ్యడం ఇష్టం లేకపో యింది కా మోసు. అట్టివారిలో చంద్రగారొకరు. అసలు రహస్య మేమిటంటే - యుద్ధకాలంలో చంద్రగారు విరివిగా రెండు చేతులతోనే కాదు- నాలుగు చేతులతో సంపాదించా రట. నాలుగు చేతులంటే భార్యగారి చేతులు కలిపి. ఆయన

మీద అనేకమైన ఫుకార్లు ఆకాశరామన్న ఉత్తరాలు విజృం భించినాయట. ఇంకా కొంతకాలం బ్రిటిషు ప్రభుత్వం ఉంటే ఈయన్ను సస్పెన్షనులో ఉంచి విచారణ జరిగేదేనట. ఆయన లంచగొండితనం బట్టబయలై పోయేదట. కాని ఆయన అదృష్ట వంతుడు. బ్రిటిషువారు వైదొలగటం - మన ప్రభుత్వం ఏర్ప డటం జరిగింది. ఈ అవకాశాన్ని ఆయన వినియోగించుకుని రాజీనామా చేశాడట. విషయాలు లోతుగా తెలియని సమ యంలో మన ప్రభుత్వం ఆయన రాజీనామాను అంగీకరించినదట. ఆయన ఉద్యోగ విరమణకు ముందే, వెంకటకృష్ణయ్యచౌదరి గారు మరణించారు. చౌదరిగారికి కుమాళ్ళు లేరు. చంద్రగారి భార్య ఒక్కతే చౌదరిగారి సంతానము. చౌదరిగారికి ఉన్న ఇరవై లక్షల ఆస్తి చంద్రగారికి సంక్రమించింది. చంద్రగారు ఉద్యోగంలో యాభైలక్షలు సంపాదించారని ప్రతీతి. ఆయన దేవపురం చుట్టుపట్ల అనేక పరిశ్రమలు స్థాపించాడు. కాయి తాల మిల్లు, జనపనారమిల్లు, రసాయనికపదార్థాలమిల్లు, విద్యు త్సామానులమిల్లు, సిమెంటు మిల్లులు, బట్టల మిల్లులు, పంచ దార మిల్లులు - ఒక సామ్రాజ్యం నిర్మించాడు. దాన్ని సార్వ భౌమాధికారంతో ఏలుతున్నాడు. ఇప్పుడు జరుగుతున్న శాసనసభ ఎన్నికలలో పోటీచేసి మంత్రి కావాలని ఆయనకు ఆశపుట్టింది. ఆయనకు తేలికగా కాంగ్రెసు టిక్కెట్టుకూడా లభించింది. ఇక కావలసినదేమి? ఎన్నికల ప్రచారం జోరుగా సాగుచున్నది. డబ్బు నీళ్ళలాగా ప్రవహిస్తున్నది."

ఈమాటలు విన్నతర్వాత నారాయణరావుకు సంపూర్ణమైన భోగట్టా తెలిసిపోయింది. 'భైరవమూర్తిపురంలో హరిజనులు వామపక్షీయులు కాబోలు. వాళ్లు చంద్రగారికి వ్యతిరేకంగా ఉన్నారన్నమాట. స్వంతప్రయత్నాలతో వాళ్ళు లొంగకపోవడంవల్ల ఇప్పుడు తన్ను ఉపయోగిస్తున్నాడన్నమాట' - అని నారాయణరావు భావించాడు.

భైరవమూర్తిపురంలో హరిజనులు చాలమంది నారాయణరావు ఆనువంశిక ధర్మకర్తగాఉన్న దేవాలయం భూమిల్ని చేసుకుని బ్రతుకుతున్నవాళ్ళు. కాబట్టి వాళ్లకు నారాయణరావు మాటలమీద ఆదరం ఉండవచ్చును. వాళ్ళలో కృతజ్ఞతాగుణం తేలికగా నశించదు. ఈ అభిప్రాయాలతో చంద్రగారు ఎత్తులు వేశారన్నమాట. నారాయణరావు ఆ ఎత్తులు గ్రహించినా చేయగలిగినదిలేక ఊరుకున్నాడు. ఆ రాత్రి దేవదర్శనం, పితృసమాధి దర్శనం, రామస్వామి యోగమందిర దర్శనం, చేసుకుని నారాయణరావు చంద్రగారి ఇంటికి వెళ్లాడు.

చంద్రగారు పదిమంది ఉపనాయకులతో నారాయణరావును తీసుకొని భైరవమూర్తిపురానికి వెళ్ళారు. నారాయణరావు హరిజనులతో చెప్పాడు. "వెంకటకృష్ణయ్యచౌదరిగారు సజ్జనుడు. ఆయనవంటి సాధువు మన ఊళ్ళోనే లేడు. ఆయన మనకందరకూ కావలసినవాడు. అందుచేత చౌదరిగారి అల్లుడైన చంద్రగారికి మనమంతా సాయము చెయ్యాలి" ఈ మాటలకు ముసలివారంతా "బాబయ్యా! మేము మీ అన్నము

తింటున్నాము. మీరు స్వయంగా వచ్చారు. మీమాట తోసి వేస్తామా!" అన్నారు. కుర్రకారువాళ్లు "పంతులుగారూ! ఇది మీ స్వంతవిషయంకాదు. మీరీ ఊళ్లో ఉండటంలేదు. మన ఊరెంత మారిందో మీకు తెలియదు. ఆయన నిర్దాక్షిణ్యుడైన ధనిక పారిశ్రామికుడు. మేము పేద కార్మికులము. ఆయనకూ మాకూ సహజవైరము. ఈ విషయంలో మీరు జోక్యం పెట్టుకోకండి. పైగా మీకు సంబంధమూ లేదు. లాభమూ లేదు." అని జవాబు చెప్పారు. వారి జవాబువల్ల గాని ప్రవర్తనవల్లగాని నిరుత్సాహపడక నారాయణరావు హరిజనవాడలో ఇంటింటికి వెళ్ళివచ్చాడు. పని పూర్తి అయిన తర్వాత నారాయణరావును అక్కడనే వదలిపెట్టి చంద్రగారు ఉపనాయకులు వెళ్ళిపోయారు. ఆ రాత్రికే నారాయణరావు తిరిగి పొన్నేరికి ప్రయాణమైనాడు.

# 37

ఎన్నికలలో భైరవమూర్తిపురంలో హరిజనులు చంద్రగారికి వ్యతిరేకంగానే పనిచేశారు. ఐనా చంద్రగారే గెలిచారు. ఆయన పెద్ద భూస్వామి. ధనికుడు. పారిశ్రామిక చక్రవర్తి. కాంగ్రెసు అభ్యర్థి. భూస్వాములంతా ఆయన బంధువర్గీయులే. పైగా ఆయన డబ్బుకు లెక్క చెయ్యలేదు.

ఎన్నికలైనతర్వాత చంద్రగారు మంత్రిమాత్రము కాలేదు. చంద్రగారి వర్గానికి నాయకుడుగా ఉన్న ప్రము

ఖుడు ముఖ్యమంత్రి కాలేదు. తరువాత చంద్రగారు వర్గాన్ని మార్చుకుని ముఖ్యమంత్రి వర్గంలో చేరి పలుకుబడి పెంచుకుని-శతథా మంత్రిపదవికోసం ప్రయత్నాలు చేస్తూనేఉన్నారు.

ఆయన తనకు వ్యతిరేకంగా పనిచేసిన హరిజనులసంగతి చూడాలని అభిప్రాయపడి పై ఉద్యోగులతో మాట్లాడి నాడు. అంతే. మరుసటి సంవత్సరమే - హరిజనులు సాగు చేస్తున్న దేవాలయపు భూముల్ని వదలిపెట్టమని హరిజనులకు నోటీసులు ముట్టినాయి. భూములలో యకరాకు సాలుసరి పంట దిగుబడి ముప్పయి బస్తాలదాకా ఉండగా హరిజనులు ఎనిమిది బస్తాలు మాత్రమే గుత్తలు ఇస్తున్నారు గనుక ఈ సంవత్సరం కౌళ్ళు వేలం పాడటానికి దేవాదాయశాఖ నిర్ణయించింది. మధ్యకారు రైతులు ఈ భూములకు యకరాకు ఇరవై బస్తాలు గుత్త ఇవ్వడానికికూడా సిద్ధంగా ఉన్నారు. ఈ విచిత్రపరిణామానికి హరిజనవాడ గగ్గోలుపడింది. హరిజన నాయకులు, కార్మిక నాయకులు, కార్మిక సలహాదార్లు, పెద్ద వకీళ్ళు ఏమీ చెయ్యలేకపోయారు. చివరకు వంశపారంపర్యా ధర్మకర్త అయిన నారాయణరావు చేత ఏమైనా అవుతుందేమోనని ఆశతో హరిజనులు వ్యవహారాన్ని అతనిద్వారా సాధించుకుందామనుకున్నారు. హరిజనవాడలో చందాలు వేసుకుని చేర్చిన మొత్తంలో కొంతసొమ్ముతీసుకొని - నలుగురు హరిజన నాయకులు పాన్నేరివెళ్ళి నారాయణరావును కలుసుకున్నారు.

నారాయణరావుకి వినయంగా నమస్కారంచేసి క్షేమ సమాచారాలు తెలుసుకున్నారు. వాళ్ళు తనకోసం పొన్నేరి వరకూ రావడానికి కారణం అర్థంగాక నారాయణరావు వాళ్ళనే అడిగాడు. వాళ్ళు వినయంగా, దయనీయంగా తమ గోడు వెళ్ళబుచ్చుకున్నారు. చివరకు "మీ పెద్దలు చేసిన దానంమీద బ్రతుకుతున్న వాళ్ళము. మా నోటికాడ కూడు నిలపటం మీ చేతిలో ఉన్నది" అని దీనంగా ప్రార్థేయపడ్డారు. ఈ వచ్చినవారిలో ఇద్దరు ఎన్నికలసమయంలో నారాయణరావు వెళ్ళినప్పుడు అసందర్భంగా మాట్లాడినవారే. నారాయణరావుకి ఏమి చెయ్యాలో తోచలేదు. ఆ రాత్రి వాళ్ళను అక్కడనే ఉండమని చెప్పి, వాళ్ళకు భోజనవసతులు ఏర్పాట్లు చేశాడు.

ఆ రాత్రి నారాయణరావు బాగా ఆలోచించాడు. ఏమీ మార్గం కన్పించలేదు. తమ దేవాలయము - అందులో నిత్య ప్రసన్నంగా ఉండే స్వామివారు తలపునకు రాగా నిద్ర వచ్చింది. నిద్రలో ఈ హరిజనుల గొడవే స్వప్నముగా వచ్చింది.

ఈ హరిజనులంతా తమ దేవాలయంచుట్టూ నిల్చుని ఉన్నారట. తాను లోపల స్వామిదర్శనం చేస్తూఉన్నాడట. స్వామివారు మిక్కిలి ప్రసన్నంగా ఉన్నారుట. బయట హరిజనులు హాహాకారాలు చేస్తూఉండగా పరమ కారుణికుడైన స్వామి మందస్మితం చేశాడట. ఆ మందస్మితంయొక్క రోచిస్సు

లేతవెన్నెలవలె ఆలయ అంతర్భాగంనుంచి బయటకు ప్రయాణించి బయట ఆర్తనాదం చేస్తున్న హరిజనులకు పరమాహ్లాదం సమకూర్చినదట.

నారాయణరావు మేల్కొని పద్మాసనంలో కూర్చుని శివకవచాన్ని పఠించి "మృత్యుంజయత్ర్యంబక సదాశివ నమస్తే నమస్తే నమః" అని హరిజనుల్ని గురించి ఆలోచించాడు.

"వీళ్ళు చాలా అమాయకులు. ఎవ్వరో స్వలాభాపేక్షపరులు వీళ్ళను రాజకీయాలలోకి దింపి వీళ్ళను వాడుకుంటున్నారు. వీళ్లు తెలియక బహిరంగంగా చంద్రగారికి వ్యతిరేకంగా పనిచేసినట్లున్నారు. అంతమాత్రంచేత వీళ్ళ నోటివద్ద కూడు తీసివెయ్యటం న్యాయం కాదు. తన ముత్తాతగారి కాలంనుంచీ వీళ్ళు దేవాలయం భూములు సాగుచేసుకుని బ్రతుకుచున్నారు. అందుచేతనే మిగిలిన హరిజనవాడలలో కంటె వీళ్ళ ఆర్థిక స్థితి కొంత మెరుగుగా ఉన్నది. భూముల్ని ధర్మసంస్థలపరం చెయ్యడంలో ఉద్దేశం భూములులేని బీదవారు ఆ భూముల్ని తక్కువ గుత్తలకు తీసుకుని బ్రతుకుతారనే అభిప్రాయమేమో. అట్టి భూదానాలలో ధర్మరహస్య మంతే నని విదితం అవుతున్నది. అనగా తన ముత్తాతగారు ఈ పేద కుటుంబాలకోసమే భూదానం చేసినట్లు భాసిస్తున్నది."

ఈవిధంగా నారాయణరావు ఆలోచించి మర్నాడు హరిజన నాయకులతో సంప్రతించి వాళ్ళతో ఆంధ్రరాజధానికి వెళ్ళాడు. అక్కడ దేవాదాయ ధర్మాదాయశాఖామా

త్యుల్ని దర్శించాడు. మంత్రిగారిని కలుసుకోవడానికి ఏమీ కష్టం కలుగలేదుగాని మంత్రిగారు భూముల్ని వేలంపాడుట సక్రమ విధానమేనని దృఢాభిప్రాయంలో ఉండి దాన్ని మార్చుకోలేదు. మంత్రిగారివద్ద నుండి బయటకువచ్చిన తర్వాత నారాయణరావుకీ ఆ హరిజననాయకులకీ తెలిసింది - ఆమంత్రిగారికి ఒక స్త్రీ ఉన్నదనీ ఆమె ఎంతచెబితే ఈయన అంతేనని. ఆమెకు ఏదైనా ముట్టచెబితే నిమిషాలమీద అనుకూలమైన ఉత్తర్వులు ఆమె సాధించిపెట్టగలదు. నారాయణరావు ఆమెద్వారా పని సాధించడానికి ఇష్టపడలేదు.

ఆ హరిజనులలో ఒకనికి చాలాదూరపు బంధువు మంత్రివర్గంలో హరిజనమంత్రిగా ఉన్నాడు. అది జ్ఞాపకానికి వచ్చి అతడు హరిజనమంత్రిగారిని చూదామన్నాడు. అందరూ అంగీకరించారు. నారాయణరావుకూడా వెళ్ళాడు.

హరిజనమంత్రిగారు వీళ్ళను ఆదరంగా చూచాడు. వచ్చినపని ఏమిటని విచారించాడు. వివరాలు విన్నాడు. భూదానాలు చెయ్యడంలో ధర్మరహస్యం ఇట్లాఉన్నదని నారాయణరావు చెప్పగా అతనిని అభినందించాడు. ఆనువంశిక ధర్మకర్త ఐన నారాయణరావుచేత భూములు వేలంపాడటానికి అభ్యంతరం చెబుతూ అర్జీ వ్రాయించి తీసుకున్నాడు. అభ్యంతర కారణాలలో భూదానంయొక్క అభిప్రాయం ఇటువంటిదని చెప్పి - దానికి విరుద్ధంగా ఆ భూములు వినియోగింపబడకూడదనీ ఆనువంశిక ధర్మకర్తగా వేలంపాటను తాను వ్యతి

రేకిస్తున్నాననీ వ్రాయించాడు. అదిగాక దేవాలయం తమ స్వాధీనంలో ఉండగా ప్రతిసంవత్సరమూ వేదపాఠశాలకు మూడువేలు, వేదవిద్యార్థులకు మూడువేలు, హరిజన విద్యార్థి వసతిగృహానికి మూడువేలు ఇస్తూ దర్శనశాస్త్ర పండితులకు వార్షికాలు వెయ్యిరూపాయలు ఇచ్చేవాళ్ళమనీ, ప్రభుత్వం వారు స్వాధీనపరచుకొన్న తరువాత ఈ విరాళాలు నిలిచి పోయాయనీ, కళ్యాణోత్సవాలుకూడా జరగడంలేదనీ, దేవుని సొమ్ము ఉద్యోగులు పంచుకుంటున్నారనీ, వెంటనే దర్యాప్తు చేసి లెఖలు చూపించకపోతే దావావేస్తాననీ వ్రాయించాడు. ఇప్పుడు ఈ వేదహరిజనుల్ని నోళ్ళుకొట్టి ఎక్కువ ఆదాయం సంపాదించినా అది ఉద్యోగుల నైవేద్యానికేననీ వ్రాయించాడు.

హరిజన మంత్రిగారు అర్జీని తాను స్వయంగా తీసుకొని వెళ్ళి ముఖ్యమంత్రిగారిని కలుసుకుని మాట్లాడారు. ముఖ్యమంత్రిగారితో ఆయన మర్మంలేకుండా అర్జీలోని అన్నివిషయాలు యదార్థాలని తనకు తెలుసునని చెప్పాడు. ఈ అన్యాయం నిలుపుదల చెయ్యకపోతే కాంగ్రెసు ప్రతిష్ఠ దెబ్బ తింటుందని చెప్పాడు. మంత్రివర్గపు ప్రతిష్ఠకు కూడా భంగం వాటిల్ల వచ్చని అన్నాడు. ముఖ్యమంత్రిగారికి ఆమాటలలో నిజాయితీ ఉన్నదని తోచింది. వెంటనే దేవాలయాల మంత్రిగారిని పిలిపించి అర్జీ చూపించారు. ఆయన ప్రక్కనే ఉన్న హరిజన మంత్రిగారినీ - ఆయన ఉద్ధృతినీ గమనించాడు. పత్రి

స్థితులను అవగాహన చేసుకున్నాడు. ఆ దేవాలయంలో మొదటగా చేరి ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగా ఉన్న ఉద్యోగి యీ మంత్రిగారి స్త్రీకి అక్కగారి అల్లుడు. అతని ఆగడాలు మంత్రిగారుకూడా ఇదివరకే విని ఉన్నారు. అవన్నీ బయటికి రావచ్చునని మంత్రిగారు భయపడ్డారు. కాని తెలివి తేటలుగల మంత్రి కాబట్టి ముఖ్యమంత్రి గారి ధోరణిని కనిపెట్టి, "భూముల గుత్తలు వేలం పాడవద్దని ఈ రోజే ఉత్తర్వులు పంపుదాము. వర్తమానకాల పరిస్థితులను బట్టి గుత్తలు పెంచవలసిన అవసరం ఉన్నది కనుక హరిజనులతో రాయబారం నడుపమని ఆను వంశిక ధర్మకర్తను కోరుదాము. దేవాలయం ఎగ్జిక్యూటివ్ ఆఫీసరును బదిలీ చేద్దాము." అని చెప్పి ముఖ్య మంత్రిగారి ఎదుటనే ఉత్తర్వులు జారీ చేశాడు. అటువంటి ఉత్తర్వులు ఇవ్వకపోతే శ్రుతిమించి రాగాన పడుతుందని మంత్రిగారు గ్రహించి చాకచక్యాన్ని ప్రదర్శించారు. ఉపద్రవం రాకుండా కాపాడుకున్నారు.

ఉత్తర్వులు తీసికొని వచ్చి హరిజనమంత్రిగారు నారాయణరావుకీ హరిజనులకీ చూపించారు. ఆయన హరిజనులతోనూ నారాయణరావుతోనూ సంప్రదించి సాలుసరి గుత్తలు పన్నెండు బస్తాలకు పెంచి ఆవిధంగా వాళ్ళ అంగీకారాన్ని నారాయణరావు సిఫారసునూ తీసుకున్నాడు.

హరిజనులపై నారాయణరావు చూపిన అభిమానానికి మంత్రిగారు అతన్ని ప్రశంసించారు. అప్పుడు ఆ హరిజనులలో

వృద్ధుడు మంత్రిగారితో నారాయణరావు పూర్వ పురుషుల వృత్తాంతము, ముఖ్యంగా అతని తల్లిదండ్రుల పుణ్య గాథ వినిపించాడు. హరిజనమంత్రి గారికి రామస్వామి వృత్తాంతము ఇదివరకే తెలుసుట. రామస్వామికి గురువుగారియొక్క పుత్రుడీ నారాయణరావేనని తెలుసుకుని మంత్రిగారు అమితంగా ఆనందించారు. లోపలకు వెళ్ళి పళ్ళూ తాంబూలము తెచ్చి నారాయణరావు పాదముల దగ్గర ఉంచి పాదాభివందనంచేసి, 'తపస్సిద్ధులైన మీ పూర్వ పురుషుల మహత్తు మీ ముఖతా నన్ను ఆశీర్వదించును గాక' అని అన్నారు. నారాయణరావు "మీరు మిక్కిలి సజ్జనులు. మాఊరి పేదలకు మేము సాయపడుట మా విధ్యుక్తధర్మము. సజ్జనులు కాబట్టి మీరు నన్ను అభినందిస్తున్నారు. మీ మద్దతు మీ కృషి లేకుండా ఈపని చక్కపడేదేకాదు. మావాళ్ళు మేము మీయందు సర్వదా ఋణపడి ఉన్నాము. మీ ధర్మనిష్ఠకు ఔదార్యానికి భగవంతుడు మిమ్ము సర్వదా రక్షిస్తాడు" అని అన్నాడు.

హరిజనమంత్రిగారు నారాయణరావుకు హరిజనులకు సాదరంగా వీడ్కోలుచెప్పారు. మేలుపొందిన హరిజనులు నారాయణరావుకు కృతజ్ఞతలు చెప్పుకున్నారు. ఆతనిని రానుపోను ఖర్చులు తీసుకొమ్మని బ్రతిమిలాడారు. కాని నారాయణరావు "మా పూర్వపురుషులు చేసిన దానము పునః స్థిరీకరింపబడుటకు, మేము కృషిచేయుట మా ధర్మమే. ఈ కృషిలో నేను ఖర్చులు తీసుకుంటే మా పూర్వుల దానఫలానికి భంగం

వాటిల్లవచ్చును. కనుక మన్నించండి!" అని సమాధానము చెప్పాడు. వాళ్ళు నొప్పిపడి అతనిని కష్టపెట్టడం ఇష్టంలేక అతని అభిమతం ప్రకారమే కానిచ్చి, అతనిని రైలెక్కించి వాళ్ళు శలవు తీసుకొని వెళ్ళారు.

# 38

ప్రతిసంవత్సరంలాగానే ఆ సంవత్సరం కూడా శివరాత్రి వెళ్ళిన మర్నాడు రామస్వామి యోగసమాధినుండి లేచి బయటకువచ్చి ప్రజలకు దర్శనం ఇస్తున్నాడు. ఆరోజున నారాయణరావు దేవపురంలో ఉండటం తటస్థించింది. నారాయణరావు చేతిమీదుగా పెండ్లిచేసిన చెల్లెలు - ఇద్దరుపిల్లల తల్లి అకస్మాత్తుగా మరణించగా దశాహస్సునకుపోయి తిరిగివస్తూ దేవపురంవెళ్ళి మనశ్శాంతికోసం తమ దేవాలయంలో స్వామి దర్శనమూ, పితృసమాధి దర్శనమూచేసి రామస్వామి దగ్గరకు వెళ్ళాడు.

ప్రతి సంవత్సరంకన్నా హరిజనులు ఎక్కువ ఉత్సాహంగా ఉన్నారు. హరిజనులు తమ స్వంతఖర్చుతో పరమేశ్వరరావుగారి సమాధి ఆలయానికీ రామస్వామి యోగమందిరానికీ విద్యుద్దీపాలు పెట్టించి నీటికుళ్ళాయిలు తెప్పించారు. వాళ్ళ ఉత్సాహానికి నారాయణరావు సంతోషపడ్డాడు. వాళ్ల భక్తివిశ్వాసాలకు అతడు ఆనందించాడు. ఇతర వర్ణాలవారు

హిందూమతాన్ని నిర్లక్ష్యం చెయ్యగా-వేదవిహిత ధర్మాన్ని అలక్ష్యం చెయ్యగా ఇన్నివేల సంవత్సరాలుగా నిరాదరింప బడిన ఈ హరిజనులైనా ఈ మతాన్ని ఆదరిస్తున్నారుకదా అని సంతోషపడ్డాడు. నారాయణరావు రామస్వామి దగ్గరకు వెళ్లేటకు ముందే హరిజనులు రామస్వామితో దేవాలయ భూములను గురించి తమకు వచ్చిన కష్టమును గురించి దానిని నారాయణరావు సహాయంతో సవరించుకున్న వైనమును గురించి చెప్పుకున్నారు.

నారాయణరావు రాగా రామస్వామి అతనిని అభినందించి "స్వామీ మీరు మా గురువుగారి కీర్తిని నిలబెట్టారు. అది నాకు పరమానందము. మీ తండ్రిగారు సమాధిగతులైన నెలలో మనం మాట్లాడుకున్నాము. మళ్ళీ ఇదే కలవడము. మీరు బాగా ఎదిగినారు. మీ తేజస్సు నేత్రపర్వంగా ఉన్నది. మీ పూర్వపురుషుల తపశ్శక్తి తేజోమాయా కృతిగా మిమ్మల్ని అవలంబించినట్లుగా ఉన్నది. మీ భ్రూమధ్య భాగాన్ని తిలకిస్తే పరమ రమణీయంగా ఉండి శ్రీదేవికి నిత్య నివాసంగా ఉన్నది. మీరున్నూ పాదుకాంత దీక్షాపరులు. తపస్సిద్ధులు" అని పాదాభివందనం చేశాడు. యోగీంద్రుడైన రామస్వామి నారాయణరావుకు పాదాభివందనం చేయడము అక్కడ గుమిగూడిన అశేషజనాన్ని చకితుల్ని చేసింది. వారు ఆశ్చర్యభరితులైనారు.

హరిజనులు దేవాలయ భూముల్ని దక్కించుకొని విశ్రమించలేదు. దాదాపు వంద సంవత్సరాలుగా ఆ దేవాలయ

భూములమీద బ్రతుకుతూ దాని మంచిచెడ్డలు పట్టించుకోక పోవడము తప్పనివాళ్ళకే ఉద్బోధమైంది. దేవాలయ భూములు చేస్తున్న కుటుంబాలవారిలో ఒకరిద్దరు హిందూ మతాన్ని వదలి మతాంతరులైనవారున్నారు. వాళ్ళకుకూడా జ్ఞానోదయమైనది. దాదాపుగా వంద సంవత్సరాలుగా జీవనాధారం చూపించిన దేవాలయాన్ని దూషించే మతాంతరం స్వీకరించి ఆ ద్వారా బాగుపడదామని ప్రయత్నించుట దూష్యమని వాళ్లు గ్రహించారు. వాళ్లంతా తిరిగి హైందవులై తమ ఆత్మపారిశుద్ధ్యాన్ని వెల్లడించుకున్నారు.

హరిజనులు దేవాలయ నిర్వహణ విషయంలో జోక్యం కలిగించుకున్నారు. వాళ్ళు ఎగ్జిక్యూటివు ఆఫీసరును తరుచు కలుసుకోవడం, పై అధికార్లను కలుసుకోవడం ప్రారంభించారు. ఆదాయ వ్యయ లెక్కలను చూడటం మొదలుపెట్టారు. వాళ్ళు తెచ్చిన వత్తిడివల్ల ఆ సంవత్సరం వేద పాఠశాలకు, వేద విద్యార్థులకూ, దర్శన శాస్త్రపండితులకూ హరిజన విద్యార్థి వసతి గృహానికి వార్షికాలు ముట్టినాయి. దేవాలయ వ్యవహారాలు కొంతలో కొంత సక్రమమార్గానికి వచ్చినాయి.

ఆ దినం నారాయణరావు దేవపురానికి రావడం హరిజనులకు పరమోత్సాహమైనవి. అతడు రామస్వామి దగ్గర ఉండగా అతని ఆగమనవార్త హరిజనవాడకు చేరింది. హరిజన కుటుంబాలవారు ప్రతి ఒక్కరూ వచ్చి అతనికి సాష్టాంగ

వందనంచేసి, రామస్వామికి పాదాభివందనంచేసి కుశల ప్రశ్నాదికం చేశారు. వాళ్ల భక్తి శ్రద్ధలకు నారాయణరావు పులకరించిపోయాడు.

ఆ సాయంకాలం హరిజనుల ఉత్సాహంతో, కార్యకర్తృత్వంతో, ధనంతో ఒక సభ జరిగింది. వకీలు రామచంద్రయ్యగారు అధ్యక్షత వహించారు. హరిజనవృద్ధులు ఉపన్యాసాలు చేశారు. ఆ ఊరికి, రైతులకి, బ్రాహ్మణులకి, హరిజనులకి నారాయణరావు కుటుంబంవారు చేసిన అనేకమైన ఉపకారాలను ఎత్తిచెప్పి పొగడి చివరకు ఆ కుటుంబంవారు ఆ ఊరిలో జీవనోపాధిలేక దూరదేశానికి వెళ్ళిపోవడం ఆ ఊరిలో అందరికీ తలవంపులని వాపోయారు. సభలో నారాయణరావుకి పూలదండలతోను, నూత్నవస్త్రాలతోను సన్మానించారు. వకీలు రామచంద్రయ్యగారు నారాయణరావుపైన కాశ్మీరు దుశ్శాలువలు కప్పి కౌగలించుకున్నాడు. నారాయణరావుమీద ఉత్సాహవంతులైన హరిజనయువకులు పద్యాలు చదువుతూ పూలవర్షం కురిపించారు. రామచంద్రయ్యగారు మాట్లాడుతూ "మీ కుటుంబంవారు ఈ ఊరికి అనేక మేళ్లు చేశారు. చివరకు మీ తండ్రిగారు సమాధి పొంది, శిష్యద్వితీయులై, ఈ పట్టణాన్ని పుణ్యక్షేత్రంగా మార్చివేశారు. మీరు ఎప్పటికైనా ఈ ఊరు కాపురస్థులు కావాలని కోరుతున్నాను" అని దుఃఖాన్ని భరించలేక గాద్గదికంతో ముగించి కూర్చున్నారు. నారాయణరావు వినయంగా

సముచితమైన సమాధానం చెప్పి, వారందరినీ సముదాయించాడు.

ఆ సంవత్సరం కల్యాణోత్సవాలుకూడా జరిగినాయి. నారాయణరావు భార్యతో కలసి వెళ్ళి కల్యాణోత్సవాలు చేయించాడు. ఉద్యోగులతో మాట్లాడి ప్రతి సంవత్సరం పూర్వపద్ధతిలోగణపతి నవరాత్రులు, దేవీనవరాత్రులు, వసంత నవరాత్రులు జరపడానికి నారాయణరావు ఒప్పించాడు. ఆ నవరాత్రులలో సాహిత్యవేత్తల, సంగీత విద్వాంసుల, వేద దర్శన శాస్త్రపండితుల సన్మానాలు జరుపడానికికూడా ఉద్యోగులు అంగీకరించారు. శంకరజయంతికూడా నవరాత్రి పండుగగా జరుపబడాలనీ, ఆ రోజుల్లో ప్రస్థానత్రయ ప్రచారం జరుగాలని నిర్ణయమైనది. వేదపాఠశాలలో శాస్త్రవిభాగమూ, సాహిత్యవిభాగమూకూడా ప్రారంభింపబడ్డాయి.

# 39

వాళ్ల ఉద్యోగాలు వాళ్లు చేసుకుంటున్నా తమకింకా ఏదో సహాయము చెయ్యలేదని నారాయణరావు తమ్ములు అన్నగారిమీద ద్వేషాలు పెంచుకున్నారు. వాళ్లు నారాయణ రావు క్షేమసమాచారాలు తెలుసుకోవడమే విరమించుకున్నారు.

నారాయణరావుకి చాల సంవత్సరాలకు సంతానం కలిగింది. లక్ష్మీదేవమ్మ మగపిల్లవానిని కన్నది. పురుడు పోసేటం

దుకు ఆడవారి దక్షతే లేకపోయింది. కావలసిన బంధువు లెవ్వరూ పలుకలేదు - ఆఖరికి కుమారుడు కలిగినందుకు అభినందిస్తూనైనా వ్రాసినవాళ్లు లేకపోయారు. తమ్ములుకూడా మౌనం వహించడం నారాయణరావుకి బాధ కలిగించిన మాట నిజం.

రక్తబంధువు లందరూ నారాయణరావుకి దూరమైపోయారు. అతనికి అతి సన్నిహితంగా ఉండే చెల్లెలు వెళ్ళిపోయింది. మిగిలిన నలుగురు తోబుట్టువులలో ముగ్గురు గతించారు. పెద్దక్క కనకమ్మగారికి భర్త పోవడం, ఆ తర్వాత సంవత్సరానికి ఆమె మరణించడం జరిగింది. నాలుగవ అక్క పద్మావతమ్మ నిస్సంతుగా చనిపోయింది. మూడవ ఆమె వెంకటనర్సమ్మ. ఆమె భర్త భీమనాథరావు వారమురోజుల వ్యవధిలో ఇద్దరూ మరణించారు. వాళ్ల సంతానంలో మొదటివాడు చేతికి అంది వచ్చి కుటుంబాన్ని నిలుపుకున్నాడు.

బ్రతికి ఉన్న తోబుట్టువు సరస్వతమ్మగారితోనూ ఆమె భర్తతోనూ నారాయణరావుకి కష్టాలు వచ్చినై. "నీవు తమ్ముళ్ళకు చదువు చెప్పించినావుకదా! నేనుకూడా తమ్ముడినైతే నాకు చదువు చెప్పించేవాడివి కదా! కనుక నా కుమారుడికైనా పై చదువులు చెప్పించకూడదా!" అని ఒకసారి "నా పెద్దతమ్ముడు పెద్దవ్యాపారంలో ఘనంగా సంపాదిస్తూ ఉండగా, నాకుమార్తె పురిటికి సహాయము చెయ్య నక్కరలేదా?" అని ఒకసారి "మాకు పెద్దకుటుంబంతో గడచుట కష్టంగా ఉన్నది.

నువ్వు సాయం చెయ్యకపోతే ఎట్లా?" అని ఒకసారి - అనేక పద్ధతులుగా అనేకసార్లు ఆమె, ఆమెభర్త, ఆమె సంతానము నారాయణరావుని సాధించి పోస్తున్నారు. ఐనా వాళ్ళ బెదరింపులు నారాయణరావు పట్టించుకోలేదు. అతనివల్ల సహాయము జరుగలేదని వాళ్ళు ద్వేషాలు పెంచుకుని ఇతన్ని లాంగదీసే సాధనాలు ఆలోచించడం ప్రారంభించారు. చివరకు వాళ్ళకక్ష క్రొత్తపుంతలు పట్టింది.

సరస్వతమ్మగారు స్వయంగా చిన్న తమ్ముళ్ళ వద్దకు వెళ్లింది. అక్కడ వాళ్ళమీద, వాళ్ళ భార్యలమీద, వాళ్ళ సంతానంమీద ఆప్యాయత ఒలుక పోసింది. వాళ్ళ క్షేమాలే తనకు ముఖ్యమైనట్లు మాట్లాడింది. వాళ్ళు ఉబ్బిపోయారు. వాళ్లకు ఉన్నవీ లేనివీ కల్పించి చెప్పింది. నూరిపోసింది. తమ తండ్రి చక్కని ఇల్లు వదలిపెట్టిపోగా దాన్ని నారాయణరావు నాశనం చేశాడట. ఇల్లు అమ్మినపుడు దొంగచాటుగా కొంత డబ్బు దాచుకుని ఆ డబ్బుతో పెళ్ళివేళ భార్యకు నగలు చేయించి చిన్నమామయ్య పేరట చదివించాడట. లేకపోతే అన్న కుమార్తెకు నగలు చేయించేటంత తాహత్తు వేంకటేశ్వరరావు మామయ్యకు ఎక్కడనుంచి వచ్చింది? ఇటువంటి మాటలు నూరిపొయ్యగా మూర్ఖులైన నారాయణరావు తమ్ములు అవి నిజాలని నమ్మారు. వాళ్ళ భార్యలమాటలు చెప్ప నక్కరలేదు. వాళ్ళు మొదట్లోనే నమ్మారు.

సరస్వతమ్మగారి భర్త కోర్టుపక్షీ. వకీళ్ళకు కేసులు తెచ్చి ఇస్తూంటాడు. అతనికి తెలియని దావాలు, తీర్పులు, చట్టాలు లేవు. ఆయన నారాయణరావును సాధించడానికి తన తెలివి తేటలు ఉపయోగించాడు. నారాయణరావు తమ్ముళ్ళ తరఫున ఆయన నడుంకట్టి నారాయణరావుకి నోటీసు ఇప్పించాడు. జాయంటు ఆస్తియొక్క ఆదాయానికి లెక్కలు చూపించమని. అసలు జాయంటు ఆస్తి ఏమున్నది ? ఆదాయము వచ్చే ఆస్తి లేనేలేదు. పైగా తండ్రిగారు అప్పు వదలిపెట్టి వెళ్లినారాయెను. అప్పుతీర్చి చెల్లెలు పెండ్లిచేసి ఇద్దరు తమ్ముళ్ళకు పెద్ద చదువులు చెప్పించుటకు ఎంతఖర్చు ? ఎంత చాకిరీ ? ఆ మూర్ఖులకు వాళ్ల భార్యలకు పట్టలేదు. సరస్వతమ్మగారు ఆమె భర్త ఆడించినట్లు వాళ్ళు ఆడినారు.

నారాయణరావు ఆ నోటీసుకి సమాధానం ఇవ్వలేదు. వాళ్ళు దావావేశారు. నారాయణరావు దావా నోటీసు తీసుకునికూడా కోర్టులో హాజరుకాలేదు. ప్రతివాదం చెయ్యలేదు. వాళ్ళపక్షంగా తీర్పుకూడా అయింది. వాళ్లు కోరిన మొత్తానికి డిక్రీకూడా పుట్టింది. డిక్రీ బాకీలో కొంత సొమ్ముకుగాను దేవపురంలో ఇంకా జాయింటుగా ఉన్న ఇంట్లో నారాయణరావు భాగం వాళ్ళ పరమైపోయింది. పీడ వదలింది పొమ్మని నారాయణరావు అనుకున్నాడు. కాని నిజంగా పీడ వదలలేదు. పీడ అప్పుడే మొదలైంది.

డిక్రీలో ఇంకా రావలసిన బాకీకిగాను నారాయణ రావు ఇంటిమీదకు జప్తు తీసుకు వెళ్లమని సరస్వతమ్మగారు ఆమె భర్త సలహాలు చెప్పారు. నారాయణరావు తమ్ముళ్ళకు అతని ఎదుటపడి అతనిని అవమానపరిచే ధైర్యములేదు. అతని ముఖముచూచి నిలబడే సాహసములేదు. అందుకని వాళ్ళు జప్తుతీసుకు రాలేదు.

యజమాని పనిమీద నారాయణరావు కలకత్తాకు వెళ్ళాడు. విజయవాడ స్టేషనులో నారాయణరావుకి సరస్వ తమ్మగారి భర్త కనిపించాడు. బావగారు కనిపించినప్పుడు అంతః కాలుష్యాలు ఎట్లా ఉన్నా అన్యోన్య కుశల ప్రశ్నాదికం జరి గింది. ప్రసంగవశాత్తూ నారాయణరావు ఆయనతో అన్నాడు. తాను కలకత్తా వెళ్లుతున్నానని, అక్కడ పని చూచుకుని ప్రయాగ, కాశీ వెళ్ళివస్తానని, కాశీలో పదిరోజులు కల కత్తాలో వారం మొత్తం మూడు వారాలకంటె జాస్తీ పట్టి వచ్చును తిరిగిరావడానికని.

ఈ సమాచారం సరస్వతమ్మగారి భర్తకు వెన్నిధిలాగా అయింది. ఆయన వెంటనే భార్యతోనూ చిన్నబావమరదుల తోనూ సంప్రతించాడు. నారాయణరావు లేనప్పుడు ఇంటి మీదకు జప్తు తీసుకుపొమ్మని ఇతడు సలహాచెప్పగా వాళ్ళకు మనస్కరించలేదు. ఆయనయొక్క సరస్వతమ్మయొక్క పోరుపడ లేక వాళ్ళు సరస్వతమ్మను వెంటబెట్టుకుని నారాయణరావు ఇంటికి వెళ్ళారు.

తన చేతిమీదుగా పెంచిన మరుదుల్ని ఇంటి ఆడపడుచును లోపలకు రావద్దని లక్ష్మీదేవమ్మ ఎట్లా చెబుతుంది! వాళ్లు రావడమే పోట్లాటకోసం. రావడమే తిట్లు ప్రారంభించారు. నారాయణరావును దూషించడం ప్రారంభించారు. బుద్ధిహీనుడనీ - తురకపిల్లను ఉంచుకొని కుటుంబ గౌరవ నాశనం చేశాడనీ అనరాని మాటలు అన్నారు. లక్ష్మీదేవమ్మ బదులుచెప్పక తప్పలేదు. తీవ్రంగానే బదులుచెప్పింది. మాటలు పెరిగాయి. ఒక్కర్తె ముగ్గురకు ఎలా సమాధానం చెబుతుంది? ఆమె పెట్టుకున్న చంద్రహారం తమదేనట. తమ తండ్రిగారు తమకు వదలిపెట్టినసొమ్ము నారాయణరావు అపహరించి భార్యకు నగలు చేయించుకున్నాడట. మాటలు మీరి సరస్వతమ్మ ఆమె తమ్ములిద్దరూ లక్ష్మీదేవమ్మమీద కలియబడి, ఆమెను కొట్టి, ఆమె మెడలోని చంద్రహారాన్ని లాక్కున్నారు. ఆమె చంద్రహారాన్ని ఇవ్వక చేసిన పెనగులాటవల్ల ఆమెకు వంటినిండా గాయాలేగాక, బట్టలు చిరిగిపోయి - నానానికృష్టంగానూ అయింది. చంద్రహారాన్నీ, ఇంట్లోఉన్న సామానులో ఖరీదైతేలికైనవీ తీసుకొని వాళ్ళు వెళ్ళిపోయారు.

లక్ష్మీదేవమ్మ అమితంగా దుఃఖించింది. ఇంట్లో ఆమె - ఆమె కుమారుడు పసివాడు మాత్రమే ఉన్నారు. వానికోసం భర్తవచ్చే దాకా ప్రాణాలు బిగపట్టుకుని ఉన్నది. నారాయణరావు నాలుగు రోజులకు తిరిగి రాగా ఒక్కసారి ఉవ్వెత్తుగా విజృంభించిన సముద్రంలాగా ఆమె కష్టాలు త్రెంచుకుని వచ్చింది.

నారాయణరావు వచ్చేదాకా ఆమె సరిగా భోజనం చెయ్య లేదు. నిద్రపోలేదు. తన బిడ్డలవలె సాకి పెద్దచేసిన మరదులు అప్రాచ్యులుగా ప్రవర్తించినారని ఆమె దుఃఖించింది. ఆడ పడుచు దగ్గర ఉండి ఇంత అఘాయిత్యం చేయించినదని ఆవేదన పడింది. రక్తబంధువులు ఇంత అక్రమానికి పాల్పడినారని దుఃఖించినది. నారాయణరావు పోనీ లెమ్మన్నాడు. ఆమెకు ఊరట కలుగలేదు. ఆమెకు అన్నము సహించలేదు. నిద్రపట్ట లేదు. చంద్రహారము సుమతి పంపించినదని నారాయణరావుకు తెలియును. ఇంతకాలం శుభాస్పదంగా ఉన్నది పోయిందని ఆమె దుఃఖించింది. కాని లాభం ఏమున్నది? దుఃఖముతో నిరా హారముతో ఆమె మంచ మెక్కినది. మామూలు సుస్తీ అని నారాయణరావు లెక్కచెయ్యలేదు. చివరకు అది విషజ్వరమై ముంచుకువచ్చి నెలరోజుల్లో ప్రమాదస్థితికి వచ్చింది.

ఆరోజున ఉదయంనుంచీ అనుమానంగానే ఉన్నది. ఆమెకు బ్రతుకుమీద రోత పుట్టినట్లుగా ఉన్నది! నారాయణ రావును బయటకు పోనీయలేదు. కుమారుని ప్రక్కనే కూర్చుండబెట్టుకున్నది. కుమారుని జాగ్రత్తగా చూడమని పదే పదే నారాయణరావుకి చెప్పింది. అతడు "నీకు ఫరవా లేదు-నీవే పిల్లవానిని చూస్తావు" అని సమాధానాలు చెప్పాడు. ఆమె రెండుమూడుసార్లు తనదగ్గర కూర్చోపెట్టుకుని అతని పాదాలు కన్నుల కద్దుకున్నది. 'మందులు ఆయుర్దా యాన్ని పోస్తాయా?' అని మందును ప్రక్కబెట్టింది. "ఇక

వుండేది కొంచెంసేపు. ఈకాస్తసేపు మందులగొడవ, మాకుల గొడవ మాట్లాడకండి. నన్ను నిశ్చింతగా మీ ముఖాన్ని చూస్తూ ప్రాణాలు వదలనీయండి.” అని చెపుతూ నారాయణ రావు చేతులు తనచేతులలో ఉంచుకుని కుమారుని చెంతకు తీసుకుని అతనిచేతులు తనగుండెలమీద వేయించుకుని మాటా డుతూ నారాయణరావువంకా, కుమారుని వంకాచూస్తూ నవ్వుతూ మళ్ళీ నారాయణరావు ముఖంమీద దృష్టి కేంద్రీక రించి మందస్మితంతో ఆమె ప్రాణాలు త్యజించింది.

నారాయణరావు బంధువులందరకూ తెలియబరచాడు. తమ్ముళ్ళకూ, సరస్వతమ్మగారికి ముఖాలు చెల్లలేదు. నారాయణ రావు స్నేహితులు మాత్రమే వచ్చి ఆదుకున్నారు. ఆర్ద్రి హృదయుడైన నారాయణరావు యజమాని కర్మకాండలకు ఏర్పాట్లు తానే చేశాడు. కర్మలు ముగిశాయి. కర్మలుముగిసిన వారంరోజులుదాకా నారాయణరావు ఇల్లు కదలలేదు. ఆరోజు సాయంత్రం యజమాని వచ్చి లోకాభిరామాయణం మాట్లాడి “రేపటినుండి ఆఫీసుకి వస్తారా ?” అన్నాడు. నారాయణరావు “మనస్సు బాగాలేదు. ఒక నెలనాళ్ళు విశ్రాంతి కావాలి” అన్నాడు.

నెలమాసికం, త్రైపక్షికం ముగిశాయి. ఈలోగా నారా యణరావు బాగా ఆలోచించాడు. అన్నివిషయాలు కూలంక షంగా మథనచేశాడు. “ఇక తానెవ్వరికోసం బ్రతకాలి? తన కుమారుని కొరకు! తను పెద్దచేసిన తమ్ములు నిర్భాగ్యులై

నారు. తనకు మధ్యవయస్సు దాటినది. ఇక ఆధ్యాత్మికచింతన చేయవలసిన దెప్పుడు? తాను ఆధ్యాత్మిక వాతావరణంలో పడిపోతే ఈపసివానికి దిక్కెవ్వరు?" నారాయణరావుకి ఏదో లీలగా స్ఫురించింది.

ఆమర్నాడు శివరాత్రి. తాను ఆదినమంతా ఉపవాస ముండి పురశ్చరణముచేసి యజమానిని పిలిపించి చెప్పాడు. "నేనిక ఈఊళ్ళో ఉండలేను. ఈరాత్రికి వెళ్ళిపోతున్నాను." యజమాని గొల్లుమన్నాడు. "నావల్ల ఏమి తప్పిదం జరిగింది? మీరు నాదగ్గరఉంటే పరమశివుడు ఇంట్లోఉన్న కుబేరుడు లాగా అభివృద్ధి పొందాను. మీకు ఇష్టం లేకపోతే ఆఫీసుకి రాకండి. ఊరు వదలిపెట్టవద్దు. మీరు మామూలుగాజీతంతీసు కోండి. మీ చిరంజీవి పెద్దవాడయ్యేదాకా మాకు మీసేవా భాగ్యం ఉండనియ్యండి." నారాయణరావు మందస్మితంతో "మాకుర్రవాడికి ఇబ్బందిలేదు. మాఊళ్ళో మా పితృప్రతిష్ఠా పితుడైన మాస్వామి ఉన్నాడు. మా వంశాంకురాన్ని ఆయన కాపాడుతాడు. ఆయనకు వీడిని అప్పగించి నేను ఆధ్యాత్మికంగా జీతవిశేషం గడుపుతాను. మీరు బాధపడకండి." అని ఆయన్ను సముదాయించాడు.

యజమాని ఎన్నివిథాలచెప్పినా నారాయణరావు అభిప్రాయం మార్చుకోలేదు. అప్పటికప్పుడే తనఇంట్లో గుడ్డలు సామానులు పేదవాళ్ళకు పంచిపెట్టి కట్టుగుడ్డలతో కుమారుని తీసుకుని బయలుదేరాడు. యజమానివద్ద, తన సహోద్యో

గులవద్ద, ఆవూరి మిత్రులవద్ద శెలవు తీసుకున్నాడు. వాళ్లు శ్రీరామచంద్రుణ్ని వనవాసానికి పంపుతున్న ప్రజానీకంలాగా దుఃఖించారు. రైలుస్టేషనుదాకా వచ్చి రైలు ఎక్కించి వీడ్కోలు ఇచ్చారు.

# 40

ఆ దినం ప్రొద్దుటినుంచీ సుమతికి చాలా ఆనందంగా ఉన్నది - ఆనాడు అమావాశ్య శుక్రవారము. క్రిందటిరోజు మహాశివరాత్రి. కన్నులు మూసుకుంటే సహస్రార బిందుగతమై అమ్మవారు ప్రసన్నమధురంగా దివ్యదర్శనం ఇచ్చింది. అమ్మవారు పురుషాకృతిగా నారాయణరావు స్వరూపంతో తనకు ఆలింగనం ప్రసాదించినట్లుగా అనిపించింది. ఆ మధురానందంలో నుంచి బయలై కనులు తెరువగా - వంట ఆమె చెప్పింది. "ఈ దినం ఉదయం నుంచి రామస్వామి యోగిగారు ప్రజలకు దర్శనం ఇస్తున్నారట. మిమ్మల్ని రమ్మని యోగిగారు స్వయంగా కబురు పంపారు."

సుమతికి ఆశ్చర్యం వేసింది. తాను దేవపురం వచ్చిన ఇన్ని సంవత్సరాలుగా రామస్వామి దర్శనం చేసినది లేదు. ఆయన్ను తాను చూడలేదు. తన్ను ఆయన చూడలేదు. మరి తనకీ కబురేమిటి? అతడు మహాయోగి. పరమేశ్వరరావు గారికి శిష్యుడు. అందరికీ దర్శనీయుడు. ఆరాధనీయుడు. లేచి బయలుదేరింది.

ముందు పరమేశ్వర రావుగారి సమాధిని దర్శించి తరువాత రామస్వామి దర్శనం చెయ్యడం అక్కడ పరిపాటి. సుమతి అట్లాగే పరమేశ్వరరావుగారి సమాధిని ముందుగా దర్శించింది. ఆమె అక్కడకు వెళ్ళడం కూడా ఇదే మొదటిసారి. అక్కడ ఏదో ఆత్మీయతా ముద్రితమైన ప్రశాంతత ఆమెకు అనుభవంలోకి వచ్చింది. అక్కడనుంచి రామస్వామి వద్దకు వెళ్ళింది. అతన్ని చూడగా - ఉపనిషన్మహర్షులు జ్ఞాపకం వచ్చినట్లయింది. ఆతని తేజస్సు దివ్యజ్యోతిగా ఉన్నది. ఆమె పాదాభివందనం చేసింది. ఆమెను కూర్చుండమని అతడు సంజ్ఞ చేశాడు. అక్కడ ఉన్న కార్య కర్తల వంక అతడు చూడగా వాళ్ళు బయటకు వెళ్ళారు.

రామస్వామి సుమతివంక చూస్తూ 'అమ్మాయీ! నిన్ను నేను ఎట్లా ఎరుగున్నానని ఆశ్చర్యపడకు - నాకు అన్నీ తెలుసును. మా స్వామిగారైన నారాయణరావుగారిని భర్తగా, దైవంగా ఆరాధించి తపస్సిద్ధి పొందినదానవు నీవు. నేను ఆ వంశానికి సేవకుడను. ఆయన తండ్రిగారి అనుగ్రహంవల్ల నేనిట్లా అయ్యాను. అందుచేత మన మిద్దరమూ ఆత్మీయులమే. నీపైనకూడా నాకు గౌరవవిశ్వాసాలున్నాయి. నీవు ఉచిత ప్రసూతి వైద్యశాల నడుపుతూ స్త్రీజనసేవ చేస్తున్న మహాత్మురాలవని నాకు తెలుసును. అందుకనే నిన్ను పిలిపించాను.

మా గురువుగారు స్వచ్ఛందంగా ప్రాణోత్క్రమణం చేసినప్పుడు ఆయన మిత్రులు వెంకటకృష్ణయ్య చౌదరిగారు

మా గురువుగారి శరీరాన్ని అక్కడ సమాధిచేయించారు. ఆ స్థలం చౌదరిగారిదే. సమాధిమీద చౌదరిగారు శివాలయం కట్టించి, ఒక కమిటీ ఏర్పాటుచేసి తామధ్యక్షులుగా ఉండే వారు. ఈలోగా నేను ప్రభుత్వంవారి జాగాలో ఇక్కడ కూర్చోవడం - ఇక్కడ ప్రజలు మూగుతూఉండటం - వారు నాకు మందిరం కట్టడం జరిగినై. ఈ మందిరం. ఆ శివాలయం ఒకే కమిటీక్రిందకు చేరినై. చౌదరిగారు మరణించగా ఆయన ఆస్తి ఆయన అల్లునికి సంక్రమించింది. ఆయన అల్లుడు చంద్ర గారు మన కిప్పుడు శాసనసభ్యులు. నీవు చూచిఉంటావు. ఈ మందిరం, సమాధి, ప్రజాదరణపాత్రాలై జనాకర్షణకలిగి ఇప్పు డొక క్రొత్తపేటకు మధ్యగా అయిపోయాయి. ఈ దేవా లయం ఈ మందిరం వీటిచుట్టూ జాగా తమ స్వంతమేననీ అక్కడ దుకాణాలు కట్టిస్తే విరివిగా లాభం ఉంటుందనీ తలచి చంద్రగారు ప్రయత్నాలు చేశారు. కమిటీలో ఇతరమెంబర్లు అభ్యంతరాలు చెప్పారు. విషయం హైకోర్టుదాకా వెళ్ళింది. చంద్రగారు ఓడిపోయారు. చౌదరిగారు ఇక్కడ ఉన్న మూ డెకరాలభూమి సమాధికి వ్రాసినట్లు వీలునామా దొరికింది. చంద్రగారు ఏమిచెయ్యలేక ఊరుకున్నారు. చంద్రగారు ఆయన బంధువులు కమిటీనుంచి తప్పుకున్నారు. ప్రస్తుతం కమిటీలో ఊరిలో అన్నివర్ణాలవారూ ఉన్నారు. చంద్రగారుకాక ఇతర సంపన్నులంతా ఉన్నారు.

మొదట్లో ఎవరో నాకెదురుగా హుండీ పెట్టారు. గురువుగారి సమాధివద్దకూడా ఒకహుండీ ఏర్పాటైంది. ఆ

రెండు హుండీలు ఇన్ని సంవత్సరాలుగా ఎవ్వరూ ముట్టుకో లేదు. ఈరోజు ఉదయం నా సమక్షంలో తెరిచారు. వాటిలో దాదాపు ఇరవై లక్షల రూపాయల విలువగల బంగారు సొమ్ములు నాణెములు ఉన్నాయి. ఆ ధనం సద్వినియోగంచేసే ఉద్దేశంతో నిన్ను పిలిచాను. నీవు నిస్స్వార్థపరురాలవు. మహా భక్తురాలవు. సాధ్వివి. నాకు ఆత్మబంధువవు. ఈ సొమ్ము నీ చేతిలో పెట్టి ఆ సొమ్ముతో నీ ఉచిత వైద్యశాలను విస్తరించుట కున్నూ, నీ ఆధ్వర్యంలోనే దిక్కులేని అన్ని మతాల కులాల బాలబాలికలకు శరణాలయం నడుపుటకూ పథకాలు తయారు చేయించి - అందుకుగాను ట్రస్టు ఏర్పాటుచేసి - దానికి నిన్నే అధ్యక్షురాలుగా నిర్ణయించి, అన్ని పత్రాలు తయారుచేసి, నీ సమ్మతి ఉంటుందనే భావించి నిన్ను పిలిపించాను. ఇకనుంచీ నీవే కమిటీ అధ్యక్షురాలవు. ట్రస్టు ఏర్పాట్లు అన్నీ పూర్తి ఐనాయి. ఇకనుంచీ హుండీ వసూళ్ళు కమిటీకే. ఊళ్ళో వసూలుచేసి పది లక్షలు ఇస్తామని కమిటీవారన్నారు'' అని ఆమె వంక శుచిస్మితంగా చూచాడు.

ఆమె ''భగవత్సేవ చెయ్యడానికి నాకు ఉత్తమ అవ కాశం కలిగించి నందుకు కృతజ్ఞురాలను'' అని పాదాభివందనం చేసి లేవబోతుండగా వెనుక అలికిడి అయింది. లేచి వెనుకకు చూడగా నారాయణరావు కుమారుని ఎత్తుకుని లోపలకు వస్తున్నాడు.

నారాయణరావు దగ్గరకు రాగా రామస్వామి పాదాభివందనం చేశాడు. సుమతి కూడా పాదాభివందనం చేసింది. రామస్వామి "స్వామీ మీరు నాకు గురుపుత్రులై ప్రత్యక్ష గురుస్వరూపులు. మీరు ఆడంబరము లేని అంతః ప్రకాశమైన తపస్సు చేసి తురీయాభ్యాసపాటవంతో తురీయాతీత స్థితిలో ఉన్నారని నాకు తెలుసు" అని అన్నాడు.

ముగ్గురూ కూర్చున్నారు. రామస్వామి చేతులు చాపగా నిద్రిస్తున్న కుమారుణ్ణి నారాయణరావు ఆతని చేతుల కందించాడు. అతడా బాలుని తనబడిలో పెట్టుకొని సుమతికి చెప్పిన ఏర్పాట్లను గురించి నారాయణరావుకు క్లుప్తంగా చెప్పాడు. "ఇది నేను బయటకురావడం ఆఖరిసారి, అందుకని ఏర్పాట్లు పూర్తి చేశాను. ఈ తెల్లవారుఝామున బ్రాహ్మీముహూర్తంలో నేను మళ్ళ యోగనిరూఢుడనై - జీవసమాధి పొందుతాను. అందుకనే తమ దర్శనం కోసం కబురంపించాను. నాకు మీ కుమారుని దర్శనం కూడా అయింది. ఇతడు ముమ్మూర్తులా మా గురువుగారి లాగానే ఉన్నాడు. బాల పరమేశ్వరునివలే ఉన్నాడు. అన్నట్లు మీ మనస్సులో ఉన్న ఆందోళన నాకు తెలియనిది కాదు. అదికూడా ఇప్పుడే పరిష్కారం అవుతుంది." అని పిల్లవానిని ముద్దు పెట్టుకున్నాడు. పిల్లవాడు నిద్ర మత్తులో కన్నులు తెరచి "అమ్మ! అమ్మ!" అంటూ సుమతి వంక చేతులుచాపగా - ఆమె ఆతనిని తీసుకొని ముద్దాడి భుజం మీద పడుకోబెట్టుకుంది. పిల్లవాడు మళ్లీ నిద్రపోయాడు.

రామస్వామి నారాయణరావువంక చూస్తూ "అది దైవేచ్ఛ, మీరు గ్రహించారా!" అనగా నారాయణరావు మందస్మితం చేశాడు. తరువాత రామస్వామి "ఇక నాకు శలవు అనుగ్రహించండి!" అని మళ్లీ పాదాభివందనం చేశాడు.

పిల్లవానిని ఎత్తుకుని సుమతి - ఆమె వెంట నారాయణరావు బయటకు వచ్చారు. యోగమందిరం తలుపులు వాటంతట అవే మూసుకున్నాయి. బయట కార్యకర్తలు ట్రస్టు కాయితాలు ఇవ్వబోగా 'రేపు చూచుకుందాములెండి' అని సుమతి ముందుకు నడిచింది. నారాయణరావు ఆమెవెనుక నడిచాడు.

ఆమె పిల్లవానిని భుజంమీద పడుకోనబెట్టుకుని మౌనంగా నడిచింది. నారాయణరావు కూడా మౌనంగానే నడిచాడు. పిల్లవానితో సహా దేవుని కళ్యాణోత్సవాలకు వెళ్ళి ప్రొద్దుపోయి ఇంటికి చేరుచున్న దంపతులవలె వాళ్లు ఆ రాత్రి సుమతి ఇంటికి చేరుకున్నారు.

ఇల్లు చేరగానే ఆమె పిల్లవానిని ప్రక్కమీద పడుకోబెట్టింది. నారాయణరావు ముందుగదిలో ఆగిపోగా ఆమె లోపలకు పిలిచింది. ఆమె నీళ్లు ఇవ్వగా అతడు పాదప్రక్షాళనం చేసుకున్నాడు. "ఏమైనా ఫలహారంచేస్తారా?" అని ఆమె అన్నది. "ఈ దినం మాఘ బహుళ అమావాస్య" అని అతడన్నాడు. నారాయణరావు లేచి స్నానాలగది చూపించమని - ఆమె చూపించగా కంఠస్నానం చేసివచ్చి - గుడ్డ పిండుకుని -

అక్కడనే వరండాలో - అనుష్ఠానం ముగించాడు. ఈ లోగా పిల్లవాడు లేవగా వంట ఆమె భోజనం చేయించింది. వంట ఆమె విశ్రాంతి తీసుకుంటావని చెప్పి వెళ్ళిపోయింది. నారాయణరావు సుమతి గదిలో మిగిలిపోయారు.

నారాయణరావు సుమతికి తన కష్టాలు చెప్పాడు. లక్ష్మీదేవమ్మ మరణ వృత్తాంతము వినిపించాడు. ఆ వార్త సుమతిని బాగా కదలించింది. ఆమె దుఃఖపడింది. అతనిని ఆమె ఓదార్చడానికి బదులు అతడామెను ఓదార్చవలసి వచ్చింది "సుమతీ! నీవు ప్రాజ్ఞరాలవు విచారించవద్దు!" అన్నాడు. ఆమె "ఇక మీరు ఇక్కడే ఉండి నాకు మీ సేవాభాగ్యం అనుగ్రహించండి." అన్నది. అతడు "సుమతీ! నీవు తపస్విద్ధవు. నాకోసం ఇదివరకే త్యాగాలు చేసినదానవు. ఇప్పుడు ఇంకో త్యాగాన్ని అర్థించడానికి వచ్చాను" అని ఆమెవంక చూచాడు. ఆమె "ఆజ్ఞాపించండి" అని అన్నది!

నారాయణరావు ఇట్లా ప్రారంభించాడు. "లక్ష్మీదేవి పోయిన తర్వాత లౌకికంమీద నాకు ఇచ్ఛపోయింది. పుత్రవాడిని పెంచవలసిన బాధ్యత ఒక్కటే మిగిలి ఉన్నది. నాకు ఏమీ తోచలేదు? ఈ పుత్రవాడు కాక ఇక నాకు నువ్వూ మా రామస్వామీ. మా తండ్రిగారి సమాధి, మా ఆలయంలో స్వామీ ఉన్నారు. అంతా ఈ ఊళ్ళోనే ఉన్నారని ఇక్కడకు వచ్చాను. కామక్రోధాది అరిషడ్వర్గంలాగానే ఈషణత్రయం కూడా బాధ కలిగించేదే. ఈ పుత్రవాణ్ణి మా దేవాల

యంలో - స్వామి సన్నిధానంలో వదలి తురీయాశ్రమానికి వెళ్ళిపోదామనే సంకల్పంతో ఈ ఊరు వచ్చాను. రైలుదిగి సరాసరి మా దేవాలయానికి వెళ్ళి స్వామిదర్శనం చేసుకున్నాను. నాకుమారుని భారం వహించి నన్ను విడుదలచెయ్యమని మాస్వామితో మొరపెట్టుకున్నాను. నేను వెళ్లేటప్పటికి సాయంకాలాభిషేకం జరుగుతున్నది. అర్చన పూర్తి అయిన తరువాత తీర్థప్రసాదాలు ఇస్తూ అర్చకుడు చెప్పాడు - ఈ దినం నేను తప్పక అక్కడకు వస్తాననీ రాగానే తనవద్దకు పంపమనీ రామస్వామి కబురుచేశాడట. తీర్థప్రసాదాలతో వచ్చిన సందేశం ఈశ్వర సందేశమేనని - నా మొరకు స్వామివారి ఆదేశమదేనని తెలుసుకుని కుర్రవాడి నెత్తుకుని బయటకు వచ్చాను.

మాతండ్రిగారి సమాధిని దర్శించి రామస్వామి దగ్గరకు వచ్చాను. అతడు నామానసిక ఆందోళన గ్రహించి, కుర్రవాడిని నావద్ద నుంచి తీసుకుని నీకు దత్తం చేశాడు. అప్పుడే కుర్రవాడు నిన్ను అమ్మ అమ్మ అని సంబోధించడంకూడా జరిగిపోయింది. కుర్రవాడు నిన్ను తల్లిగా స్వీకరించాడు. నువ్వు వాడిని గ్రహించావు. ఇదే ఈశ్వరేచ్ఛ అని రామస్వామి వివరించాడు. ఇక నాభారం తీరినదని నేను సంతోషపడ్డాను. ఇదే భగవన్నిర్ణయమని నేను శిరసావహించాను. ఇక ఈబాలునికి నీవే తల్లివి. నీవే తండ్రివి. నీవు శలవు ఇప్పిస్తే నేను వెళ్ళివస్తాను" "యావదధికారమవస్థితిరాధికారిణామ్" అని నారాయణరావు ముగించాడు.

ఆమె అతనిమాటలు ఆలకించి మెల్లిగా "మీరు లక్ష్మీదేవి అక్కయ్యకు సుస్తీగా ఉన్నప్పుడు నాకు తెలుపవలసింది. మేమిద్దరమూ వెంకమ్మగారికి శిష్యురాళ్ళముకదా! నాకు ఆమెను కడసారి చూచే అవకాశం లేకపోయింది!" అని తపన పడింది. అతడు మౌనంగా చూచాడు. ఆమె కొంత తేరుకుని మళ్ళీ అన్నది. "ఈనాటినుండి మీకుమారుణ్ణి నాకుమారుడుగా చేశారు. నేను నాప్రాణాధికంగా సంరక్షిస్తానని మీపాదములసాక్షిగా ప్రమాణం చేస్తున్నాను. దేవదత్తుడైన ఈ నాకుమారుడు భారతీయసంప్రదాయ పరిశుద్ధత్వానికి ప్రతీకగా మహాబ్రహ్మణ్యుడు కాగలడని విశ్వసిస్తున్నాను. అతని సర్వపూర్వపురుషుల తపశ్శక్తి అతనిని వరించి సిద్ధపురుషుణ్ణి చేయగలదని విశ్వసిస్తున్నాను" అని గాద్గదికం చెంది కన్నులవెంట బాష్పధారలు రాగా తుడుచుకొని మెల్లిగా ఇట్లా అన్నది. "మీరు ఈబాలుని నాకిచ్చి నాకు మాతృత్వాన్ని సమకూర్చారు. కృతజ్ఞురాలను. భారతీయులు మతాతీతంగా ప్రేమానుబంధాలు పెంచుకోలేరని అపనింద ఉన్నది. దాన్ని మీరు పరాస్తం చేశారు ఈబిడ్డను నాకిచ్చి. ఇకనుంచి ఈమాతృపుత్ర సంబంధానికి మతప్రసక్తి లేదు. ఇంతవరకూ బాగానేఉన్నది. మీరు కనీసం ఈఊళ్లోనైనా ఉండి అప్పుడప్పుడు దర్శనం అనుగ్రహించరాదా?" అని ప్రార్థేయపడింది.

"నారాయణరావు "నేను ఈ బాధ్యతలనుండి విముక్తి పొంది తురీయం స్వీకరించి రానున్న మహాలయ అమావాస్య

వరకూ ఉంటాను. 'యతీనాం మహాలయః'. మరి నాకు సమ్మతి ఇవ్వు" అన్నాడు. అతని మాటలలో భావము ఆమెకు అవగాహనకాక ఆమె ప్రశ్నార్థకంగా చూచింది. అతడు 'ఈ బాలకుని పోషణభారాన్ని నీవు తీసుకున్నావు. ఇక నాకు లౌకిక వ్యవస్థతో మిగిలిన సంబంధ మేమున్నది? నేను సరాసరి శృంగేరి వెళ్ళుతాను. అక్కడ నాకు సతీర్థులు పీఠాధిపతులుగా ఉన్నారు. వారివద్ద 'ప్రేష' ఉచ్చరించి తురీయాశ్రమాన్ని స్వీకరిస్తాను" అని అన్నాడు. ఆమె చకితఅయి కన్నుల నీరు బెట్టుకున్నది.

నారాయణరావు మళ్ళీ "సుమతీ! నీవు ప్రాజ్ఞురాలవు. దైన్యంవలన సాధించబడే దేమీలేదు. కుర్రవాడు కావలసినప్పుడు తెచ్చుకునేటట్లుగా నా దేవతార్చన మా స్వామివారి సన్నిధిలో భద్రపరిచాను నేను అనేకకష్టాలు పడ్డాను. జీవితంలో సుఖం తెలియనివాడిని. నావల్ల ఎవరికీ ప్రయోజనంలేదు. నాది శాపగ్రస్త జీవితమైపోయింది. నన్ను తురీయం తీసుకోనీ" అన్నాడు. ఆమె అతనివంక సాలోచనగాచూచి 'అంతేనా' అన్నది. ఆమె భావాలు నారాయణరావు గ్రహించాడు. మెల్లిగా "నీ అచంచల ప్రేమాభిమానాలతో నువ్వు నామీద ఒక హక్కును సంపాదించుకున్నావు. నాకుమారుని మాతృదేవిగాఅయి ద్విగుణీకృతం చేసుకున్నావు. మా గురుపాదులు నీసమ్మతికూడా స్వీకరించినతర్వాతనే తురీయాశ్రమాధికారము లభిస్తుందని మునుపే నాకు చెప్పారు. నాకుమారుడు ద్వైమా

తురుడనీ - వాని ద్వితీయ మాతృకసమ్మతికూడా నేను పొంద వలసి ఉంటుందనీ శ్రీచరణుల ఆజ్ఞ. అందుకనే నీసమ్మతిని అర్థి స్తున్నాను.

నీకు తెలియని దేమున్నది. నీవే ఒకసారి చెప్పావు. "ఆత్మకు శౌచా శౌచభావాలు, కులమత భావాలూ ఉన్నా యా' అని. అట్లాగే ఆత్మకు ప్రేమ, గౌరవం, మమకారం వంటి భావాలుకూడా లేవు. ఆత్మ చిత్పదార్థము. దానికి భావవికా రాలేమిటి? నువ్వు దయచేసి నాకు సమ్మతిని అనుగ్రహించు" అని అన్నాడు.

సుమతి సమాధానం చెప్పకుండా లేచి మెల్లిగా వెళ్ళి లోపలగదిలో కూర్చున్నది. నారాయణరావు కొంతసేపుచూచి తానుకూడా లోపలకువెళ్ళి ఆమెకు ఎదురుగా ఉన్న సోఫాలో కూర్చున్నాడు. తనకు సమాధానం ఇవ్వమని ప్రార్థిస్తున్నట్లు ఆమెవంకచూచాడు. ఆమె "ఇది ఏమి విచిత్ర జీవితము నాది. అడుగడుగునా ధర్మముపేర పెద్ద త్యాగాలే చేయవలసి వస్తు న్నది. నేనేమి చేయగలను. దైవోపహితురాలను, ధర్మోపహతు రాలను, ఎప్పటికీ జయం ధర్మానిదే కదా!" అని తీక్షణంగా నారాయణరావు వంకచూస్తూ "మీకు ఏదిధర్మమని తోస్తే అట్లా చెయ్యండి!" అని అన్నది. "సరే! నాప్రయత్నానికి నిన్ను మనస్ఫూర్తిగా సమ్మతించమని కదా అర్థిస్తున్నాను" అని అతడు ప్రత్యుత్తరం ఇస్తూ ఆమె వంక చూచాడు.

ఆమె ఏదో చెప్పుటకు అభిలాష కలిగి చెప్పుటకు వెను కాడుచున్న అస్పష్టమైన భావాలు ఆమెముఖంలో విద్యమానం కాగా నారాయణరావు ఆమెతో అన్నాడు. "నువ్వు ఏదో చెప్పదలచుకున్నట్లు ఉన్నది. నువ్వు ఏమి చెప్పినా వినడానికి నేను సిద్ధంగా ఉన్నాను. ఫరవాలేదు చెప్పు." అతడు ధైర్యము కలిగించగా ఆమె లేచి నుంచుని అటూ ఇటూ చూసింది. గదితలుపులు కిటికీతలుపులు బిగించివచ్చి అతనికి పాదాభివందనం చేసి ఆతనికి ప్రక్కగా కూర్చున్నది. మెల్లిగా అన్నది. "మీరు నన్ను భార్యగా స్వీకరించలేదు. కాని మీ పుత్రునికి తల్లిగా అంగీకరించినారు. ఏమి ధర్మ సూక్ష్మము! నేను మిమ్మల్ని భర్తగా ఇష్టదైవంగా ఉపాసన చేశాను. మీ స్వరూపమే నాకు శ్రీత్రిపురసుందరీదేవి. నాకు మీరు ప్రత్యక్షదైవం. మీలో నాకు జగదంబిక ప్రసన్నత కన్పడుతున్నది. కాబట్టి మీ సన్నిధానంలో నాకు ఉన్న ఒకే ఒక కోరిక మనవి చేస్తాను. మన్నించండి. మీరు అనుమతి ఇస్తేనే మనవి చేస్తాను." అని ప్రార్థనా పూర్వకంగా చెప్పి దీనంగా చూచింది.

నారాయణరావు ఆమెకు భరవసా ఇస్తున్నమాదిరిగా సుముఖంగా ప్రసన్నంగాచూచాడు. ఆమె ఇంకా సంకోచ పడుతుండగా, 'ఫరవాలేదు చెప్పు. నీకోరిక ఎట్టిదైనా మన్ని స్తాను.' అని అన్నాడు. ఆమాటలకు ఆమె ధైర్యం పుంజుకుని లజ్జతో మెల్లిగా అన్నది. "మీకు తెలుసును నేను సౌభాగ్య విద్య అనుష్ఠిస్తున్నానని, మరి మీరు ఇట్లా వెళ్ళిపోతే నా

మంత్ర సిద్ధి ఏమి కావాలి! నా మంత్ర తపస్సు వ్యర్థం కా కూడదు కదా! అందుకని నేను మిమ్మల్ని ఈ కోరిక కోరు తున్నాను. ఒక్కసారి మిమ్మల్ని గాఢంగా ఆలింగనం చేసుకో నివ్వండి. నాకది చాలు. అది లభిస్తే నాజీవితం చరితార్థ మైన దని సంతోషిస్తాను.'' ఆమాటలకు నారాయణరావు చకితుడై ఆమె వంక సాలోచనగా చూచి - కన్నులు మూసుకుని ధ్యానించి - మళ్ళీకన్నులు తెరచాడు. అక్కడనుంచి లేచి వెళ్ళి ఎదురుగా ఉన్న మంచం మీాద పద్మాసనస్థుడై కూర్చుని దృఢంగా ఆమె వంక చూస్తూ - కన్నులు విశాలంచేసి ఇట్లా అన్నాడు "ఇది నాకు విషమపరీక్ష. నేను ప్రవేశించబోయే తురీయాశ్రమానికి నా మనస్సు నాశరీరము పరిపక్వమైనాయో లేదో నని భగవంతుడు పరీక్షిస్తున్నాడు. నాయందు గురువు గారి అనుగ్రహం ఉండి నన్ను రక్షించాలి'' అని మందస్మితంగా ఆమెను చూచి మళ్ళీ "ఐతేసరే, నీకోరికను మన్నిస్తానని మాట ఇచ్చానుగా. పది నిమిషాలు ఆగు. నేను పద్మాసనంలో ఉంటాను. కన్నులు మూసుకొని ఉంటాను. నీవు కోరినప్రకారం ఆలింగనం చేసుకో. ఒక అరగంట మాత్రమే నీకు సమయం ఇచ్చాను. పది నిమిషాల లోపుగా నన్ను స్పృశించవద్దు.'' అని ఉత్తర దిక్కుగా కూర్చుని అంతర్దృష్టిగా పద్మాసనస్థుడై కన్నులు మూసుకున్నాడు. ఐదునిమిషాలకే ఆమెకు తెలిసి పోయింది. అతడు యోగనిద్రా సమారూఢమైన స్థితిలో ఉన్నాడని, ఆమె అనుకున్నది. "ఇతడింత పరిపక్వమైన తపశ్శక్తి

కలవాడన్నమాట. బహునిగూఢ తపస్వి. ఇతడింత తపశ్శక్తి సంపన్నుడు కనుకనే మహాయోగి రామస్వామి పాదాభివందనం చేశాడు.

ఆమె సర్వాలంకార సుందరంగా, సర్వాభరణభూషితగా, వివస్త్ర అయి అతనిని సమీపించి, పాదాభివందనంచేసి, అతని సమీపంలో కూర్చుని గాఢంగా ఆలింగనంచేసుకుని చుంబించింది. అతడు నిర్జీవ ప్రతిమలాగా ఉన్నాడేకాని చలించ లేదు. ఆమెకు అంతవరకే తెలుసు.

ఆ పిమ్మట ఏదో స్మృతిలేనట్లుగా - ఏదో మహత్తర అలౌకికానందం అందిపుచ్చుకున్నట్లుగా - ఆకాశ తరంగాలలో అతి మధుర శబ్దమయవైఖరీ రూపసాగర తరంగాలలో తేలి పోతున్నట్లుగా నాదమాధురీమయమైన గంధర్వలోకంలో విహరించి తదతీతమాధుర్యస్ఫురణంలో ఆరోహణం చేస్తున్నట్లుగా ఆనందమయలోకాన్ని చేరినట్లుగా - అక్కడ సర్వదేవతలచేత పరివేష్టింపబడి అరుణమైన పాదపద్మాలతో - సమందహాసిలేక్షణంగా - సశరచాపపాశాంకుశంగా - అరుణమాల్యభూషోజ్వలంగా - జపాకుసుమభాసురంగా - కరుణాంతరంగితాక్షిగా - సర్వాలంకారయుక్తంగా - రత్నతాటంకరమ్యంగా - తారాహారోజ్వలంగా - అతిప్రసన్నంగా - ఉన్న శ్రీమాతృదేవిసన్నిధానము లభించినట్లయి - అలౌకిక మహదానందం అనుభవంలోనికి వచ్చినట్లయి. ఇంతలో అంతా విస్మృతిపథంలో అదృశ్యమై - స్మృతిపోయి - అట్లే కొంతకాలముండి తిరిగి కొంత సేపటికి జాగ్రదవస్థ కలుగగా కన్నులు తెరిచింది.

ఇంకా నారాయణరావు తన బాహుమధ్యంలోనే ఉన్నాడని ఆమె గమనించి వెంటనే లేచి అతనిపాదములమీద శిరస్సుఉంచి నమస్కరించి తరువాత లేస్తూ ఆనందపరవశత్వం పుక్కిలింతలుకాగా అతనిపాదాలమీద ఒరిగిపోయింది. ఇంతలో అతడు కన్నులు తెరచి ఆమెను లేవదీశాడు. ఆమె శిరస్సును వామహస్తంతో స్పృశించాడు.

ఆమె ఆనందాతిరేకాన్ని నిలుపుకుంటూ వస్త్రధారణం చేసి మళ్ళీ అతనికి పాదాభివందనం చేసి ఇట్లా అన్నది. "మీరు మహర్షులు. కామక్రోధాది అరిషడ్వర్గాన్ని ఎప్పుడో జయించారు. నన్ను వివాహం చేసుకోనన్ననాడే మీరు కామాన్ని జయించారు. లక్ష్మీదేవమ్మ అక్కగారితో మీరు చేసిన సంసారం ధర్మపాలనమే. మీరు ఈషణత్రయాన్నికూడా జయించారు. పుత్రుణ్ణి నాకు దత్తంచేశారుకదా. నేను మూర్ఖురాలనై మీరింకా కామంవద్దరే ఉన్నారని భ్రమపడ్డాను క్షమించండి.

మీరు నన్ను ఉద్ధరించారు. మీచరణదాసిని ఐన నాకు సహధర్మచారిణీత్వంతోపాటు మోక్షద్వారం తెరచిచూపించారు. నాకుకూడా కామాది అరిషడ్వర్గాన్ని జయించే శక్తి ప్రసాదించారు. మీరు యాజ్ఞవల్క్య మహర్షియొక్క అవతారంగా ఉన్నారు. ఒక్కసారి బాహిరమైన ఆలింగనకే బహుజన్మ తపఃఫల తుల్యమైన దివ్యసమాధి ఇప్పించారు. నిత్యం దైహికంగా మానసికంగా మిమ్ము సేవిస్తూ మీసహాచర్యం మీ

సన్నిధానం అనుభవించిన అక్క లక్ష్మీదేవమ్మ సుకృతం గొప్పది.''
అని ఆమె అనగా నారాయణరావు లేచి నుంచున్నాడు.

ఆమె అతనివంక చూస్తూ ''మీరు ధర్మస్వరూపులు. మీకు తెలియనిదేమున్నది. మీ ఇష్టప్రకారమే చెయ్యండి. బృహదారణ్యకభాష్యంలో శ్రీభగవత్పాదులవారు తమవంటి వారికి తురీయాధికారం సహజంగానే ఉన్నదని ''అధికారో వ్యుత్థానే'' అని చెప్పనే చెప్పారు. మీరు చేసిన నిర్ణయమే ధర్మమైన నిర్ణయం'' అని మందస్మితం చేసింది. నారాయణరావు చిరునవ్వుతోనే ప్రత్యుత్తరం చెప్పాడు. కుమారుడు ఉన్న గదిలోకి వెళ్ళి కుమారునిచూస్తూ రెండు నిముషాలు నుంచుని కన్నులు మూసుకుని రెండునిమిషాలు ధ్యానించి మళ్ళీ కుమారుని చూస్తూ అతని మూర్ధాన్ని అలవోకగా స్పృశించాడు. సుమతి అతనిప్రక్కనే ఉన్నది.

నారాయణరావు బయటకురాగా సుమతికూడా వెంట వచ్చింది. అతడు ఆమెనుచూస్తూ నిలుచున్నాడు. ఆమె అతని పాదాలమీద శిరస్సు ఉంచి 'నకర్మణా' అంటూ నమస్కరించింది. లేచి అతన్ని చూస్తూ నుంచున్నది. అతడు ఆఖరిసారి ఆమెవంకచూచి మందస్మితం చేశాడు. తరువాత మెల్లిగా వాకిటిలోకి వెళ్ళి అక్కడనుంచి వెనక్కు తిరిగిచూడకుండా ముందుకు నడచిపోయాడు.

ధర్మనిర్ణయం

నారాయణరావు కన్పిస్తున్నంతసేపూ సుమతి అతనినే చూసింది. ఆతరువాత వాకిట్లో అట్లాగే అతను వెళ్ళిపోయిన దిక్కుగాచూస్తూ చాలాసేపు నిల్చున్నది. ఇంతలో లోపల పుత్రవాడు అమ్మ అమ్మ అని కలువరిస్తున్నట్లు భాసించగా లోపలకు వెళ్ళింది.

శ్రీః

మదరాసు: 'వావిళ్ల' రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
వావిళ్ల 'ప్రెస్సున' ముద్రితము.—1970 కాపీలు 2000.